భక్తరామదాసు ప్రణీతము

# దాశరథి శతకము

మానసోల్లాస వ్యాఖ్య



సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపర - 2

భక్తరామదాసు ప్రణీతము

# దాశరథి శతకము

## మానసోల్లాస వ్యాఖ్య

వ్యాఖ్యాత

ఆచార్య ఎం. కులశేఖరరావు

సంపాదకులు

శ్రీ చల్లా సాంబిరెడ్డి





శ్రీ పావని సేవా సమితి ప్రచురణ నెం.2

సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపర - 2

ద్వితీయ ముద్రణము - 2000 సెప్టెంబరు. ప్రతులు 2000

DASARADHI SATAKAMU - Devotional Poems on Lord Sri Rama - Well known Telugu Satakamu by Bhadrachala Ramadasu.

With commentary by - Prof. M.Kulasekhara Rao.

Divine Blessings by - Avadhuta Datta Peethadhipathi, Sri Sri Sri Ganapati Sachchidananda Swamiji, Mysore.

Appreciations by - 1. Dr. D. Chinna Krishnaiah M.A., M.Litt., Ph.D. Chennai.

2. Brahmasri Yeluripati Anantaramayya, Hyderabad.

Edited by - Sri Challa Sambi Reddy.



Title Page drawing - Gangadhar

Price - **Rs.50/-**

Type setting at - Fontline Graphics, Baglingampally, Hyderabad - 500 044, Phone. 7660000.

Printed at - Sri Sai Ram Printers, Hyderabad - 500 004, Phone. 232316.



# అవధూత దత్త పీఠము

శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమము
మైసూరు.

అవధూత దత్త పీఠాధిపతి - జగద్గురు - పరమపూజ్య

## శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి

## ఆశీస్సందేశము

కవులైన భక్తులు తమకోసం తాము కావ్యాలు వ్రాసుకొంటారు. కానీ అట్టి కావ్యాలు గుడిలోని నైవేద్యాలులాగా, దేశమంతటికీ ప్రసాదాలవుతాయి. నైవేద్యానికి వంట చేసే అర్చకుడు ముందుగా రుచి చూడడు. స్వామికి నైవేద్యం చేయగలగటమే, అతనికి పండగ. కవి - భక్తుడైతే, అతనికి తన కావ్యంలోని చమత్కారాలు తనకే పట్టవు. స్వామిని స్తుతించ గలిగాను కదా అనేదే అతని సంతోషం. ప్రసాదం తినే భక్తులు మాత్రం ప్రసాదం అని మన్నిస్తూనే, దానిలోగల జీడిపప్పులకు సంతోషపడుతూ వుంటారు. అనుభవజ్ఞులైన పెద్దలు మాత్రం, ఇదే వంటకం ఇంటి దగ్గర చేసుకొంటే ఇలాంటి రుచి రాదనీ, ఈ రుచి స్వామి ఎంగిలి సోకిన కమ్మని రుచి అనీ, గుర్తించి పిన్నలకు వివరిస్తూ వుంటారు.

స్తుతి కావ్యాల వ్యాఖ్యాతలు ఈ కోవకు చెందిన పెద్దలు. శ్రీపావని సమితి అధ్యక్షుడు చల్లా సాంబిరెడ్డి ఇలాంటి పెద్దలను కౌగిటపట్టి, వారి పలుకులను తెలుగు పిల్లలందరికీ వినిపించటం పనిగా పెట్టుకొన్నాడు. మన సాంప్రదాయక శతకాల సౌరభాలను దిక్కులకు వెదజల్లే వ్యాఖ్యానాలను వ్రాయించి, ఆ ప్రతులను పిల్లలకు ప్రసాదాలుగా పంచుతున్నాడు. ఆ కృషి పరంపరలో కృష్ణ శతకానికి ఉత్పల కవిచే గోపీనయనోత్పల వ్యాఖ్య వ్రాయించి ఇది వరకే ప్రకటించాడు. ఇపుడు దాశరథి శతకాన్ని స్వీకరించాడు.

దీని వ్యాఖ్యాత డా॥ ఎమ్. కులశేఖరరావు. ఈయన తన వ్యాఖ్యానంలో రామాయణ మర్మాలను దొరికిన చోటల్లా కుమ్మరించాడు. సిద్ధ పురుషుడైన భద్రాచల రామదాసుగారి అవ్యక్త భక్తి గానంలో గల మధుర మంత్రార్థాలను మనోహరంగా ఆవిష్కరించాడు.

ఇక పై వంతు ఆంధ్రదేశపు పిల్లలది; వారిని తీర్చిదిద్దే పెద్దలది ! దత్తస్వామి కృపవల్ల ఈ శతకము, ఈ వ్యాఖ్యానము, దీనిలోని భావపరంపర, ఆంధ్రదేశంలోని ఇంటింటా గుబాళించాలనే సాంబిరెడ్డి తపన సఫలమగుగాక !

**జయగురుదత్త.**

ఊర్ధ్వలోక గతులై కూడా శ్రీకృష్ణ భగవానుని ప్రేరణతో

నిరంతరం మమ్మల్ని ఆశీర్వదిస్తున్న పూజ్యులు

మా జనకులు స్వర్గీయ

**శ్రీ చల్లా సుబ్బారెడ్డి** పవిత్ర స్మృతికి.

\- చల్లా సాంబిరెడ్డి

Dr. D. Chinna Krishnaiah, M.A., M.Litt., Ph.D.,
(Formerly Prof. & Head, Dept. of Telugu, Presidency College)
Triplicane, Chennai - 600 005

# హంసోదకము

ఈ శతక కర్త గోపకవి; రామదాసుగా సుప్రసిద్ధుడు.ఆయన తండ్రి లింగమంత్రి. తెనాలికవి వంటివాడు గోపన. ఇరువురును అగ్రశాఖవారే; తొలుత శైవులే; పిదప శ్రీవైష్ణవం స్వీకరించినవారే. 'వీరవైష్ణవం' అను వ్యవహారంలో గోపన వ్యాసక్తుడు. వైష్ణవ మతంలో ఎక్కువ నిష్ఠగల ఒక తెగ విష్ణుభక్తుడు గోపన. (వీర: వైష్ణవ: - కర్మధారయసమాసం). వీరశైవులున్నపుడు వీరవైష్ణవులు నుందురుకదా! ఇట, వీర శబ్దానికి త్యాగశీలమని అర్థం; ఈ వివక్షితార్థ ప్రతిపాదనం శతక రచనా పరమార్థం,'హరే: నామైవ, నామైవ, నామైవ భవ భేషజమ్' అని తత్త్వపదవీ వివృతి - గోపనకు సమస్తమును రాముడే.

కవి ఇంటిపేరు 'కంచెర్ల' వారు;ఇది యతిస్థల ఘటితం; రామాంకితంగా 'ఎల్లకవుల్ నుతింప రచియించితి' నని కవి ఉద్ఘాటనం (చూడండి చివరి పద్యం). 'శ్రీరాముని దయచేతను, ఆరూఢిగ సకలజనులు 'ఔరా' యనగా... నోరూరగ, చవులుపుట్ట, నుడివిన' కందపద్యాలు సుమతి శతకంలోనివి. గోపకవి హృదయం సహృదయైకవేద్యం; ఈ కులశేఖరీయ సువిస్తర వ్యాఖ్య, గోపకవి హృదికి గవాక్షం; శతకంలోని చంపకోత్పల పద్యరసానుగతికి, రసాయనప్రాయ ప్రసూతి; శ్రీ విశిష్టాద్వైత మత రహస్య దర్శనానికి కరదీపిక.

వ్యాఖ్యలకు ప్రమాణములున్నవి. 'పదచ్ఛేదం పూర్వ ముక్త్వా, పదార్థం త్వాంధ్రభాషయా, తథాకాంక్షాం సమాసాదీన్, భావం చ వివృణో మ్యహం' అన్నారొకరు. మూలానికి వన్నెచిన్నెలు తీర్చిన మనోరమవ్యాఖ్య శ్రీ రావుగారిది.

'నామూలం లిఖ్యతే కించిత్, నానపేక్షిత ముచ్యతే' - అనుట మరొక ప్రమాణం. అమూలకార్థాలను, అనపేక్షిత తాత్పర్యాలను పరిహరించడం వ్యాఖ్యాతకు అవశ్యకర్తవ్యం. శ్రీరావుగారు మూలవృత్త వికసనానికీ, సాపేక్షా సంవాదానికీ ప్రాధాన్యమిస్తూ, ప్రసక్తాను ప్రసక్తంగా గుప్తార్థాలు ప్రకటిస్తూ, తమ అధ్యయన, అధ్యాపనల అనుభవాలను అధివాసితం కావించారు. ఈ వ్యాఖ్య, తమ జీవితధ్యేయంగా వారు భావించారన్నది చదువరులు గుర్తింపగలరు.

వెల్లివిరిసే రామభక్తి నెపంగా, గోపకవి చంపకోత్పల పూజాకుసుమాలు

సమర్పించాడు; వ్యాఖ్యావ్యాజంగా శ్రీ రావుగారు సరళ, సరస గతిలో సుమసౌరభ వ్యాప్తికి కారకులయ్యారు. 'తరుః ప్రసూతే పుష్పాణి, మరు ద్వహతి సౌరభమ్'. శతకంలో వస్తుగౌరవం; వ్యాఖ్యలో ఋజిష్ఠం.

45 ఏళ్ల క్రితం, టీకా తాత్పర్యసహిత దాశరథి శతకం వావిళ్లవారు ప్రకటించారు;అది మూదల కాలేని ప్రయాస. కొన్ని పద్యాలకు 'కక్కుటితి' వివరణ లున్నాయి. ఒక ఉదాహరణం : 'జనవర! మీ కథాళి విననొపక, కర్ణములందు ఘంటికా నినద వినోదముల్ సలుపు నీచునకున్ వర మిచ్చినావు...' (ప.44) అను పద్యంలో ఉన్నది, ఘంటాకర్ణోపాఖ్యానం; హరివంశంలోనిది. ఘంటికలు కట్టుకొన్నవాడు 'హిరణ్యకశిపు' డని, వావిళ్ల ప్రతిలోని వింత వ్యాఖ్య. రావుగారిది సమంజస.వ్యాఖ్య. గోపకవి రామ, కృష్ణులకు అభేదాన్ని పాటించిన సందర్భాలు అక్కడక్కడా ఉన్నాయి. ఇది పోతనగారి పద్ధతి. భాగవతాన్ని తెనిగించి, తన కంకిత మిమ్మని శ్రీరాములవారు ఆదేశించినా, పోతన, రాముని సంబోధిస్తూ కృష్ణునికి పురాణాన్ని అంకితం చేయడం, ఆ కవి ఆశ్రయించిన మధ్యేమార్గం. ఇది భాగవత సంప్రదాయం. రామ కృష్ణులదైన అభేద 'విభవం' ఈ శతక రచనలోనూ సంవీక్ష్యం. 55వ పద్యంలో, ద్రౌపది మొరలు ఆలకించి ఆదుకొన్నది, కరుణాపయోనిధియైన దాశరథి! గోపకవి సంభావనలో వ్యుత్క్రమం ఏమీలేదని విజ్ఞులు ఊహించగలరు. అలాగే, దశావతార వర్ణనంలో, గోపన, 'రామో, రామశ్చ, రామశ్చ' అన్న ప్రభావంతో బలరాముని (ప.76) వినుతించి, 'కృష్ణమూర్తి నీ కనుజుడుగా జనింప' అని చమత్కరించాడు. రామ (బలరామ) శబ్దంపై గోపనకున్న భక్తి ప్రపత్తులు అనుపమం.

'దాశరథీ!' అన్న సంబోధనలో 'ద' కారం యతిస్థలం; దీనికి అనుగుణంగా చతుర్థపాద ఆదివర్ణం 'వళి' కావలసి ఉన్నది; యతి కుదర నప్పుడు, కవి అఖండయతి వాడుకున్నాడు. భావ విస్తృతికి తగినట్లు,అక్కడక్కడా పంచపాదివృత్తాలూఉన్నాయి.

'సరసుని మానసంబు సురసజ్ఞుఁ డెఱుంగును' (ప.95) అని గోపకవి ఘంటాపథ ప్రవచనం. 'విద్వానేవ విజానాతి' అన్నారు కదా! 'చదువది ఎంత కల్గిన, రసజ్ఞత ఇంచుక చాలకున్న, ఆ చదువు నిరర్థకంబు' అనలేదా మరోకవి! ఆచార్య శ్రీ కులశేఖరరావుగారు రసజ్ఞులు; విద్వాంసులు; గ్రథన కౌశలం కలవారు; వారు సార్థక నామధేయులు; వారి ఈ మానసోల్లాస వ్యాఖ్య సార్థక నామధేయ; అది హంసోదకము.

దేవళ్ల చిన్నికృష్ణయ్య

# మిసిమి మీగడ

శ్రీ చల్లా సాంబిరెడ్డి గారు సమాజమూ వ్యక్తులూ ఉన్నరీతీ ఉండవలసిన తీరూ గురించి కచ్చితమయిన అభిప్రాయాలు కలవారు. దానినీ వారినీ కూడా ఉండవలసిన తీరుకు మలచటానికి వారేమి చేయాలి వీరేమి చేయగూడదు అన్న ఆలోచనల కంటె ఎవరేమి చేయాలన్నది ఎవరికి వారు నిర్ణయించుకొని తాము చేయవలసినది చేయగలిగినంత, తాము చేస్తే, పరిస్థితులు వాటంతట అవి సరిఅవుతాయన్న సదాశయమున్నవారు. జనంలో ధర్మం దైవం వీటి గురించిన సద్భావన లోపించినదనీ, ఈ రెంటి గురించి సరయిన భావన ఉన్ననాడు అన్నీ చక్కబడతాయనీ వారి ఉద్దేశం. దీనిని సాధించటానికి ఇదివరలో పెద్దల ప్రవచనాలూ, పిల్లలకు చిన్నప్పటి నుంచీ ధర్మ-నీతి-జ్ఞాన బోధకాలయిన కథలూ, పద్యాలూ, పాటలూ, ప్రదర్శనలూ ఉండేవి. ఇటువంటి వాటి ద్వారా పిన్నలకూ పెద్దలకూ సద్భావము కలగటమూ, పెంపొందటమూ, ఆచరించటమూ ఉండేవి. అవి లోపించటం ప్రస్తుత పరిస్థితికి మూలకారణం అన్నది వారిలోకపరిశీలనఫలం. యుద్ధంలో కాని, పెద్ద ప్రమాదంలో కాని గాయపడినవారు ఎక్కువమంది ఉండి చికిత్స చేసేవారు తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు చికిత్స చేస్తే నయమయే అవకాశం ఉన్నవారికి ముందు చికిత్స ప్రారంభించి, చేసినా బ్రతికే ఆశలేదు అనిపించినవారికి చివర విధ్యుక్త కర్తవ్యంగా భావించి చికిత్స చేస్తారు. సమాజంలో కూడా నడవడిలో ఉపద్రవం ఏర్పడినపుడు దీర్ఘకాలిక ప్రయోజన దృష్టితో చూచినపుడు, బాలురు, యువకులు, నడివయసువారు, వృద్ధులు - అనేవారిలో చిన్నవయసు వారి నుంచి ప్రారంభించి, వారిపై ఎక్కువ దృష్టి ప్రసరింపజేస్తూ పైమూడు తరగతుల వారి గురించే అదే - పూర్వపూర్వ - ప్రాధాన్య క్రమంలో కృషి చేయాలన్నది వారి అభిప్రాయం. ప్రవచనాలూ, ప్రసంగాలూ, సద్గ్రంథాలూ, అన్నదానాదులూ ఆ ముగ్గురికీ ఎక్కువ సంబంధించినవి. భావాలు లేత మనస్సులపై ముద్రితములై అనంతర కాలంలో వారి జీవితాల మీదనూ, వారి ద్వారా సమాజ జీవితం మీదనూ గాఢప్రభావం చూపిస్తాయి కనుక, గతంలో మహాపురుషులను తీర్చిదిద్ది, భవిష్య మహాపురుషులను రూపొందించగల శక్తిగల భావభండారాలు శతకాలని రెడ్డిగారి నమ్మకం.

ఇలా తాత్కాలిక దీర్ఘకాలిక ప్రణాళికతో సమాజాన్ని పావనం చేయటం ద్వారా చేతనైన సేవ చేయటానికి మరి నలుగురు మిత్రులతో వారు శ్రీ పావని సేవాసమితి స్థాపించి దానికి తాము అధ్యక్షులుగా ఉంటూ క్రియప్రధానంగానూ ప్రకటన ప్రక్రియ అప్రధానంగానూ తత్తత్కాలోపయోగి సత్కార్యాలు కుడిచేత చేసినవి ఎడమచేతికి

తెలియనీయకుండా చేస్తున్నారు. పావని ఆంజనేయునిలా, ప్రయత్నం ఉంటే, ఎంత చిన్నవారైనా, ఎంత పెద్ద సముద్రాన్ని లంఘించి అయినా, దైవం సంతోషించే సందేశాన్ని అటు వ్యక్తులకూ వారి ద్వారా ఇటు సమాజానికి అందించగలరనీ, తద్వారా, పేట్రేగిపోతున్న భావకాలుష్యాన్ని తొలగించి సద్వర్తనాన్ని శ్లాఘాపాత్రం చేయగలరనీ అపుడు తప్పక రాజ్యం రామరాజ్యం కాగలదనీ నమ్మి శ్రీ పావని సేవాసమితి పరిశ్రమిస్తున్నది.

ఫలపుష్పాలూ నిలువనీడా కావాలంటే చెట్టు కొమ్మలపై చిలికి తడపటం కాక, చెట్టు మొదట పాదుకట్టి నీరుపోయాలని అనుభవాగత విజ్ఞానంతో రెడ్డిగారు చిన్నవారు ఇదివరలో కంఠస్థం చేస్తూ వచ్చిన ఇపుడు మళ్ళీ చేయవలసిన శ్రీకృష్ణ - దాశరథి - నరసింహ - నారాయణ - సర్వేశ్వర - శ్రీకాళహస్తీశ్వర - సుమతి - వేమన - భాస్కర - భర్తృహరి నీతిశతకాలనూ, కాలక్రమంలో గువ్వలచెన్న శతకం వంటివాటినీ ప్రతిపదార్థ - తాత్పర్య - విశేషాంశ - సహితవ్యాఖ్యాన సహితంగా నిర్దుష్టంగా అందంగా శ్రీపావని సేవా సమితి ద్వారా ప్రచురించాలని సంకల్పించారు.

శతకాలు ఇంత శక్తిమంతాలుగా రూపొందటానికి కారణమున్నది. శతకాలలోలా ఇతర ప్రక్రియలలో కవిభావం ఇంత సూటిగా దూసుకుపోయి చదువరి హృదయంలో కుదురు కొనదు. కావ్యాదులలో ఎక్కడనో తప్ప కవి పాత్రల వెనుకనో వర్ణనల చాటుననో ఉండి తన భావం వినిపిస్తాడు. శతకంలో అలా కాదు, చెప్పేది తనకు మిక్కిలి ఇష్టమయిన దైవంతో, భావం పుట్టినది పుట్టినట్టుగా స్నిగ్ధముగ్ధామృతదిగ్ధంగా అరమరికా దాపరికమూ లేకుండా వెలువడుతుంది. పది పుస్తకాలు చదివి ఒక పుస్తకం వ్రాయటంలా కాకుండా, ఆర్తి కానీ, అర్థనకానీ, ఆక్షేపణకానీ అదేదైనా స్వీయానుభవనిశితమై నవంనవంగా ఉంటుంది. ఇందులో చదువరి తాను కవిఐపోయి ఆయన అనుభూతి తనది అయి ఆనందాది ప్రయోజనాలు పుష్కలంగా పొందగలుగుతాడు.

భారతీయుల శతకరచనా భావమే అపూర్వమైనది. అనుభూతి వ్యక్తీకరణ కంటె అతి విలక్షణ ప్రయోజన విశిష్టమైనది. అష్టవిధ మానసిక పుష్ప పూజకు దారితీసే ఇష్టదైవ పుష్పపూజ అష్టోత్తరశతనామ పుష్పపూజగా చేయటం మన సంప్రదాయం. అవి పద్య పుష్పాలయితే ఇష్టదైవ ప్రీతికీ, ఇష్టభావధారణ మనన రీతికీ ఉపయోగపడతాయని శతకరచన ఆరంభించారు. అన్ని ప్రక్రియలకు లాగానే శతక సృష్టికీ మూలం సంస్కృతమే అయినా శతక సరస్వతికి మకుటం పెట్టిన సుకృతశాలి తెలుగువాడే. శతకం అంటే నూరింటి సమూహం, నూరుకలది అని అర్థం. ఇలా మయూర సూర్యశతకాదులుగా దైవపూజాంగాలుగా ప్రారంభమైన శతకం సంస్కృతంలోలాగానే తెలుగులోనూ ఇష్టదైవ స్తుతిపరంగానూ, నీత్యుపదేశసుందరంగానూ, సమాజ సంస్కరణబోధకంగానూ, సర్వవిధ భావ ప్రచార సాధకంగానూ పరిణమించింది. సహజం.

నారాయణుడు నరులకు ఆదర్శప్రాయుడైన నరునిగా దశరథ కుమారుడైన రాముడుగా అవతరించి, తల్లిదండ్రులు, సోదరులు, మిత్రులు, శత్రువులు, ప్రజలు, పశువులు,

పక్షులు, మునులు మొదలయిన వారితో కష్టాలలో సుఖాలలో ఎలా ప్రవర్తించాలో ప్రవర్తించి చూపించినాడు. ఆ రాముని అరణ్యావాసం తెలుగు దండకారణ్యంలో జరిగినందుననేమో రాముడు తెలుగు వారికి ఇలవేల్పైనాడు. పానుగంటివారి దశరథుడు కోరుకొన్నట్టు పది కొంపలును లేని పల్లెలందైనను రామ భజన మందిరం ఏర్పడి రామ గుణ కీర్తనం నిరంతరం కొనసాగిస్తూ తెలుగు నరులను రామలక్ష్మణ భరత శత్రుఘ్నులుగా, తెలుగు బాలురను లవకుశులుగా, తెలుగు నారీమణులను సీతమ్మలుగా తీర్చిదిద్దుతున్నది. అట్టి రాముడు వెలసిన భద్రాద్రి తెలుగువాని వైకుంఠం. ఆ రామయ్య గుడి గోపురాలు కట్టించిన గోపన్న రామదాసై తెలుగువారి గుండెల్లో కాపురమున్నాడు. భద్రాద్రి రామదాసు సర్కారు సొమ్ముతో గుడిగోపురాదులు కట్టించటంలోని తప్పొప్పులు తెలుగు వాని కక్కరలేదు. ఆ భక్తుని పుణ్యమా అని భద్రాచలమన్నా, పర్ణశాలన్నా, రామదాసన్నా ఆ మాటలు వినబడితేచాలు తెలుగువానికి ఒళ్ళు తెలియదు.

రామదాసు కీర్తనలు తెలుగువారి హృదయ తంత్రులను మీటే మంత్రాలు. ఆయన దాశరథి శతకం తెలుగువాని వేదం. అగణిత సత్యభాష, రంగదరాతి భంగ, రామ విశాల విక్రమ పరాజిత భార్గవరామ, భండనభీముడార్తజన బాంధవుడు, పరమ దయానిధే పతిపావన నామ, దాసిన చుట్టమా శబరి దాని దయామతినేలి నావు, చిక్కని పాలపై మిసిమి చెందిన మీగడ, చక్కెర మానివేముదిన జాలిన కైవడి, కంటినదీ తటంబు - వంటి పద్యాలు కంఠస్థం కాని తెలుగువాడు కనిపించేవాడు కాడు. పాండిత్యమూ భక్తీ, సంప్రదాయ పరిజ్ఞానమూ వేద పురాణ వేదాంత విజ్ఞానమూ, ఆర్తీ ఆత్మనివేదనమూ, ఇహమూ పరమూ తొణికిస లాడేటట్లుగా తన తలపు ప్రతివాని తలపుగా తన కోరిక ప్రతివాని కామోదముగా దాశరథి శతకాన్ని పలికినాడు రామదాసు.

ఈ శతకంలో శ్రీ రామానుజ వైష్ణవ విశిష్టాద్వైత సిద్ధాంతం మొదలు సర్వభక్తి భావాలు ఎలా వెల్లి విరుస్తున్నాయో తులసీ వాల్మీకి ప్రభృతుల పలుకులెలా ప్రతిధ్వనిస్తున్నాయో నిపుణతతో వివరించారు ఆచార్య కులశేఖరరావు గారు. బహుకాలం ఆచార్యులుగా తెలుగు పరమ పట్టభద్రులను తీర్చి దిద్దినారు గనుక వారి వ్యాఖ్య సర్వసుబోధంగా ఉన్నదంటే చాలు. వీరి వ్యాఖ్యలోని విశేషాలు మరొక ఆచార్యులు వేరే వివరించారు. ఇంత చక్కని వ్యాఖ్య సమకూర్చిన వీరు ధన్యులు, మాన్యులు.

దీనిని తమ శతక ప్రచురణ ప్రణాళికలో రెండవదిగా ప్రచురిస్తున్న శ్రీ పావని సేవాసమితికీ, శ్రీ సాంబిరెడ్డి గారికీ తెలుగువారు తమ ఋణం తీర్చుకోలేరు. అయినా మార్గం లేకపోలేదు. మిగిలిన శతకాలకు వ్యాఖ్యలు వ్రాయనంగీకరించిన వారూ త్వరలో వాటిని పూర్తి చేసి ఇవ్వటం తరవాయిగా, ఆ వ్యాఖ్యలతోపాటు వీరు ప్రచురించనున్న శతకాలు తాము చదువుతూ తమ పిల్లల చేత చదివిస్తూ ఉండటం ఒకటే ఆ మార్గం.

**ఏలూరిపాటి అనంతరామయ్య**

# మా మాట

(ద్వితీయ ముద్రణ)

సాహిత్యం చాలా ప్రభావవంతమైన వస్తువు. దానికి భగవద్ వైముఖ్యం కలిగించడంలోనూ, భగవదాభి ముఖ్యం కలిగించడంలోనూ అప్రతిమానమైన సామర్థ్యం ఉంది.

గతంలో మాదిరి, మానవ వికాసం ధర్మావగాహన-పారలౌకిక చింతన అనే పునాదులపై జరగడం లేదనేది గమనార్హం. ఈ లోటు పూరించడానికి శ్రీ పావని సేవా సమితి శతక సాహిత్యం మీధికి దృష్టి మళ్లించింది.

భక్తి సంప్రదాయ శతక సాహిత్య ప్రచురణతోపాటు, నీతి శతక సాహిత్య ప్రచురణ కూడ చేపట్టింది.

ప్రథమ ప్రచురణ శ్రీకృష్ణ శతకము, మహాకవి శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారి "గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య" తో జనవరి 1998లో ప్రచురించటం-పండితుల, పాఠకుల ప్రశంసలందుకోవటం జరిగింది.

మా ఈ ద్వితీయ ప్రచురణ "దాశరథి శతకము". ఈ గ్రంధానికి అవధూత దత్తపీఠాధిపతి, పరమపూజ్య, జగద్గురు, శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు తమ ఆశీస్సందేశము అనుగ్రహించినారు. వారికి మా సాష్టాంగనమస్కారములు. మాకోరికను మన్నించి ప్రముఖ సాహిత్యవేత్త ఆచార్య ఎమ్. కులశేఖరరావు గారు ప్రఖ్యాతమైన ఈ దాశరథి శతకానికి అనుపమానమైన వ్యాఖ్య వ్రాసి అనుగ్రహించారు. శ్రీరామావతార తత్త్వం, పరమాత్మ తత్త్వం, అవసరమైన చోట్ల వేదాలు, పురాణాలు, ఇతిహాసాదులు- వీటి నుంచి ప్రమాణ వాక్యాలనుదాహరించి, పాఠకులకు ఈ శతకమాధుర్యాన్ని అందించారు. ఈ వ్యాఖ్యలు భావితరాల వారికి వెలుగుబాటగా నిలుస్తాయి అని మా విశ్వాసము. శ్రీ కులశేఖరరావుగారికి శ్రీ పావని సేవా సమితి కృతజ్ఞతలను తెలుపుకొంటున్నది.

ఈ పుస్తకానికి హంసోదకము వ్రాసిన డా॥ డి. చిన్ని కృష్ణయ్య గారికి, ఈ శతకముల ప్రచురణలో మాకు తమ అమూల్య సలహాల నందించిన పూజ్యులు పెద్దలు మహాకవి శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికి, ఈ పుస్తకానికి 'మిసిమిమీగడ' అనుగ్రహించిన ఆంధ్ర వ్యాస, కమిుల రత్నదీప, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య గారికి మా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాము.

ఈ పుస్తకానికి ముఖపత్రాలంకరణ కావించిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ గంగాధర్ గారికి, ముచ్చటగా టైపు చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ నిర్మలగారికి, సుందరంగా ముద్రించిన శ్రీ సాయిరాం ప్రింటర్స్ అధినేత శ్రీ నాగేశ్వరరావు గారికి మా కృతజ్ఞతలు.

**జి.సిహెచ్. రామారావు**

కార్యదర్శి, శ్రీ పావని సేవా సమితి.

## మనవి

తెలుగువారికి భద్రాచల శ్రీరాముడు ఎంతటి ఆరాధ్య దైవమో, రామదాసు అని ప్రఖ్యాతిని పొందిన కంచెర్ల గోపన్న అంతటి ప్రియమైన కవి. ఈ కవి వ్రాసిన కీర్తనలు, ఆయన వ్రాసిన దాశరథి శతక పద్యాలు ఆంధ్రులకు నిత్యశ్రవణీయాలు, నిత్యపఠనాలు అయినాయి.

భక్తి శతకాలలో బహుళ ప్రాచుర్యం పొందిన శతకం దాశరథి శతకమే. పోతన్నగారి పద్యాలు తరువాత, దాశరథి శతక పద్యాలకు మనవారు చాల ఆదరించినారు. శ్రీ రఘురామ, చారుతులసీదళదామ, అనే పద్యాన్ని విననివారు, మననం చేయనివారు అరుదు. భగవంతుడు, తన నిజమైన భక్తుని అనేక పరీక్షలు పెట్టి నిగ్గు తేల్చుకొంటాడట. రామదాసు, శ్రీరాముని త్రికరణ శుద్ధిగా కొలిచి, కష్టాల పాలైన వృత్తాంతం మన దేశంలో ఆబాలగోపాల విదితమే. గోలకొండ దుర్గాన్ని దర్శించిన వారలు, భద్రాచల రామదాసు బందీఖానాను యాత్రాస్థలంగా భావించి చూచి ఆయన కష్టాల్లో పాలుపంచుకొంటారు. ' మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అనే శాస్త్రవాక్యాన్ని పరిపూర్ణంగా అనుసరించిన వారు గోపన్న కవి. భాగవతాది పురాణాల్లో ప్రకటింపబడిన వివిధ భక్తి మార్గాలను పరిపూర్ణంగా అవగాహన చేసికొని ఈ కవి ఈ భక్తి శతకాన్ని సంతరించినారు. ఆయా సంధర్భాలో వివిధ భక్తి విశేషాలు ఈ వ్యాఖ్యానంలో వివరింపబడినాయి.

కంచెర్ల గోపన్న కవి రఘునాథభట్టాచార్యుల సన్నిధిని తిరుమంత్రమునుపదేశము పొంది త్రికరణ శుద్ధిగా విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ఆచరించిన కవి. ఆయన పద్యాల్లో చాల చోట్ల ఈ సిద్ధాంత విశేషాలు స్పష్టంగా దర్శనమిస్తాయి. యధాశక్తిగా ఈ పద్యాలవ్యాఖ్యానంలో ఆవిషయాలు ప్రస్తావించి ప్రదర్శించే ప్రయత్నం చేసినాను.

అనేక కీర్తనలు వ్రాసిన రామదాసుగారు, కంచెర్ల గోపన్న ఒకరేనా, భిన్నమైనవారా అనే ఆలోచన ఇంకా కొందరికి వస్తుంది వారిద్దరు ఒకరే అని భావించే వారిలో నేనొకణ్ణి. ఈ కవి పద్యాల్లోను, రామదాసు కీర్తనలోను ఉండే భావ సామరస్యాన్ని చూపించి అవి ఒకే కవి వ్రాసినవి అని నిరూపించడానికి ప్రయత్నం చేసినాను. నిర్ణయించేవారు పాఠకులే.

ఈ వ్యాఖ్య వ్రాసిన తరువాత దీనికి మానసోల్లాస వ్యాఖ్య అనే పేరు పెట్టవలెనని స్ఫురించింది. మనస్సుకు ఉల్లాసం కలిగించేది భక్తిభావం. ఈ పద్యాలు, ఈ వ్యాఖ్యానం, చదివితే పాఠకుల్లో ఆభావం తప్ప మరేమి కలుగదు. మానస సరోవరంలో ఉల్లాసంగా తిరిగేవి హంసలు : వీటికి క్షీర నీర న్యాయశక్తి ఉన్నదంటారు. ఈ వ్యాఖ్యకు కూడ యధార్థాన్ని విశదం చేయడం పరమార్థమైంది. అందుచేత ఈ పేరు రెండువిధాల సరిపోవచ్చు .

ఈ శతకం, మానసోల్లాసంగా వెలుగు చూడడానికి శ్రీ చల్లా సాంబిరెడ్డిగారి ఔదార్యం ప్రధాన కారణం. ఆచార్య దేవళ్ల చిన్ని కృష్ణయ్యగారి హంసోదకం దీనికి వన్నె కూర్చింది. శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి వారి ఆశీస్సందేశం వలన ఈ గ్రంధానికి అదృష్టం వచ్చింది. వీరందరికి నా నమస్కృతులు.

ఎమ్. కులశేఖర రావు.

1. ఉ. శ్రీ రఘురామ చారుతులసీదళదామ శమక్షమాదిశృం
గారగుణాభిరామ త్రిజగన్నుతశౌర్యరమాలలామ దు
ర్వారకబంధరాక్షసవిరామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.

ప్రతిపదార్థము : శ్రీ = సంపత్ప్రదమైన, రఘురామ = రఘుమహారాజు జన్మించుటవలన ప్రఖ్యాతమైన ఇక్ష్వాకువంశంలో జననమందినవాడా, చారు = సుందరమైన - అందమైన - సొగసైన, తులసీదళదామ = తులసి అనే పవిత్ర-ఓషధీదళములచేత, చివళ్లచేత, కూర్చబడిన దండను ధరించినవాడా, శమ = శాంతము, క్షమ = ఓర్పు, ఆది = మొదలైన, శృంగార = ఇంపుగా ఉండే, అలంకారంగా ఉండే, గుణ = మంచిగుణాలచేత, అభిరామ = మనోహరమైనవాడా, త్రిజగత్ = స్వర్గమర్త్యపాతాళములనే మూడులోకములలో, నుత = పొగడబడిన - స్తుతి చేయబడిన, శౌర్యరమా = పరాక్రమమనే లక్ష్మికి, లలామ = అలంకారమువంటివాడా, దుర్వార = నివారించడానికి సాధ్యంకాని, ఎదుర్కొనడానికి సాధ్యం కాని, కబంధరాక్షస = కబంధుడనే పేరు గలిగిన రాక్షసుని, విరామ = వధించినవాడా, జగజ్జన = లోకంలోని జనుల యొక్క, కల్మష = పాపాలనెడు, అర్ణవ = సముద్రాన్ని, ఉత్తారక = దాటింపచేయునట్టి, నామ = పేరు, ప్రఖ్యాతి కలిగినవాడా, భద్రగిరి = భద్రాచలము అనే పుణ్యక్షేత్రంలో వెలసి ఉన్న, దాశరథీ, = దశరథునికుమారుడైన, శ్రీరామా, కరుణా = దయాగుణానికి, పయోనిధీ = సముద్రమువంటివాడా, అనంతమైన దయాస్వభావంకలవాడా.

తాత్పర్యము : సంపత్ప్రదమయిన రఘుమహారాజు జన్మించిన ఇక్ష్వాకువంశంలో జన్మించి, భద్రాచలక్షేత్రంలో నివసించి ఉన్న దయా సముద్రుడవగు ఓ దశరథరామా, నీవు సుందరమైన తులసీ దళమాలను ధరించినవాడవు. శాంతము, ఓర్పు అనే మనోహరగుణములు గలవాడవు. స్వర్గ మర్త్యపాతాళలోకములలో పొగడబడిన పరాక్రమ లక్ష్మికి అలంకారమైనవాడవు. ఎదిరించడానికి సాధ్యంకాని కబంధుడనే దుష్టరాక్షసుని సంహరించినవాడవు. సముద్రంవంటి అపారమైన జనుల పాపాలను దాటింప జేసే సామర్థ్యం కలవాడవు.

వ్యాఖ్యానము : దాశరథిశతకాన్ని రచించిన రామదాసుగా ప్రఖ్యాతిని పొందిన కంచెర్ల గోపన్న తనశతకాన్ని శ్రీ అనే అక్షరంతో ప్రారంభించినాడు. కావ్యప్రారంభం శ్రీకారంతో చేయడం తెలుగు కవిసంప్రదాయం. తెలుగుసాహిత్యంలో ఆదికవి నన్నయభట్టు తన ఆంధ్రమహాభారతాన్ని 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అని ప్రారంభించినాడు. నన్నయకు

దీటైన తిక్కనసోమయాజి 'శ్రీయన గౌరినాబరగు' అనే శ్రీకారాన్నే ప్రారంభంలో ఉపయోగించినాడు. శ్రీ అంటే సంపద, లక్ష్మి, సమృద్ధి, శుభము మొదలైన అర్థాలున్నాయి. 'అనిర్వేదః శ్రియో మూలమ్' అని రామాయణంలో ఉన్నది. శ్రీ అనే అక్షరాన్ని (పదాన్ని) దేవతలకు, గౌరవింపదగిన వ్యక్తులకు, ముందు ఉపయోగిస్తారు. తెలుగువారు సామాన్యంగా 'శ్రీరాముడు' అనే కాని రాముడు అని వ్యవహరించరు. మహాకావ్యాలను పేర్కొనేటప్పుడుకూడ శ్రీ అని ఉపయోగించడం ఉన్నది. శ్రీమద్రామాయణం, శ్రీమద్భాగవతం ఇత్యాదులు.

సూర్యవంశంలో ప్రఖ్యాతుడైన మహారాజు రఘువు. ఇతడు దిలీపునికుమారుడు. అజమహారాజుతండ్రి. ఇతడు పాండిత్యంలోను, పరాక్రమంలోను అఖండుడని తండ్రి భావించెనట. దానికి తగినట్లుగానే, రఘుమహారాజు సర్వదిగ్విజయాలు చేసినాడు. ప్రపంచం చివరిదాక జయించినాడు. అతడు విశ్వజిత్తు అనే యాగాన్ని నిర్వహించినాడు. దానిలో తన సర్వస్వాన్ని బ్రాహ్మణులకు దానం చేసినాడు. అప్పుడు తనకుమారునికి - అజునికి - యౌవరాజ్యపట్టాభిషేకం కట్టినాడు. శ్రీరాముడు అటువంటి రఘువంశంలో జన్మించినవాడని, గొప్పవాడని చెప్పినాడు.

భారతీయులు తులసిని పవిత్ర-ఓషధిగా పరిగణిస్తారు. విష్ణుమూర్తి తులసీ మాలను ధరిస్తాడని వైష్ణవులవిశ్వాసం. శ్రీరాముడు, విష్ణుమూర్తిఅవతారమే కాబట్టి ఆయన తులసిదళములమాలికను ధరించినట్లుగా కవి వర్ణించినాడు. తెలుగుదేశంలోనివారు కార్తికశుద్ధద్వాదశినాడు తులసీవివాహంచేయడం సంప్రదాయంగా వస్తూఉన్నది.

శమము అనగా, శాంతము, క్షమ అనగా ఓర్పు, ఈ రెండు చాల ఉత్తమగుణాలు. వాటినిగురించి రామాయణంలో ఇట్లా ఉన్నది:

> నాస్తి వేదసమం శాస్త్రం నాస్తి శాన్తిసమం సుఖమ్ ।
> నాస్తి శాన్తిపరం జ్యోతిర్నాస్తి రామాయణాత్ పరమ్॥
> నాస్తి క్షమాసమం సారం నాస్తి కీర్తిసమం ధనమ్ ।
> నాస్తి జ్ఞానసమో లాభో నాస్తి రామాయణాత్పరమ్ ॥

ఇటువంటి సుగుణాలైన శాంతిక్షమాగుణాలను శ్రీరాముడు వహించినాడు. స్వర్గమర్త్య పాతాళలోకాలలో శ్రీరాముని కీర్తి వ్యాపించింది.

శ్రీరామలక్ష్మణులు, సీతాన్వేషణ చేస్తూ,అడవిలో సంచరిస్తున్నప్పుడు కబంధుడనే రాక్షసుడు తన దీర్ఘబాహువులతో వారిని బంధిస్తాడు. ఇతడు మహాబలవంతుడు. అయినా, రామలక్ష్మణులు పరస్పరం సంప్రదించుకొని, అతని రెండుబాహువులను తమ

భుజశక్తితో ఖండించివేస్తారు. కబంధునికి శాపవిమోచనం కలుగుతుంది. అతనికి విరూపం నుండి విముక్తి లభిస్తుంది. అతడు రామలక్ష్మణులను కొనియాడుతాడు. రామాయణంలోని అరణ్యకాండలో ఈ వృత్తాంతం ఉన్నది. కవి ఈకథను సూచనప్రాయంగా పేర్కొన్నాడు.

ప్రపంచంలోనిజనం తమ నిత్యజీవితవ్యవహారంలో అనేకపాపకర్మలకులోనవుతారు. క్రమంగా వారిపాపాలు సముద్రంలాగ అపారమైపోతాయి. ఈ పాపాలను తొలగించుకోవడానికి ఈ పాపాలసముద్రం దాటడానికి 'శ్రీరామ' అనే పేరు తప్ప మరొకటి లేదని కవి సూచించినాడు.

చరితం రఘునాథస్య, శతకోటిప్రవిస్తరమ్
ఏకైకమక్షరం ప్రోక్తం, మహాపాతకనాశనమ్॥

భద్రగిరి, భద్రాచలం, ఆంధ్రదేశంలోని శ్రీరాముని పుణ్యక్షేత్రం. శ్రీరాముడు అరణ్యావాసం చేస్తున్నప్పుడు ఇక్కడ, గోదావరీతీరంలో కొంతకాలం నివసించినాడని విశ్వసిస్తారు. దమ్మక్క అనే భక్తురాలివలన, రామదాసు అనే కంచర్ల గోపన్నవలన భద్రాచలక్షేత్రం లోకంలో పేరుపొందింది. దశరథుని కుమారుడైన శ్రీరాముడు ఈ నాటికిని ఈ క్షేత్రంలో నివసించి తెలుగువారి నిత్యసేవలను అందుకొని వారిని కటాక్షిస్తున్నాడు. శ్రీరాముడు దయాగుణానికి సముద్రమంతటి విస్తృతి కలిగినవాడుకదా.

దాశరథి శతకం అనే ఈ స్తుతికావ్యానికి నాయకుడు శ్రీరాముడు. ప్రారంభంలోని ఈ పద్యంలో ఈ నాయకుడు ఎటువంటివాడో, కవి చెప్పడానికి ప్రయత్నంచేసినాడు. అతడు రఘువంశంలో పుట్టినవాడని, క్షమాదిసుగుణాలు కలవాడని, మూడు లోకాలలో ప్రస్తుతింపబడేవాడని, రాక్షససంహారం చేసినవాడని, జనులపాపాలను తొలగించేవాడని, దయాగుణానికి నిలయమని ప్రస్తుతం భద్రాచలక్షేత్రంలో నివసించి ఉన్నాడని వర్ణించినాడు.

కావ్యప్రారంభంలో ఆశీస్సు, నమస్కారము, వస్తునిర్దేశం అనేవి వ్రాయడం కవిసంప్రదాయం. ఈ మూడు లక్షణాలుండవచ్చు. కాదా కొన్ని అయినా ఉండవచ్చు. ప్రారంభంలో రఘురాముని పేర్కొనడం చేత, ఇది అతనికి చెందినశతకం అనే సూచన. ఆయన గుణాలు వర్ణించడంచేత ఈ కావ్యానికి తగిన నాయకుడనే ప్రస్తావన. రాక్షససంహారం చేసినాడనడంచేత ఇటువంటి కథలు ముందు రాగలవని చెప్పడం.

ఈ ప్రారంభపద్యం సంబోధనాత్మకంగా ఉన్నది. స్తుతికావ్యాలు సంబోధనాత్మకంగా ఉండడం సంప్రదాయమే. శ్రీమద్భాగవతంలో 'శ్రీకృష్ణా యదుభూషణా, నరసఖా, శృంగారరత్నాకరా' మొదలైన పద్యాలు ఇటువంటివే. కృష్ణమాచార్యులు మొదలైన

భక్తులు తమ కావ్యాలను, 'అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా, ఆదిమధ్యాంతరహితా' వంటి సంబోధనలతో ప్రారంభిస్తారు.

కంచెర్ల గోపన్న శతకలక్షణాలను అనుసరించి 'దాశరథీ కరుణాపయోనిధీ' అనే సంబోధనతో తన శతకపద్యాలను ముగిస్తాడు. దాన్ని లక్షణకారులు మకుటం అని పేర్కొంటారు. తెలుగు శతకాల్లో సుమతీ, కృష్ణా, భాస్కరా వంటి శబ్దాలు మకుటంగా ఉపయోగింపబడడం అందరకు తెలిసిందే.

ఈ పద్యంలో ప్రధానంగాఅనుప్రాసాలంకారం ఉంది.

**2. ఉ. రామ, విశాలవిక్రమపరాజితభార్గవరామ, సద్గుణ**
**స్తోమ, పరాంగనావిముఖసువ్రతకామ, వినీలనీరద**
**శ్యామ, కకుత్స్థవంశకలశాంబుధిసోమ, సురారిదోర్బలో**
**ద్దామవిరామ, భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: రామ = సుందరమైనశ్రీరామా, విశాల = విస్తృతమైన, విక్రమ = పరాక్రమము వలన, పరాజిత=ఓడింపబడిన, భార్గవరామ=పరశురాముడుకలవాడా, సద్గుణ =సత్యము,పరాక్రమముమొదలైనమంచిగుణ ములయొక్క, స్తోమ=సమూహముకలవాడా, పరాంగనా = ఇతరస్త్రీలపట్ల, విముఖ=పెడమొగముపెట్టు, సువ్రత= మంచిదీక్షను, కామ=కోరువాడా, అభిలాషకలవాడా,వినీల=అందమైన-విశేషమైననలుపురంగుగల, నీరద=మేఘమువంటి, శ్యామ=నల్లనివాడా, కకుత్స్థవంశ=కాకుస్థవంశమనేసూర్య వంశము అనే, కలశాంబుధి = పాలసముద్రానికి, సోమ = చంద్రునివంటివాడా, సురారి = దేవతలకు శత్రువులైన రాక్షసుల, దోర్బలోద్దామ = బాహుబలము గొప్పతనాన్ని, విరామ = అణచినవాడా, దాశరథీ - కరుణాపయోనిధీ.

తా: రామా, సుందరస్వరూపంగలవాడవు. భార్గవవంశంలో జన్మించిన పరశురాముని జయించినవాడవు, మంచిగుణములసమూహముకలవాడవు, పరస్త్రీలయందు ఆసక్తిలేనివాడవు. ఇంపైన నల్లనిమేఘమువంటి శరీరకాంతి గలవాడవు. సూర్యవంశమైన కాకుత్స్థవంశమనే సముద్రానికి చంద్రునివలె ఆహ్లాదంకలిగించేవాడవు. రాక్షసుల బాహుబలాన్ని అణచినవాడవు. భద్రాచలరామా, దశరథరామా.

వ్యా : ఈ పద్యంలోని శ్రీరాముని సంబోధిస్తూ, అతని గుణగణాలను వర్ణిస్తున్నాడు కవి. సీతారాముల వివాహమైనతరువాత, దశరథుడు నూతనదంపతులతో అయోధ్యకు ప్రయాణమైనాడు. అపుడు దుష్టశకునాలు ఎదురైనాయి. ఇంతలో పరశురాముడు కనిపించినాడు.

*స్కంధే చాసజ్జ్య పరశుం ధనుర్విద్యుద్గణోపమమ్।*

*ప్రగృహ్య శరముగ్రం చ త్రిపురఘ్నం యథా శివమ్॥*

అతడు భుజంపై పరశువు ధరించి ఉన్నాడు. విద్యుద్గణంలాంటి ధనుర్బాణాలు వహించి ఉన్నాడు. అప్పుడతడు త్రిపురాలను నశింపచేసే మహేశ్వరుని వలె కనిపించినాడు. అక్కడ ఉండిన వశిష్ఠాది ఋషులు, దశరథుడు అతనిని ప్రసన్నునిచేయడానికి ప్రయత్నించినారు. కాని, క్రోధోద్దీప్తుడైన భార్గవరాముడు, శ్రీరాముని ఎదిరించి, శివధనుర్భంగం చేయడం ఏమంత గొప్ప కాదని, తనవద్ద ఉన్న వైష్ణవధనువును ఎక్కుపెట్టమని ఆదేశించినాడు. శ్రీరాముడీఅవమానాన్ని సహించలేదు. ఆ వైష్ణవధనుస్సును అతనిచేతినుండి గ్రహించి దానిని ఎక్కుపెట్టి దానిలో బాణమును సంధించినాడు. దానితో పరశురామునిశక్తి నశించిపోయింది.

*జడీకృతే తదా లోకే రామే వరధనుర్ధరే।*

*నిర్వీర్యో జామదగ్న్యోసౌ రామో రామముదైక్షత॥*

అపుడు పరశురాముడు శ్రీరామునిశక్తిని తెలిసికొని అతన్ని స్తుతిచేసినాడు. ఈ విధంగా లోకంలోని క్షత్రియులకు నాశనకారకుడుగా ఉండిన భార్గవరాముని, శ్రీరాముడు పరాజితుని చేసినాడు. కవి ఈ కథను ఈ పద్యంలో సూచించినాడు.

శ్రీరాముడు దయ, త్యాగం మొదలైన మంచిగుణాలకు ఆలవాలమైనవాడని లోకప్రఖ్యాతి.

పరస్త్రీలను, సోదరీమణులవలె, తల్లులవలె భావించడం అనాదిగా వస్తున్న భారతీయ సంప్రదాయం. పురుషోత్తముడైన శ్రీరాముడు త్రికరణశుద్ధిగా ఈ సంప్రదాయాన్ని పాటించిన మహానుభావుడు. ఈ నియమాన్ని చిత్రించడానికి ఒక ఉదాహరణము చాలును. సీతారామలక్ష్మణులు దండకారణ్యంలో ఉన్నప్పుడు రావణునిసోదరి శూర్పణఖ అక్కడికి వచ్చింది. త్రిలోకమోహనుడైన శ్రీరామునిసౌందర్యంచేత ఆకర్షింపబడింది. ఎందుచేతనంటే శ్రీరాముడు

*దీప్తాస్యం చ మహాచాపం పద్మపత్రాయతేక్షణమ్।*

*గజవిక్రాంతగమనం జటామండలధారిణమ్॥*

తనకాంక్షను వ్యక్తంచేసింది. కాని శ్రీరాముడు ఆమెసౌందర్యానికి గాని, ఆమె ఆభిజాత్యానికి కాని లోబడినవాడు కాదు. చపలచిత్తయైన శూర్పణఖ లక్ష్మణునివైపు వెళ్లింది. సీతాదేవిని భయపెట్టింది. ఈ దుష్టప్రవర్తనకు శ్రీరాముడు ఆమెకు తగినశిక్ష విధింపచేసినాడుకూడ. బహుశా కవి ఈ సంఘటనను మనస్సులో పెట్టుకొని 'పరాంగనావిముఖసువ్రతకామ' అనే విశేషణాన్ని శ్రీరామునిపరంగా వ్రాసి ఉన్నాడు.

శ్రీరాముడు నీలమేఘశ్యాముడు. పరమసుందరస్వరూపం కలిగినవాడు. విచిత్రమేమో కాని, మన ప్రాచీన గ్రంథాలైన పురాణాల్లో చాలమంది వ్యక్తులు, (ప్రధానవ్యక్తులు) నల్లనివారే. భాగవతంలో వర్ణింపబడిన శ్రీకృష్ణుడు నల్లనివాడు. 'నల్లనివాడు పద్మనయనంబులవాడు' అని పోతనగారు వర్ణించినాడుకదా. మహాభారతంలో అర్జునుడు నల్లనివాడే. 'అర్జున, ఫల్గుణః, పార్థః, కిరీటీ, శ్వేతవాహనః, బీభత్సుః, విజయః, కృష్ణః, సవ్యసాచీ, ధనంజయః' అనే అతనిపేర్లలో కృష్ణ అని ఉండడం ఈ విషయాన్నే సూచిస్తుంది. మహాభారతం కథానాయిక అయిన ద్రౌపదీదేవికి కృష్ణ అనే పేరున్నది. బహుశా ఈ పేరు ఆమె నీలవర్ణంచేతనే వచ్చి ఉంటుంది. ఇక మహాభారతాన్ని రచించిన వ్యాసమహర్షి, కృష్ణద్వైపాయనుడు. నల్లనివాడై ద్వీపంలో పరాశరమహర్షికుమారుడుగా జన్మించినాడు.

శ్రీరాముని శ్యామల సౌందర్యము లోకోత్తరమైంది. చాలమంది కవులీ అందంతో ఆయనను వర్ణించినారు. ఆంధ్రమహాభాగవత కర్త పోతనామాత్యుడు చేసినవర్ణన మనోహరమైంది:

మెరుఁగుచెంగటనున్న మేఘంబుకైవడి నువిద చెంగటనుండ నొప్పువాఁడు.
చంద్రమండలసుధాసారంబుపోలిక ముఖమున జిరునవ్వు మొలచువాఁడు
వల్లీయుతతమాలవసుమతీజముభంగి బలువిల్లు మూపునఁ బరగువాఁడు
నీలనగాగ్రసన్నిహితభానునిభంగి ఘనకిరీటము దలఁ గలుగువాఁడు
పుండరీకయుగముఁ బోలుకన్నులవాఁడు వెడఁదయురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా కన్నుగవకు నెదురఁ గానఁ బడియె

ఈ జగన్మోహనరూపుని దర్శించిన కవి ధన్యుడుకదా. ఇంతటి అందమైనవాడు కాబట్టే, శ్రీరాముని శూర్పణఖ, తన సోదరుడైన రావణునిసభలో ఈ విధంగా వర్ణించింది:

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ
పుండరీక విశాలాక్షౌ, చీరకృష్ణాజినాంబరౌ ॥

సూర్యవంశంలో కకుత్స్థుడు అనే రాజు జన్మించి ప్రఖ్యాతి వహించడంచేత, ఆ వంశానికి కాకుత్స్థవంశం అనేపేరు వచ్చింది. పూర్వం దేవతలు, రాక్షసులు పాలసముద్రాన్ని మథిస్తే, అమృతం, విషం, మొదలైన పదార్థాలతో పాటు అందమైన చంద్రుడుకూడ ఉద్భవించినాడట. ఆ విధంగానే సూర్యవంశంలో శ్రీరాముడు ఆహ్లాదకరంగా, శశాంకుని వలె జన్మించినాడని కవి భావించినాడు.

దేవతలకు, రాక్షసులకు ఎప్పుడు శత్రుభావమే. దేవతలు సాత్త్వికులు, రాక్షసులు

తామసులు. విష్ణుమూర్తి, సముద్రమంథనకాలంనుండి, సాత్త్వికులైన దేవతలను రక్షించడానికి, రాక్షసులను అణచివేయవలసి వచ్చింది. విష్ణుమూర్తి త్రేతాయుగంలో శ్రీరాముడుగా అవతరించినప్పుడుకూడ, అదే పని చేసినాడు. గురువైన విశ్వామిత్రునియొద్ద అస్త్రఉపదేశం పొందినతరువాత, లోకరక్షణార్థం తాటకను సంహరించినాడు. విశ్వామిత్రయాగసంరక్షణకొరకు, మారీచుని పారద్రోలి సుబాహుని హతమార్చినాడు. వనవాసం చేస్తున్నప్పుడు ప్రబలులైన విరాధకబంధోగ్రఖరదూషణాదులను, చివరన రావణాదులను సంహరించవలసివచ్చింది. ఈ విషయాలను మనస్సులో ఉంచుకొని కాబోలు గోపన్నగారు శ్రీరాముని 'సురారిదోర్బలోద్దామ విరామ' అని సంబోధించినారు.

అయోధ్యానగరంలో శ్రీరాముడు జన్మించడంచేత అయోధ్యారాముడు, దశరథునికుమారుడు కావడంచేత దశరథరాముడని శ్రీరాముని వ్యవహరించడం ఉన్నది. కాని, కంచెర్ల గోపన్నగారు శ్రీరాముని భద్రగిరిరాముడనే ఆద్యంతం సంబోధించినాడు. భద్రాచలంలో ఆయన నివసించి ఉండడంచేత ఈ సంబోధన సముచితమే.

ఈ పద్యంలో అనుప్రాస అనే శబ్దాలంకారం నిక్షిప్తమైంది. మకారం అంత్యప్రాసగా నిలిచి పద్యానికి శబ్దసౌందర్యం సమకూర్చింది.

'కకుత్స్థ వంశ కలశాంబుధిసోమ' అన్నప్పుడు రూపకం అనే అర్థాలంకారం ఉపయుక్తమైంది.

> *'తద్రూపక మభేదో య ఉపమానోపమేయయోః*
>
> *సమస్తవస్తువిషయం శ్రౌతా ఆరోపితా యదా'*

అని లక్షణము.

రూపకాలంకారంలో ఉపమేయంమీద ఉపమానం ఆరోపింపబడుతుంది. 'కకుత్స్థవంశం' అనే ఉపమేయంమీద, 'కలశాంబుధి' అనే ఉపమానం ఆరోపింపబడింది.

**3. చ. అగణితసత్యభాష, శరణాగతపోష,, దయాలసజ్ఝరీ**
**విగతసమస్తదోషపృథివీసురతోష, త్రిలోకపూతకృ**
**ద్గగనధునీమరందపదకంజవిశేష, మణిప్రభాధగ**
**ద్ధగితవిభూష, భద్రగిరిదాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర: అగణిత = గణించుటకు సాధ్యము కాని, ఎన్న నలవి కాని, సత్యభాష = సత్యవాక్యములుమాత్రమే పలుకువాడా, శరణ + ఆగత = అభయము కోరివచ్చినవారిని, పోష = రక్షించువాడా, పోషించువాడా, దయా = కరుణ అనెడు, లసత్ = ప్రకాశిస్తున్న ఝరీ = ప్రవాహంచేత, విగత = పోయిన, సమస్త = సకలమైన, దోష = పాపములు

కలవాడా, పృథివీసుర = భూలోకంలో దేవతలవంటి బాహ్మణులను, తోష = సంతోషపెట్టువాడా, త్రిలోక = స్వర్గమర్త్య పాతాళలోకములను, పూతకృత్ = పవిత్రముచేస్తున్న, గగనధునీ = గంగానది యనే, మరంద = మధువు లేక తేనెగల, పదకంజవిశేష = పాదపద్మముల విశేషము, ఆధిక్యము గలవాడా, మణిప్రభా = వజ్రము మొదలైన మణులకాంతులచేత, దగద్దగిత = ధగధగమని ప్రకాశిస్తున్న, విభూష = అలంకారములు గలవాడా, దాశరథీ, కరుణాపయోనిధీ.

తా: అసామాన్యమైన, గణించుటకు సాధ్యం కాని, సత్యావాక్యములు మాటాడువాడవు. అభయమును కోరినవారిని, శరణువేడినవారిని, కాపాడువాడవు, ప్రకాశించే ప్రవాహంవంటి స్వచ్ఛమైన దయాగుణంచేత, ఆశ్రితుల దోషాలను పరిహరించే వాడవు. బ్రాహ్మణులను సంతోషింపచేసేవాడవు, మూడులోకాలను పవిత్రంచేసే గంగానదిని వెలువరించిన పాదపద్మాలు గలవాడవు. రత్నములకాంతులచేత ధగధగ మెరుస్తూ ఉన్న ఆభరణములు ధరించినవాడవు. భద్రాచల నివాసియగు దశరథరామా!

వ్యా: ఈ పద్యంలో కవి శ్రీరాముని గుణవిశేషాలను వర్ణించి ఆయన గొప్పతనాన్ని ప్రదర్శిస్తూ ఉన్నాడు. లోకంలో సత్యవాక్పరిపాలన చేసేవాడుండవచ్చు గాని, శ్రీరాముని సత్యావాక్యం ఇంతటిది అని ఎన్ని చెప్పడానికి సాధ్యంకానిది. శత్రువైనను సరే, శరణు వేడితే కాపాడే గుణం కలిగినవాడు. ఆయన దయాగుణం స్వచ్ఛమైన నీటి ప్రవాహంవంటిది. దానిచేత లోకంలోని మనుష్యుల, భక్తులపాపాలు పోగొట్టేశక్తి కలిగినవాడు. వేదాభ్యాసం చేసి, నియమవ్రతాలను పాలించే బ్రాహ్మణులను సంతోషపెట్టేవాడు. శ్రీరామునిపాదాలు పవిత్రమైనవి. గంగానదిలో స్నానంచేస్తే పాపాలు తొలగి పోతాయంటారు. శ్రీరాముని పాదాలనుంచి గంగానది జన్మించటంచేత, ఆయనపాదాలు స్పృశిస్తేచాలు భక్తులదోషాలన్ని నశిస్తాయి. మహారాజు కాబట్టి అనేకరత్నాలంకారాలు ధరించినాడు. అవి ఎప్పుడు ప్రకాశిస్తూ ఉంటాయి.

శ్రీరామునిసత్యవాక్కు మూడులోకాల్లో ప్రఖ్యాతమైంది. అందుచేత అది అగణ్యమైంది. శ్రీరామునికి యౌవరాజ్యపట్టాభిషేకం చేయాలని తండ్రి దశరథ మహారాజు సంకల్పించినాడు. కాని సవతితల్లి కైక అడ్డుపడి రామునికి బదులు తనకుమారుడు భరతునికి పట్టాభిషేకం చేసి శ్రీరాముని పదునాల్గు సంవత్సరాలు వనవాసానికి పంపవలసిందని, తనకు భర్తవలన లభించిన పూర్వవరాలు ఆధారంగా పట్టుపడుతుంది. సత్యసంధుడైన రాజు కాదనలేకపోయినాడు. తండ్రిమాట నిలబెట్టడానికి, సత్యశీలుడైన శ్రీరాముడు నారచీరలు ధరించి అరణ్యానికి ప్రయాణమయినాడు. ఆయనతోపాటు సహధర్మచారిణి, పతివ్రత అయిన సీతాదేవికూడ అడవికి బయలుదేరింది. అనురాగమూర్తి

సోదరుడు లక్ష్మణస్వామికూడ వారితో బయలుదేరినాడు. సీతారామలక్ష్మణుల వనగమనంతో, దశరథుడు క్రుంగిపోయినాడు. పుత్రవియోగం ఆయనకు భరించరానిదైంది.

తండ్రిమరణవార్త చెప్పడానికి, భరతుడు, పరివారంతో, తల్లులతో, చిత్రకూటపర్వతానికి వెళ్లి శ్రీరామునికి ప్రణమిల్లి, దుఃఖవార్త చెప్పి, శ్రీరాముడు తిరిగి అయోధ్యకు రావలసిందని, అయోధ్యారాజ్యాన్ని స్వీకరించి పరిపాలించమని ప్రార్థిస్తాడు. కాని, రాముడు తన సత్యసంధతను వదలడు.

ఈ విధంగా తన సత్యసంధతను శ్రీరాముడు నిలబెట్టుకొన్నాడు. కాబట్టే కవి అతన్ని 'అగణితసత్యభాష' అని సంబోధించినాడు.

శ్రీరాముని శరణువేడి తరించిన వారిలో ప్రధానమైనవాడు రావణాసురునిసోదరుడైన విభీషణుడు. ఇతడు రావణునిసభలో, శ్రీరామునిశక్తిని, అతని మహత్త్వాన్ని వర్ణించి చెప్పి అన్నవలన అవమానం పొందుతాడు. ఇక మూర్ఖుడైన రావణునిఅండలో ఉండడం శ్రేయస్కరం కాదని, విభీషణుడు తననలుగురు మంత్రులతో శ్రీరాముని శరణు వేడడానికి ఆయనసమక్షంలోనికి వస్తాడు. మొదట సుగ్రీవుడు అతన్ని అనుమానించినా, మిత్రభావంతో వచ్చినవానిని శత్రువైనా చేరదీయడం ధర్మం అని శ్రీరాముడు తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయడంతో, సుగ్రీవుడు విభీషణుని ప్రవేశపెట్టుతాడు. విభీషణుడు శ్రీరామునికి పాదాభివందనం చేసి రామచంద్రునిపాదయుగాన్ని నమ్మి వచ్చినానని శరణువేడుతాడు.

శ్రీరాముడు విభీషణునికి అభయమిచ్చినాడు. తనపరివారంలో చేర్చుకొన్నాడు.అతనికి సముద్రోదకంతో లంకా రాజ్యాన్ని అభిషేకం చేసినాడు.

శ్రీరాముడు ప్రసన్నుడైతే, శత్రువైనా అతనిశరణులో సుఖిస్తాడు. ఇటువంటి విభీషణశరణాగతి ఘట్టం శ్రీమద్రామాయణంలో ఉన్నది కాబట్టి, ఈ మహాకావ్యానికి దీర్ఘశరణాగతి అనే ప్రఖ్యాతి కలిగింది.

శ్రీరాముడు దయామయుడు. అతని దయాగుణం ప్రవహించే స్వచ్ఛమైన నదీప్రవాహంలాంటిది. నదినీరు ఎక్కడపారితే అక్కడ సస్యశ్యామలమై కరువుకాటకాలు తొలగిపోయేవిధంగా, శ్రీరామునిదయాగుణం ఎవరిమీద ప్రసరించినా, వారు చేసుకొన్న దోషాలు క్షణమాత్రంలో తొలగిపోతాయి. ఈ విశేషాన్ని కవి చెబుతున్నప్పుడు, గుహుడు, శబరిమొదలైన భక్తులు, శ్రీరాముని కరుణాకటాక్షంవలన పునీతులైన వృత్తాంతాలు ఆయనమనస్సులోఉండి ఉండవచ్చు. వాటిని సూచనాప్రాయంగా చెప్పడానికే దాశరథిని 'దయాలసజ్ఝురీవిగతసమస్తదోష' అని సంబోధించి ఉంటాడు.

భారతీయవిజ్ఞానానికి మూలకందమైనవి వేదాలు. వాటిని నిరంతరం అధ్యయనంచేసేవారు బ్రాహ్మణులు. తాపసులు-మునులు. శ్రీరాముడు అరణ్యవాసం చేస్తున్న సందర్భంలో అనేకమునిబృందాల ఆశ్రమాలను సందర్శిస్తాడు. అక్కడ నివసించే ఆశ్రమవాసులు శ్రీరాముని దర్శించి చాల సంతోషిస్తారు. ధనుర్ధారి అయిన శ్రీరామునివలన ఆశ్రమాలకు భంగంచేసే రాక్షసులవలన తమకు కష్టాలు తప్పిపోయినాయనేది వారి సంతోషానికి కారణం. శ్రీరాముణ్ణి దర్శించి సంతోషాన్ని పొందినవారిలో శరభంగుడు - సుతీక్ష్ణుడు, అత్రి మొదలైనమహార్షులున్నారు.

గంగానదిని భారతదేశంలో చాల పవిత్రమైందిగా భావిస్తారు. ఈ నది స్వర్గమర్త్యపాతాళలోకాలలో ప్రవహిస్తుంది. స్వర్గంలో దీనికి మందాకిని అని పేరు. భూలోకంలో గంగానది అని వ్యవహారం. పాతాళంలో భోగవతి అని అంటారు. ఈ విధంగా ఈ నది మూడు లోకాలను పునీతం చేసింది.

గంగానదిని 'విష్ణుపాదోద్భవ' అనడం సంప్రదాయం. శ్రీరాముడు విష్ణుమూర్తిఅవతారం కాబట్టి కవి రామునిపాదపద్మాల్లో గంగానది ఉన్నదని వర్ణించినాడు.

గంగానది దేవతగా భావిస్తారు. బ్రహ్మశాపకారణంగా భూలోకంలో అవతరించింది. ఆమె శంతనుమహారాజును వివాహమాడింది. ఆమెకు అష్టవసువులు కుమారులుగా జన్మించినారు. వారిలో భీష్ముడొకడు.

భగీరథుడనే ఇక్ష్వాకువంశమహారాజు దీర్ఘకాలం తపమాచరించి, గంగానదిని భూలోకంలో అవతరింపచేసిన వృత్తాంతం శ్రీమద్రామాయణంలో ఉన్నది. ఇంతటిపవిత్రమైన నదిని తనపాదంనుంచి ప్రభవింపజేసినశ్రీరామునికి నమస్కారం చేస్తే గంగాస్నానంవంటి పుణ్యం లభిస్తుందని కవిభావం.

శ్రీరాముడు అయోధ్యానగరాధిపతి. కోసలాధీశుడు. అందుచేత నవరత్నఖచితమైన కిరీటకటకాంగదమేఖలాదులు ధరించి ఉంటాడు. ఈ ఆభరణాలు ఆయన జగన్మోహనరూపాన్ని మరింత సుందరతరం చేస్తాయి. విష్ణుమూర్తియే శ్రీరాముడు కాబట్టి 'అలంకారప్రియో విష్ణుః ' అన్న ఆర్యోక్తి ఇక్కడ సముచితంగా ఉన్నది.

ఈ పద్యంకూడ సంబోధనాత్మకంగా ఉన్నది. దానిలోకూడ అనుప్రాసాలంకారం ప్రయుక్తమైంది.

**4. ఉ. రంగదరాతిభంగ ఖగరాజతురంగ విపత్పరంపరో**
**త్తుంగతమఃపతంగ, పరితోషితరంగ, దయాంతరంగ, స**
**త్సంగ, ధరాత్మజాహృదయసారసభృంగ, నిశాచరాబ్జమా**
**తంగ శుభాంగ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: రంగత్ = అతిశయించు, పైకిలేచు, అరాతి = శత్రువులను, భంగ = విరిచినవాడా, నిర్జించినవాడా, ఖగరాజ= ఆకాశ గమనము చేసే పక్షులకురాజైన గరుత్మంతుని అశ్వముగా, వాహనముగా గలవాడా, విపత్ = ఆపదలయొక్క, పరంపరా = తెగనివరుసఅనే, ఉత్తుంగ = ఎత్తైన, అతిశయించిన, తమః = చీకటికి, అంధకారానికి, పతంగ = సూర్యుడైనవాడా, పరితోషిత = సంతోషపెట్టబడిన, రంగ = రంగనాథుడు గలవాడా, దయాంతరంగ = దయతో కూడిన మనస్సుగలవాడా, సత్+సంగ = సజ్జనులతో కూడి ఉండువాడా, ధరాత్మజా = భూమికుమార్తె యైన సీతాదేవియొక్క, హృదయ = మనస్సు అనెడు, సారస = పద్మమునకు, భృంగ = తుమ్మెదయైనవాడా, నిశాచర = రాక్షసులనెడు, అబ్జ = పద్మములకు, మాతంగ = ఏనుగులాంటివాడా, శుభాంగ = శుభలక్షణములుగల అవయవములు గలవాడా, భద్రాచలనివాసి దశరథరామా.

తా: విజృంభించిన శత్రువుల గర్వాన్ని అడచేవాడవు, గరుత్మంతునివాహనంగా చేసికొన్నవాడవు. అంధకారమువలె వరుసగావచ్చే (ఆశ్రితుల)ఆపదలను సూర్యుని వలె తొలగించేవాడవు. శ్రీరంగనాథుని సంతోషపెట్టినవాడవు. దయతో నిండిన మనస్సు గలవాడవు. సత్పురుషులచేత సేవింపబడేవాడవు. సీతాదేవిహృదయమనే పద్మానికి తుమ్మెదలాంటివాడవు. అనగా, ఆమెమనస్సులో పరిభ్రమించేవాడవు. దుష్టులైన రాక్షసులను సంహరించేవాడవు మంచిశరీరలక్షణములు గలిగినవాడవు, భద్రాచలంలో నివసించే దశరథరామా.

వ్యా: శ్రీరాముని స్తుతిపూర్వకంగా సంబోధనచేస్తూ చెప్పబడిన పద్యమిది.

లోకంలో అతిశయించి విజృంభించిన శత్రువులను సంహారం చేయడానికే శ్రీవిష్ణుమూర్తి శ్రీరాముడుగా అవతరించాడు. బ్రహ్మదేవునివరాలతో రావణబ్రహ్మమదించి భూలోకాన్నే కాక స్వర్గపాతాళాలను కూడ సతమతం చేస్తున్నాడు. ఈ బాధకు దేవతలు, మానవులు సహించలేకుండా ఉన్నారు. దశరథమహారాజుకు సంతానం కలిగి ఆ సంతానం వలన రావణసంహారం జరిగితే ఉభయ తారకంగా ఉంటుంది. బ్రహ్మకు తాను రావణాసురునికి ఇచ్చినవరాలు జ్ఞాపకం ఉన్నాయి. నరవానరులవల్ల రావణుడు రక్షణ కోరలేదు. కాబట్టి దశరథునికి అటువంటి సంతతిని ప్రసాదిస్తే సమస్య తీరిపోతుంది. బ్రహ్మఆలోచనకు విష్ణువు స్పందిస్తాడు. ఆమోదిస్తాడు. తాను దశరథనందనునిగా జన్మిస్తానని చెప్తాడు. దేవతలు ఋ షులు సంతోషిస్తారు.

శ్రీరాముడు అవతరించిన తరువాత, లోకాన్ని పీడిస్తున్న రాక్షసులనెందరినో, రావణునితోసహ సంహరించినాడు. విజృంభించినశత్రువుల నిర్జించడం క్షాత్రధర్మం కాబట్టి శ్రీరాముడు ఆ ధర్మాన్నికూడ నిర్వహించినవాడు.

విష్ణుమూర్తి గరుడవాహనుడు. గరుత్మంతుడు పక్షిరాజు. అతడు కశ్యపప్రజాపతికి వినతవలన కలిగినకుమారుడు. అరుణునికి సోదరుడు. (అరుణుడు సూర్యసారథి). వినత తన సవతి కద్రువతో కలిగిన వివాదంలో ఆమె దాస్యానికి లోనవుతుంది. తల్లిని దాస్యవిముక్తను చేయడానికి కద్రూకుమారులు - సర్పాలు - అమృతాన్ని తెచ్చి యిమ్మని గరుడుని కోరుతారు. గరుత్మంతుడు తల్లిదండ్రుల ఆశీస్సులను పొంది, ఇంద్రునితో యుద్ధంచేసి, వజ్రాయుధాన్ని కూడ ఎదిరించి, అమృతం తీసికొని కద్రువ కుమారులకు ఇస్తాడు. కాని, ఇంద్రునిమాయవలన కద్రూకుమారులకు అమృతం రుచిచూచే అవకాశం దొరకదు.

గరుత్మంతుడు సురాధీశుడైన ఇంద్రుని ఎదిరించడంలోను, అతని వజ్రాయుధాన్ని ఎదుర్కొనడంలోను ప్రదర్శించిన విష్ణువు మెచ్చుకొనినాడు.

అపుడు గరుత్మంతుడు విష్ణుమూర్తితో ఇట్లా పలికినాడు. 'దేవా, అమృతాశనం చేయకపోయినా నాకు అజరామరత్వం కలుగవలె. త్రిలోకాధీశుడవైన నీయొక్క సన్నిధానం అనుగ్రహించు. నిన్ను భక్తితో సేవించే యోగ్యత ప్రసాదించు' అని, గరుడని కోరికలను విష్ణుమూర్తి మన్నించడమే కాక, 'నీవు నాకు వాహనంగాను, ధ్వజంగాను ఉండుము' అని కూడ ఆదేశించినాడు.

ఈ కథ మహాభారతంలో ఆదిపర్వంలో వస్తుంది.

**'ఆపదామపహర్తారం - దాతారం సర్వసంపదామ్**
**లోకాభిరామం శ్రీరామం- భూయో భూయో నమామ్యహం'**

ఈ శ్లోకాన్ని లోకంలో అందరు భక్తులు పఠిస్తారు. శ్రీరాముడు తనకు ఆశ్రితులైనవారి ఆపదలను, అవి పరంపరగా వచ్చినా సరే, నివారించడానికి దీక్షవహించినవాడు. తనకు సతీమణి, భక్తురాలు అయిన సీతాదేవిని రావణుడు హరించుకొనిపోతే, ఆమె నిరంతరం శ్రీరాముని ధ్యానిస్తూ అతనిని తనను రక్షించమని ప్రార్థిస్తూ వచ్చింది. ఆమెప్రార్థనను స్వీకరించి, శ్రీరాముడు, దండకారణ్యాన్ని దాటి, సుగ్రీవాదులతో మైత్రిచేసి, వాలిని వధించి, సముద్రానికి వారధిని నిర్మించి, లంకలో ప్రవేశించి, రావణాది అసంఖ్యాకమైన రాక్షసులను సంహరించి సీతాదేవిని కాపాడినాడు. ఈ పని అంతా ఒక భర్త ఒకభార్యను కాపాడడం కాదు. భగవత్స్వరూపుడైన శ్రీరాముడు ఒకభక్తురాలిని రక్షించడమే. ఆమె అనుక్షణం శ్రీరాముని ధ్యానించింది. కాబట్టి ఆమెకు అతనివలన రక్ష లభించింది. అంతే కాదు. దుష్టుడైన రావణునిసంహారంవలన భూలోకంలోని సాత్త్వికులైన ఋషులు, మునులు, రక్షింపబడినారు. దేవలోకంలో ఉండే ఇంద్రాదిదేవతలకు రక్షణ లభించింది. ఇది కాక, అన్నయైన వాలివలన వానరరాజైన సుగ్రీవునికష్టాలు తొలగిపోయి అతనిభార్య,

అతనిరాజ్యం అతనికి లభించినాయి. లంకానగరంలో, రావణుని సభలో అవమానాలపాలై శ్రీరాముని ఆశ్రయాన్ని పొందిన విభీషణునికి, అన్నవలన కలిగే కష్టాలు తొలగిపోయినాయి. రాముని అనుగ్రహంవలన లంకారాజ్యం లభించింది. ఇట్టి విషయాలనన్నింటిని మనస్సులో పెట్టుకొని కంచర్లగోపన్నకవి శ్రీరాముని 'విపత్పరంపరోత్తుంగతమఃపతంగ' అని సంబోధించినాడు. సీతాసుగ్రీవాదులవలె, శ్రీరాముని భక్తులకు కష్టాలు సంభవించినా, అవి అతన్ని ధ్యానించడంవలన తొలగిపోతాయని కూడ కవిభావం.

ఇక్ష్వాకులకులదైవం శ్రీరంగనాథుడు. *'లబ్ధ్వా కులధనం రాజా, లంకాం ప్రాయాద్విభీషణః'* అని శ్రీమద్రామాయణ యుద్ధకాండలో ఉన్నది. ఇక్కడ కులధనం అంటే శ్రీరంగనాథుడే అని పండితులు వెల్లడించి ఉన్నారు. ఇక్ష్వాకులవంశ ప్రభువులందరు శ్రీరంగనాథుని సేవించి తరించినవారే అదేవిధంగా శ్రీరాముడు తమకులదైవమైన శ్రీరంగనాథుని సేవించి, పూజించి అర్చించి, ఆయనను ప్రసన్నుని చేసుకొని ఉన్నవాడే. అందుచేత శ్రీరాముని కవి 'పరితోషితరంగ' అని సముచితంగా సంబోధించినాడు. శ్రీరాముడు దయాస్వభావం కలవాడు. కాబట్టి అతనిని కవి 'దయాంతరంగ' అని ఉచితరీతిని సంబోధించినాడు. సాధుస్వభావుల సాహచర్యంలో ఉండడం మహానుభావులలక్షణం. ఒక తెలుగు రాజు రాజరాజనరేంద్రుడు తన కోరికలను వెల్లడిస్తూ తనకు 'శశ్వత్సాధుసాంగత్యం' ఉండవలెనని కోరుకొన్నాడు - శ్రీరామునివర్ణించినకవులు :

*రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,*
*రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥*
*రామం రామానుజం సీతాం భరతం భరతానుజం,*
*సుగ్రీవం వాయుసూనుం చ ప్రణమామి పునః పునః॥*

అని చెప్పి ఆయన పరిసరాల్లో ఉన్న సాధువ్యక్తులను నిర్దేశించినారు. అందుచేతనే శ్రీరాముడు 'సత్సంగుడు'.

హృదయాన్ని పద్మంతో పోల్చిచెప్పడం కవిసంప్రదాయం. పద్మం, పరిమళభరితంగా ఉంటుంది. కాబట్టి దానిచుట్టూ తుమ్మెద పరిభ్రమించడం సహజమే. పద్మానికి తుమ్మెదకు నాయికానాయకసంబంధం చెప్పడంకూడ కవిసంప్రదాయమే. సీతాదేవి మనస్సు ఉదాత్తమైంది. కాబట్టి కవి దానిని పరిమళభరితమైన పద్మంతో పోల్చినాడు. ఆ ఉదాత్తగుణంవలన ఆకర్షింపబడింది. పరిమళంతో ఆకర్షింపబడినట్టి తుమ్మెదలాంటివాడు శ్రీరాముడు. ఎల్లప్పుడు సీతాదేవి హృదయంలోనే పరిభ్రమిస్తుంటాడు. రావణునిచెరలో

నివసించిన పదినెలలకాలం సీతాదేవి నిరంతరం శ్రీరామనామస్మరణ చేస్తూనే ఉన్నది. అంటే శ్రీరామభృంగం ఆమె హృదయపద్మంలో పరిభ్రమిస్తూ ఉన్నట్లేకదా.

(మదించిన)ఏనుగులు సరస్సులో జలక్రీడలాడడం వినోదం. ఆ వినోదంలో సరస్సుల్లోని పద్మాలను తమతుండాలతో త్రుంచి ముక్కలు చేయడంకూడ ఒకటి. రాక్షసులను సరస్సుల్లోని పద్మాలనుకొంటే, జలక్రీడ చేస్తున్నగజం ఎంతసునాయాసంగా పద్మాలను నిర్మూలిస్తుందో, అంత సులభంగా శ్రీరాముడు రాక్షసులను నిర్మూలించినాడు అని చెప్పడం కవిభావం.

*తాటక మర్దించి తపసిజన్నము గాచి హరువిల్లు విరిచి ధైర్యమున మెరసి*
*ప్రబలులైనట్టి విరాధకబంధోగ్ర ఖర దూషణాది రాక్షసులఁ దునిమి*
*వానరవిభునేలి వాలిఁ గూలఁగ నేసి జలరాశిగర్వంబు చక్కఁజేసి*
*సేతువు బంధించి చేరి రావణకుంభకర్ణాదివీరులఁగడిమిఁ ద్రుంచి*
*అల విభీషణు లంకకు నధిపుఁ జేసి భూమిసుతఁ గూడి సాకేతపురమునందు*
*రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు.*

ఈ పద్యంలో శ్రీరాముని రాక్షసవధలన్ని సంక్షిప్తంగా చెప్పబడినాయి.

గోపన్న తనకిష్టమైన అనుప్రాసాలంకారాన్ని తిరిగి ఈ పద్యంలో ప్రయోగించినాడు. దీనివలన పద్యం శ్రుతిసుభగమైంది.

విపత్తులను అంధకారంతోను, శ్రీరాముని పతంగునితోను ఆరోపించడం చేత రూపకాలంకారము.

ధరాత్మజాహృదయాన్ని పద్మంతోను, శ్రీరాముని భృంగంతోను ఆరోపించిచెప్పడంతో ఇంకొక రూపకాలంకారము.

**5. ఉ. శ్రీద, సనందనాదిమునిసేవితపాద, దిగంతకీర్తి సం**
**పాద, సమస్తభూతపరిపాలవినోద, విషాదవల్లికా**
**చ్ఛేద ధరాధినాథకులసింధుసుధామయపాద, నృత్తగీ**
**తాదివినోద, భద్రగిరిదాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర: శ్రీ = సంపదను, వైభవమును, ద = ఇచ్చువాడా. సనందనాది = సనకుడు, సనందనుడు,ఆదిగాగల, ముని = ఋషులచేత, సేవిత = కొలువబడిన, సందర్శింపబడిన, పాద = చరణములు, అడుగులు కలవాడా, దిగంత = దిక్కులచివరలవరకు, దిక్కులఅంతమువరకు, కీర్తి = యశము యొక్క- ప్రఖ్యాతియొక్క, సంపాద = సంపాదనముగలవాడా, సమస్త = సర్వమైన, అన్ని, భూత = ప్రాణులయొక్క, పరిపాల

= రక్షించడంలో, కాపాడడంలో, వినోద = వేడుక, సంతోషము గలవాడా, విషాద = దుఃఖమనెడు, వల్లికా = తీగను, ఛేద = త్రెంచువాడా, ధర+అధినాథ = భూమిని పరిపాలించే రాజులయొక్క, కుల = వంశమనెడు, సింధు = సముద్రమునకు, సుధామయ = అమృతమయములైన, పాద = కిరణములకలచంద్రుడైనవాడా. నృత్త = హస్తాద్యమయిన విక్షేపమాత్రముగల నాట్యము, గీత = పాట, గేయము, ఆది = మొదలైన, వినోద = వేడుకలు కలవాడా.

తా: సంపదలనిచ్చువాడవు, సనకుడు సనందనుడు మొదలైన ఋషులచేతసేవించబడి పూజింపబడేవాడవు. విస్తృతమై దిక్కుల చివరివరకు వ్యాపించిన కీర్తి గలవాడవు. లోకములోని అన్ని ప్రాణులను కాపాడేవాడవు. (భక్తుల, ఆశ్రితుల) దుఃఖమును పోగొట్టేవాడవు. (ప్రాణులు అడవిలో ఉండే చెట్ల తీగలవంటి దుఃఖాల్లో ఇరుకుకొని బయట పడలేకపోతే, ఆ దుఃఖమనే తీగలను ఖండించి వారి దుఃఖాన్ని పోగొట్టేవాడు రాముడు). క్షత్రియవంశమనే జలధికి చంద్రునివంటివాడవు. ఆటపాటలయందు వేడుకకలవాడవు. భద్రాచలంలో నివసించే దశరథరామా!

వ్యా: ఈ పద్యంలో శ్రీరాముని విష్ణుమూర్తిగా భావించి కవి స్తుతిచేసినాడు.

విష్ణుమూర్తి లక్ష్మీదేవికి భర్త. ఆమెను సర్వదా వక్షఃస్థలంలో ధరించి ఉంటాడు అని అనేకపురాణాలు చెబుతూ ఉన్నవి. శ్రీకాంతుడు అని విష్ణుమూర్తి పేర్లలో ఒకటి. శ్రీ అనేపదానికి, ధనము, వైభవము, సమృద్ధి,రాజత్వము, ఉన్నతపదవి, సౌందర్యము, లక్ష్మీదేవి, అలంకారము మొదలైన అనేకార్థాలున్నాయి.

విష్ణుమూర్తి, అనగా శ్రీరాముడు, శ్రీకి, అనగా పైనచెప్పినవాటికన్నింటికి అధీశుడు కాబట్టి సంపద మొదలైనవాటిని అనుగ్రహించేవాడు. శ్రీరాముని సేవించేవారికి సంపదలకు కొదువలేదని కవిభావము.

సనకసనందనులు బ్రహ్మమానస పుత్రులు. గొప్పఋషులు వీరు విష్ణుమూర్తిసాన్నిధ్యంలో ఎల్లప్పుడు నివసించి ఉండేవరం పొందినవారు. అందుచేత ఆయనపాదాలను సేవించేవారని కవి వాక్రుచ్చినాడు.

రాముడు వహించిన కీర్తికూడ స్వల్పమేమి కాదు. తండ్రిఆజ్ఞ జవదాటనివాడు, ఏకపత్నీవ్రతాన్ని నిర్విఘ్నంగా అవలంబించినవాడు. మునులకు ఋషులకు అపకారంతల పెట్టినరాక్షసులను సంహరించినవాడు, అన్నింటిని మించి లోకకంటకుడైన దశకంఠుని హతమార్చినవాడు శ్రీరాముడు. అందుచేత అతనిసత్కీర్తి లోకమంతటా వ్యాపించింది. అందుచేత శ్రీరామునికి కవి దిగంతకీర్తి సంపాద అనే విశేషణం వేసి స్తుతిచేసినాడు.

ఈ ప్రపంచానికి, సృష్టిస్థితిలయములనే ఒక క్రమం ఉన్నది. మనపురాణేతిహాసాలను అనుసరించి, సృష్టికర్త పరమేష్ఠి యైన బ్రహ్మ. స్థితికారకుడు విష్ణుమూర్తి. దీన్ని లయం చేసే ధర్మాన్ని నిర్వహించేవాడు, మహేశ్వరుడు. త్రిమూర్తులలో విష్ణుమూర్తికి భాగవతాది పురాణాలు ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఎందుచేతనంటే లోకంలోని ప్రాణులను సర్వవేళసర్వావస్థల్లో విష్ణుమూర్తి పరిరక్షిస్తాడు కాబట్టి. - విష్ణుమూర్తి చేసే ఈ పనిని శ్రీరాముడు త్రేతాయుగంలో చేసినాడు. లోకంలోని సర్వప్రాణులను తన ఆశ్రితులను శ్రీరాముడు రక్షించినాడు. కాబట్టి గోపన్నకవి ఆయనను, సర్వభూతపరిపాలవినోద అని సంబోధించినాడు. ఇది కాక శ్రీరాముడు క్షత్రియుడైన మహారాజు. అందుచేత తనపాలనలో ఉండే సమస్తప్రజలను సంరక్షించవలసినబాధ్యత ఆయనకున్నది. విశ్వామిత్రాది మహర్షులను, అహల్యాదిదయనీయులను, పరశురామాది అవతార పురుషులను, గుహాదివనచరులను, దండకారణ్య మహర్షులను, మారీచాదులను, జటాయ్వాది పక్షులను కబంధాది రాక్షసులను, సుగ్రీవాదివానరులను, శబర్యాది సామాన్యస్త్రీలను, జాంబవదాదిభల్లూకాలను, విభీషణాది రాక్షసులను, సీతపై అపవాదులు వేసినపౌరులను కూడా రాముడు ఉద్ధరించినాడు. ఆ కారణంచేతకూడ శ్రీరామునికి ఈ సంబోధన సముచితంగా భాసిస్తుంది. ఈ ధర్మాన్ని కవి వినోదంగా వర్ణించడం కవితాత్మకంగా కనిపిస్తుంది.

విష్ణుమూర్తి భక్తులకు, ఏ సందర్భంలో దుఃఖం కలిగినా, స్వామిని ప్రార్థించి ఆశ్రయిస్తే వారిదుఃఖాన్ని ఉపశమింపచేస్తాడు. పూర్వం గజేంద్రునికి కలిగిన ఆపదను విష్ణుమూర్తి పరిహరింపచేసినాడు. 'నీవే తప్ప నితఃపరంబెరుగను' అని ప్రార్థించగానే విష్ణుమూర్తి ప్రత్యక్షమై మకరాన్ని ఖండించి తనభక్తుడైన గజేంద్రుని కాపాడినాడు. ఇక రామావతారంలో, సుగ్రీవుడు తన సోదరుని దౌష్ట్యంచేత రాజ్యాన్ని, భార్యను పోగొట్టుకొన్నాడు. శ్రీరాముని ఆశ్రయించి పోగొట్టుకొన్నవాటిని తిరిగి పొందినాడు. ఇవి కేవలం ఉదాహరణలే. విష్ణుమూర్తి, శ్రీరామచంద్రుడు ఆర్తుల దుఃఖాన్ని హరించడానికి చేసిన పనులు అసంఖ్యాకంగా ఉన్నాయి.

శ్రీరాముడు క్షత్రియవంశంలో పుట్టినపురుషోత్తముడు. అందుచేత క్షత్రియవంశాన్ని క్షీరసాగరంలాగ భావించి, శ్రీరాముని చంద్రునితో ఉపమించినాడు కవి. ఇదివరకటి పద్యంలో (2వ పద్యంలో) కకుత్స్థవంశకలశాంబుధిసోమ అని సంబోధించడంవంటిదే ఇది. అయినా ఇక్కడ ఒక విశేషం కనిపిస్తున్నది. శ్రీరాముడు సీతాదేవిని వివాహమైన తరువాత, క్షత్రియవంశానికి అశనిగా ఉండిన పరశురాముడు ఎదురు పడ్డాడు. యథార్థానికి శ్రీరామునికూడ పరశురాముడు శత్రువుగానే భావించినట్లున్నాడు. అతడుకూడ క్షత్రియుడు

కావడంచేత. అతన్ని అతనిపరాక్రమాన్ని ధిక్కరించినాడుకూడ. కాని, శ్రీరాముడు పరశురామునిశక్తిని హరించడంచేత, ఆయన శ్రీరామునికి అపకారం చేయలేకపోయినాడు. ఇంక ఏ క్షత్రియునికి హాని లేకుండాపోయింది. క్షత్రియవంశంలో జన్మించి, దానికి పరశురామునివలన కలిగే హానిని శ్రీరాముడు పరిహరించి, ఆహ్లాదంకలిగించినాడు. కాబట్టి ఆహ్లాదాన్ని ప్రసాదించే చంద్రునితో అతన్ని ఉపమించినాడు.

ముందటి పద్యాల్లోవలె ఈ పద్యంలోకూడ అనుప్రాస అనే శబ్దాలంకారం ప్రయుక్తమైంది. దకారాంతఅనుప్రాసఇది.

క్షత్రియవంశాన్ని పాలసముద్రంతోను, శ్రీరాముని చంద్రునితోను ఆరోపించడంవల్ల రూపకం అనే అర్థాలంకారం ఈ పద్యంలో ప్రయుక్తమైంది. రూపకలక్షణం 2వ పద్యవ్యాఖ్యానంలో ఉన్నది.

**6. ఉ. ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా**
**చార్యులకంజలెత్తి కవిసత్తములన్ వినుతించి కార్యసా**
**కర్యమెలర్ప నొక్క శతకంబొనఁగూర్చి రచింతు నేఁడు తా**
**త్పర్యమునన్ గ్రహింపుమిది దాశరథీ కరుణాపయోనిధీ**

ప్ర: ఆర్యులకు+ఎల్ల = వేదశాస్త్రాలనుఅనుసరించువారికెల్లరకు, మ్రొక్కి = నమస్కరించి, వినత+అంగుఁడనై = వంచిన శరీరముగలవాడనై, అణకువచేత వినమ్రములైన అవయవములు కలవాడనై, అనగా మ్రొక్కి, రఘునాథభట్టరాచార్యులకున్ = రఘునాథభట్టరు అనే పేరు కలిగిన, ఆచార్యులకు = గురువుగారికి, ఆచార్యుడనగా శిక్షకుడు, విద్యనేర్పించేవాడు. ఆధ్యాత్మికమార్గదర్శి, ఉపనయనం చేసినవాడు, వేదాభ్యాసం చేయించినవాడు అనే అర్థాలున్నాయి. అంజలెత్తి = చేతులు జోడించి నమస్కారం చేసి, కవిసత్తములన్ = (పూర్వ) కవిశ్రేష్ఠులను, వినుతించి = స్తుతిచేసి, కొనియాడి, కార్యసౌకర్యము = పని సులభము కావటము, కావ్యరచన తేలికగా జరగటము, ఎలర్పన్ = వికసించడానికి, ఒక్క శతకంబు = నూరుపద్యాలు కలిగిన గ్రంథమును, ఒనగూర్చి = పొందికచేసి, నేఁడు = నేటిదినం, ఇప్పుడు, రచింతున్ = రచనచేయుదును, కూర్చుదును. తాత్పర్యమునన్ = ఆసక్తితోడ, మంచి అభిప్రాయంతో, గ్రహింపుము ఇది = దీనిని స్వీకరింపుము.

తా: నేను వినయముతో పెద్దలకందరికి నమస్కరించి, మా గురువులైన రఘునాథ భట్టరాచార్యులవారికి చేతులు జోడించి మ్రొక్కి, పూర్వకవులను స్తుతిచేసి, నేను చేసే రచన సుకరముగా - సులభముగా - నెరవేరగా, ఇపుడు శతకమనే కావ్యాన్నివ్రాస్తున్నాను.

కరుణాసముద్రుడనైన ఓ భద్రాచలరామా, ఈశతకాన్ని మంచి అభిప్రాయంతో స్వీకరించుము.

వ్యా: కావ్యప్రారంభం నిజానికి ఇక్కడనే ఉన్నది. ఇదివరకు శ్రీరాముని భద్రాచలరాముని స్తుతి పూర్వకంగా సంబోధించినాడు.

కావ్యప్రారంభంలో పూర్వులైన పెద్దలకు నమస్కరించడం సంప్రదాయంగా ఉన్నది. తెలుగుసాహిత్యంలో ఆదికవి నన్నయభట్టు సంస్కృతమహాభారతాన్నివ్రాసినవ్యాసమహర్షిని ఈ విధంగా గౌరవించినాడు.

ఇదే సందర్భంలో నన్నయభట్టు పండితసభనుకూడ స్తుతిచేసినాడు. పోతనామాత్యుడు తన శ్రీమహాభాగవతంలో పూర్వకవులనీవిధంగా పేర్కొన్నాడు.

కంచెర్లగోపన్న ఈ సత్సంప్రదాయాన్ని అనుసరించి కావ్యప్రారంభంలో ఆర్యులకు, కవిసత్తములకు నమస్కారంచేసి వారిని వినుతించినాడు.

కంచెర్ల గోపన్నకు రఘునాథభట్టరాచార్యులవారు గురుపాదులైనట్లు ఈ పద్యంలో తెలియవస్తున్నది. మరొక పద్యంలో 'పట్టితి భట్టరార్యగురుపాదము'ను అనికూడ చెప్పియున్నాడు. దాన్నిబట్టి భట్టరాచార్యులవారు కవికి విశిష్టాద్వైతసిద్ధాంతమును బోధించినగురువు అని తెలియవస్తున్నది. ఈ ఆచార్యులవారినిగురించి చారిత్రకమైన విశేషాలు మనకంతగా తెలియవు. భట్టరాచార్యులవారు గోపన్నకు తిరుమంత్రోపదేశంచేసి సమాశ్రయణమొనర్చి విశిష్టాద్వైత సిద్ధాంతబోధ చేసినట్టివాడు అని భావించడం సముచితం. విశిష్టాద్వైత మతానుయాయులు ఏ పని ప్రారంభించినా, 'అస్మద్గురుభ్యోన్నమః' అని ఉచ్చరించి ముందుకు పోవుట సంప్రదాయం. విష్ణుమూర్తిభక్తుడై తనస్వామియైన శ్రీరాముని గురించి శతకం వ్రాస్తున్నగోపన్నగారు గురువుగారికి సగౌరవంగా అంజలి యెత్తడం సంప్రదాయసిద్ధంగా ఉన్నది.

గురువులకు, పెద్దలకు, పూర్వకవులకు నమస్కరిస్తే, తాము చేసేపని సులభమవుతుందని విజ్ఞులు భావిస్తారు. ఈ శతకకర్తకూడ వినయంతో అట్లాగే భావించినాడు. దాశరథీశతకంలో భక్తి ఉంటుంది. ఈ రసనియమం అనేది ఒక విధంగా ఈ చిన్నకావ్యానికి ఏకీభావాన్ని సమకూరుస్తుందని చెప్పవలె.

తెలుగు శతకాల్లో చాలవరకు వృత్తనియమం, లేక పద్యనియమంకూడ పాటింపబడింది. మనకవి కంచెర్లగోపన్న ఉత్పలమాలావృత్తాలు, చంపకమాలావృత్తాలు ఉపయోగించినాడు. ఛందస్సులో ఈ రెండు వృత్తాలకు సాన్నిహిత్యం ఉండడం చేత అతడట్లా చేసి ఉంటాడు. (చంపకం అంటే సంపెంగ, ఉత్పలమంటే నల్లకలువ, ఇవిపుష్పాలు. పుష్పమాలలుగా పద్యమాలలు సమర్పించటం ఒక ఉపచారంగనూ భావించి ఉంటాడు.)

కంచెర్లగోపన్న దాశరథీశతకం రచించి, శ్రీరాముని స్వీకరింపుమని ప్రార్థిస్తున్నాడీ పద్యంలో. ఇదే సాహిత్యం అంకితం చేయడమనేసంప్రదాయం. తిక్కనసోమయాజి తనఆంధ్రమహాభారతాన్ని హరిహరనాథునికి అంకితంచేసినాడు. పోతనామాత్యుడు *పలికించెడు వాఁడు రామభద్రుండఁట* అని చెప్పి *'శ్రీకంఠచాపఖండన'* అని సంబోధించి శ్రీరామునికి అంకితం చేసినాడు. ఈ అంకితసంప్రదాయాన్ని గోపన్నకవికూడ చక్కగా అనుసరించిఉన్నాడు.

**7. చ. మసకొని రేగుబండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు దు**
**ర్వ్యసనము జెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యె నా**
**రసనకుఁబూతవృత్తి సుకరంబుగఁ జేకురునట్లు వాక్సుధా**
**రసములు చిల్క పద్యముఖరంగమునందు నటింపవయ్య సం**
**తసమునుజెంది భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: మసకొని = మసకము+కొని=సౌఖ్యమును కోరి, మత్తునకు లోనై, కన్నులు మసకగ్రమ్మగా, రేగుపండ్లకును = రేగుపండ్లనే సామాన్యఫలములకు (వాటిని సంస్కృతంలో బదరీఫలములంటారు) మౌక్తికముల్ = మంచిముత్యాలు, వెలబోసినట్లు = బదులుఇచ్చినట్లు, దుర్+వ్యసనము+చెంది = చెడు అలవాట్లకు లోనై, ఆశకు వశమై, కావ్యము = రచన, కథాకావ్యము, దురాత్ములకు = చెడుమనస్సు గలవారికి, చెడునడతగలవారికి, ఇచ్చితిని = అంకితము చేసినాను. మోసము+అయ్యె = ప్రమాదము జరిగెను. నా రసనకు = నా నాలుకకు, పలుకుకు, పూతవృత్తి = పవిత్రమైన ప్రవర్తన, సుకరంబుగ = తేలికగా, సులభంగా, చేకూరునట్లు = పొందునట్లుగా, వాక్ = మాటలో, శబ్దంలో, సుధారసములు = అమృతధారలు, చిందన్ = చిలుకునట్లుగా, పద్య = పద్యములు కలిగిన, ముఖరంగమునందు = నాముఖము-నోరు-అనెడునాట్యరంగంలో, సంతసమును జెంది = సంతోషమును వహించి,

తా: రేగుపండ్లు తినడానికి ఆశపడి, వాటి బదులు మంచిముత్యాలు ఇచ్చి ఆపండ్లు కొని తినినట్లుగా, దుష్టమైన అలవాట్లకు లోనై, దురాశకు లోనై, మోసపోయి నా కావ్యాన్ని దుష్టబుద్ధులైనవారికి అంకితమిచ్చినాను. ఈ అపరాధానికి నాకు ఇపుడు పశ్చాత్తాపం కలిగింది. ఓ భద్రాచల దశరథరామా, ఇపుడు నీవు నానాలుకకు, తప్పు చేసినదానికి, పవిత్రభావం చేకూడేవిధంగా, పద్యం వ్రాస్తున్న నా ముఖరంగంలో, నోటిలో సంతోషంతో నటింపుమా. అట్లా చేస్తే నానాలుక పవిత్రం అవుతుంది. నాకు మంచి పద్యం వస్తుంది. అమృతంవంటి వాక్కును, మాటను నాకు కలిగింపుము.

చేసినాడు. ఈ పద్యంలో కవి కొన్ని సాభిప్రాయప్రయోగాలు చేసినాడు.

వ్యా: ఈ పద్యంలో కవి కొన్ని సాభిప్రాయప్రయోగాలు చేసినాడు.

మసకొను = మసక కొను = ఇంచుకనలుపుగాను, స్పష్టంగాకనిపించని నలుపు -

మసకొను = సంభోగేచ్ఛ - సుఖములపై ఆసకొను. దీనిప్రయోగం కాళహస్తిమాహాత్మ్యంలో ఇట్లా ఉన్నది.

ప్రాణనాయికతోడ పర్యంకసీమల మసకొని పెనగ సంభ్రమము విడిచి.

వ్యసనము = ఆపద, కామక్రోధములవలనబుట్టిన దోషము, ఇది యేడు విధాలు. పానము, స్త్రీ మృగయు, ద్యూతము, వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము.

కావ్యము: కథాకావ్యము, కబ్బము, రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, భారవి, మాఘము.

మోసము = దొంగతనము, ప్రమాదము - దీనిప్రయోగము భీమఖండంలో ఇట్లున్నది.

ముక్కు మొగంబు జూడకొక మోసపుమాటకు విశ్వనాయకుం

డెక్కడికైనఁ బొమ్మనుచు నెట్టని చూడ్కులఁ జూచెనల్కతోన్.

సుధా = అమృతము, తేనె, ద్రవము, రసము, నీరు, అని అర్థాలున్నాయి. పూదేనెవలె, అమృతంలాగ మధురంగాను, శాశ్వతంగాను మాట ఉండవలెనని కవి అభిప్రాయము.

మౌక్తికము = మంచిముత్యము - ఇది ఏనుగుకుంభస్థలము, మేఘము, పందికోర, శంఖము, మత్స్యశిరము, పాముపడగ, ముత్యముచిప్ప, చెరకు, వెదురుబొంగు, వీనిలో లభిస్తుందని చెబుతారు.

రేగుబండ్లు సామాన్యమైనఫలములు. ఎక్కడైనా చౌకగా లభిస్తాయి. అటువంటివి తినవలెనని జిహ్వాచాపల్యం కలిగినప్పుడు వాటిబదులు కొద్దిడబ్బులు ఇచ్చి తీసికొనడం సామాన్యపద్ధతి. కాని, విలువైనముత్యాలు బదులుగా వాటిని గ్రహించడం వ్యామోహంలో పడిపోవడమేకదా. ఆశలో పడిపోయినా, సౌఖ్యంపై అత్యాశ కలిగినా మనుష్యుడు చేయకూడనిపని చేస్తాడని కవి సూచించినాడు.

'రేగుపండ్లకు ముత్యాలు పోసికొన్నట్లు' అనగా చవుక వస్తువులను విలువైన వస్తువులకు మారుగా గ్రహించినట్లు అని అర్థం. గోపన్నగారున్న భద్రాచలంలో ఈ రేగుపండ్లు చాలచౌక. ఇటువంటిమాటలను జాతీయాలంటారు.

'రేగుబండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు దుర్వ్యసనముజెంది కావ్యము దురాత్ముల కిచ్చితి' అని చెప్పినప్పుడు ఉపమాలంకారమనే అర్థాలంకారం ప్రయుక్తమై ఉన్నది.

'ఉపమానోపమేయయోరేవ న తు కార్య కారణాదికయోః సాధర్మ్యం భవతీతి తయోరేవ సమానేన ధర్మేణ సంబన్ధః ఉపమా' అని లక్షణము. ఉపమాన ఉపమేయములకు సాధర్మ్యం చెప్పడం ఉపమాలంకారము.

కావ్యము ముత్యాలవంటిది అనగా శ్రేష్ఠమైనది.

రేగుబండ్లు దురాత్ములవలన కలిగేమోసం లాంటిది. చవుక అయినట్టిది. కావ్యము, రేగుబండ్లు ఉపమేయాలు. రేగుబండ్లు, దురాత్ములవలనిమోసం ఉపమానాలు.

ఈ పద్యంలో కవి ఆత్మనిర్వేదం ఉన్నది. కంచెర్ల గోపన్నకవి పూర్వం ఒక మంచి కావ్యం వ్రాసినట్లున్నాడు. దానిని, ధనవ్యామోహంలో పడి, దురాత్ముడైన ధనవంతునికో, రాజుకో అంకితం చేసినట్లున్నాడు. దానివలన అతనికి పశ్చాత్తాపం కలిగింది. అందుచేత, తొలగించుమని తన యిష్టదైవమయిన శ్రీరాముని వేడుకొంటున్నాడు. ఇంకొకనిపేరుమీదుగా కావ్యం వ్రాయడంచేత అతని నాలుకకు దోషం కలిగింది. మోసం కలిగింది. దానికి తిరిగి పవిత్రతను కలిగించుమని విన్నవించుకొన్నాడు. పద్యము ఇతరులపేర పేర్కొనప్పుడు, అతనిపేరు తనముఖరంగంలోప్రవేశింపక తప్పదుకదా. అటువంటినోటిలో తిరిగిరాముడు నటింపవలెనని ప్రార్థిస్తున్నాడు.

కంచెర్ల గోపన్న, దాశరథీశతకం వ్రాయడానికి పూర్వం ఏ కావ్యం వ్రాసినాడో, ఎవరికి అంకితం చేసినాడో తెలియరాలేదు. ఆయన వ్రాసిన కీర్తనలు శ్రీరామునికే అంకితమైనాయి. కాబట్టి ఈ పద్యం వాటినిగురించి కాదని స్పష్టంగా తెలుస్తూ ఉన్నది.

దాశరథీశతకంలో తన పద్యాలు అమృతధారలుగా, తేనెధారలుగా ఉండవలెనని భావించినాడు. యథార్థానికి దానిలోని పద్యాలు అమృతధారాపాతంగా ఉన్నాయి. తనకోర్కె నెరవేరింది. రామునిఅనుగ్రహం కూడ కలిగింది.

ఉత్పలమాల, చంపకమాలవృత్తాలలో సామాన్యంగా నాలుగు పాదాలు వ్రాయటమే సంప్రదాయం. కాని, ఇక్కడ ఐదు పాదాలున్నాయి. చాల విరళంగా కవులు ఇట్లా చేయడం ఉన్నది. ఇది లక్షణవిరుద్ధం కాదు.

**8. ఉ. శ్రీరమణీయహార యతసీకుసుమాభశరీర, భక్త మం**
**దార, వికారదూర, పరతత్త్వవిహార, త్రిలోకచేతనో**
**ద్ధార, దురంతపాతకవితానవిదూర, ఖరాదిదైత్యకాం**
**తారకుఠార, భద్రగిరిదాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర: శ్రీ = కాంతిచే- లక్ష్మీదేవిచే, రమణీయ = మనోజ్ఞమైన, అందమైన, హార = కంఠహారము కలవాడా, అతసీ = నూనెఅవిసి, అవిసెపూవువంటి, ఆభ = కాంతి, శోభ గల, శరీర = దేహముగలవాడా, భక్తులకు = సేవించేవారికి, కొలిచేభక్తులకు, మందార = కల్పవృక్షమువంటివాడా, వికార = మనసునందుకాని, రూపమునందుకాని మారుపాటు, విదూర = లేనివాడా, పరతత్త్వ = పరమాత్మ స్వరూపంయొక్క, విహార = అవతారాది

విహారాలుగలవాడా, త్రిలోక = స్వర్గమర్త్యపాతాళ లోకములందలి, చేతన = జీవులను, ఉద్ధార = పతనముకాకుండ ఉద్ధరించువాడా, దురంత = అంతముకాని, అనంతమైన, పాతక = పాపములయొక్క, వితాన = సమూహమును, విదూర = దూరము చేయువాడా, నిర్మూలించువాడా, ఖరాది = ఖరుడు మొదలైన, దైత్య = దితికుమారులైన రాక్షసులనెడు, కాంతార = అడవికి, కుఠార = గొడ్డలియైనవాడా- నశింపచేయువాడా, భద్రగిరిదాశరథీ కరుణా పయోనిధీ.

తా: లక్ష్మీదేవియొక్క కాంతిచేత మనోజ్ఞమైన హారములు దాల్చి, అవిసె పూవువంటి సుకుమారమైన, అందమైన శరీరకాంతి గలవాడవు. నిన్ను సేవించుభక్తుల కోర్కెలు నెరవేర్చేవాడవు. కాబట్టి కల్పవృక్షంలాంటివాడవు. పరమాత్ముడవై అవతారాదిలీలలలో విహరించేవాడవు. స్వర్గమర్త్యపాతాళములనే మూడు లోకాల్లో ఉండే ప్రాణులను, పతనం కాకుండా కాపాడేవాడవు. మానవులు చేసే అనంతమైన పాపాలను దూరం చేసేవాడవు. పదునాల్గువేల పదునాల్గుమంది ఖరదూషణాదిరాక్షసులనేదట్టమైన తొలగించేవాడవు. అడవికి గొడ్డలిలాంటివాడవు. అనగా వారందరిని నిశ్శేషంచేసినవాడవు. భద్రాచలంలో నివసించే దయాసముద్రమైన దశరథరామా.

వ్యా : శ్రీ అనగా, లక్ష్మి, సంపద, ఐశ్వర్యము, త్రివర్గము, వృద్ధి, శోభ, అలంకరణము, కీర్తి, బుద్ధి, సరస్వతి అనే అర్థాలున్నాయి. విష్ణుమూర్తి స్వరూపుడైన శ్రీరాముని కంఠహారము సుందరమైంది. ఎందుచేతనంటే, అది లక్ష్మీదేవితో కూడింది. లక్ష్మీదేవిని ఆయన వక్షఃస్థలంలో ధరించి ఉంటాడు కాబట్టి. లక్ష్మిని ధరించినవాడు కాబట్టి సంపదను ధరించినట్లేలెక్క. ఐశ్వర్యమన్నా అదే అర్థము. త్రివర్గమంటే ధర్మార్థకామములు, శ్రీరాముడు తనవక్షఃస్థలంలో తనభక్తులకు ఈ త్రివర్గాన్ని దర్శింపచేయడంచేత, ఆయనహారం మనోజ్ఞంగా ఉన్నది. శ్రీరాముని వక్షఃస్థలంలో ఉండేహారం భక్తులకు వృద్ధికారకమైంది. అది శోభతో కూడినట్టిది. హారాన్ని అలంకారంకొరకు ధరించినాడు. కాబట్టి ఆ అర్థంకూడ సముచితంగా ఉన్నది. ఇన్ని గుణాలు కలిగినహారం, శ్రీరాముడు కంఠంలో ధరించింది. రమణీయంగా అంటే ఒప్పిదంగా ఉన్నది.

అతసీకుసుమాభశరీర అని కవి సంబోధించినప్పుడు శ్రీరాముని శరీరసౌందర్యాన్ని వెల్లడించవలెనని కవి భావించినాడు. అవిసెపూవువంటికాంతికలిగిన శరీరశోభ కలిగినవాడని కవి అభిప్రాయం. దట్టమైన హరితవర్ణంగా ఉండే ఆకుల్లో ప్రకాశవంతంగా పూచే అవిసెపువ్వు చాల కాంతిమంతంగా కన్పిస్తుంది. ఇది సహజసౌందర్యం- దానినే కవి వ్యక్తంచేసినాడు. శ్రీకృష్ణస్తోత్రంలో ఈ శ్లోకాన్ని గమనించవలె.

అతసీపుష్పసంకాశం హారనూపురశోభితం
రత్నకంకణకేయూరం కృష్ణం వందే జగద్గురుమ్.

భక్తితో సేవించినవారికి శ్రీరాముడు కల్పవృక్షంలాంటివాడు. అనగా అన్ని కోరికలను నెరవేర్చేవాడు. భక్తి కలిగినవారు భక్తులు. భక్తి అంటే సేవ. ఇది ఎనిమిదివిధాలుగా చెప్పబడింది. భాగవతవాత్సల్యము, భగవత్ పూజయందనుమోదము, భగవదర్చన, భగవద్విషయమందు కోరిక, భగవత్కథాశ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగవికారము, సదాభగవదనుస్మరణము, అమాంసభక్షణము.

భక్తిలక్షణములు తొమ్మిదివిధాలు. శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.

మధుసూదనసరస్వతి భక్తిరసాయనంలో భక్తియొక్క పదునొకండు భూమికలను వివరించినాడు.

*ప్రథమం మహతాం సేవా తద్దయాపాత్రతా తత:*
*శ్రద్ధాథ తేషాం ధర్మేషు తతో హరిగుణశ్రుతి:*
*తతో రత్యంకురోత్పత్తి: స్వరూపాధిగతిస్తత:*
*ప్రేమవృద్ధి: పరానందే తస్యాథ స్ఫురణం తత:*
*భగవద్ధర్మనిష్ఠాత: స్వస్మిన్ తద్గుణశాంతతా*
*ప్రేమ్ణోథ పరాకాష్ఠేత్యుదితా భక్తిభూమికా(?)*

ఈ పదునొకండింటికి శాస్త్రీయోపాయములని పేరు. ఇవి క్రమముగా ఒకటి తరువాత ఒకటి అలవడవలెను. వానిలో చివరిది భగవత్ప్రేమ పరాకాష్ఠ. ఇటువంటి భక్తిమార్గాలను అవలంబించేవారికి భగవంతుడు కల్పవృక్షంలాంటివాడేకదా.

పరతత్త్వము అంటే పరమాత్మ-భగవత్స్వరూపుడైన శ్రీరాముడు, విష్ణుమూర్తి తన అవతారములచేత విహారములు చేసి లోకాన్ని పునీతం చేసినాడు. ఈ అవతారతత్త్వములు అనంతములైనవి. శ్రీమద్భాగవతంలో ఈ అవతారాలు పేర్కొనబడినాయి. నారాయణుడు, నరుడు, దత్తాత్రేయుడు, కపిలుడు, సనత్కుమారుడు, హయగ్రీవమూర్తి-నారదుడు, కూర్మము, ధన్వంతరి, ఋషభుడు, యజ్ఞదేవుడు, బలభద్రుడు, యముడు, శేషుడు, ద్వైపాయనుడు, బుద్ధదేవుడు, కల్కి, లోకంలో ప్రఖ్యాతమైన

*మత్స్య: కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామన:*
*రామో రామశ్చ రామశ్చ బుద్ధ: కల్కిశ్చ తే దశ*

ఇన్ని అవతారాలు ధరించి ఆయన విహారం చేసేవాడు అని కవి స్తుతిచేసినాడు.

స్వర్గమర్త్యపాతాళాలనేవి త్రిలోకాలు. ఈ లోకాల్లో నివసించేవారికి ఎటువంటి ఆపద వచ్చినా, విష్ణుమూర్తి వారిని ఆ ఆపదలనుండి కాపాడుతాడు. స్వర్గంలో ఇంద్రునికి రాక్షసులవలన ఆపద సంభవించినప్పుడు, రాక్షససంహారం చేసి బలిచక్రవర్తిని అణచడం దేవతలహితంకొరకే. ఇక భూలోకంలోని ఋ షులకు, మునులకు, రావణాదిదైత్యులు హాని కలిగిస్తే రామావతారం ధరించి వారిని ఉద్ధరించినాడు. ద్వాపరయుగంలో కంసాదిదుష్టులు మానవహానిచేయగా, దుర్యోధనాది క్షత్రియులు అన్యాయప్రవర్తనచేయగా, శ్రీకృష్ణుడుగా అవతరించి, సాత్త్వికులను, న్యాయపక్షంలో ఉండే పాండవాదులను ఉద్ధరించినాడు. ఈ వాక్యంలో కవి ఇటువంటి సంఘటనలు సూచనామాత్రంగా చెప్పినాడు.

భూలోకంలో నివసించే ప్రజలకు పాపాలు అనంతంగా కలుగుతాయి. ఈ పాపాలను తొలగించుకోవడానికి ఒక మార్గం ఉన్నది. భక్తితో శ్రీనాథుని స్మరించడమే. భక్తులకు ఎన్ని పాపాలుకలిగినా వాటిని నశింపచేసేసామర్థ్యం పరమాత్మునికే ఉన్నది.

ఖరదూషణులసైన్యం పదునాల్గువేల సంఖ్యలో ఉండేదని వాల్మీకి వర్ణించినాడు. అందుచేత అది ఒక అడవిలాంటిది. శ్రీరాముడు ఆ అడవికి గొడ్డలిలాగ ప్రవర్తించి ఆ కాంతారవిచ్ఛేదంచేసినాడు.

ఈ పద్యంకూడ ఆద్యంతం సంబోధనాంకంగా నడిచింది.

'ఖరాదిదైత్యకాంతారకుఠార' అని చెప్పినప్పుడు రూపకాలంకారం.

కాంతారధర్మాన్ని ఖరాది దైత్యులపై ఆరోపించినాడు.

కుఠారధర్మాన్ని శ్రీరామునిపై ఆరోపించడం జరిగింది.

**9. చ. దురితలతాలవిత్ర, ఖరదూషణకాననవీతిహోత్ర, భూ**
**భరణకళావిచిత్ర, భవబంధ విమోచన సూత్ర, చారువి**
**స్ఫురదరవిందనేత్ర, ఘనపుణ్యచరిత్ర, వినీలభూరికం**
**ధరసమగాత్ర, భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: దురిత = పాపమనెడు, లతా = తీగలకు, లవిత్ర = కొడవలివంటివాడా, ఖరదూషణ = ఖరుడు, దూషణుడు అనే రాక్షసులనబడు, కానన = అడవికి, వీతిహోత్ర = అగ్నియైనవాడా, భూ = భూమి, ధరయొక్క, భరణ = వహించుటయందు, ధరించడంలో, కళా = నేర్పుచేత, విన్నాణముచేత, విచిత్ర = అద్భుతమైనవాడా, భవము = పుట్టుక, జన్మము, అనెడు, బంధ = ముడిని, కట్టుబడిని, విమోచన = విడిచిపుచ్చుటలో, వదలించడంలో, సూత్ర = విధిగలవాడా, సిద్ధాంతం గలవాడా. చారు = అందమైన,

సుందరమైన, విస్ఫురత్ = విశేషంగా ప్రకాశిస్తున్న, ఎక్కువగా మెరుస్తున్న, అరవింద = తామరలవంటి, పద్మాలవంటి, నేత్ర = కన్నులు కలిగినవాడా, ఘన = గొప్పదైన, మిక్కిలియైన, పుణ్య = పవిత్రమైన, పుణ్యప్రదమైన, చరిత్ర = నడవడి, శీలము, చరితగలవాడా, వినీల = మిక్కిలి నల్లనైన, అందంగా, నల్లగా ఉండే, భూరి = అధికమైన, గొప్పదైన, కంధర = మేఘముతో, మొయిలుతో, సమ = సమానమైన, గాత్ర = శరీరము గలవాడా.

తా: తీగలవంటి పాపసంచయాన్ని కొడవలివలె నరికివేసేవాడును, అగ్ని దట్టమైన అడవిని కాల్చివేసినట్లుగా ఖరదూషణులను నాశనంచేసినవాడును. నానావిధములలీలలచేత భూభాగాన్ని అద్భుతంగా వహించినవాడును, భక్తులకు కలిగిన జన్మపరంపరలనుండి విముక్తి కలిగించేవాడును, సుందరమైన పద్మాల్లాంటి సోగకన్నులు గలవాడును, మిక్కిలి పావనమైన నడవడియందు ప్రవర్తిల్లినవాడును మబ్బువంటి సుందరమైన నల్లని శరీరవర్ణం కలవాడును, భద్రగిరిలో నివసించేవాడును నైన శ్రీదశరథరామా.

వ్యా: ఈపద్యంకూడ సంబోధనాత్మకమే.

మనుష్యజన్మ ఎత్తిన తరువాత పాపాలు సంక్రమించకుండా ఉండవు. ఈ పాపాలను కవి తీగలతో పోల్చినాడు. ఒకసారి తీగలో చిక్కుకొంటే, క్రమంగా దానిలో ఇరుకుకొని పోవడమే కాని బయటపడడం ఉండదు. భగవంతుని అనుగ్రహమే ఆ చిక్కునుంచి బయటపడేమార్గం. పాపాల్లో చిక్కిన అహల్యను, తనదర్శనంతో విముక్తి కానించినాడు శ్రీరాముడు.

వీతిహోత్రుడు అంటే అగ్ని. హవిస్సు ఆహారంగా గలవాడని అర్థం. ఖరదూషణులు చాల సైన్యంగలవారు. చాల బలవంతులుకూడ. శూర్పణఖమాట విని శ్రీరామునిపై దండెత్తివచ్చి ఆయన బాణాలతో అసువులు కోల్పోయారు. ఈ కథ ఇదివరకే వచ్చింది. దట్టమైన అడవిలాంటి ఖరదూషణులకు, వారి సైన్యానికి రాముడు అగ్నిలాగ పరిణమించి వారిని నిర్మూలించినాడని కవి సూచించినాడు.

శ్రీరాముడు, భూలోకంలో అవతరించిన విష్ణుమూర్తి. త్రిమూర్తులలో విష్ణుమూర్తికి భూమిని సంరక్షించవలసిన విధి ఉన్నది. ఆయన అనేక అవతారాల్లో ఈ విధిని నేర్పుతో నిర్వహించినాడు. లోక కల్యాణంకోసం విష్ణుమూర్తి కూర్మావతారాన్ని వహించిన ఘట్టం మనస్సులో పెట్టుకొనికాబోలు, కవి భూభరణకళావిచిత్ర, అని శ్రీరాముని (విష్ణుమూర్తిని) సంబోధించినాడు.

భవము అనే మాటకు, పుట్టుక, సంసారము అనే అర్థాలున్నాయి. భవబంధమంటే, జన్మబంధమని, సంసారబంధమని అర్థాలు చెప్పవచ్చును. భగవత్స్వరూపుడైన శ్రీరాముడు జన్మబంధాన్ని,సంసారబంధాన్ని విడిపించేవిధి కలిగినవాడు. జటాయువుకు భవబంధమోక్షం శ్రీరామునివలన కలిగింది.

శ్రీరాముడు సుందరస్వరూపం గలవాడు. సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అన్నట్లుగా ఆయన కన్నులు చాల అందమైనవి. అవి అరవిందసదృశమైనవి. కవులు సామాన్యంగా స్త్రీలకన్నులనే పద్మాలతో పోల్చి చెప్పడం ఉన్నది. కాని, విష్ణుమూర్తి కన్నులను కూడ పద్మాలతో ఉపమించడం సంప్రదాయమే. నిత్యస్మరణీయమైన శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం- సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపం ఆజానుబాహుమరవిందదళాయతాక్షం- రామం నిశాచరవినాశకరం నమామి. అన్నశ్లోకంలో ఇదే ఉపమానం ఉన్నది. శ్రీరాముడు అందమైనకనులున్నవాడని కవిభావం.

శ్రీరాముడు ఉన్నతమైనచరిత్ర కలవాడు. ఆయన సౌశీల్యంలో కళంకం లేదు. అందువలన 'ఘనపుణ్యచరిత్ర' అనే సంబోధన సముచితంగా ఉన్నది.

'వినీలభూరికంధరసమగాత్ర' అన్నప్పుడు సుందరమైన గొప్పదైన నల్లని మేఘంవంటి శరీరంకలవాడని అర్థం. రాముడు నీలమేఘశ్యాముడు. వాల్మీకిమొదలు అందరు కవులు ఇట్లాగే చెబుతారు. పోతనగారు 'మెరుగు చెంగటనున్న మేఘంబుకైవడి' అని చెప్పినాడుకదా. గోపన్నగారుకూడ అదే వరుసలో వర్ణించినాడు.

దురితలతాలవిత్ర, ఖరదూషణకాననహోత్ర, చారువిస్ఫురదరవిందనేత్ర, అన్న వీటి సమాసాల్లో రూపకాలంకారచ్ఛాయలున్నాయి. వినీలభూరికంధరసమగాత్ర అన్నప్పుడు గాత్రము ఉపమేయము, నల్లనిగొప్పదైన మేఘము ఉపమానము, సమ అన్నప్పుడు ఉపమావాచకము. ఇది ఉపమాలంకారము.

**10.చ. కనకవిశాలచేల, భవకాననశాతకుఠారధార, స**
**జ్జనపరిపాలశీల, దివిజస్తుత సద్గుణకాండ, కాండసం**
**జనిత పరాక్రమక్రమ విశారద, శారదకందకుందచం**
**దనఘనసారసారయశ, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: కనక = బంగారుమయమైన, విశాల = విస్తృతమైన, చేల = వస్త్రముగలవాడా, భవ = జన్మము, పుట్టుక అనెడు, కానన = అడవికి, శాత = వాడియైన, కుఠార = గొడ్డలియొక్క, ధార = వాదర, వాడియైన భాగము గలవాడా, సజ్జన = సత్పురుషులను. మంచివారిని, పరిపాల = రక్షించుటయే, శీల = చరితగా, స్వభావముగా గలవాడా,

దివిజస్తుత = దేవతలచేత నుతింపబడిన, సద్గుణకాండ = మంచిగుణముల సమూహం కలవాడా, కాండ = బాణములు, అస్త్రవిద్యయందు, సంజనిత = కలిగిన, పుట్టిన పరాక్రమ = శౌర్యముయొక్క, క్రమ = పద్ధతియందు, విశారద = నేర్పు, పాండిత్యము గలవాడా, శారద = శరత్కాలమునందలి, కంద = మేఘము, కుంద = మల్లెపూవులు, చందన = మంచిగంధము, ఘనసార = పచ్చకర్పూరము,సార = శ్రేష్ఠమైన, యశ = కీర్తి కలిగినవాడా.

96599

తా: విస్తృతమైన జలతారు వస్త్రమును గట్టి, వాడియైన గొడ్డలిచేత అడవిని నరుకునట్లుగా, జన్మబంధాలను, సంసారబంధాలను నాశముచేసి, సత్పురుషులను, మంచినడవడిగలిగినవారిని పరిపాలించేవాడవు. దేవతలచేత పొగడబడిన మంచి గుణములు కలిగినవాడవు. అస్త్రములవిద్యచేత పరాక్రమ పద్ధతిని, నేర్పు కలవాడవు. శరత్కాలమందలి మేఘమువలెను, మల్లెపూవులవలెను, మంచి గంధమువలెను, పచ్చకర్పూరమువలెను శ్రేష్ఠమైన తెల్లని స్వచ్ఛమైన కీర్తి కలిగినవాడవు. దయాసముద్రుడవైన దశరథరామా.

వ్యా: విష్ణుమూర్తికి పీతాంబరుడు అనే పేరున్నది. పచ్చనిబంగారు వస్త్రము ధరించిన వాడని అర్థము. శ్రీరాముడు విష్ణుమూర్తి అవతారమే కాబట్టి బంగారుజలతారు వస్త్రమును విస్తృతమైనదానిని రాముడు ధరించినాడని కవి ఇక్కడ వర్ణిస్తున్నాడు. రాజులు, రాణులు కేవలం శరీరానికి సరిపోయే వస్త్రం మాత్రమే ధరించరు. చాలనిడివియైన వస్త్రం వారివెనుక జారుతూ ఉండడం రాజపద్ధతి. కనకవిశాలచేల, అనగా బంగారు వస్త్రం ధరించిన శ్రీరామా అని కవి సంబోధన.

బంగారు (జలతారు) వస్త్రం ధరించడం మహారాజలక్షణంకూడ. భవము అన్నప్పుడు పుట్టుక(జన్మము), సంసారము అనేవి ప్రధానార్థాలు. సంసారమనే అడవిలో కొట్టుమిట్టాడుతుంటాడు మానవుడు. అటువంటిఅడవిని నిర్మూలించేవాడు భగవత్స్వరూపుడైన రాముడు. అందుచేత ఆయన వాడియైన గొడ్డలిధారవంటివాడు. జీవులు సంసార జీవితాన్ని గడుపుతూ ఉన్నప్పుడు అనేకబంధాల్లో చిక్కుకుంటారు. శరణాపన్నుడైన గజేంద్రుని యెడ శ్రీహరి రక్షాపర్వత్వాన్ని మనస్సులో పెట్టుకొనిగోపన్నగారు భవకాననశాతకుఠార అని భగవత్స్వరూపుని సంబోధించి ఉంటారు.

అధికారం, శక్తి ఉన్నవారు సజ్జనులను చేరదీయడం అనేది మంచిలక్షణాల్లో ఒకటి. శ్రీరామునికి సజ్జనులకు అభయమివ్వడం అనే లక్షణం అడుగడుగునా కనిపిస్తుంది. ఆయన, శత్రువుకు సోదరుడైన విభీషణునికి ఏ విధంగా ఆశ్రయం కల్పించాడో పైన చెప్పడమైంది.

దేవతలు విష్ణుమూర్తిచేత అనేక ఉపకారాలు పొందినవారు కాబట్టి వారెప్పుడు
శ్రీహరిని స్తుతిచేయడం సముచితమే. ఇంక శ్రీరాముడు అన్ని మంచిగుణాల
సమూహమైనవాడు. అందుచేత అతన్ని కవి 'సద్గుణకాండ' అని సంబోధించినాడు.

తాటకసంహారానంతరం రాముడు రాక్షససంహారానికి తగినవ్యక్తి అని విశ్వామిత్రుడు
గ్రహిస్తాడు. దేవతలుకూడ ఆమోదాన్ని తెలియజేస్తారు. ఇక ఆలస్యం చేయక
రామచంద్రునికి కావలసినఅస్త్రసంపద ప్రసాదించవలెననే విశ్వామిత్రుడు ప్రేమతో
రాముని చెంతకు పిలిచి అమోఘములయిన అస్త్రాలను అనుగ్రహిస్తాడు.
ఇటువంటిఅస్త్రాలను ధరించడంచేత ఆయనపరాక్రమపద్ధతిలో నేర్పు కలిగింది.

కీర్తి నిష్కళంకంగా స్వచ్ఛంగా ఉంటుంది. అందుచేత కీర్తిని తెల్లనివస్తువులతో
ఉపమిస్తారు. ఈ ఉపమానాలు కవిసమయాలుగా లక్షణకారులు నిర్దేశించి ఉన్నారు.
చంద్రుడు, వెన్నెల, నురుగు, ముత్యము, రజతాద్రి, హంస,వెండి, హిమాద్రి, శివుడు,
కామధేనువు, అమృతము, శంఖము, మంచు, కల్పవృక్షము, ఐరావతము, ఉచ్చైశ్శ్రవము,
సింహము, గజదంతము, పాలు, గంగ, సరస్వతి, నారదుడు, కర్పూరము, వజ్రము,
రెల్లుపువ్వు, నక్షత్రము, మందహాసము, పాలసముద్రము, బలరాముడు మొ॥ ఈ
సంప్రదాయాన్ని అనుసరించి కవి శ్రీరాముని కీర్తిని శరత్కాలమేఘము, మల్లెపూవు,
మంచిగంధము, కర్పూరము అనే తెల్లని వస్తువులతో పోల్చినాడు.

ఈపద్యంలో లాటానుప్రాస అనే శబ్దాలంకారం ప్రయుక్తమైంది. 'శబ్దగతోఽనుప్రాసః
శబ్దార్థయోరభేదేఽప్యన్వయభేదాత్ లాట జనవల్లభత్వాచ్చ లాటాను ప్రాసః' అని లక్షణం.

**11.ఉ. శ్రీరఘువంశతోయధికి శీతమయూఖుఁడనైన నీ పవి**
**త్రోరుపదాబ్జముల్ వికసితోత్పలచంపకవృత్తమాధురీ**
**పూరితవాక్ప్రసూనములఁ బూజలొనర్చెదఁ జిత్తగింపుమీ,**
**తారకనామ, భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: శ్రీ = సంపత్కరమైన, రఘువంశ = రఘుమహారాజు జన్మించినవంశము,
ఇక్ష్వాకువంశము, అనెడు, తోయధికి = సముద్రానికి, శీతమయూఖుఁడనైన, = చల్లని
కిరణములు గలవాడవు, చంద్రుడవు, ఐన = ఐనట్టి, నీ పవిత్ర = నీ పావనమైన, ఉరు
= గొప్పవైన, పద+అబ్జములు = పాదములనెడు పద్మాలకు, వికసిత = వికసించిన,
ప్రకాశించిన, ఉత్పల = కలువపువ్వు, ఉత్పలమాల అనే వృత్తము, పద్యము, చంపకము
= సంపెంగపువ్వు, చంపకమాల అనేవృత్తము, పద్యము, వీటియందలి మాధురీ =
తీయదనముచేత, మాధుర్యగుణముచేత, పూరిత = నిండిన, వాక్ = మాటలు, శబ్దాలు,

అనే ప్రసూనములన్ = పుష్పులచేత, పూజలు = అర్చనలు, ఒనర్చెదన్ = చేసెదను, చిత్తగింపుమీ = అంగీకరించుమా, స్వీకరించుమా, తారక = సంసారమును తరింపచేయునట్టి,నామ = దివ్యమైనపేరు గలిగినవాడా.

తా: చంద్రుడు తాను పుట్టిన సముద్రాన్ని వర్ధిల్లచేసినవిధంగా, రఘుమహారాజువంశమున బుట్టి దానిని వృద్ధిచేసినవాడవైన నీ పవిత్రపాదార విందములను ఉత్పలము, చంపకము అనే పుష్పాలతో పూజించినవిధంగా, శబ్దాలతోకూడిన చంపకమాల, ఉత్పలమాల అనే పద్యాలతో పూజిస్తున్నాను. భద్రాచలంలో నివసించి,దయాసముద్రుడవైన, సంసారమును తరింపచేసేరామా, దానిని స్వీకరింపుము.

వ్యా: కంచెర్ల గోపన్నకవికి తన ఇష్టదైవమైన శ్రీరాముని పాదాలను అర్చించవలెననే కోరిక కల్గింది. భక్తుడైనవానికి భగవంతుని సేవించే సహజమైన కోరిక ఇది. కాని, ఏ అర్చామూర్తినో కాక, మనఃఫలకంపై నివసించి ఉండిన శ్రీరామమూర్తినిఅర్చించే కోరిక ఇది. అందుచేత లోకంలో భక్తులు, కలువలు, సంపెంగలు తీసుకొని వెళ్లి శ్రీరామపాదాలను అర్చించినట్లుగానే ఉత్పలమాల, చంపకమాల అనే పద్యాలతో ఆయనపాదాలను పూజిస్తామనే వాంఛకలిగింది. విచిత్రంగా ఈ పద్యాలకు పూవులపేర్లే ఉన్నాయి. శార్దూలమత్తేభాలు అనే వృత్తాలు గ్రహించి ఉంటే వాటిని పుష్పాలతోఉపమించే అవకాశం ఉండేదికాదు. తన శతకాన్ని, అర్చనావిధిగా వ్రాస్తున్నాను అనే మాటను కవి ఈ పద్యంలో సూచించి ఉన్నాడు. పూజల్లో వాక్పూజకూడ ఒకటి. క్రీ.శ.14వశతాబ్దంలో నివసించిన భక్తాగ్రగణ్యుడు, వైష్ణవాగ్రేసరుడు, శ్రీకృష్ణమాచార్యులు, 'చాతుర్లక్ష' వచనాలచేత తనయిష్టదైవమైన సింహాచల నరసింహునికి వాక్పూజలు చేసినా'నని చెప్పినాడు. భక్తులు భగవంతుని గురించి చేసేరచనలు వాక్పూజలే. వాటిని గోపన్నగారు వాక్ప్రసూనములు అని ఉపమించడం ఇంపైన భావన.

తెలుగుశతకప్రక్రియలో విభిన్నమైన రూపాలున్నాయి. నీతిశతకము, అధిక్షేపశతకం, భక్తిశతకం మొదలైన వీరూపాలు. గోపన్న తన శతకాన్ని భక్తిశతకంగా రచిస్తానని ఈ పద్యంలో స్పష్టం చేసినట్లయింది.

శతకలక్షణాల్లో వృత్తనియమం ఒకటి. కవులు ఆద్యంతం ఒకవృత్తంలోనే శతకాన్ని రచిస్తారు. సుమతీశతకం కందపద్యాల్లో ఉన్నది. వేమన్న ఆటవెలదిని గ్రహించినాడు. కంచర్లగోపన్న చంపకమాల, ఉత్పలమాల అనే వృత్తాలను గ్రహించి దాశరథీశతకాన్ని కూర్చినాడు. ఈ రెండు వృత్తాలకు ఛందస్సులో సాన్నిహిత్యం ఉండడంచేత, ఈ కవి ఒక వృత్తాన్ని కాక రెండింటిని గ్రహించి ఉంటాడు. ఈ రెండు వృత్తాల లక్షణం ఇట్లా ఉంటుంది.

నజభజజజ్జరేఫలు పెనంగి దిశాయతితోడఁ గూడినన్
త్రిజగదభిష్టుతా బుధనిధీ విను చంపకమాలయై చనున్.

చంపకమాలలో ప్రతిపాదంలో నగణము, జగణము, భగణము, జగణము, జగణము, జగణము, రగణము వరుసగా ఉండవలె. మొదటి అక్షరానికి, పదునొకండో అక్షరానికి యతిమైత్రి ఉంటుంది. ప్రాసనియమము విధిగా ఉంటుంది. ఇది చంపకమాల లక్షణము.

ఇక ఉత్పలమాల లక్షణము.

భానుసమాన విస్ఫురనభారలగంబులఁ గూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయుతంబుగ నుత్పలమాలయై చనున్.

ఉత్పలమాలలో ప్రతిపాదంలోను భగణము, రగణము, నగణము, భగణము, భగణము, రగణము, వగణము(లగము) వరుసగా ఉండవలె. ప్రథమాక్షరానికి, పదవ అక్షరానికి యతిమైత్రి ఉంటుంది.

ఈ రెండు పద్యాలకు సన్నిహితసంబంధమేమంటే, చంపకమాలలోని మొదటి రెండు లఘువులను తీసి, ఆ స్థానంలో ఒక గురువును, చేర్చితే అది ఉత్పలమాల అవుతుంది. ఉత్పలమాలలోని ప్రథమాక్షరమైన గురువునకు బదులు రెండులఘువులనుచేరిస్తే అది చంపకమాల అవుతుంది.

శ్రీరాముడు జన్మించిన ఇక్ష్వాకు వంశానికి రఘువంశమనే ప్రఖ్యాతి ఉన్నది. రఘుమహారాజు ఆవంశంలో జన్మించడమేకారణం. రఘు అనే సంస్కృతపదానికి వెళ్లడం, చేరడం అనే అర్థాలున్నాయి. రఘుమహారాజుతండ్రియైన దిలీపుడు, తనకుమారుని చూచి ఇతడు జ్ఞానంలోను, పరాక్రమంలోను, చివరిదాక వెళ్లగల ధీమంతుడు అని భావించి అతనికి రఘుడు అనేపేరు పెట్టినాడు. దానికి తగ్గట్లుగానే రఘువు, నాలుగు దిక్కుల ప్రపంచాన్ని జయించినాడు. రాజులను ఓడించినాడు. అప్పుడతడు విశ్వజిద్యాగాన్ని నిర్వహించినాడు. ఆ యాగంలో తనసర్వస్వాన్ని దానం చేసినాడు. అజుణ్ణి, తనకుమారుణ్ణి యౌవరాజ్యపట్టాభిషిక్తుని చేసినాడు. ఇంతటి ఘనకార్యాలు చేసినాడు. కాబట్టి ఆ వంశానికి రఘువంశమనే పేరు వచ్చింది. ఈ రఘువంశాన్ని కవి సముద్రంగా ఉపమించి, ఆ వంశంలో పుట్టి శ్రీరామచంద్రుని చల్లని ప్రసన్నమైన కిరణాలు కలిగిన శశాంకునితో పోల్చినాడు. చంద్రుడు సముద్రాన్ని ప్రకాశింపచేసినట్లుగా, శ్రీరాముడు రఘువంశాన్ని వెలిగించినాడని కవి అభిప్రాయం. రఘువంశము, శ్రీరాముడు ఉపమేయాలు, సముద్రము, చంద్రుడు ఉపమానాలు. ఐన అనేది ఉపమావాచకము, ఇది ఉపమాలంకారమైంది.

విశిష్టాద్వైతసంప్రదాయంలో ప్రపత్తిమార్గము ముఖ్యమైంది. దానిలో ఆరాధ్యదైవమైన శ్రీమన్నారాయణుని పాదములను ఆశ్రయించడం విధి. వాటిని పూజించడం విధి. ద్వయమంత్రంలో 'శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే' అనేది ప్రధానవాక్యం. భక్తుడైన కవికి శ్రీరాముడు శ్రీమన్నారాయణుడే కాబట్టి తాను వ్రాస్తున్న ఉత్పలచంపకవృత్తాలను, ఆయనపాదాలకు నివేదనంచేస్తున్నాడు. విశిష్టాద్వైతంలోని ప్రపత్తిమార్గాన్ని అనుసరించినాడు.

కావ్యగుణాలు పది ఉన్నాయని లక్షణకారులు చెప్పినారు.

శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా,

అర్థవ్యక్తిరుదారత్వమోజః కాన్తిః సమాదయః॥

వాటిలో మాధుర్యగుణం కావ్యానికి ముఖ్యమయినట్టిది.

ఆహ్లాదకత్వం మాధుర్యం శృఙ్గారే ద్రుతికారణమ్॥

అని లక్షణము. సంతోషాన్ని, ఆనందాన్ని కలిగించేది మాధుర్యగుణం అని భావించడం ఉన్నది. గోపన్నగారికి శ్రవణసుభగంగాను, భావనిర్భరంగాను పద్యాలు వ్రాయడంలో నేర్పు ఉన్నది. కాబట్టి ఆయన పద్యాలు మాధుర్యగుణం కలిగి ఉన్నాయి. శ్రీరాముని 'తారకనామ' అని ఇక్కడ సాభిప్రాయంగా సంబోధించినాడు కవి. తారకుడు అంటే తరింపచేసేవాడని, నదిని దాటించే నావికుడని సామాన్యార్థం. సంసారమనే ప్రవాహంనుండి బయటికి తీసే పరమాత్మ అనేది మరొక అర్థం. కంచెర్ల గోపన్న ప్రభుత్వ అధికారిగా ఉన్నప్పుడు, భద్రాచలరామునికి కైంకర్యాలు చేసి చిక్కుల్లో పడ్డాడు. చెరసాల పాలైనాడుకూడ. ఈ బంధనాలనుండి కవిని విడిపించినవాడు లోకోత్తరుడైన, శ్రీరాముడే. అందుచేత అతనిని తారకనామ అని సంబోధించినాడు.

'అపరాధసహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే

అగతిం శరణాగతం హరే కృపయా కేవలమాత్మసాత్కురు'

అని వైష్ణవాగ్రేసరుడైన ఆళవందారు చెప్పినాడు = ప్రార్థించినాడు. తన దోషాలను, తాజేసిన అపరాధాలను ఎరుకపరచి తనను క్షమించుమని భగవంతుని ప్రార్థించడాన్ని వైష్ణవులు నైచ్యానుసంధానం అంటారు. ఈ అపరాధాలను శ్రీహరి పరిహరించడంచేత మానవజన్మ లభించింది. ఈ విధంగా శ్రీహరి-శ్రీరాముడు-తారకుడే. ఆతారకునివలననే భక్తునికి భక్తి లభించింది.

'నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే'

12.చ. గురుతరమైన కావ్యరసగుంభన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిలఁ జాలుదురోటు శశాంకచంద్రికాం
కురములకిందుకాంతమణికోటి స్రవించినభంగి వింధ్యభూ
ధరమున జారునే శిలలు? దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : గురుతరము = శ్రేష్ఠమైనది, మిక్కిలి గొప్పది అయిన, కావ్యరస = కావ్యమునందలి శృంగారాది రసములయొక్క, గుంభనమునకున్ = కూర్పునకు, శబ్దములు మొదలైవానికూర్పునకు, అబ్బురమంది = ఆశ్చర్యపడి, ముష్కరులు = మూఢులు, కుటిలురు, రసజ్ఞతలేనివారు, సరసులమాడ్కి = రసమువిలువ తెలిసినవారివలె, విజ్ఞులవలె (ఆశ్చర్యమును పొంది), సంతసిలన్ = సంతోషించుటకు, చాలుదురు+ఓటు = ఓటుపడుటకు, భంగపడడానికి సరిపోదురు. (చాలుదురోటు = సమర్థులా? కారు), శశాంక = కుందేలు గుర్తుగా కలిగిన, చంద్రుని యొక్క, చంద్రికా = వెన్నెలలయొక్క, అంకురములకు = మొలకలకు, లేతవెన్నెలలనుట, ఇందుకాంతమణి = చంద్రకాంతమణులయొక్క, కోటి = సమూహము, స్రవించిన భంగిని = కరగినరీతి, వింధ్యభూధరమున = వింధ్యపర్వతంలోని, శిలలు = రాళ్లు, జారునే = కరగునా? కరగవు అని భావము.

తా: చంద్రుని కిరణాలు ప్రసరించినప్పుడు, చంద్రకాంతమణులనే శ్రేష్ఠమైన మణులు కరిగి జాలువారుననికవిసంప్రదాయం. చంద్రుని వెన్నెలలోచంద్రకాంతమణులు కరిగేవిధంగా, వింధ్యపర్వతంలో ఉండే బండరాళ్లు కరిగి జాలువారునా? కరగవుకదా. ఆ విధంగానే కావ్యంలో ఉండే శృంగారాది రసస్ఫూర్తికి, రసమువిలువ తెలిసినవారివలె, మూర్ఖులైనవారు, కుటిలురు, అబ్బురపడి సంతోషింపజాలరు. ఆ విలువ తెలిసికొనలేక భంగపడుతారు. అందుచేత ఈ కావ్యాన్ని సరసుడవైన నీకు అంకితం చేస్తూ ఉన్నాను. దయాసముద్రుడవైన దశరథరామా.

వ్యా: గురువు అనే పదానికి, ఉపాధ్యాయుడు, బృహస్పతి, కులముపెద్ద, తండ్రి, తాత, అన్న, మామ, మేనమామ, రాజు, కాపాడువాడు, అలఘువు, గొప్పది అనే అర్థాలున్నాయి. రసనిర్భరమైన కావ్యం చాల గొప్పది అనేభావం కలిగినవాడీకవి కాబట్టి, తనకావ్యంఅటువంటిదని భావించినవాడు కాబట్టి దానికి 'గురుతర' అనే విశేషణం ప్రయోగించినాడు. ఇక్కడ రసగుంభనము అంటే, విభిన్న కావ్యరసములను ఉచితరీతిని కూర్చుట అని భావము. దీనివలన కావ్యానికి సౌందర్యం సమకూరుతుంది.

ముష్కరుడు అనే పదానికి దొంగతనం చేసేవాడు అన్న అర్థం ఉన్నది. బహుశా

కావ్యరచననుగురించి పరిజ్ఞానం లేనిమూఢులు, రసవంతమైన కావ్యాన్ని దొంగల్లాగా మెచ్చుకొనరు అని కవిభావం కాబోలు. కంచెర్లగోపన్నకవి ఇంతకుపూర్వం తాను వ్రాసిన కావ్యాలను 'దురాత్ములకిచ్చి మోసపోయినా'నని (7వ పద్యం) చెప్పిఉన్నాడు. ఆ దురాత్ములనే మనస్సులో పెట్టుకొని ముష్కరులు అని వ్రాక్రుచ్చిఉంటాడు. రసనిర్భరంగా ఉన్న తన కావ్యాన్ని, దైవానికి అంకితమైన తన కావ్యాన్ని వారు మెచ్చుకొని ఉండరు. వారు 'సరసులు' కారు కదా.

సరసుడు అంటే రసము, తెలిసినవాడు. రసజ్ఞుడు-రసము విలువ కనుగొనువాడు. శ్రీరామునికి ఉండే రసజ్ఞత సామాన్యులకు ఉండదు కాదా. అటువంటి సరసుడైన రసజ్ఞుడు, శ్రీరాముడు తన కావ్యం అంకితం కావడానికి అర్హుడు అని కవి భావించినాడు.

చంద్రకాంతశిలలు చలువరాళ్లవంటివి. తెల్లగా స్వచ్ఛంగా ఉంటాయని భావిస్తారు. చంద్రుడు వెన్నెలను ప్రసరింపజేసినప్పుడు ఈ చంద్రకాంతశిలలు ద్రవిస్తాయని, వాటినుండి నీరు జాలువారుతుందని కవులు భావించి, సంప్రదాయంగా పెట్టుకొన్నారు. సరసులైనవారు, మంచికావ్యాలు విన్నప్పుడు, చిత్తద్రవం చెందడం, వెన్నెలను చూచి చంద్రకాంతం ద్రవించడంవంటిదని కవిభావం. ఇక సామాన్యమైన రాళ్లు వెన్నెలకు కరుగవు కదా. కావ్యరసజ్ఞత లేనివారు బండరాళ్లవంటిమనస్సు కలవారట.

చంద్రకాంతశిలలున్నాయని, అవి చంద్రిక కాచినప్పుడు ద్రవిస్తాయని కవులు చెప్పడమేకాని, శాస్త్రబద్ధంగా దానికి ప్రమాణం లేదు. వెన్నెల ప్రసరించినప్పుడు సామాన్యంగా చల్లనివాతావరణం ఏర్పడుతుంది. దానివలన చలువరాళ్లవంటి తెల్లని రాళ్లపై, మంచుబిందువులు చేరవచ్చు (రాత్రిపూట). దాన్ని చూచినకవులు అవి ద్రవించినాయని అతిశయోక్తిగా భావించి ఉండవచ్చు. అదే కవి సమయం లాగా ప్రచలితం కావచ్చును:

ఈ పద్యంలో ఉపమానుప్రాణిత దృష్టాంతాలంకారము ప్రయుక్తమైంది. దృష్టాంతాలంకారలక్షణం.

***దృష్టాన్త: పునరేతేషాం సర్వేషాం ప్రతిబిమ్బనమ్.***

***ఏతేషాం సాధారణ ధర్మాదీనామ్. దృష్టా న్త: నిశ్చయ: యత్ర స దృష్టాన్త:***

*(కావ్యప్రకాశము).*

బయట ఉన్న ముఖం బింబం. అద్దంలో కనపడేది ప్రతిబింబం. ఈ రెండు వేరువేరు అయినా, పరస్పర సాదృశ్యాన్నిబట్టి అవి రెండు ఒకటే అన్న ప్రతీతి కల్గుగుతుంది. అదే విధంగా, రెండు వాక్యాలలో ఉపమాన-ఉపమేయ-సాధారణ ధర్మాలను కూర్చినప్పుడు

అవి ఒక్కటే అనే ప్రతీతి కలుగుతుంది. ఒక విషయాన్ని చెప్పి, అది అంతేఅని ధ్రువీకరించడానికి, మరొక విషయం ఉదాహరణగా చెప్పబడుతుంది. ఉదాహరణగా చెప్పబడేది దృష్టాంతం.

గొప్పదైనా కావ్యరసాన్ని గ్రహించలేని కుటిలురైనవారు, ఆ కావ్యాన్ని చూచి భంగపడతారు. సరసులు కావ్య రసగుంభనకు అద్భుతపడి సంతోషిస్తారు.

చంద్రుని ప్రసన్నమైన వెన్నెల ప్రసరించినప్పుడు వింధ్యపర్వతంలో ఉండే రాళ్ళు కరగవు. కాని చంద్రకాంతమణులు ద్రవిస్తాయి.

కావ్యరసం గ్రహించలేనివారు వింధ్యపర్వతంలోని రాళ్లవంటివారు.

కావ్యరసగుంభనకు సంతోషించేవారు చంద్రకాంతశిలలవంటివారు.

*మహేంద్రో మలయ స్సహ్యః శ్శుక్తిమాన్ గంధమాదనః ।*
*వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః॥*

కులపర్వతాలు సంఖ్యలో ఏడు ఉన్నాయని, వింధ్యపర్వతం వాటిలో ఒకటి అని చెప్పబడింది.

**13.చ. తరణికులేశ, నా నుడులఁ దప్పులు గల్గిన నీదునామన**
**ద్విరచితమైన కావ్యము పవిత్రముగాదె? వియన్నదీజలం**
**బరుగుచు వంకయైన మలినాకృతిఁ బారినఁ దన్మహత్త్వముం**
**దరమె గణింప నెవ్వరికి? దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : తరణి = సూర్యునియొక్క, కుల = వంశమునందు, ఈశ = శ్రేష్ఠమైనవాడా. నా నుడుల = నామాటలలో, నా పద్యాల్లో, శబ్దాల్లో, తప్పులు కల్గిన = దోషములు వచ్చినప్పటికి, నీదునామ = నీపేరుతోడ, నీపేరుమీద, సత్ = గొప్పదయిన, పవిత్రమైన, శ్రేష్ఠమైన, విరచిత = రచింపబడినదియు, అయినకావ్యము = అయినట్టి-ఈశతకము. పవిత్రముకాదె = పావనము కాదా (అగునుకదా). వియత్+నదీ+జలము = ఆకాశగంగలోనినీరు, అరుగుచు = ప్రవహిస్తూ, వంకయైన = వంకరగా తిరిగిన, మలినాకృతిన్ = మాలిన్యము గలిగిన ఆకారంతో, బురదమొ॥కలిసిన, పారినన్ = ప్రవహించినా, తన్మహత్త్వమున్ = దానిగొప్పతనమును, గణింపన్ = ఎన్నుటకు, తరమె= సాధ్యమా (శక్యము కాదు).

తా: సూర్యవంశంలో జన్మించినవారిలో శ్రేష్ఠుడవైన శ్రీరామా, నేను వ్రాసిన పద్యాల్లోని శబ్దాల్లో, మాటల్లో దోషాలున్నప్పటికి, ఆ పద్యాలు, నీ నామముతోడ రచింపబడినవి కాబట్టి, ఈ కావ్యము పవిత్రమైనదేకదా. అట్లే అగునని భావం. మూడులోకాల్లో

ప్రవహించే గంగానదినీరు తనప్రవాహంలో ఒకచోట వంకరగా తిరిగినప్పటికి, బురద మొదలైన మాలిన్యంతో ప్రవహించినప్పటికి, దానిగొప్పతనము ఎన్నుట సాధ్యమా - దాని మహాత్మ్యానికి భంగం కలుగదని భావం.

వ్యా: తరణి అంటే సూర్యుడు - ముందు వెళ్లేవాడు అని అర్థం - సూర్యుడు లోకానికి వెలుగును ప్రసాదించేవాడు. అంధకారాన్ని ఛేదించేవాడు. ఆ సూర్యుడు వంశకర్తగా ఉండిన వంశంలో శ్రీరాముడు జన్మించినాడు. ఈ వంశంలోనే దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు మొదలైన చక్రవర్తులు జన్మించినారు. కాని, శ్రీరాముడు 'తరణికులేశుడు' ఈ సూర్యవంశంలో శ్రేష్ఠుడు అని అర్థం. ఈశశబ్దానికి రాజు అనికూడ అర్థమే. సూర్యవంశంలో జన్మించిన మహారాజుల్లో శ్రీరాముడు సర్వశ్రేష్ఠుడు అని కవి భావించినాడు. అతడు సూర్యవంశజుడు కాబట్టి లోకానికి వెలుగును ప్రసాదించేవాడని కూడ కవిభావం.

నుడులు అంటే మాటలు - కవిమాట అంటే కావ్యమేకదా. మాటకు లోకంలో చాల ప్రాధాన్యం ఉన్నది. కవిమాటయైన కావ్యానికి కూడ అంతే.

> ***పుడమి నవప్రథయగునెడఁ బడతికి దేహంబు విడువఁ బాడియ కాదే***
>
> ***నుడికంటెఁ జావు మేలను నుడువు పురాతనముగాదె నూతనపదమే***

మాట పల్కుతున్నప్పుడు, కావ్యం వ్రాస్తున్నప్పుడు ఏవైన ఛందోవ్యాకరణాది దోషాలుకాని, ఔచిత్యానౌచిత్యాలు కాని రావడం సంభవించవచ్చు. 'ప్రమాదో ధీమతామపి' అని కదా ఆర్యోక్తి.

తప్పులున్నా లేకపోయినా 'నానుడులఁ దప్పులు గల్గిన' అని కంచెర్లగోపన్నగారు పలుకడం ఆయన వినయసంపదయే కాని మరొకటి కాదు.

'నీదునామ(రామనామ) సద్విరచితమైనకావ్యము పవిత్రము కాదె' అని అంటున్నాడు. శ్రీరామునిగుణగణాలను మనస్సులో పెట్టుకొని పల్కినమాట యిది. శ్రీమద్రామాయణప్రారంభంలో శ్రీరాముని సుగుణాలుపేర్కొనబడినాయి.

శ్రీరామునిపేరుతో వ్రాసినకావ్యం పవిత్రమని కవి అనడంలో ఔచిత్యమే కాని, అతిశయోక్తిలేదు. దాశరథిశతకాన్ని గోపన్న కవి కేవలం శ్రీరామునికి అంకితం చేయడమేకాదు. ప్రతిపద్యంచివర'దాశరథీ కరుణాపయోనిధీ' అనే మకుటం కూర్చి ప్రతిపద్యంలో తన ఇష్టదైవాన్ని సంబోధించి తృప్తి చెందినాడు.

ఈ పద్యంలోకూడ గడచిన పద్యంలోలాగ దృష్టాంతాలంకారం ప్రయుక్తమైంది. శ్రీరామునిపేర విరచితమైనకావ్యంలో ఎక్కడైనా దోషాలు దొర్లినాయనుకొనండి. ఆకాశగంగ వంకరపోయినా, బురదతో మలినమైనా అపవిత్రం కానట్లు శ్రీరామునిపేరుతో

ఉన్న కావ్యంలోని గొప్పతనానికి భంగం రాదు అని కవి చెప్పినాడు. ఈ భావాన్ని రెండు సమానాంతర వాక్యాలు గ్రహించి వ్యక్తంచేయడంచేత ఇది దృష్టాంతాలంకారమైంది. ఈ అలంకార లక్షణం 12వ పద్యం చివరన వ్రాసినాను.

ఇచట నియున్నదియైన గంగానది ప్రస్తావన వచ్చింది. సగరునికుమారులు యాగాశ్వాన్ని వెదకుతూ మునిశాపదగ్ధులవుతారు. వారివంశంలో పుట్టిన భగీరథుడు సగరకుమారులను గంగానది తోయంతో పావనం చేయాలని సంకల్పించి బ్రహ్మనుగురించి ఘోరతపస్సు చేసినాడు. బ్రహ్మప్రసన్నుడైనాడు కాని, హిమవంతునిపెద్దకుమార్తె గంగ. ఆమె భూమికి దిగినట్లయితే, ఆ వేగాన్ని ఈ భూమి భరించలేదు. దానిని ఆపగలిగినవాడు ఉమాపతి ఒక్కడే. అందుచేత శివునిగురించి తపస్సుచేసి మెప్పించు' అన్నాడు. తిరిగి భగీరథుడు తపమాచరించి మహేశ్వరుని ప్రసన్నుని చేసికొన్నాడు. ఆయన గంగను తనజటాజూటంలో నిలపడానికి అంగీకరించినాడు. కాని గంగ భూలోకంలో అవతరించడం సాధ్యం కాలేదు. చివరకు శివుని అనుగ్రహంతో గంగ బిందుసరస్సులోనికి ప్రవహించింది. తరువాత భగీరథునివెనుక నడచింది. కాని, ప్రవాహవశాన ఆమె జహ్నుమహర్షి ఆశ్రమంలో ప్రవేశిస్తే, తన యజ్ఞవేదికకు భంగంకలుగుతుందని ఆ మహర్షి ఆ ప్రవాహాన్ని ఆచమనం చేసినాడు. ఆమె మహర్షిగర్భంలో ప్రవేశించి మాయమైపోయింది. భగీరథుడు జహ్నుమహర్షిని ప్రార్థించగా, ఆయన దాన్ని తనకుడిచెవినుండి వదలిపెట్టినాడు. జహ్నుమహర్షిచెవినుండి స్రవించింది. కాబట్టి జాహ్నవి అయింది. ఆ తరువాత గంగ సముద్రాన్ని చేరింది. పాతాళానికి ప్రవేశించి సగరపుత్రులు భస్మమైనస్థలానికి చేరింది. భగీరథుడు తన పితరులకు జలతర్పణంచేసి వారికి ఉత్తమగతులు కలిగించినాడు.

మూడులోకాలలో ప్రవహించే గౌరవం కేవలం గంగానదికే ఉన్నది.

**14.ఉ. దారుణపాతకాబ్ధికి సదా బడబాగ్ని భవాకులార్తివి**
**స్తారదవానలార్చికి సుధారసవృష్టి దురంతదుర్మతా**
**చారభయంకరాటవికి చండకఠోరకుఠారధార నీ**
**తారకనామమెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: నీ తారకనామము = సంసారమును దాటించు, తరింపజేయునట్టి నీయొక్క 'రామ'నామము, ఎన్నుకొనన్ = తలపగా, భావించగా, గణించగా, దారుణ = భయంకరమైన, పాతక = పాపములనెడు, అబ్ధికిన్ = సముద్రానికి, సదా = ఎల్లప్పుడు, బడబాగ్ని = బడబానలము, వార్ధపుటగ్గి, భవ = జన్మము, సంసారముయొక్క, ఆకుల = వ్యాప్తమైయున్న, ఆర్తి = బాధ, పీడయొక్క, విస్తార = బాహుళ్యమనెడు, దవానల =

ఉన్న కావ్యంలోని గోప్యతనానికి భంగం రాదు అని కవి చెప్పినాడు. ఈ భావాన్ని రెండు సమానాంతర వాక్యాలు గ్రహించి వ్యక్తంచేయడంచేత ఇది దృష్టాంతాలంకారమైంది. ఈ అలంకార లక్షణం 12వ పద్యం చివరన వ్రాసినాను.

ఇచట వియన్నదియైన గంగానది ప్రస్తావన వచ్చింది. సగరునికుమారులు యాగాశ్వాన్ని వెదకుతూ మునిశాపదగ్ధులవుతారు. వారివంశంలో పుట్టిన భగీరథుడు సగరకుమారులను గంగానది తోయంతో పావనం చేయాలని సంకల్పించి బ్రహ్మనుగురించి ఘోరతపస్సు చేసినాడు. బ్రహ్మప్రసన్నుడైనాడు కాని, హిమవంతునిపెద్దకుమార్తె గంగ. ఆమె భూమికి దిగినట్లయితే, ఆ వేగాన్ని ఈ భూమి భరించలేదు. దానిని ఆపగలిగినవాడు ఉమాపతి ఒక్కడే. అందుచేత శివునిగురించి తపస్సుచేసి మెప్పించు' అన్నాడు. తిరిగి భగీరథుడు తపమాచరించి మహేశ్వరుని ప్రసన్నుని చేసికొన్నాడు. ఆయన గంగను తనజటాజూటంలో నిలపడానికి అంగీకరించినాడు. కాని గంగ భూలోకంలో అవతరించడం సాధ్యం కాలేదు. చివరకు శివుని అనుగ్రహంతో గంగ బిందుసరస్సులోనికి ప్రవహించింది. తరువాత భగీరథునివెనుక నడచింది. కాని, ప్రవాహవశాన ఆమె జహ్నుమహర్షి ఆశ్రమంలో ప్రవేశిస్తే, తన యజ్ఞవేదికకు భంగంకలుగుతుందని ఆ మహర్షి ఆ ప్రవాహాన్ని ఆచమనం చేసినాడు. ఆమె మహర్షిగర్భంలో ప్రవేశించి మాయమైపోయింది. భగీరథుడు జహ్నుమహర్షిని ప్రార్థించగా, ఆయన దాన్ని తనకుడిచెవినుండి వదలిపెట్టినాడు. జహ్నుమహర్షిచెవినుండి స్రవించింది. కాబట్టి జాహ్నవి అయింది. ఆ తరువాత గంగ సముద్రాన్ని చేరింది. పాతాళానికి ప్రవేశించి సగరపుత్రులు భస్మమైనస్థలానికి చేరింది. భగీరథుడు తన పితరులకు జలతర్పణంచేసి వారికి ఉత్తమగతులు కలిగించినాడు.

మూడులోకాలలో ప్రవహించే గౌరవం కేవలం గంగానదికే ఉన్నది.

**14.ఉ. దారుణపాతకాబ్ధికి సదా బడబాగ్ని భవాకులార్తివి**
**స్తారదవానలార్చికి సుధారసవృష్టి దురంతదుర్మతా**
**చారభయంకరాటవికి చండకఠోరకుఠారధార నీ**
**తారకనామమెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: నీ తారకనామము = సంసారమును దాటించు, తరింపజేయునట్టి నీయొక్క 'రామ'నామము, ఎన్నుకొనన్ = తలపగా, భావించగా, గణించగా, దారుణ = భయంకరమైన, పాతక = పాపములనెడు, అబ్ధికిన్ = సముద్రానికి, సదా = ఎల్లప్పుడు, బడబాగ్ని = బడబానలము, వార్ధపుటగ్గి, భవ = జన్మము, సంసారముయొక్క, ఆకుల = వ్యాప్తమైయున్న, ఆర్తి = బాధ, పీడయొక్క, విస్తార = బాహుళ్యమనెడు, దవానల =

కార్చిచ్చుయొక్క, అడవిలోనిఅగ్నియొక్క, అర్చికిన్ = సెగకు, వేడికి, సుధారసవృష్టి = అమృతరసవర్షము, అమృతమువాన, దురంత = మితిమీరిన, దుర్మత = దుష్టమతములయొక్క, దుష్టబుద్ధులయొక్క, ఆచార = ఆచారము, నడతఅనెడు భయంకర = భయమునుకలిగించే, అడవికిన్ = కాననమునకు, చండ = తీక్ష్ణమును, భయంకరమును, కఠోర = కఠినమును, కటువయినదియునగు, కుఠార = గొడ్డలి, ధార = వాడియైనభాగము, వాదరవంటిది.

తా: ఈ పద్యంలో కవి రామనామము మహత్త్వాన్ని వ్యక్తం చేస్తున్నాడు. సంసారాన్ని తరింపచేయునట్టి నీనామము, బడబాగ్ని సముద్రాన్ని పీల్చినట్లుగా భయంకరమైన పాపాలను తొలగిస్తుంది. అమృతద్రవవర్షము, అడవిలో ప్రజ్వలించే అగ్నిని చల్లార్చినట్లుగా సంసారబాధలను ఉపశమింపజేస్తుంది. పదునయిన గొడ్డలిధార, భయంకరమైన అడవిని నరికే విధంగా మితిమీరిన దుర్మతాచారాలను, దుష్టులనడవడిని నిర్మూలనము చేస్తుంది. భద్రాచలంలో నివసించే ఓదశరథరామా.

వ్యా: తారకశబ్దానికి దాటించేవాడు, తరింపచేసేవాడు, అనే అర్థాలున్నాయి. శ్రీరాముడు, భగవత్స్వరూపుడు. కాబట్టి సంసారము, జన్మ అనేవాటిని సుఖంగా దాటిస్తాడు. కాబట్టి ఆయన తారకరాముడైనాడు. శ్రీరామునిపేరు తారకనామమనుట కష్టాలతో కూడిన ఈ జన్మానికి మోక్షం ప్రసాదిస్తాడు. కాబట్టి అతడు తారకరాముడైనాడు. పడవవాడు, క్లిష్టమైన నదీప్రవాహాన్ని సుఖంగా దాటించిన విధంగా శ్రీరాముడు జన్మను సుఖమయం చేసి ముక్తిని కలిగిస్తాడు. అందుచేత జన్మ నదీప్రవాహంలాంటిదయితే, శ్రీరాముడు నావికునివంటివాడు. ఇద్దరూ దాటించేవారే. ఇద్దరూ సుఖాన్ని కలిగించేవారే. రామదాసు అని ప్రఖ్యాతిని పొందిన కంచెర్ల గోపన్నకవికి శ్రీరామునిపేరు సదా తారకమంత్రమే.

రామనామ మంత్రాన్ని తాను తెలిసికొనడమే కాక, యితరులు కూడ తెలిసికొండని, ముక్తి చెందుడని, రామదాసు ప్రబోధించినాడు. రామభక్తులకు రామనామముకంటె తారకమంత్రము లేదు.

సముద్రగర్భంలో బడబాగ్ని ఉంటుందని, అది సముద్రాన్ని, భూమిని, శీతలం కాకుండ కాపాడడమే కాక, సముద్రం ఉప్పొంగి లోకానికి అపకారం తలపెట్టితే దాన్ని ఇంకించివేస్తుందని భావిస్తారు.

ఎల్లప్పుడు నీటిలో నివసించి గొప్పతపస్సునుచేస్తూ నిశ్చలంగా ఉండే మునులకు వేడిని కలిగించేది బడబాగ్ని. కాని ఇది భయంకరమై సముద్రాన్ని ఇంకించివేస్తుంది కూడ.

లోకంలో పాపాలు ప్రబలిపోయినప్పుడు, దుష్టులు విస్తరించినప్పుడు, భగవంతుడు
అవతరించి వారిని నాశనం చేస్తాడుకదా.

**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** అనేది గీతావాక్యం. పాపాలు ఎవరు
చేసినా భగవంతుడు వాటిని నశింపచేస్తాడు. శ్రీరాముడు తన అవతారంలో చేసిన
దుష్టశిక్షణక్రమంనాలుగవపద్యంవ్యాఖ్యలో ఉదహరించిన"తాటక మర్దించి" అన్న పద్యంలో
పేర్కొనబడినది. ఈ పనులన్ని 'దారుణపాతాకాబ్ధికి సదా బడబాగ్నివలె, ఉండడానికే.

మానవజన్మం చాల విచిత్రమైంది. నిత్యజీవితం గడుపుతూ ఉన్నవారుకూడ ఎక్కడో
ఒకచోట బాధలకు గురికాక తప్పదు. ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. ఎల్లప్పుడు శ్రీహరిని
ధ్యానంచేయడమే తనవిధిగా భావించుకొనే ఉత్తముడు. అటువంటిమహాభక్తునికి,
దుష్టుడైన తండ్రి, హిరణ్యాకశిపునివలన అనేక కష్టాలు కలిగినాయి. అతనిజీవితం
దుర్భరమైంది. చివరకు భగవంతుని అనుగ్రహంచేతనే అతనికష్టాలు గట్టెక్కుతాయి.
మానవసంసారంకూడ అంతే. ఈ సంసారబాధలను, చిక్కులను తప్పుకోవలెనంటే,
శ్రీరామనామం ఒకటే ఆధారం. స్వయంగా రామదాసుగారు తన ఆత్మానుభూతిని ఈ
పద్యంలో సూచించినారేమో అనిపిస్తుంది. ఏ అపరాధం చేయకయే ఆయన రాజదండనకు
గురియైనారు. ఆ ఆర్తిని శ్రీరాముడే తొలగించగా ఆయనమీద అమృతవృష్టి
కురిసినట్లయింది.

దుర్మతులు అంటే చెడ్డబుద్ధిగలవారు అని భావం. ఒక్కొక్కసారి మానవుడు
చెడుబుద్ధికి లోనై, దుష్టమైన ప్రవర్తన వహిస్తాడు. అటువంటివానిని అణచడానికి, అతడు
చేసేపాపాలవలన లోకాన్ని, సమాజాన్ని కాపాడడానికి భగవత్స్వరూపుడైన శ్రీరాముడు
తప్ప మరొకరు లేరు అని కవిభావం. ఇటువంటి దానికి ఉదాహరణ రామాయణంలోనే
ఉన్నది.

ఋక్షరాజు తనయులు వాలిసుగ్రీవులు. వాలి పెద్దవాడు. బలశాలి. స్నేహశీలి. కాని
ధర్మాధర్మవిచక్షణ లేనివాడు. అతడే రాజవుతాడు. అన్నగారికి పరిచర్యలు చేస్తూ
తమ్ముడు సుగ్రీవుడు వినయవిధేయతలతో రాజ్యపాలనంలో సాయం చేస్తూ ఉంటాడు.

ఒకసారి మయతనయుడు మాయావికీ, వాలికీ స్త్రీవిషయంలో వైరం ఏర్పడుతుంది.
ఒక రాత్రివేళ కిష్కంధ మాటుమణిగిన సమయంలో మాయావి వాలియింటికి వచ్చి
యుద్ధానికి రమ్మని బిగ్గరగా కేకవేస్తాడు. వాలి శత్రువును ధిక్కరిస్తాడు. వాలివెంట
సుగ్రీవుడు కూడ వెళ్లుతాడు. వాలిసుగ్రీవులను చూచి మాయావి పారిపోయి కొండగుహలో
ప్రవేశిస్తాడు. వాలికూడ అతనివెంట గుహలో ప్రవేశించి వాకిట వేచి ఉండమని
సుగ్రీవునికి చెబుతాడు. సుగ్రీవుడు అన్నకొరకు వేచి ఉన్నాడు. కాని సంవత్సరం గడిచినా

వాలి బయటికి రాలేదు. వాలి చప్పుడు కాదు. నురుగులు క్రక్కే నెత్తురుకాలువలు బయటకు వస్తాయి. అది చూచి సుగ్రీవుడు భయపడి, అన్నకు మరణం సంభవించి ఉంటుందని భావిస్తాడు. అతనికి అంత్యక్రియలు చేసి కిష్కింధ చేరుతాడు. పెద్దలందరు సుగ్రీవుని ఉత్తరాధికారిగా ఎన్నుకొని కిష్కింధారాజ్యపట్టం కట్టుతారు. సుగ్రీవుడు మంచి రాజుగా పేరు తెచ్చుకొని రాజ్యాన్ని ప్రజాక్షేమకరంగా పాలిస్తాడు.

కొంతకాలానికి, మాయావిని చంపి వాలి కిష్కంధలో ప్రవేశిస్తాడు. సుగ్రీవుని అధికారం చూచి మండిపడతాడు. అతన్ని అందరిఎదుట అవమానపరచి, రాజ్యం లాక్కొని,అతని భార్యనుకూడ గ్రహించి, అతనికి రాజ్యబహిష్కారంచేస్తాడు. సుగ్రీవుడు తన తప్పు లేదని, మన్నించమని ప్రార్థించినా, లెక్క చేయడు. సుగ్రీవుడు ఋష్యమూకపర్వతం చేరి, రామునితో స్నేహంచేసి, వాలి చేసిన ఘోరకృత్యాలను వివరిస్తాడు. శ్రీరాముడు, వాలి చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా అతన్ని యుద్ధంలో బాణంవేసి హతమారుస్తాడు. ఆ విధంగా దుర్మతాచారానికి నిర్మూలనం జరిగింది.

ఈపద్యంలో బడబాగ్ని, సుధారసవృష్టి, చండకఠోరకుఠారధార అనేవి ఉపమానాలు. తారకనామము అనేది ఉపమేయము, పై ఉపమానధర్మాలను, ఉపమేయానికి కవి ఆరోపిస్తున్నాడు. కాబట్టి ఇది రూపకాలంకారమైంది.

**15.చ. హరునకు నవ్విభీషణున కద్రిజకుం దిరుమంత్రరాజమై**
**కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తిహరించు చుట్టమై**
**పరగినయట్టి నీ పతితపావననామము జిహ్వపై నిరం**
**తరము నటింపఁజేయుమిఁక దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : హరునకు = శివునికి, పరమేశ్వరునికి, విభీషణునకు = రావణుని తమ్ముడైన విభీషణునికి, అద్రిజకు = పార్వతికి, తిరు = శ్రీకరమైన, మంత్రరాజము = శ్రేష్ఠమైన మంత్రము, అయి, కరికి = ఏనుగుకు, గజేంద్రునకు, అహల్యకు = గౌతమినసతియైన అహల్యకు, ద్రుపదకన్యకు = పాండవులపత్ని యైన ద్రౌపదీదేవికి, ఆర్తిన్ = బాధను, కష్టాన్ని, వ్యథను, హరించు = తొలగించు, పోగొట్టు, చుట్టము = బంధువు, ఆప్తుడవు, అయి, పరగిన+అట్టి = ప్రయుక్తమైనట్టి, నాయొక్క, పతిత = పడిపోయిన,గతితప్పినవారిని,పావన = పవిత్రులను చేయునట్టి, నామము = (రామ)పేరు, ఇంక, జిహ్వపై = నాలుకమీద, నిరంతరము = ఎల్లప్పుడు, నటింపఁజేయుము = నృత్యము చేయునట్లు చేయుము, ఆడునట్లు చేయుము.

తా: ఓ దశరథరామా, త్రిమూర్తులలో ఒకడైన మహేశ్వరునికి, రావణునిసోదరుడైన

విభీషణునికి, మహేశ్వరుని అర్ధాంగియైన పార్వతీదేవికి, మహేశ్వరుని అర్ధాంగియైన పార్వతీదేవికి, శ్రేష్ఠమైన మంత్రమైనది. నీ పవిత్రమైన నామము. అట్లే, ఏనుగులకు అధీశుడైన గజేంద్రునికి, గౌతమసతియైన అహల్యకు పాండవపత్నియైన ద్రౌపదీదేవికి ఆత్మబంధువువలె వ్యథలను తొలగించేది నీపేరు. అది పతితులను ఉద్ధరించేది. పవిత్రం చేసేది. అటువంటి నీరామనామాన్ని ఎల్లప్పుడు నానాలుకమీద ఆడునట్లు చేయుమా. అనగా నేనెల్లప్పుడు నీపేరు ఉచ్చరించే అవకాశాన్ని కలిగింపుమని భావం.

వ్యా: దాశరథీశతకాన్ని రచించిన కంచెర్లగోపన్నకవి గొప్పవైష్ణవుడు. భక్తుడు. శ్రీమన్నారాయణుని సర్వదా స్మరించుకొనేవాడు. ఈ విశేషాలు ఈ పద్యంద్వారా చక్కగా వ్యక్తమైనాయి.

మోక్షప్రాప్తికి ప్రపత్తిని మించిన సాధనము లేదని పరమభాగవతసిద్ధాంతము. సాధకుడు సర్వేశ్వరునకు తన్ను సమర్పించుకోవడమే ప్రపత్తియోగము. దీనికి శరణాగతి యని ప్రసిద్ధమైన పేరు. త్యాగము, న్యాసము, భరన్యాసము, సన్న్యాసము, సాధ్యభక్తి - మొదలైనవి దీనికే పర్యాయాలు. సర్వశ్రేష్ఠమైన ఈ ప్రపత్తిదర్శనం వేదము, ఉపనిషత్తులు, ఆగమశాస్త్రం, పురాణాలు, మహాభారతం (భగవద్గీత) మొదలైన ప్రామాణికగ్రంథాలన్నింటిలోను ప్రతిపాదితమైంది. బ్రహ్మ, శివుడు, నారదమహర్షి, కపిలాచార్యుడు, ప్రహ్లాదుడు, భీష్ముడు, అర్జునుడు మొదలైన పలువురు దీన్ని అనుష్ఠించినారు. శ్రీవైష్ణవసిద్ధాంతానికి ప్రపత్తిమార్గం జీవగర్ర.

***తం పత్నీభిరనుగచ్ఛేమ దేవాః పుత్రైర్భ్రాతృభిరుత వా హిరణ్యైః***
***నాకం గృభ్ణానా సుకృతస్య లోకే తృతీయే పృష్ఠే అధిరోచనేన.*** (యజు -15-50.

ఈ మంత్రార్థమిది.

'పుణ్యాభాజనులగు భక్తులకే ప్రవేశింప నలవియైనది, స్వర్గాదిలోకాలకు పైన దివ్యకాంతులతో విలసిల్లుతూ, త్రిపాద్విభూతి అనబడే నీసన్నిధిని, పరమపదాన్ని పొందడానికి, ఓస్వామీ, మా స్త్రీలతోను, మా సంతానంతోను, మాకుగల సర్వసంపదలతోను, నిన్నే శరణుపొందుతున్నాము.' ఈ వేదవాక్యంవలన ముముక్షువగు మానవుడు తనసర్వస్వాన్ని భగవదర్పణం గావించి శరణాగతి చేయవలెననే ఉపాయం ఉపదిష్టమైంది.

**'యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్'**(గీత) ఎవరెట్లు నన్నుపాసిస్తారో వారికి నేనట్లే ఫలప్రాపకుడనవుతాను.

మహేశ్వరుడు ప్రథమవిష్ణుభక్తుడని ప్రఖ్యాతి. ఈశ్వరుని ప్రథమ భాగవతోత్తమునిగా వైష్ణవులు భావిస్తారు. ప్రహ్లాదాదిభక్తులతో సమానంగా భావిస్తారు. అందుచేత 'హరునకు' రామనామం తారకమైంది అని కవి వక్కాణించినాడు.

శ్రీరామరామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ॥

అని మహేశ్వరుడు తనభార్య పార్వతీదేవికి రామనామాన్ని ఉపదేశించినాడు. ఆ మంత్రాన్ని జపించి ఉమాదేవి భర్తఅనురాగాన్ని పొందింది. అతని అర్ధనారీత్వమును పొందగా మహేశ్వరుడు అర్ధనారీశ్వరుడైనాడు. అందుచేత శివునకు, పార్వతీదేవికి రామనామ మహిమ సంపూర్ణంగా తెలుసు. వారు దానిజపంవల్ల రామమహిమను పొందినారు.

విశిష్టాద్వైత సంప్రదాయానుయాయులకు తిరుమంత్రము పరమపావనమైనది. నారాయణాత్మకమైన ఈ మంత్రాన్ని సాధకుడు ఆచార్యసన్నిధానంలో ఉపదేశం పొందవలసి ఉన్నది. అంతేకాదు. ఆచార్యనామోచ్చారణ నమస్సులతోపాటు, తిరుమంత్రాన్ని ప్రతిదినం, వ్రతాన్ని ఆచరించినవిధంగా ఉచ్చరించవలె. దీనివలన సర్వపాపములూ నాశనం అయి, జన్మరాహిత్యం కలిగిన ముక్తి లభిస్తుందని ఆ సంప్రదాయానుయాయులు విశ్వసిస్తారు.

భగవన్నామములలో అప్రాకృతమైనవి, అతిరహస్యమైనవి, నారాయణ, వాసుదేవ, శ్రీకృష్ణ, గోవింద, శ్రీరామాదినామములు.

నరమనగా ఆత్మ అని అర్థం. దానినుండి ఉత్పన్నమైన ఆకారాదులు నారములు. వాటిలో కారణరూపమున, కార్యరూపంలో వ్యాప్తమై నివసించినవాడు నారాయణుడు.

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః

అని వేదమంత్రం వర్ణిస్తున్నది.

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణశబ్దమేకం విముక్తదుఃఖాః సుఖినో భవన్తి.

పీడితులు, విషాదగ్రస్తులు, భయభీతులు, భయానకరోగబాధితులు, ఒకసారి నారాయణమంత్రం జపిస్తే, సమస్తదుఃఖాలకు దూరమై, సుఖాన్ని పొందుతారు. తిరుమంత్రానికే అష్టాక్షరీమంత్రం అనేది పర్యాయపదం. శ్రీరామనామం అష్టాక్షరీమంత్రంతో సమానమైందనీ, దాన్ని ఉచ్చరించి, జపించి, మహేశ్వరుడు, ఆయనఅర్ధాంగి మహేశ్వరి,రావణసోదరుడైన విభీషణుడు సర్వదుఃఖాలను తొలగించుకొని సుఖాన్ని పొందినారని కవి వక్కాణించినాడు. విభీషణుడు శరణాగతిని పొంది, రాముని అనుగ్రహాన్ని సంపాదించి అందరిలాక్షసులవలెకాక, మృత్యువును తప్పించుకొని, సౌఖ్యాన్ని రాజ్యాన్ని అనుభవించినాడుకదా.

పూర్వం మొసలినోటిలో చిక్కుకొన్న గజేంద్రుని, విష్ణుమూర్తి, ఆత్మబంధువులాగ పరుగెత్తుకొని వచ్చి కాపాడినాడు. ఆ విధంగానే జడరూపంలో ఉండిన అహల్యాదేవికి, శాపవిమోచనం కలిగించి, ఆమెకు అతిలోకమైన పూర్వరూపం ప్రసాదించినాడు.

అహల్యావృత్తాంతం వాల్మీకిరామాయణంలో ఉన్నది. గౌతముని ఆశ్రమంలో ప్రవేశించిన రామలక్ష్మణులకు జడరూపంలో ఉన్న అహల్య, 'పొగ క్రమ్మిన అగ్నిశిఖవలె, మంచు మబ్బులతో నిండిన పూర్ణచంద్రునివలె, నీటిలో మధ్యందినభాస్కరకాంతివలె ఎవ్వరికి కనిపించక భస్మీభూతమై పడిఉండిన లావణ్యము' కనిపించినట్లుగా వాల్మీకి వ్రాసినాడు.

ఇంక ద్రౌపదివృత్తాంతము. ధర్మరాజు కౌరవులతో ఆడిన జూదంలో రాజ్యాదికాలను, సోదరులను ఓడిపోయినాడు. భార్యనుకూడ కోల్పోయినట్లే అయింది. దుష్టులైన కౌరవులు ద్రౌపదీదేవికి అవమానం చేయవలెననే తలంపుతో, దుశ్శాసనుడు ఆమెను సభకు, ఏకవస్త్రగా ఈడ్చుకొని వచ్చినాడు. ద్రౌపది ధరించిన వస్త్రాలను హరింపుమని దుర్యోధనుడు దుశ్శాసనుని ఆదేశించాడు. దుష్టుడు దుశ్శాసనుడు ద్రౌపదివస్త్రాలను హరిస్తూఉంటే ఆమె శ్రీహరిని రక్షింపుమని ప్రార్థించింది.ఆయనఅనుగ్రహం చేత 'ఒలువంగఁబడియు మున్నుపనీతమైన తద్వస్త్రంబు నట్టివలువ లలతాంగి జఘన మండలమున బాయక యొప్పుచు'నుండె. ఈ విధంగా పరమాత్ముని అనుగ్రహంచేత ఆమెకు సభలో అవమానం తప్పింది. అందుచేత, విష్ణుస్వరూపుడైన శ్రీరాముడు ఆమెకు చుట్టమేకదా.

శ్రీరామనామం, తన నాలుకమీద, ఎల్లప్పుడు నటింపచేయుమని తన ఇష్ట దైవాన్ని కవి ప్రార్థిస్తున్నాడు. ఇక్కడ ఒక విశేషం ఉన్నది. విశిష్టాద్వైతసంప్రదాయానుయాయులు సర్వదా నారాయణధ్యానం చేయవలసి ఉన్నది. వారు సర్వకాలసర్వావస్థలలో నారాయణనామాత్మకమైన 'ద్వయ'మంత్రాన్ని జపిస్తూ ఉంటారు. అంటే మనస్సులో మననం చేసుకొంటూఉంటారు. శ్రీరామనామంకూడ తత్తుల్యమే కాబట్టి, ఆపేరును తననాలుకపై ఆడేటట్లు చేయుమని కవి ప్రార్థించడం సముచితమే.

**16.ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట నిల్చినవేళ, రోగముల్**
**గొప్పరమైనచో గఫము కుత్తుకనిండినవేళ, బాంధవుల్**
**గప్పినవేళ, మీస్మరణ గల్గునొ, గల్గదొ నాటికిప్పుడే**
**తప్పక చేతు మీభజన, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : ముప్పునన్ = ముసలితనమునందు, వార్ధక్యంలో, కాలకింకరులు = యమదూతలు, కాలుడంటేయముడు, అతనిసేవచేసే సేవకులు, రోగములు = తెవుళ్లు,

కొప్పరము=అధికం, అతిశయం, అయినచోన్ = అయినప్పుడు, కఫము = శ్లేష్మము, తెమడ, కుత్తుకన్ = కంఠములో, నిండినవేళన్ = వ్యాపించి, పూర్ణమై ఉండిన సమయంలో, బాంధవులు = చుట్టములు, కప్పినవేళన్ = క్రమ్ముకొన్నప్పుడు, చుట్టుముట్టుకొన్నప్పుడు మీస్మరణ = మిమ్ముస్మరించడం, జ్ఞప్తికి తెచ్చుకోవడం, కల్గునో కల్గదో = సంభవమవుతుందో, కాదో (సందేహం), నాటికి = భవిష్యత్తుకోసం, ఇప్పుడే = ఇదే సమయంలో,వర్తమానంలో, తప్పక = విడువక, మీ = రాముడైన మిమ్ములను. భజనం = సేవించుట, భజించుట = చేతును = ఆచరింతును.

తా: ఓ దశరథరామా, నాకు వార్ధక్యమేర్పడి (ముసలితనం వచ్చి) నప్పుడు నేనున్న చోటికి మరణసమయంలో యమదూతలు వచ్చినప్పుడు, రోగములు అతిశయించినప్పుడు, అంతిమసమయంలో గొంతులో శ్లేష్మము (=తెమడ) నిండియున్నప్పుడు, చివరిక్షణాల్లో బంధువులు చుట్టుముట్టుకొని ఉన్నప్పుడు, మిమ్ములను నేను స్మరించడం సంభవిస్తుందో లేదో. అంటే అవయవాలు స్వాధీనంలో లేనప్పుడు భజన చేయడం సాధ్యం కాదని భావం. అందుచేత, ఇప్పుడే నిన్ను తప్పక సేవింతును, భజన చేతును.

వ్యా: శతకకవులు చాలమంది కవిత్వం వ్రాసేటప్పుడు ఆత్మాశ్రయంగా వ్రాయడం ఉన్నది. కవి తన అనుభూతులను, ఇతరులఅనుభూతులకు సరిసమానంగా చెప్పగా, పాఠకులకు, కవిలాంటి అనుభూతి కలిగితే దాన్ని ఆత్మాశ్రయత్వమని విమర్శకులు భావిస్తారు. కవి తనవృత్తాంతం చెప్పుతూనే ఇతరుల వృత్తాంతం చెప్పినట్టి నేర్పు ఇది. ఇక్కడ కంచెర్ల గోపన్నగారు,తాను వృద్ధుడై, తనకు అంతిమ సమయం ఆసన్నమైనప్పుడు, తన ఇష్టదైవమయిన శ్రీరాముని భజనచేయడానికి, నామస్మరణ చేయడానికి అవకాశం ఉంటుందో లేదో అని సందేహించి, ఆ సేవ ఇప్పుడే, అంటే అవయవాలు స్వాధీనంలో ఉన్నప్పుడే చేస్తాను అని తన స్థితిని పరమాత్మునికి నివేదిస్తున్నాడు.

లోకంలో ఉండే మనుష్యమాత్రులకు, వార్ధక్యం రావడం రోగాలు అధికం కావడం, చుట్టాలు చుట్టుముట్టడంవంటి పరిస్థితులు అందరికి ఏర్పడుతాయి. అటువంటి సమయంలో భగవద్ధ్యానం చేయడం సాధ్యం కాకపోవడంకూడ సహజమే. కవిగారి ఈ అనుభవాన్ని పాఠకులు తమ అనుభవంగాభావించి ఆత్మాశ్రయత్వ-అనుభూతిని పొందుతు ఉన్నారు. కవి, ముందుగానే జాగ్రత్తపడి, ఇప్పుడే శ్రీరామభజన చేస్తానని చెప్పడంలోను పరమార్థం ఉన్నది. మీకందరికి వార్ధక్యం వస్తుంది. రోగాదులు చుట్టుకొని అనిశ్చితస్థితి ఏర్పడుతుంది. అప్పుడు భగవంతుని ధ్యానించడం సాధ్యపడదు. అందుచేత దేహంలో శక్తి ఉన్నప్పుడే ఈశ్వరధ్యానం చేయండి అని ధ్వనిప్రధానంగా సూచిస్తున్నాడు కవి. తనగోడు వినిపిస్తూనే ఇతరులకు ప్రబోధంచేసే రమణీయపద్ధతి ఇది.

గోపన్నకవి ఈ పద్యం వ్రాస్తూ ఉన్నప్పుడు ముకుందమాలలోని ఈ శ్లోకం వారి మనస్సులో మెదలి ఉంటుంది :

కృష్ణ త్వదీయపదపఙ్కజపఞ్జరాన్త మద్యైవ మే విశతు మానసరాజహంస:
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తై: కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే॥

దీనికి తెలుగు సేత.

కృష్ణ! ఇపుడె త్వత్పాదపంకేజపంజరమ్ము నాచిత్త రాజహంసమ్ము చొరుత.
మిత్తి దరియంగ, కఫవాతపిత్తములొగి గళము మూయంగ నీస్మృతి కలుగుటేడ.

ముకుందమాల అనే విష్ణుభక్తికావ్యాన్ని రచించినవారు శ్రీకులశేఖరాళ్వార్. విశిష్టాద్వైత సంప్రదాయానికి, వైష్ణవభక్తితత్త్వానికి ఈ స్తుతికావ్యం ఊటబావివంటిది. కులశేఖరులు రాజకవి. కేరళదేశాధీశ్వరుడు. శ్రీవేంకటేశ్వరునికి పరమభక్తుడు. రామాయణంలో జనకమహారాజులాగా జీవన్ముక్తుడైన రాజయోగి. నాలాయిర ప్రబంధంలోని మొదలాయిరంలోనూటఅయిదు పాశురములు గల పెరుమాళ్ తిరుమొళి కులశేఖరుల మరియొక రచన. ముకుందమాలప్రభావం సంస్కృతంలో లీలాశుకుడు రచించిన శ్రీకృష్ణకర్ణామృతం అనే గ్రంథంపై కనిపిస్తుంది. ముకుందమాలలోని, 24,25 శ్లోకాలైన మంత్ర, ఔషధశ్లోకాలు శ్రీకృష్ణకర్ణామృతంలోను కనిపిస్తాయి. శ్రీవైష్ణవభగవద్భక్తుడుగా పేరొందిన కులశేఖరులు పన్నిద్దరాళ్వారులలో ప్రశస్తమైనవాడు. విష్ణుమూర్తి ధరించే కౌస్తుభమణిఅంశగా ఈ భక్తకవి జన్మించినట్లుగా వైష్ణవులు భావిస్తారు. భక్తిసాహిత్యానికి ముకుందమాల కౌస్తుభమణివంటిది. అందుచేతనే కులశేఖరులపేరు ముకుందమాలవలననే లోకంలో వ్యాప్తిచెందింది. భారతదేశమంతటా ఈ భక్తిగ్రంథానికి ప్రశస్తి ఉన్నది. కులశేఖరచక్రవర్తికవితాప్రతిభ అనన్యంగా ఉండడమే దీనికి కారణం. నాలాయిరదివ్యప్రబంధంలో పెరుమాళ్ తిరుమొళికికూడ ఖ్యాతి ఉన్నది. ఇంతటి ముఖ్యమైన ముకుందమాలనుండి కంచెర్లగోపన్నభావాలను గ్రహించడం, ఆయనకు గల సంప్రదాయాభిజ్ఞతను స్పష్టం చేస్తున్నది.

ముప్పు అనేమాటకు, కష్టము, ఆధివ్యాధులు అనే అర్థాలున్నాయి. మరణమాసన్నమైనప్పుడు జీవికి కష్టకాలం వచ్చినట్లేకదా. మానసికమైన వ్యాధిని ఆధి అంటారు. శారీరకమైన రోగాన్ని వ్యాధి అంటారు. ఈ రెండు గాని,వీటిలో ఒకటి గాని దాపురించినప్పుడు మరణం సంభవిస్తుంది. ఈ అర్థాలనన్నింటిని యోచించియే కవి ముప్పు అనే శబ్దప్రయోగం చేసి ఉంటారు.

కాలం-అంటే నల్లనిది. కాలం అంటే సమయం, కాలం అంటే మృత్యువు. సమయాన్ని అనుసరించి మృత్యువు నల్లగా (అశుభ్రంగా) వస్తుందని కాబోలు దానికి ఆ పేరు

వచ్చింది. మృత్యువే యముడు కాబట్టి కాలం అంటే యముడనికూడ అర్థం. యముడు దూతలను పంపించి మానవులప్రాణాలను హరింపచేస్తాడని భారతీయులవిశ్వాసం. అజామిళుడు మొదలైనవారికథలు మనకు పురాణాల్లో కనిపిస్తాయి.

ముంగిలిఅంటే (ముంగల+ఇల్లు) అంకణము, మధ్యప్రదేశము అనే అర్థాలున్నాయి. ముంగిటికల్పభూరుహము అనే ఆముక్తమాల్యదాకావ్యప్రయోగము. ముంగిలి అనే దానికి 'టి' అనే ఔపవిభక్తికం చేరితే ముంగిట అనే అర్థం వచ్చింది. ముంగిట రావడం అనేది తెలుగుజాతీయం-సమీపంగా, సన్నిహితంగా రావడం అని భావం. అంత్యసమయంలో కాలకింకరులు ఇంట్లోకి ప్రవేశించినారు అని కవిభావం.

కఫవాతపిత్తములు అనేవి శరీరంలోనిఅంశములు అని ఆయుర్వేదంలో ఉన్నది. 'కఫాపచయాదారోగ్యైకమూలమాశయాగ్నిదీప్తి' అని శాస్త్రము. గొంతులో కఫం తట్టుకొన్నప్పుడు శ్వాసకోశం నిండిపోయి మరణమాసన్నమవుతుందని వైద్యనిదానం.

వ్యాధిగ్రస్తుడైనవాడు, మరణిస్తాడు, తమను వీడిపోతాడు అని దుఃఖించే ఆప్తులు కొంతమంది. అతడు మరణిస్తే, ఆస్తిపాస్తులు ఇతరులను గ్రహించనీయక ఆక్రమించడానికి వచ్చే బంధువులు కొంతమంది. వీరందరు అతన్ని చుట్టుముట్టుతారు. అటువంటి సమయంలో వారిని చూడడానికే సరిపోతుంది. కాని, రామస్మరణకు అవకాశం ఏది?

నవవిధభక్తులలో స్మరణ అనేది ఒకటి. శ్రవణము, కీర్తనము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అనేవి ఇతరములు. ప్రాణికి మృత్యువాసన్నమైనప్పుడు ఇవి యేవియు సాధ్యము కావని కవిభావము.

కీర్తనమే భజనకు పర్యాయపదము. రామదాసుగా ప్రఖ్యాతి పొందిన గోపన్నగారికి కీర్తనమన్నా, భజనయన్నా మక్కువ.

**17.చ. పరమదయానిధే పతితపావననామ, హరే యటంచు సు**
**స్థిరమతులై సదా భజనచేయుమహాత్ములపాదధూళి నా**
**శిరమునఁ దాల్తు మీరటకుఁ జేరకుఁడంచు యముండు కింకరో**
**త్కరముల కానబెట్టునట, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : పరమ = మిక్కిలి, అధికమైన, దయా = కరుణకు, నిధే = నిధానమైనవాడా, పతిత = పాపాత్ములను, అడుగున పడినవారిని, పావన = పవిత్రులనుగాజేసే, నామ = పేరు గలవాడా, హరే = శ్రీహరీ, విష్ణుమూర్తీ, అటంచున్ = అనుచు, సదా = అన్ని సమయాల్లో ఎప్పుడు, సుస్థిర = మిక్కిలి నిలకడగల, సంచలనములేని, మతులై = మనస్సు, బుద్ధి గలిగినవారై, భజన = భజించుట, కీర్తించుట, చేయు మహాత్ముల =

చేయునట్టి గొప్పవ్యక్తులయొక్క, పాదధూళి = అడుగులదుమ్ము, నాశిరమున = నాతలపై, తాల్తున్ = ధరిస్తాను. మీరు, అటకు = అక్కడికి, వారిదగ్గరకు, చేరకుఁడు+అంచు =వెళ్లవలదు అంటు, యముండు = మృత్యుదేవత, కింకర+ఉత్కరమునకున్ = సేవకులసమూహానికి, దూతలగుంపునకు, ఆనబెట్టునట = ఆజ్ఞాపిస్తాడట. నిర్బంధిస్తాడని చెప్పుతారు.

తా: దయాగుణానికి పాతరవంటి ఓ దశరథరామా, అడుగునపడిన పాపాత్ములను ఉద్ధరించి పవిత్రులను చేసే పేరు ప్రఖ్యాతి కలిగిన ఓ రామా, హరీ అని ఎల్లప్పుడు, మిక్కిలి నిలకడ కలిగిన మనస్సుగలవారలు, అనగా చంచలత్వము లేని మనస్సు గలవారలు, నిన్ను భజించుమహనీయులపాదధూళిని నాతలపై ధరింతును. దానివలన, మీరు అట్టివారి యొద్దకు, వెళ్లవద్దని మృత్యుదేవత యైన యముడు, తన సేవకులను ఆజ్ఞాపిస్తాడని చెప్పుదురు. అనగా, విష్ణునామ సంకీర్తన చేసేవారిని స్మరించి, వారిపాదాలకు నమస్కరించేవారిని సమీపించడానికి మృత్యువుకూడ భయపడుతుందని కవిభావము.

వ్యా: శ్రీకులశేఖరాళ్వార్లు రచించిన ముకుందమాల అనే భక్తికావ్యంలో ఇట్లా ఉన్నది.

*మజ్జన్మ ఫలమిదం మధుకైటభారే మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ ।*

*త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్యభృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ॥*

దీని తెలుగు అనువాదం:

*వాసిగ నాదుజన్మ ఫలవంతము దాననె కైటభారి, నా*

*కాసపడంగఁ దగ్గదిది యందఁగఁ దగ్గదియైన నిద్ధి నీ*

*దాసునిదాసదాసునికి దాసునికాతని దాసుఁడైన యా*

*దాసుని దాసుఁడంచు జగదాశ్రయ, నీమది నన్ దలంపుమా*

విశిష్టాద్వైతసంప్రదాయంలో భాగవతసేవ అనేది ఒక ముఖ్యభాగం. భాగవతులు, అంటే భగవద్భక్తులు. ఆ భగవద్భక్తులైనవారిని సేవిస్తే, నారాయణుని సేవ చేసినట్లే, నారాయణుని తృప్తిపరచినట్లే అని వైష్ణవులు భావిస్తారు. మహేశ్వరుడు ప్రథమభాగవతోత్తముడనికదా ప్రతీతి. అటువంటిమహేశ్వరుని సదా ధ్యానించి మార్కండేయుడు మృత్యువును తప్పించుకొన్నకథ జగత్ప్రఖ్యాతమైంది కదా.

విష్ణుభక్తులకు సేవచేసినవారిని యమకింకరులు సమీపించరు అని కవి చెప్పడం ఇటువంటి ఐతిహ్యాన్ని మనస్సులో పెట్టుకొన్నదే. కులశేఖరాళ్వార్లు భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య-భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ అనడంకూడ ఇటువంటి భావాన్నే సూచిస్తుంది. వైష్ణవులు తమకు మంత్రోపదేశం చేసిన ఆచార్యులను పరమోత్తముడుగా

భావించి, ఆయనను, భాగవతోత్తముడని సంభావిస్తారు. ఆయన పాదములను అనునిత్యం సేవిస్తారు. అట్లా చేయడంచేత వారికి అపమృత్యువు కలుగదని విశ్వాసం. ఇది సామాన్యులకే సీమితం కాదు. పన్నిద్దరాళ్వారుల్లోఒకడైన విప్రనారాయణస్వామి, ఈ సిద్ధాంతాన్ని త్రికరణశుద్ధిగా విశ్వసించి, తనపేరును మార్చుకొని తొండరడిప్పొడియాళ్వార్ అని పెట్టుకొన్నాడు. తొండర్ అనగా భక్తులు, అడి అంటే పాదాలు, పొడి అంటే ధూళి. భక్తుల పాదధూళి అనేది ఆ పేరుకు (అర్థం.) దీనినే సంస్కృతీకరించి 'భక్తాంఘ్రిరేణుఆళ్వారులు' అని ప్రఖ్యాతి కలిగింది ఆయనకు.

భక్తులసేవించేవారి దగ్గరకు, వైష్ణవుల సమీపమునకు యముడు తనకింకరులను రానీయడనేదానికి అజామీళునికథ ఉదాహరణగా చెప్పవచ్చు. అజామిళుడనే వాడు మరణాసన్నసమయమైనప్పుడు 'నారాయణ'నామాన్ని యాదృచ్ఛికంగా ఉచ్చరించినాడట. దానివలన యమదూతలకు ఆటంకం, విష్ణుదూతలకు ప్రవేశం కలిగింది. యమదూతలు తిరిగివచ్చి యమధర్మరాజుతో తమపరాభవాన్ని చెప్పుకొన్నారు. విష్ణుదూతలవాదన వినిపించినారు. అంతా విని యముడు విష్ణుభక్తుల జోలికి పోవద్దని వారికి హితవు చెప్పి విష్ణుదూతల దర్శనమైనందుకు వారి అదృష్టాన్ని మెచ్చుకొని ఇట్లా అన్నాడు.

*తే దేవసిద్ధపరిగీతపవిత్రగాథా*
*యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః*
*తాన్ నోపసీదత హరేర్గదయాభిగుప్తాన్*
*నైషాం వయమ్ న చ వయః ప్రభవామ దండే*

శ్రీమద్భాగవతమ్-6-3-27

సమదర్శనులు, ప్రపన్నులు అయినవారు భగవంతుని తమకు సాధ్యంగాను, సాధనంగాను భావించి భగవంతునిపై తమభారమంతా మోపి, నిశ్చింతగా ఉంటారు. పెద్ద పెద్ద దేవతలే, సిద్ధపురుషులే వారి పవిత్ర చరిత్రను గానం చేస్తూ ఉంటారు. ఓ దూతలారా, అలాంటివారి దగ్గరకు మీరు పొరపాటునైనా పోవద్దు. వారి యొద్ద భగవంతుని గదాయుధం ఉండి, సదా వారిని రక్షిస్తుంది. అట్టివారిని దండించడానికి నాకు సాధ్యంకాదు సరికదా, సాక్షాత్తు మహాకాలునికి కూడ సామర్థ్యం లేదు. ఇటువంటి ఐతిహ్యాలు కూడ కవి స్మరించి ఉంటాడు ఈ పద్యం వ్రాసేసందర్భంలో.

(శ్రీ విష్ణుపురాణంలోని యమగీత 3.7.14-35 కూడా దీని కాధారం కావచ్చు.)

'పరమదయానిధే, పతితపావననామ, హరే' అనేసంబోధనల్లో కవి సార్థకభావాలను ఉల్లేఖించినాడనిపిస్తుంది. ఈ సందర్భంలో ఈ ఉదాహరణ సముచితంగా ఉండవచ్చు.

దండకారణ్యంలో సీతాలక్ష్మణులతో ప్రవేశించిన శ్రీరామునికి బ్రహ్మలోకానికి వెళ్లడానికి సిద్ధంగా ఉన్న శరభంగ మహర్షి కనిపిస్తాడు. శ్రీరాముని దర్శనం వలనను, అతనికటాక్షంచేతను శరభంగుడు వైకుంఠం చేరుకొంటాడు. ఈ విధంగా శ్రీరాముని దర్శనమాత్రంచేత శరభంగునికి వైకుంఠప్రాప్తి కలిగింది. అతని శ్రేయస్సును చూచిన ఆశ్రమ ఋషులందరు శ్రీరాముని శరణువేడుతారు.

త్వన్నాథో౽ నాథవద్రామ రాక్షసైర్బాధ్యతే భృశమ్ 3.6.20
పరా త్వత్తో గతిర్వీర పృథివ్యామ్ నోపపద్యతే
పరిపాలయ నస్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ 3.6.20

పరమాత్మనైన నీవు తప్ప రాక్షసులబారినుండి మమ్ములను రక్షించేవేరే గతి లేదు. వారికి శ్రీరాముడు ఈ విధంగా సమాధానం ఇచ్చినాడు.

నైవమర్హథ మాం వక్తుమాజ్ఞాప్యో ౽ హం తపస్వినామ్
కేవలేనాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనమ్॥ 3.6.22
పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టో ౽ హమిదం వనమ్
భవతామర్థసిద్ధ్యర్థమాగతో ౽ హం యదృచ్ఛయా. 3.6.23

తపస్సాధనలో మీబాధను ఎప్పుడు చెప్పినారో అప్పుడే నన్ను ఆజ్ఞాపించిన వారైనారు. మీయోగబాధ్యత ఇకనాదే. అందుచేత, నేను నాకార్యసాధనకోసం దండకారణ్యంలో ప్రవేశిస్తున్నాను, పితృవాక్యపరిపాలన అనే నెపంతో మీరక్షణ కార్యంకొరకే, కోరి అడవులకు వచ్చినాను.

భక్తులు తమసాధన తాము చేసి,కోరితే భగవత్స్వరూపుడైన శ్రీరాముడు వారికోసం ఏమైనా చేస్తాడని స్పష్టమవుతుంది. అందుచేతనే కవివాక్కులో అతడు 'పరమదయానిధి, పతితపావననాముడు హరి'.

పరమసాత్త్వికంగా, అహింసనే సిద్ధాంతంగా గ్రహించి, సత్యాగ్రహాన్నే ఆయుధంగా ఉపయోగించిన గాంధీమహాత్ముడు నిత్యస్మరణీయుడైన శ్రీరాముని ఈ విధంగా భజించేవాడు.

'రఘుపతిరాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్'

**18.చ. అజునకుఁ దండ్రివయ్యు, సనకాదులకుం బరతత్త్వమయ్యు, స**
**ద్ద్విజముని కోటికెల్లఁ గులదేవతవయ్యు, దినేశవంశభూ**
**భుజులకు మేటివయ్యు, బరిపూర్ణుఁడవై వెలుఁగొందుపక్షిరా**
**డ్ధ్వజ, మిముఁ బ్రస్తుతించెదను, దాశరథీ, కరుణాపయోనిధీ.**

దండకారణ్యంలో సీతాలక్ష్మణులతో ప్రవేశించిన శ్రీరామునికి బ్రహ్మలోకానికి వెళ్లడానికి సిద్ధంగా ఉన్న శరభంగ మహర్షి కనిపిస్తాడు. శ్రీరాముని దర్శనం వలనను, అతనికటాక్షంచేతను శరభంగుడు వైకుంఠం చేరుకొంటాడు. ఈ విధంగా శ్రీరాముని దర్శనమాత్రంచేత శరభంగునికి వైకుంఠప్రాప్తి కలిగింది. అతని శ్రేయస్సును చూచిన ఆశ్రమ ఋషులందరు శ్రీరాముని శరణువేడుతారు.

త్వన్నాథో ఽ నాథవద్రామ రాక్షసైర్బాధ్యతే భృశమ్ 3.6.20

పరా త్వత్తో గతిర్వీర పృథివ్యామ్ నోపపద్యతే

పరిపాలయ నస్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ 3.6.20

పరమాత్మవైన నీవు తప్ప రాక్షసులబారినుండి మమ్ములను రక్షించేవేరే గతి లేదు. వారికి శ్రీరాముడు ఈ విధంగా సమాధానం ఇచ్చినాడు.

నైవమర్హథ మాం వక్తుమాజ్ఞాప్యో ఽ హం తపస్వినామ్

కేవలేనాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనమ్॥ 3.6.22

పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టో ఽ హమిదం వనమ్

భవతామర్థసిద్ధ్యర్థమాగతో ఽ హం యదృచ్ఛయా. 3.6.23

తపస్సాధనలో మీబాధను ఎప్పుడు చెప్పినారో అప్పుడే నన్ను ఆజ్ఞాపించిన వారైనారు. మీయోగబాధ్యత ఇకనాదే. అందుచేత, నేను నాకార్యసాధనకోసం దండకారణ్యంలో ప్రవేశిస్తున్నాను, పితృవాక్యపరిపాలన అనే నెపంతో మీరక్షణ కార్యంకొరకే, కోరి అడవులకు వచ్చినాను.

భక్తులు తమసాధన తాము చేసి,కోరితే భగవత్స్వరూపుడైన శ్రీరాముడు వారికోసం ఏమైనా చేస్తాడని స్పష్టమవుతుంది. అందుచేతనే కవివాక్కులో అతడు 'పరమదయానిధి, పతితపావననాముడు హరి'.

పరమసాత్త్వికంగా, అహింసనే సిద్ధాంతంగా గ్రహించి, సత్యాగ్రహాన్నే ఆయుధంగా ఉపయోగించిన గాంధీమహాత్ముడు నిత్యస్మరణీయుడైన శ్రీరాముని ఈ విధంగా భజించేవాడు.

'రఘుపతిరాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్'

**18.చ. అజునకుఁ దండ్రివయ్యు, సనకాదులకుం బరతత్త్వమయ్యు, స**
**ద్విజముని కోటికెల్లఁ గులదేవతవయ్యు, దినేశవంశభూ**
**భుజులకు మేటివయ్యు, బరిపూర్ణుఁడవై వెలుఁగొందుపక్షిరా**
**డ్ధ్వజ, మిముఁ బ్రస్తుతించెదను, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర: అజునకున్ = బ్రహ్మకు, తండ్రివయ్యు = తండ్రివిగానుండి, పితృస్థానమున నుండి, సనకాదులకున్ = విష్ణుభక్తులయిన సనకుడు, సనందనుడు మొదలగువారికి, పరతత్త్వము అయ్యున్ = ఉత్కృష్టతత్త్వము, భగవంతుడు, అయినవాడవు,సత్ = సన్మార్గమున ప్రవర్తించే, మంచిశీలముకలిగిన, పండితులయిన, ద్విజ = బ్రాహ్మణులయొక్క, ముని = మౌనం వహించి తపస్సు చేసేమునులయొక్క, కోటికి= సమూహానికి, ఎల్లన్ = అందరికి, పరదేవతవు అయ్యున్ = శ్రేష్ఠమైన దైవముగాను, దినేశ = సూర్యునియొక్క, వంశము = కులమునందలి, భూభుజాలకున్ = రాజులకు, భూపతులకు, మేటివయ్యు = ముఖ్యుడవై, శ్రేష్ఠుడవై, పరిపూర్ణుడవు అయి, వెలుగొందు = ప్రకాశించు, పక్షి+రాట్+ధ్వజ = పక్షులకు రాజైన గరుత్మంతుని జెండాగా కలిగిన విష్ణుమూర్తీ(శ్రీరామా), మిము=మిమ్ము,ప్రస్తుతించెదను = స్తోత్రంచేస్తాను, పొగడుతాను.

తా: బ్రహ్మకు నీవు తండ్రివి. సనకసనందనాది విష్ణుభక్తులకు నీవు భగవంతుడవు. చక్కని నడవడి కలిగిన బ్రాహ్మణులకు, ఋషులకు, మునులకు ఉత్కృష్టమైన దైవమవు. సూర్యవంశంలో జన్మించి, లోకాన్ని పరిపాలించిన రాజులందరిలో ముఖ్యమైనవాడవు. ఇన్ని మంచి గుణాలు కలిగిన నీవు నిండైనవాడవు. లోపము లేనివాడవు. అట్టి నిన్ను స్తోత్రం చేస్తాను, ఓ దశరథరామా!

వ్యా: భగవంతుని, భక్తుడు సేవించి తరించడానికి కల నవవిధమార్గాలలో. కంచెర్లగోపన్నగారు భక్తుడైన కవి కాబట్టి ఆయన ప్రస్తుతి మార్గాన్ని, (తనకవితద్వారా) అనుసరిస్తానని చెబుతున్నాడు. కీర్తన అంటే గొప్పతనాన్ని వర్ణించడం, వైభవాన్ని వర్ణించిచెప్పడం అనే అర్థాలున్నాయి. కవి తన పద్యాల్లో ఆ పనిని చేస్తానని అంటున్నాడు. ఇంక తన యిష్టదైవమైన రాముడు, ఎంతటి వైభవంకలవాడో క్రమంగా చెబుతున్నాడు.

బ్రహ్మ విష్ణునాభికమలంనుంచి సంభవించినవాడన్నది ప్రసిద్ధమే.

సనకసనందనులు బ్రహ్మమానసపుత్రులు. విష్ణుభక్తులు. దేవతలకంటె అనాదులైనవారు. గొప్ప భాగవతోత్తములు. విష్ణుమూర్తి సాన్నిధ్యంలో ఉండేడివారు. వారెప్పుడు శ్రీహరిని ధ్యానంచేస్తూ ఆయనను పరతత్త్వంగా కొలుస్తూ ఉంటారు.

సచ్ఛీలము అనేది సామాన్యులకైనా, మునిఋషులకైనా, భూషణమే. ద్విజులంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు. జన్మతః వీరుకూడ శూద్రప్రాయులే కాని, ఉపనయనాదిసంస్కారవిశేషంచేత, వారికి ద్విజత్వం, అంటే రెండవ జన్మ వస్తుందని చెప్పబడింది. ముని అంటే మౌనం వహించేవాడు, భక్తుడు, తాపసి అనే అర్థాలున్నాయి. వ్యాసమహర్షి మునియే. వాల్మీకికూడ ముని. బుద్ధుణ్ణికూడ ముని (శాక్యముని) అని

అనడం ఉన్నది. సచ్ఛీలం కలిగిన ద్విజులకు, మునులకు, త్రిమూర్తుల్లో శ్రేష్ఠుడైనవాడు శ్రీహరియే. వశిష్ఠాది మహర్షులు, శ్రీహరిని కొలిచి తరించిన వృత్తాంతాలు సర్వవిదితములే.

దినేశవంశ మంటే సూర్యవంశం. ఈ వంశంలో ఇక్ష్వాకువు, దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, మొదలైనవారు జన్మించి ప్రఖ్యాతి పొందినారు. కాని, శ్రీరామునివలె ఏకపత్నీవ్రతాన్ని, పితృవాక్యపరిపాలననియమాన్ని వహించి లోకకంటకులైన రావణాది రాక్షసులను సంహరించిన కీర్తి మరెవ్వరికి లేదు. అందుచేత కవి సూర్యవంశంరాజుల్లో శ్రీరామునిమేటి అని పేర్కొనడం సముచితంగానే ఉన్నది. పైగా శ్రీరామునికి కలిగిన విష్ణుమూర్తి అవతారమహత్త్వం మరేరాజుకు లేదుకదా.

కవి తన ఇష్టదైవమైన శ్రీరాముని 'పక్షిరాడ్ధ్వజ' అని సంబోధించినాడు. అన్ని సందర్భాల్లో శ్రీరాముని విష్ణుమూర్తిగా భావించినట్లే ఇక్కడకూడ అదేభావం వ్యక్తమైంది. పూర్వం, గరుత్మంతుడు, స్వర్గలోకానికి వెళ్లి ఇంద్రునితో యుద్ధంచేసి, అతనివజ్రాయుధాన్నికూడ లెక్కచేయక అమృతాన్ని తెచ్చి తనతల్లిని దాస్యంనుండి విముక్తి కలిగించినాడు. గరుడునిపరాక్రమాన్ని మెచ్చుకొని విష్ణుమూర్తి అతన్ని తనవాహనంగాను, తనధ్వజానికి లాంఛనంగాను ఉండేవరాలు ప్రసాదించినాడు. అప్పటినుండి విష్ణుమూర్తికి గరుడలాంఛనుడనే ప్రఖ్యాతి కలిగింది.

ఇన్నిగుణాలు కలిగిన భగవంతుడు పూర్ణుడు అని కవి అంటున్నాడు. పూర్ణుడంటే సకలసద్గుణాలు నిండినవాడు అని అర్థం చెప్పవచ్చును. ఈశావాస్యోపనిషత్తులో శాంతిమంత్రం ఇట్లా ఉన్నది.

పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

అది పూర్ణం, ఇది పూర్ణం,పూర్ణంకంటె పూర్ణం గొప్పది. పూర్ణమునకు పూర్ణం తీసివేస్తే పూర్ణమే మిగులుతుంది. ఇది సామాన్యార్థం. కాని తాత్త్వికులు చెప్పే పరమార్థం చూతాము.

సాధకులకున్నసామాన్యభావాన్ని, తత్త్వాన్ని ఈ శాంతిమంత్రం బోధిస్తున్నది. ప్రాణులందరికి అతిసన్నిహితంగా, నిత్యము అనుభవింపబడుతూ తమ ఉనికిని ఆ తత్త్వంతోనే పోల్చుకొని జీవిస్తున్నప్పటికి, సామాన్యంగా మానవులు ఆ తత్త్వాన్ని, అంటే పరబ్రహ్మను దూరంగా ఉన్నట్లు భావిస్తారు. ఆ పరబ్రహ్మ నిండైంది. దానికి లోపంలేదు. దానినుండి ఎన్ని తీసివేసినా మిగిలేది నిండైన పరబ్రహ్మయే. పరమాత్మయే భగవంతుడే. అతడే పూర్ణుడు.

**19.ఉ. పండిత రక్షకుం డఖిల పాపవిమోచను(డబ్జసంభవా**
**ఖండలపూజితుండు దశకంఠవిలుంఠనచండకాండకో**
**దండకళా(ప్రవీణు( డగుతావకకీర్తివధూటికిత్తు( బూ**
**దండలు గాఁగ నాకవిత, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: పండితరక్షకుండు = వేదవేత్తలయిన విద్వాంసులను రక్షించేవాడు, అఖిల = సమస్తమైన, పాప=పాపములనుండి, విమోచనుండు = విడిచిపుచ్చువాడు, అబ్జసంభవ = కమలములో పుట్టిన బ్రహ్మచేత, ఆఖండల = ఇంద్రునిచేత, పూజితుండు = గౌరవించబడేవాడు. ఆరాధింపబడేవాడు, దశకంఠ = పదికంఠములు(=కుత్తుకలు) కలిగిన, విలుంఠ = కొల్లగొనుటచేత, చండ = తీక్షణమైన, కాండ = బాణములుగల, కోదండకళా = విలువిద్యయందు, అస్త్రవిద్యలో, ప్రవీణుడు = నేర్పరియైనవాడు. అను = అనెడు, తావక = నీయొక్క, కీర్తి = యశస్సు అనెడు, వధూటికి = సుందరికి, నా కవిత = నా కావ్యాన్ని, పద్యాలను, పూలదండగాగ = పుష్పహారముగాగ, ఇత్తును = సమర్పింతును.

తా: కరుణా సముద్రుడవైన దశరథరామా, 'పండితులను రక్షించువాడు, సమస్తపాపాలను తొలగించువాడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు వారిచేత పూజింపబడేవాడు, రావణాసురుని తలలు దునుమునట్టి వాడి బాణములు వేయనేర్చిన విలువిద్యయందు నేర్పరియైనవాడు' అనెడు నీ కీర్తికి నా కావ్యమనేపూలదండను సమర్పింతును.

వ్యా: రామదాసు అని ప్రఖ్యాతిపొందిన కంచర్ల గోపన్నగారు, తాను దాశరథీశతకం అనే కావ్యాన్ని శ్రీరామునికి సమర్పణ చేయసంకల్పించి ఈ పద్యం వ్రాసినాడు. ఈ శతకంలో నూటమూడు పద్యాలున్నాయి. ఒక్కొక్క పద్యాన్ని ఒక్కొక్క పుష్పంగా భావిస్తే, ఇది ఒక పూలదండ అయింది. ఈ పద్యాలలో భక్తిభావం పుష్పాల్లో దారంలాగ దీని ఏకీభావానికి కారణమైంది. కవిగారికి తనకావ్యం ఉత్తమమైంది, సుందరమైంది అనే విశ్వాసం ఉన్నది. అందుచేతనే దాన్ని పూలదండలాగ భావించి సమర్పిస్తానని అంటున్నాడు.

భక్తులు తమ యిష్టదైవమైన భగవంతునికి అర్చాపూర్వకంగా పూలదండలు కానుకలుగా సమర్పించడం సంప్రదాయంగా ఉన్నది. పూర్వం పెరియాళ్వారు అనే విష్ణుచిత్తుడు విష్ణుమూర్తికి మాలాకైంకర్యం చేసేవాడు. అంటే పూలచెట్లను పెంచి, వాటిపూలను మాలలుగా కూర్చి విష్ణుమూర్తికి సమర్పించి తనజన్మను సార్థకం చేసికొన్నాడు. విప్రనారాయణుడనే మరియొక ఆళ్వారు (విష్ణుభక్తుడు) కూడ శ్రీరంగేశ్వరునికి మాలాకైంకర్యం చేసేవాడట. కంచెర్ల గోపన్నగారుకూడ విష్ణుభక్తుడే కాబట్టి,

పూర్వభక్తసంప్రదాయాన్ని అనుసరించి తమకావ్యమాలాకైంకర్యాన్ని తనయిష్టదైవానికి చేస్తున్నానని ఈ పద్యంలో శ్రీరామునికి మనవిచేసుకొన్నాడు. విష్ణుచిత్తుడు పెరియాళ్వారు అని ప్రఖ్యాతిని పొందినట్లుగానే కంచెర్లగోపన్న 'రామదాసు' అనే కీర్తిని సంపాదించుకొన్నాడు.

శ్రీరాముడు లోకోత్తరమైన కీర్తిని సంపాదించినాడు. ఇటువంటి కీర్తి ఆయనకు ఏ విధంగా వచ్చింది అని విచక్షణ చేసి ఆయన కీర్తికి కారణమైన కొన్ని సంఘటనలను కవి చెప్పుతున్నాడు. కీర్తిలేనివారికి, ఘనకార్యాలు చేయనివారికి, కానుక ఇవ్వడం నిరర్థకంకదా. ఇంక ఆయన కీర్తికి కారణమయిన సంఘటనలు చూడవలసిందే.

పూర్వం రాజులు చేసేవిధుల్లో కవిపండితులను పోషించడం ఒకటి. కాళిదాసును భోజరాజు, నన్నయభట్టును రాజరాజనరేంద్రుడు, అష్టదిగ్గజకవులను శ్రీకృష్ణదేవరాయలు పోషించినవైనం సర్వలోకవిదితమే. రాజాశ్రయం లభించనికవులు తమజీవితాలను నిరర్థకంగా భావించే కాలమది. 'నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతా' అనే నానుడి ఈ కారణంగానే కలిగి ఉండవచ్చు.

శ్రీరాముడు మహారాజు. ఆయన రక్షణలో అనేకమంది పండితులుండవచ్చును. మనకు తెలిసినంతవరకు వశిష్ఠుడు పరమబ్రహ్మజ్ఞుడు. తాపసి. సుమంతుడు గొప్ప రాజకీయవేత్త, పండితుడే. మరింక చాలమంది ఉండి ఉంటారనడంలో సందేహం లేదు. శ్రీరాముడు దండకారణ్యంలోప్రవేశించినప్పుడు, మునులు, ఋషులు తమకు రక్షణ కల్పించుమని, రాక్షసులనుండి కాపాడుమని ప్రార్థించినారు. ఈ ఋషులందరు పండితులేకదా. (విజ్ఞులేకదా.) వారిని ఆయన రక్షించడంచేత పండితరక్షకుడనే కీర్తి కలిగింది.

శ్రీరాముడు అవతరించిన తరువాత అనేకులకు శాపవిమోచనం కలిగించినాడు. అన్నింటిని మించి నిశ్చలజడరూపంలో ఉన్న అహల్యాదేవికి కలిగినశాపవిమోచనం ఉత్తమోత్తమమైంది. ఆమె అపరాధం చేసి, భర్తృశాపాన్ని పొంది శిలాకృతివంటి జడరూపం ధరించింది. ఆ శాపాన్ని తొలగించి శ్రీరాముడు ఆమెకు తిరిగి పవిత్రవ్యక్తిత్వాన్ని ప్రసాదించినాడు. శ్రీరాముని అనుగ్రహంవలననే పాపాల్లో చిక్కుకొని పోయిన అహల్యాదేవి నిత్యపూజనీయ అయింది.

అహల్యా ద్రౌపదీ కుంతీ తారా మండోదరీ తథా ।
పంచకన్యాః పఠేన్నిత్యం సర్వపాపవినాశనమ్॥

శ్రీరాముడు పాపవిమోచనుడనే కీర్తిని పొందినాడు.

భూలోకంలో ఇదివరకు, హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడువంటిరాక్షసులు పుట్టినారు. వారుకూడ లోకకంటకంగా ప్రవర్తించినారు. కాని, రావణుని పద్ధతి వేరే. అతడు

సామాన్య రాక్షసులవలెగాక పదితలలతో ఇరువది చేతులతో జన్మించినాడు. గరుడగంధర్వయక్షరాక్షసదేవతలవలన మృత్యువులేని వరాలను సంపాదించినాడు. ఇటువంటివాణ్ణి సంహరించడం శ్రీరామునిపని అయింది.

పదికంఠాలు కలిగిన రావణుణ్ణి సంహరించడం, అస్త్రాలతో అతన్ని ఛేదించడం ఒక శ్రీరామునికే సాధ్యమైంది. అందుచేత 'రామబాణానికి' లోకంలో తిరుగులేదనే ప్రఖ్యాతి కలిగింది. శ్రీరాముడు 'దశకంఠవిలుంఠనచండకాండకోదండకళాప్రవీణు'డైనాడు.

**20.ఉ. శ్రీరమ సీతగాఁగ నిజసేవకబృందము వీరవైష్ణవా**
**చార జనంబుగాఁగ విరజానదిగౌతమిగా వికుంఠము**
**న్నారయ భద్రశైలశిఖరాగ్రముగాఁగ, వసించుచేతనో**
**ద్ధారకుఁడైన విష్ణుఁడవు, దాశరథీ, కరుణాపయోనిధీ!**

శ్రీరమ = సంపత్ప్రదయైన లక్ష్మీదేవి, సీతగాఁగ = జనకునికుమార్తెయైన (సీతాదేవి) కాగా, నిజ = నీయొక్క, తనదైన, సేవకబృందము = సేవచేసేవారి సమూహము, భక్తులు, అర్చకులు మొదలైనవారు, వీరవైష్ణవ = వైష్ణవసంప్రదాయాన్ని అనుసరించే, ఆచార = ప్రవర్తనకలిగిన, జనంబుకాఁగన్ = జనులు కాగా, విరజానది = వైకుంఠంలో ఉండేనది, గౌతమిగా = గోదావరికాగా, వికుంఠమున్ = విష్ణుమూర్తి నివాసమైన వైకుంఠము, ఆరయన్ = విచారింపగా, భద్రశైల = భద్రాచలంయొక్క, శిఖర = కొండకొమ్ము, అగ్రముగాఁగన్ = కొనకాగ, వసించు = నివసించు, నెలకొనియుండునట్టి, చేతన = ప్రాణులను, జీవులను, ఉద్ధారకుఁడైన = పైకినెత్తిన, ఉద్ధరించే, విష్ణుఁడవు = విష్ణుమూర్తివి, సాక్షాత్తు విష్ణుదేవుడవు.

తా: భద్రాచలాన్ని కంచెర్లగోపన్నకవి వైకుంఠంగా భావించి వర్ణిస్తున్నాడీపద్యంలో.

ఓదశరథరామా, నీవు పరమపదమందున్న సంపత్ప్రదయైన లక్ష్మీదేవిని ఇచట సీతాదేవిగా చేసికొని, ఆపరమపదంలో ఉండే నీపరివారం ఇచట విశిష్టాద్వైతసిద్ధాంతాన్ని అనుసరించే ఆచార్యజనంగా కొలుస్తూ ఉండగా, అచట ఉండే విరజానది ఇచటి గోదావరిగా ప్రవహించగా, ఆ వైకుంఠమే ఇచటి భద్రాచలంలోని కొండకొమ్ము కొనగా రాణింపగా, నీవు వేంచేసి, ప్రాణులను, జీవులను ఉద్ధరిస్తున్న శ్రీవిష్ణుమూర్తివేకాని, వేరు కావు.

వైకుంఠనగరాన్ని మనస్సులో పెట్టుకొని కవి భద్రాచలాన్ని ఇచట వర్ణిస్తున్నాడు. వైకుంఠనగరంలో లక్ష్మీదేవి ఉంటుంది. *'అలవైకుంఠపురంబులో నగరిలో ఆమూలసౌధంబుదాపల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోత్పల*

పర్యంకరమా' అని కదా. అందుచేత భద్రాచలంలో ఉండే సీతాదేవి రమాదేవియే. వైకుంఠంలో సనకసనందనాదులు, ఆర్యజనులున్నారు. వీరు విష్ణుమూర్తి సాన్నిధ్యంలో ఉంటారు. ఇక భద్రాచలంలోని శ్రీరామునిసన్నిధిలో విశిష్టాద్వైతసంప్రదాయ ప్రవర్తకులున్నారు. ఇతరభక్తజనులు ఉన్నారు. వైకుంఠంలో విరజానది ఉన్నది. భద్రాచలంలో గోదావరినది జీవనదిగా ప్రవహిస్తున్నది. అందుచేత, భద్రాచలం అనే కొండకొమ్ము వైకుంఠనగరంలాంటిదే. ఇక వైకుంఠంలో విష్ణుమూర్తి శ్రీరాముడే. ఇచట ఒకవిశేషం, విశిష్టాద్వైత సంప్రదాయానికి, వైష్ణవసంప్రదాయమని, ఉభయవేదాంతమని నామాంతరాలున్నాయి. ఇక్కడ కంచెర్ల గోపన్నగారు, వైష్ణవాచారముపాటించే విష్ణుభక్తులను 'వీరవైష్ణవాచారజనము' అని పేర్కొన్నాడు. కాని, వీరవైష్ణవసంప్రదాయం, వీరశైవసంప్రదాయంలాగ ఏదీ లేదు. ఇక్కడ వీర అంటే శ్రేష్ఠవాచకంలాగానే గ్రహించవలె గాని, వైష్ణవులలో వీరవైష్ణవులున్నారు అని భావించనవసరం లేదు.

ఈ పద్యంలో ఉపమాలంకారాలు వరుసగా ప్రయోగింపబడినాయి.

ఉపమేయాలు : సీత, సేవకబృందం,
గౌతమి, భద్రశైలం, రాముడు.

ఉపమానాలు : శ్రీరమ, వీరవైష్ణవాచారజనము, విరజానది, వికుంఠనగరం, విష్ణుమూర్తి.

చేతనోద్ధారకుడు అనే విశేషణం, శ్రీరామునికి, విష్ణుమూర్తికి సమానంగా సరిపోతుంది. జీవులను ఉద్ధరించేవాడు నారాయణుడు. ఆయన అనేకఅవతారాలను వహించి, భక్తులపాపాలను తొలగించి, వారికి ముక్తిని కలిగించాడు. శ్రీరాముడు భద్రాచలంలో తన భక్తులకు దర్శనమిచ్చి, వారిని కష్టాలనుంచి కాపాడి వారికి విముక్తి కలిగిస్తున్నాడు. నారదాదివిష్ణుభక్తులు శ్రీమన్నారాయణుని సేవించినవిధంగానే, వైష్ణవసంప్రదాయాను యాయులు భద్రాచలంలో శ్రీరాముని సేవిస్తున్నారు. తరిస్తున్నారు.

వైకుంఠంలో ఉండేసనకసనందనులవలె, భద్రాచలంలో శ్రీరామునిసేవించేకవికూడ అట్టివాడే అనే విశేషం ఈ పద్యం చదివినప్పుడు ధ్వనించక పోదు.

**21.ఉ. కంటి నదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధివాసమున్**
**గంటి నిలాతనూజ నురుకార్ముకమార్గణశంఖచక్రముల్**
**గంటిని మిమ్ము లక్ష్మణుని గంటి, కృతార్థుఁడనైతి, నో జగ**
**త్కంటకదైత్యనిర్దళన! దాశరథీ కరుణాపయోనిధీ!**

ప్ర : జగత్ = లోకాలకు, కంటక = బాధించువారైన,ముల్లువంటివారైన, దైత్య = దితికుమారులైనరాక్షసులను, నిర్దళన = త్రెంపివేయువాడా, సంహరించువాడా,

పర్యంకరమా' అని కదా. అందుచేత భద్రాచలంలో ఉండే సీతాదేవి రమాదేవియే. వైకుంఠంలో సనకసనందనాదులు, ఆర్యజనులున్నారు. వీరు విష్ణుమూర్తి సాన్నిధ్యంలో ఉంటారు. ఇక భద్రాచలంలోని శ్రీరామునిసన్నిధిలో విశిష్టాద్వైతసంప్రదాయ ప్రవర్తకులున్నారు. ఇతరభక్తజనులు ఉన్నారు. వైకుంఠంలో విరజానది ఉన్నది. భద్రాచలంలో గోదావరినది జీవనదిగా ప్రవహిస్తున్నది. అందుచేత, భద్రాచలం అనే కొండకొమ్ము వైకుంఠనగరంలాంటిదే. ఇక వైకుంఠంలో విష్ణుమూర్తి శ్రీరాముడే. ఇచట ఒకవిశేషం. విశిష్టాద్వైత సంప్రదాయానికి, వైష్ణవసంప్రదాయమని, ఉభయవేదాంతమని నామాంతరాలున్నాయి. ఇక్కడ కంచెర్ల గోపన్నగారు, వైష్ణవాచారముపాటించే విష్ణుభక్తులను 'వీరవైష్ణవాచారజనము' అని పేర్కొన్నాడు. కాని, వీరవైష్ణవసంప్రదాయం, వీరశైవసంప్రదాయంలాగ ఏదీ లేదు. ఇక్కడ వీర అంటే శ్రేష్ఠవాచకంలాగానే గ్రహించవలె గాని, వైష్ణవులలో వీరవైష్ణవులున్నారు అని భావించనవసరం లేదు.

ఈ పద్యంలో ఉపమాలంకారాలు వరుసగా ప్రయోగింపబడినాయి.

ఉపమేయాలు : సీత, సేవకబృందం,
గౌతమి, భద్రశైలం, రాముడు.

ఉపమానాలు : శ్రీరమ, వీరవైష్ణవాచారజనము, విరజానది, వికుంఠనగరం,
విష్ణుమూర్తి.

చేతనోద్ధారకుడు అనే విశేషణం, శ్రీరామునికి, విష్ణుమూర్తికి సమానంగా సరిపోతుంది. జీవులను ఉద్ధరించేవాడు నారాయణుడు. ఆయన అనేకఅవతారాలను వహించి, భక్తులపాపాలను తొలగించి, వారికి ముక్తిని కలిగించాడు. శ్రీరాముడు భద్రాచలంలో తన భక్తులకు దర్శనమిచ్చి, వారిని కష్టాలనుంచి కాపాడి వారికి విముక్తి కలిగిస్తున్నాడు. నారదాదివిష్ణుభక్తులు శ్రీమన్నారాయణుని సేవించినవిధంగానే, వైష్ణవసంప్రదాయానుయాయులు భద్రాచలంలో శ్రీరాముని సేవిస్తున్నారు. తరిస్తున్నారు.

వైకుంఠంలో ఉండేసనకసనందనులవలె, భద్రాచలంలో శ్రీరామునిసేవించేకవికూడ అట్టివాడే అనే విశేషం ఈ పద్యం చదివినప్పుడు ధ్వనించక పోదు.

**21.ఉ. కంటి నదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధివాసమున్**
**గంటి నిలాతనూజ నురుకార్ముకమార్గణశంఖచక్రముల్**
**గంటిని మిమ్ము లక్ష్మణుని గంటి, కృతార్థుఁడనైతి, నో జగ**
**త్కంటకదైత్యనిర్దళన! దాశరథీ కరుణాపయోనిధీ!**

ప్ర : జగత్ = లోకాలకు, కంటక = బాధించువారైన,ముల్లువంటివారైన, దైత్య = దితికుమారులైనరాక్షసులను, నిర్దళన = త్రెంపివేయువాడా. సంహరించువాడా.

కరుణాపయోనిధీ = దయాసముద్రుడా, దాశరథీ = శ్రీరామా, నదీతటంబు =గోదావరీ నదీతీరాన్ని, కంటిన్ = చూచితిని, భద్రనగ+అధివాసమున్ = భద్రాచలమనెడు శ్రేష్ఠమైన నివాసస్థానాన్ని, కంటిన్ =చూచితిని. ఇలా + తనూజన్ = భూమికుమార్తెను, సీతాదేవిని, కంటిన్ = చూచినాను. ఉరు = శ్రేష్ఠమైన - (శత్రువులకు) భయంకరమైన, కార్ముక = ధనుస్సును, మార్గణ = బాణములను, శంఖచక్రములు = పాంచజన్యము, సుదర్శనము అనే శంఖ చక్రాలను, కంటిన్ = చూచినాను. మిమ్ము = శ్రీరాముని, లక్ష్మణుని = సోదరుడైన లక్ష్మణాఖ్యుని (రామలక్ష్మణులను), కంటిన్ = చూచితిని, కృతార్థుఁడను = తీరిన కోరిక గలిగినవాడను అయినాను.

తా: లోకహింసకులైన రాక్షసులను నిర్మూలించి, దయాసముద్రుడవై యొప్పుచున్న ఓ దశరథరామా, గోదావరీనదీతీరాన్ని, నీకు శ్రేష్ఠమైన నివాసమైన, నీవు వేంచేసి ఉన్న భద్రాచలమనే పుణ్యక్షేత్రాన్ని దర్శించినాను. భూదేవికుమార్తె అయిన సీతాదేవిని చూచినాను. నీవు ధరించిన గొప్పధనుస్సును, బాణములను కన్నాను. నిన్ను నీ సోదరుడైన లక్ష్మణుని సేవించి ధన్యుడనైనాను. నాకోరికలు నెరవేరినవి.

వ్యా: దాశరథీశతకాన్ని రచించి పాఠకలోకానికి సమర్పించిన కంచెర్ల గోపన్న కవి తాను బహుశా ప్రప్రథమంగా గోదావరీ నదీతీరంలోని భద్రాచలక్షేత్రాన్ని, ఆ క్షేత్రస్వామియైన శ్రీరామచంద్రుని, ఆయన ప్రక్కనున్న సీతాలక్ష్మణులను, స్వామిధరించి యుండిన ధనుర్బాణములను, శంఖచక్రాలను దర్శించిన మనోహరదృశ్యాన్ని ఈ పద్యంలో ఆత్మీయంగా వర్ణించినాడు. ఈ కవి వర్ణించిన భద్రాచల క్షేత్రమెట్టిది? దాని కథానికేతాలేవి? అని ఈ సందర్భంలో ప్రస్తావించడం సముచితంగా ఉంటుంది.

భద్రాచలం గోదావరీనదీతీరంలో రాజమహేంద్రవరానికి ఎగువ ఉత్తరంగా నూరుమైళ్లదూరంలో (160 కి.మీ) అడవిప్రాంతంలో ఉన్న ఒక పుణ్యక్షేత్రం. ఆంధ్రులకు చాల ఆదరపాత్రమైన క్షేత్రంకూడ. గోదావరియెడమఒడ్డున సగం కిలోమీటరు దూరంలోభద్రాద్రిరామాలయం ఉన్నది. మేరుపర్వతుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి పుత్రుని పొంది, అతనికి భద్రుడు అని నామకరణం చేసినాడు. భద్రుడు గౌతమీనదిలో స్నానంచేస్తూ, శ్రీరాముని ధ్యానించి, రామసాక్షాత్కారం పొంది ఆ దేవుడట నివసించునట్లు వరం పొందినాడు. ఆ నాటినుండి ఆ కొండకు భద్రాద్రి అనేపేరు కలిగిందని, భద్రుని కోరికను మన్నించి శ్రీరాముడు అచట నివసించినాడని బ్రహ్మాండ పురాణంవలన తెలియవస్తున్నది.

పూర్వం పోకల దమ్మక్క అనే శబరభక్తురాలికి శ్రీసీతారాములు స్వప్నంలో సాక్షాత్కారమై తమ మూర్తులు భద్రాచలం అనే కొండపై ఉన్నాయని సూచించినారట. దమ్మక్క

సీతారాములపై భక్తితో, ఆ సూచనను అనుసరించి, ఆ విగ్రహాలను కనుగొని, వాటికి ఒక చిన్నమండపం యథాశక్తిగానిర్మించింది. ఆమెకు స్వప్నంలో భవిష్యత్తులో ఒక రామభక్తుడు అక్కడకు వచ్చి ఆలయాన్ని నిర్మిస్తాడు అనే సూచనకూడ శ్రీరాముని అనుగ్రహంతో అందిందట.

క్రీ.శ.1674 ప్రాంతంలో కంచెర్ల గోపన్న అనే వైష్ణవనియోగి బ్రాహ్మణుడు, గోల్కొండను కుతుబ్షాహిరాజు అబుల్ హసన్ తానాషా (1658-1687) పరిపాలిస్తున్న కాలంలో భద్రాచలానికి తహసీల్దారుగా నియుక్తుడైనాడు. గోపన్న ఖమ్మంజిల్లాలోని నేలకొండపల్లె గ్రామవాసి. తానేషా ఆస్థానంలో అక్కన్న మాదన్న అనే అన్నదమ్ములు మంత్రులుగా ఉండినారు. గోపన్న వారి మేనల్లుడు. అతడు భద్రాద్రిలో ఉద్యోగకార్యక్రమం నిర్వహిస్తూనే, సహజంగా రామభక్తుడు కాబట్టి, దమ్మక్కసందేశాన్ని అందుకొని, భద్రాచలంలో రాములవారిని దర్శించి, భక్తిపారవశ్యంతో రామనామసంకీర్తనం చేస్తూ రామాలయనిర్మాణానికి పూనుకొన్నాడు. భక్తులనుండి చందాలు ప్రోగుచేసి నిర్మాణంపనులు చేయాలనుకొన్నాడు. కాని, సమయానికి ద్రవ్యం అందక పోవడంచేత రాచబొక్కసంనుండే నిర్మాణానికి, సంతర్పణలకు ధనం వ్యయం చేసినాడు. దానికిగాను తానాషాభటులతో గోల్కొండకు వెళ్లవలసి వచ్చింది. రాజదండనకు గురియై పండ్రెండేండ్లు కారాగారంలో ఉన్నట్లు తెలుస్తుంది.

రామాయణానికి సంబంధించిన పెక్కు స్థలాలు భద్రాచల ప్రాంతంలో ఉన్నాయి. రావణుడు జటాయువును నరుకగా రెక్కలు పడినచోటు రేకపల్లి అయిందట. అది భద్రాచలానికి 28మైళ్లదూరంలో ఉన్నది. శ్రీసీతారామలక్ష్మణులు నివసించిన పర్ణశాల ఈ క్షేత్రానికి 22 మైళ్లదూరంలో ఉన్నది. ఇక్కడికి నాలుగు మైళ్లదూరంలో ఉష్ణగుండాలున్నాయి. ఆదిశేషుడు నిర్మించిన హోమగుండాలని, యజ్ఞం చేసినచోటు అని చెబుతారు. రామగిరి 44 మైళ్లదూరంలో ఉన్నది. ఇక్కడే శ్రీరాముడు జటాయువుకు అగ్నిసంస్కారం చేసినాడు. సమీపంలో ఉన్న రెండు గుట్టలను వాలిసుగ్రీవుల గుట్టలంటారు.

దమ్మక్క నిర్మించిన మండపంలో శ్రీసీతారామలక్ష్మణుల మూర్తులను దర్శించి పరవశుడై 'కంటి నదీతటంబున బొడగంటిని భద్రనగాధివాసమున్' అని రామదాసు ఈ పద్యం వ్రాసి ఉంటాడు. పరమభక్తునికి తనదైవమైన పరమాత్మ కనిపించినప్పుడు వచ్చే ఆవేశం అంతా ఈ పద్యంలో కనిపిస్తుంది.

రామదాసు కీర్తనల్లోను, ఇటువంటి భావాలుకలిగిన ఒకకీర్తన ఉన్నది.

'కంటి మారాములను కనుగొంటి నేను,'.... అన్నది దానిమొదలు

భక్తుడైనవాడు తనయిష్టదైవాన్ని దర్శించినప్పుడు కలిగే భావం ఇదే. ఈ పద్యము ఆత్మాశ్రయభావ నిబద్ధమై సర్వభక్త సహజంగా భాసిస్తున్నది.

శ్రీరాముడు అరణ్యవాసం చేస్తున్న సందర్భంలో భద్రునికి సాక్షాత్కరించి ఈ కొండపై నివసించి ఉంటాడని భావించవలె. ఎందుచేతనంటే, భద్రాచలంలో ఉన్నవారు కేవలం సీతారామలక్ష్మణులే. భరతశత్రుఘ్నులు కాని, ఆంజనేయస్వామికాని ఆయన సాన్నిధ్యంలో లేరు. బహుశా భద్రాచలంలో వెలిసేనాటికి, సీతావియోగం కలుగలేదు. అందుచేత ఆంజనేయస్వామి సమాగమం కూడా కలుగలేదు.

శ్రీరామలక్ష్మణులవిగ్రహాలు దాదాపు మూడడుగుల ఎత్తుంటాయి. ఇవి పశ్చిమాభిముఖంగా ఉన్నాయి. శ్రీరాముడక్కడ చతుర్భుజుడు. విశేషమేమంటే కుడిచేత శంఖాన్ని ఎడమచేత చక్రాన్ని ధరించి ఉన్నాడు. ఆపన్నరక్షకుడై భద్రుని రక్షించడానికి వచ్చే తొందరలో శంఖచక్రాలను వ్యుత్క్రమంగా ధరించినాడని చెబుతారు. (తొమ్మిదివిధాలుగా ఉండేరాముని అర్చామూర్తులలో ఇది ఒకటి). మిగిలిన రెండు చేతులలో ధనుర్బాణాలున్నాయి. విష్ణుమూర్తి ఆపదలో ఉన్నవారిని కాపాడడానికి *సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపడు'* కదా.

'జగత్కంటక దైత్యనిర్దళన' అని కవి శ్రీరాముని సంబోధించినాడు. లోకానికి కంటకప్రాయంగా ఉన్న రాక్షసులను సంహరించినవాడు శ్రీరాముడు. అందుకే లోకాన్ని కాపాడినవాడు శ్రీరాముడు. అందుచేత ఆయనకు 'జగత్కంటకదైత్య నిర్దళన' బిరుదాన్ని కంచెర్ల గోపన్నగారు ప్రదానం చేయడం అర్థవంతమైందే.

**22.చ. హలికునకున్ హలాగ్రమున నర్థము చేకురుభంగి, దప్పిచే**
**నలమట జెందువానికి సురాపగలో జలమబ్బినట్లు, దు**
**ర్మలినమనోవికారివగు మర్త్యుని నన్నొడగూర్చి నీవయిన్**
**దలపు ఘటింపజేసితివి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : హలికునకున్ = మడి దున్నువానికి, పొలమును వ్యవసాయంకొరకు సిద్ధంచేసే కర్షకునికి హలాగ్రమునన్ = నాగలిమొనయందు - నాగలికొనను కొర్రు అంటారు - కొర్రుకొనకు, అర్థము = ధనము, చేకురుభంగిన్ = లభించినవిధంగా, దప్పిచేన్ = దాహముచేత, అలమటన్ = బడలికను, అలసటను, చెందువానికి = పొందినవానికి, సుర+ఆపగలో = దేవతలనదిలోని గంగానదిలోని, జలము = నీరు, అబ్బినట్లు = లభించినవిధంగా, దుర్మలిన = చెడ్డదైన మాలిన్యము, కాలుష్యము కలిగిన, దోషయుక్తమైన, మనః = మనస్సుయొక్క, వికారిని = వికారముకలవాడను, మనస్సులో సంచలనం

కలిగినవానిని, అగు మర్త్యుని = అయిన సామాన్య మానవుని, నన్ను = కవిని, ఒడగూర్చి = సవరించి, సిద్ధింపచేసి, నీపయిన్ = నీమీద, తలపు = చింతనము, ఘటింపచేసితివి = కలుగచేసితివి - దశరథరామా.

తా: ఓ దయాసముద్రుడవైన దశరథరామా, మడి దున్నుకొని జీవితము గడిపే కర్షకునికి, నాగలికొర్రుకు ధనరాశి తగిలి లభించిన విధంగాను, దాహంతో అలసటచెంది బాధలో ఉన్నవానికి గంగానదిలోని నీరు దొరకినట్లుగాను, మాలిన్యముకలిగి, దోషభూయిష్ఠమైన మనస్సుకలిగిన మానవుడనైన నన్ను చక్కచేసి, నీపయి మనస్సుకలిగించి, భక్తి కలిగించి ధన్యుని చేసితివికదా.

వ్యా: కవి శ్రీరామునిమీద, తనదైవంమీద కృతజ్ఞతతో చెప్పినటువంటి పద్యం ఇది. దీనిలో ఆత్మీయభావం సర్వదా వ్యక్తం అవుతూ ఉన్నది. ఆయనజీవితవిశేషాలు కూడ ధ్వన్యాత్మకంగా కనిపిస్తు ఉన్నవి. దమ్మక్క నిరాడంబరంగా ఏర్పాటు చేసిన మండపంలో ఉండే భద్రాచలరాముని చూసినప్పుడు 'కంటిని భద్రనగాధివాసమున్' అనే పద్యం చెప్పినట్లుగానే, ఆరాముని దర్శించిన తరువాత లోక సామాన్యంగా ప్రభుత్వ-ఉద్యోగంలో ఉండి జీవితం గడిపే కంచెర్ల గోపన్నగారికి జీవితంలో గొప్పమార్పు సంభవించిన అనుభూతి కలిగింది. ఆ అనుభూతిని పురస్కరించుకొనియే ఈ పద్యం వ్రాసి ఉన్నాడు.

దీనిలో తనకు తాను ఉపమేయంగా భావించి, సాధకుడు, భక్తుడు, కవియైన రామదాసు మూడు ఉపమానాలను గ్రహించి తన మనస్సును, దానిలోనిభావాన్ని మనకు అందించేప్రయత్నం చేస్తున్నాడు. మొదటి ఉపమానం హలికుడు అనేది. అదే హాలికుడుఅని రూపాంతరంకలిగింది. నాగలిచేతబట్టి భూమిని దున్నేకర్షకుడు అని దీనిఅర్థం. మడిదున్నేరైతు, సంవత్సరమంతా పనిచేసి చేనును కాపాడి దానిలో లభించినపంటను అనుభవించడం చేస్తాడు. మనదేశంలో రైతులు కేవలం జీవికకొరకే కృషి చేస్తారు. కాని, చాలసందర్భాల్లో సంపదను పొంది అనుభవించే ఆశతో కానేకాదు. అటువంటికాపువానికి, భూమిలో ఇదివరకు గుప్తంగా ఉన్న ధననిధి తన నాగలికొర్రుకు తగిలి లభిస్తే తరతరాలుగా తాము అనుభవిస్తున్న దారిద్ర్యంనుండి విముక్తి కలిగినట్లేకదా. కవికూడ నేలకొండపల్లిలో జన్మించి మేనమామల అభిమానంచేత ప్రభుత్వ - ఉద్యోగం సంపాదించి, జీవితం సామాన్యంగా గడుపుతున్నప్పుడు భద్రాచలంలో శ్రీసీతారామలక్ష్మణులు కనిపించడం, వారిమీద భక్తి కలగడం, అతని జీవితంలో పెద్దమార్పు తెచ్చింది. అందుచేత, బీదవానికి పెన్నిధి లభించినంత సంతోషం కలిగింది. ఐహికమైన

జీవితంలోనుండి, కవి ఆముష్మిక జీవితంలో, భక్తిప్రపూర్ణజీవితంలో అడుగు పెట్టినప్పుడు కలిగిన అనుభూతి అన్నమాట.

కవి తనకు తాను పోల్చుకొన్న రెండవ ఉపమానం దాహంచేత అలసిపోయినస్థితి. దాహం అంటే తాపము, నీటిని కోరేస్థితి అనేవి సామాన్యార్థాలు. దాహం కలిగినవారికి సమయానికి నీరు లభించకపోతే ప్రమాదం సంభవించే అవకాశం లేకపోలేదు. ఇక్కడ దాహం అన్నప్పుడు మానవునికి కలిగే ఆశ, ఆసక్తి అనేవి సంకేతార్థాలు. మనుష్యుడు లోకంలో ఎన్ని సంపదలను పొందినా, వాటిమీద ఇంకా ఆశపెరుగుతుంది. తాత్త్వికులు ఈ ఆశను మూడు విధాలుగా చెప్పినారు. ధనేషణ, దారేషణ, పుత్రేషణ అని. ఇవి నిరంతరం దుఃఖాన్ని, బాధలను కలిగిస్తాయి తప్ప రవంత సుఖాన్ని ప్రసాదించవు అని తాత్త్వికుల భావన. ఈ ఈషణత్రయంనుండి విముక్తి కలగాలంటే, మానవుడు ఆధ్యాత్మిక చింతనను అలవరచుకోవడంకంటే మార్గాంతరం లేదు. ఇటువంటి దప్పి కలిగినవారికి గంగాజలం లభిస్తే ఎంత సుఖంగా ఉంటుందో, ఆశల్లో చిక్కుకొన్నవారికి రామభక్తి అటువంటి సౌఖ్యాన్నే ప్రసాదిస్తుందని, అనుభవపూర్వకంగా కవి వక్కాణించినాడు. ఉద్యోగంలో ఉండే ఆశలు, బాధలు నిత్యం దప్పిగొన్న ప్రయాణికునివంటి స్థితిని గోపన్నగారికి కలిగిస్తే భద్రాచలరామునిపై భక్తి వహించి ఆ దప్పిని పోగొట్టుకొని, గంగాజలం గ్రహించినవానివలె సౌఖ్యాన్ని అనుభవించినానని చెపుతున్నాడు.

కవి సామాన్యమానవుడు. మంత్రిపదవిలో ఉండిన మేనమామల అనుగ్రహంచేత ఉద్యోగం సంపాదించినవాడు. ఆ ఉద్యోగంలో ఎన్నో సాధక బాధకాలను అతడు ఎదుర్కొనడం సహజమే. దానివలన ఎంతటి సాత్త్వికుడైనా, మనసుమలినం కావడంకూడ అసహజమేమి కాదు. కాని, ఉద్యోగవిధినిర్వహణలో నిత్యజీవితాన్ని గడపడంలో తనమనస్సుకు వికారం కలిగిందని, తన వ్యక్తిత్వానికి మాలిన్యం సంభవించిందని తెలుసుకోవడమే గొప్ప. ఆ గొప్పతనమే మనకీ కవిలో వ్యక్తమయింది. గోదావరీనదీతటంలోని క్షేత్రంలో శ్రీరాముని దర్శించినప్పుడు తాను సామాన్యమానవునివలె కాక మాలిన్యంనుండి తప్పించుకొన్నానని, దానికి కారణం శ్రీరామునిపై తలపు ఘటించడమని, కృతజ్ఞతాపూర్వకంగా నివేదించుకొన్నాడు. తాను సహజమైన మనుష్యుడను, మాలిన్యం కలిగిన హృదయం కలిగిన వాడను అని తనను తాను మూడవసారి ఉపమించుకొన్నాడు.

ఈ పద్యంలో కవి స్వీయమైన అనుభవం చెప్పినప్పటికి, సామాన్యీకరణం అనే గుణం స్పష్టంగా కనిపిస్తుంది. మానవుడు లోకంలో కర్షకునిలాగ నిరంతరం కృషిచేసి తన దారిద్ర్యాన్ని పారద్రోలుకోవలెనని భావిస్తాడు. కాని గుప్తనిధివంటి భగవదనుగ్రహంలేక,

భగవంతునిపై భక్తికలుగక, అతనికృషి ఫలించదు. మానవుడు లోకంలో ఉండి వివిధమైన సంపదల ఆశకు లోనై దప్పితో బడలిన మనుష్యునిస్థితికి వచ్చి చేరుతాడు. ఊదాహం, ఆ ఆశ తీరవలెనంటే, భగవద్భక్తి తప్ప మరో మార్గంలేదు. ఆ భక్తి లభిస్తే స్వచ్ఛమైన గంగాజలం లభించినట్లే అని కవి వక్కాణించినాడు. మనుష్యుడు పుట్టుకచేత స్వచ్ఛమయినవాడైనప్పటికి, సాంసారికజీవితం సాగించినప్పుడు అనేక దోషాలకు,పాపాలకు గురి అయ్యే అవకాశం ఉంది. ఈ పాపాలనుండి తప్పేమార్గం ఒకటే. అదే భగవద్భక్తి దాని ఒడగూడ్పువలన, సిద్ధివలన సర్వదోషాలు పరిహారం అవుతాయి. కవి తన అనుభవాన్ని వర్ణిస్తూనే, సామాన్యమానవుని స్థితిని ఈ పద్యంలో మనోహరంగా, ధ్వనిపూర్వకంగా నిక్షిప్తంచేసినాడు. లోకంలోని ప్రతిసాధకునిస్థితి ఇటువంటిదే అనే భావాన్ని వ్యక్తం చేసినాడు.

శ్రీమద్భాగవతంలో భక్తివలన భగవంతుని కొలిచేమార్గాలు, మానవుడు తరించే మార్గాలు చెప్పబడినాయి.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥

శ్రీహరిని భక్తితో సేవించడానికి తొమ్మిది మార్గాలున్నాయి. సఖ్యము, శ్రవణము, దాసత్వము, వందనము, సేవ, ఆత్మజ్ఞానము, సంకీర్తన, చింతనం. వాటిని త్రికరణశుద్ధిగా, అంటే, మనోవాక్కాయ కర్మలచేత ఆచరించడంచేత, మానవుడు సజ్జనుడై తరిస్తాడు.

ఈ పద్యంలో ఉపమాలంకారాలను కవి మనోహరంగా ప్రయోగించినాడు.
ఉపమేయాలు - కవి - శ్రీరాముడు.

ఉపమానాలు - హాలికుడు, అర్థము, అలసటచెందువాడు, గంగాజలము, మనోవికారి, ఒడగూర్పు.

ఉపమావాచకాలు : భంగి, అట్లు,

**23.ఉ. కొంజక తర్కవాదమను గుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్**
**రంజిలఁద్రవ్వి కన్గొనవిరామనిధానము, నేఁడు భక్తి సి**
**ద్ధాంజనమందు హస్తగతమయ్యె 'భళీ' యనఁగా మదీయ హృ**
**త్కంజమునన్ వసింపుమిఁక దాశరథీ -కరుణాపయోనిధీ.**

ప్ర : కొంజక = సంకోచింపక, సందేహించక, తర్కవాదము+అను = తర్కశాస్త్రము వలనవివాదము అనే, గుద్దలిచే = వేళ్లు మొదలగునవిపెకలించే సాధనంచేత,పరతత్త్వ = భగవంతుని, దేవుని, భూస్థలిన్ = భూమి అనే స్థలాన్ని,పొలాన్ని, త్రవ్వి = పెల్లగించి-

రంజిలన్ = ఆనందంతో, కన్గొనని = తెలియరాని, దొరకుకొనని, రామనిధానము = శ్రీరాముడు అనే ధననిధి, నేడు = ఇప్పుడు, ఈనాడు -భక్తి = ఈశ్వరుని సేవవలన, సిద్ధ = లభించిన, సిద్ధునివలన లభించిన, అంజనమందు = కాటుకలో, హస్తగతము = చేతికి దొరికింది అయింది. భళీ = సంతోషవాచకము, మెప్పు, మదీయ = నాయొక్క,హృత్కంజమునన్=హృదయమనేపద్మంలో, వసింపుము = నెలకొని ఉండుము.

తా: దశరథరామా, భూమిని గుద్దలి అనేసాధనంచేత, ఎంత త్రవ్వినా కనిపించనినిధి, సిద్ధునివలన లభించిన అంజనముచే, అంటే కాటుకచేత, లభించినవిధంగా, భగవంతునిగూర్చిన తర్కవాదాలచేత ఎంత పరిశీలించినా, వెదకినా అంతుతెలియనిరాముడవగునీవు, భక్తిచేత సులభముగా నాకు వశమయినావు. ప్రశంసాపూర్వకంగా లభించినావు. ఇంక నీవు నా హృదయంలో వసింపుమా.

వ్యా: 1.కొంజు అంటే సందేహించు, సంకోచించు అనేఅర్థాలున్నాయి. ఇది ఆధునిక భాషలో ప్రయోగించబడడం లేదు. ఆంధ్రమహాభాగవతంలో దశమస్కంధంలో ఈ పదమిట్లా ఉపయోగింపబడింది.

*అంజక బాలకుఁడనియును- గొంజక దయమాలి రాజకుంజర యంతన్*
*గుంజరమును డీకొలిపెను- గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్.*

2. తర్కము అనే పదానికి ఊహ, అధ్యాహారము, కారణము, కోరిక, ఒకశాస్త్రము అనే అర్థాలున్నాయి. కారణంమీద వాదించే ఒక శాస్త్రము అని అర్థం గ్రహించవచ్చు. నియమనగ్రంథాన్ని శాస్త్రం అంటారు. దీనిని ఆరురకాలుగా విభజించినారు. 1. తర్కము 2. వ్యాకరణము. 3. ధర్మము. 4. మీమాంస, 5. వైద్యము, 6. జ్యోతిషము.

శాస్త్రబద్ధంగా వాదాలు చేసి భగవంతుని కనుగొనుట సాధ్యం కాదని భావం. పరతత్త్వం అంటే పరమాత్మ - పురుషుడు. పంచవింశతితత్త్వాలు, అష్టప్రకృతులు, షోడశవికారాలు - ఇవన్ని పురుషునిగురించి చెబుతాయి.

భక్తి అంటే సేవ. ఇది ఎనిమిదివిధాలుగా ఉంటుంది. భాగవతవాత్సల్యము, భగవత్పూజ యందనుమోదము, భగవదర్చన, భగవద్విషయమునందదంభము, భగత్కథాశ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగవికారము, సదా భగవదనుస్మరణము, అమాంసభక్షణము.

తర్కవాదాలచేతకాక, పరతత్త్వమైన శ్రీరాముని భక్తిమార్గంచేత కనుగొన్నానని కవి కంచెర్ల గోపన్న ఈ పద్యంలో ఉద్ఘాటించినాడు. భక్తిమార్గం ఎటువంటిది అని పరిశీలించడం ఇక్కడ సముచితంగా ఉంటుంది.

కర్మమార్గము, జ్ఞానమార్గము, భక్తిమార్గము, మోక్షసాధనాలుగాను, పురుషార్థ సాధనాలుగాను, పురాణోపనిషత్తుల్లో చెప్పబడింది.

విధివిహితమైన కర్మానుష్ఠానము భగవదాజ్ఞాపరిపాలనముగా పర్యవసించి, సాధకునకు భగవదనుగ్రహసంపాదకమవుతుంది.

'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే' అని గీతావాక్యం. జ్ఞానయోగం చాల పవిత్రమైంది. దానికి సాటి మరొకటి లేదని గీతలో చెప్పబడింది.

మోక్షప్రాపకాలైన యోగములలో భక్తియోగానికి విశిష్టమైన స్థానం ఉన్నది.

'మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'

అని శాస్త్రోక్తి. లౌకికవిషయాల్లో కలిగే ప్రీతి, ఆసక్తి రతి అనబడే చిత్తవృత్తిని భగవత్పరంగా మరల్చి అతనిలోనే నిల్పినట్టయితే అది భక్తిగా పరిణమిస్తుంది. ఈ భక్తి తైలధారలాగ ఎడతెగకుండా సాగవలె. సర్వేశ్వరుని అఖిలహేయప్రత్యనీకకళ్యాణగుణాలను కీర్తించడం, తల్లీలాదులను స్మరించడం, తన్మంగళమూర్తిని దర్శించడం, దానినర్చించడం, భక్తినిలయించే కృత్యాలు.

'ఆత్మావారే ద్రష్టవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'

అన్న బృహదారణ్యకంలోని వాక్యం ఈ భక్తికృత్యాన్నే వ్యక్తం చేస్తూ ఉన్నది.

యత్కర్మభిర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చ యత్

యోగేన దానధర్మేణ శ్రేయోభిరితరైరపి

సర్వం మద్భక్తియోగేన మద్భక్తో లభతేఞ్జసా

అని భక్తియోగప్రాశస్త్యాన్ని శ్రీమద్భాగవతం వక్కాణించింది. కర్మజ్ఞానాదులగు అనేకసాధనాలచేత క్లేశపడి సాధకుడు ఏది సాధిస్తాడో, అది అంతా భక్తియోగపరుడు అనాయాసంగాను, శీఘ్రంగాను పొందగలుగుతాడు అనేది దీనిభావం.

సర్వపాపాలను పటాపంచలు చేసి, సాధకుని ఉద్ధరించే మహిమ, భక్తియోగానికే ఉన్నదని వ్యాసమహర్షి వచించినాడు.

యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్ ।

తథా మద్విషయాభక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః ॥ (భాగ - 11-14-19)

భగభగమనేమంటలు ఎగసిన అగ్ని కట్టెలను బుగ్గిచేసినట్లుగా, ఓ ఉద్ధవా, నాభక్తి, భక్తుని అన్ని పాపాలను నశింపచేస్తుంది.

కర్మచే ఎట్టిపాపియైనా, జాతిచే ఎంతనికృష్టుడైనా, దృఢమైన భగవద్భక్తి అతన్ని పవిత్రుణ్ణి చేసి ఉద్ధరిస్తుంది. 'అటువంటి భక్తి ఒకటే చాలు. అదే నన్ను తనియిస్తుంది. దానికే నేను పట్టుపడుతాను.' అన్నాడు భగవానుడు తన భక్తుడైన ఉద్ధవునితో.

విధివిహితమైన కర్మానుష్ఠానము భగదాజ్ఞాపరిపాలనముగా పర్యవసించి, సాధకునకు భగవదనుగ్రహసంపాదకమవుతుంది.

'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే' అని గీతావాక్యం. జ్ఞానయోగం చాల పవిత్రమైంది. దానికి సాటి మరొకటి లేదని గీతలో చెప్పబడింది.

మోక్షప్రాపకాలైన యోగములలో భక్తియోగానికి విశిష్టమైన స్థానం ఉన్నది.

**'మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'**

అని శాస్త్రోక్తి. లౌకికవిషయాల్లో కలిగే ప్రీతి, ఆసక్తి, రతి అనబడే చిత్తవృత్తిని భగవత్పరంగా మరల్చి అతనిలోనే నిల్పినట్టయితే అది భక్తిగా పరిణమిస్తుంది. ఈ భక్తి తైలధారలాగ ఎడతెగకుండా సాగవలె. సర్వేశ్వరుని అఖిలహేయప్రత్యనీకకళ్యాణగుణాలను కీర్తించడం, తల్లీలాదులను స్మరించడం, తన్మంగళమూర్తిని దర్శించడం, దానినర్చించడం, భక్తివెలయించే కృత్యాలు.

'ఆత్మావారే దృష్టవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'

అన్న బృహదారణ్యకంలోని వాక్యం ఈ భక్తికృత్యాన్నే వ్యక్తం చేస్తూ ఉన్నది.

మత్కర్మభిర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చ యత్
యోగేన దానధర్మేణ శ్రేయోభిరితరైరపి
సర్వం మద్భక్తియోగేన మద్భక్తో లభతేంజసా

అని భక్తియోగప్రాశస్త్యాన్ని శ్రీమద్భాగవతం వక్కాణించింది. కర్మజ్ఞానాదులగు అనేకసాధనాలచేత క్లేశపడి సాధకుడు ఏది సాధిస్తాడో, అది అంతా భక్తియోగపరుడు అనాయాసంగాను, శీఘ్రంగాను పొందగలుగుతాడు అనేది దీనిభావం.

సర్వపాపాలను పటాపంచలు చేసి, సాధకుని ఉద్ధరించే మహిమ, భక్తియోగానికే ఉన్నదని వ్యాసమహర్షి వచించినాడు.

యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్ ।
తథా మద్విషయాభక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః ॥ (భాగ - 11-14-19)

భగభగమనేమంటలు ఎగసిన అగ్ని కట్టెలను బుగ్గిచేసినట్లుగా, ఓ ఉద్ధవా, నాభక్తి భక్తుని అన్ని పాపాలను నశింపచేస్తుంది.

కర్మచే ఎట్టిపాపియైనా, జాతిచే ఎంతనికృష్టుడైనా, దృఢమైన భగవద్భక్తి అతన్ని పవిత్రుణ్ణి చేసి ఉద్ధరిస్తుంది. 'అటువంటి భక్తి ఒకటే చాలు. అదే నన్ను తనియిస్తుంది. దానికే నేను పట్టుపడుతాను.' అన్నాడు భగవానుడు తన భక్తుడైన ఉద్ధవునితో.

*భక్త్యాహమేకయా గ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియః సతామ్*
*భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకాదపి సంభవాత్॥* భాగ - 11-14-22.

భక్తియోగంతో సమ్మిళితమైందే, ప్రపత్తిమార్గం. సాధకుడు సర్వేశ్వరునికి తన్నుతాను సమర్పించుకోవడమే ప్రపత్తియోగం. దానికే శరణాగతి అని ప్రసిద్ధము అయిన పేరు. ఈ ప్రపత్తినిగురించి వేదము, ఉపనిషత్తులు, ఆగమశాస్త్రం, పురాణములు, మహాభారతంలో భగవద్గీత మొదలైన ప్రామాణికగ్రంథాల్లో ప్రతిపాదితమైంది. బ్రహ్మ, శివుడు, నారదుడు,కపిలాచార్యులు, ప్రహ్లాదుడు, భీష్ముడు, అర్జునుడు మొదలైనవారు దీన్ని అనుష్ఠించినారు. విశిష్టాద్వైత సంప్రదాయానుయాయులై, తత్ర్పచారంచేసిన పన్నిద్దరాళ్వార్లకు భక్తిప్రపత్తిమార్గం జీవగఱ్ఱ.

మధుసూదన సరస్వతి భక్తిరసాయనంలో భక్తియొక్క పదునొకండు భూమికలను నిర్వచించినాడు. వీటిని అతడు భాగవతంనుంచే గ్రహించినాడు.

*ప్రథమం మహతాం సేవా తద్దయాపాత్రతా తతః*
*శ్రద్ధాథ తేషాం ధర్మేషు తతో హరిగుణశ్రుతిః*
*తతో రత్యంకురోత్పత్తిః స్వరూపాధిగతిస్తతః*
*ప్రేమవృద్ధిః పరానందే తస్యాథ స్ఫురణం తతః*
*భగవద్ధర్మనిష్ఠాతః స్వస్మింస్తద్గుణశాలితా*
*ప్రేమ్ణో ఽథ పరాకాష్ఠేత్యుదితా భక్తిభూమికా(?)*

ఈ పదునొకండింటిని అతడు శాస్త్రీయోపాయాలని పేర్కొన్నాడు. శ్రీమత్ భాగవతంలో విభిన్నమైన వారు విభిన్నంగా భక్తిమార్గాన్ని అనుసరించినవిధం చెప్పబడింది.

*కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా*
*సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్*
*బ్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రిం గంటి మెట్లైన ను*
*ద్దామధ్యాన గరిష్ఠుఁడైన హరిఁజెందన్‌వచ్చు ధాత్రీశ్వరా.*

తర్కవాదమనుగుద్దలి-అన్నప్పుడు,
పరతత్త్వభూస్థలిన్-రామనిధానము అన్నపుడు రూపకాలంకారాలు.

**24.ఉ. రాముఁడు ఘోరపాతకవిరాముఁడు, సద్గుణకల్పవల్లికా**
**రాముఁడు, షడ్వికారజయరాముఁడు, సాధుజనావనవ్రతో**
**ద్దాముఁడు, రాముఁడే పరమదైవము మాకని మీయడుంగుఁగెం**
**దామరలే భజించెదను, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : రాముఁడు = రమింపచేసేవాడు, ఆనందం కలిగించేవాడు, ఘోరం = భయంకరమైన, పాతక = పాపములను, విరాముఁడు = తొలగించేవాడు, సద్గుణ = మంచిగుణములనే, కల్పవల్లికా = కల్పవృక్షపుతీగలకు, ఆరాముఁడు = తోటయైనవాడు, స్థానమైనవాఁడు, షడ్వికార = ఉండుట, పుట్టుట, పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, అనే ఆరురకాల వికారాల, జయ = గెలుపుచేత, రాముడు = అందమయినవాడు, మనోజ్ఞమైనవాడు, సాధుజన = మంచివారిని, సజ్జనులను, అవన = రక్షించడం అనే, వ్రత = నియమంచేత, ఉద్దాముఁడు = అధికుడైనవాడు, శ్రేష్ఠుడు, రాముడే = శ్రీదశరథరాముడే, మాకు, పరమదైవమని = పరమాత్మ అని, మీ అడుంగుకెందామరల = మీపాదపద్మాలనే, భజించెదను = స్తుతిచేస్తాను, కీర్తిస్తాను.

తా: సకలజనులను ఆనందింపచేసేవాడు, ఘోరమైన పాపాలను తొలగించేవాడు, కల్పవృక్షం తీగలలాంటి మంచిగుణాలకు ఉద్యానంలాంటివాడు, జన్మ, జర, మొదలైన ఆరుమానవసహజమైనవికారాలను జయించినవాడు, మంచివారిని, సజ్జనులను రక్షించడమనే వ్రతాన్ని ఆచరించడంలో శ్రేష్ఠమైనవాడు, అతడే శ్రీరాముడు. ఓ దశరథరామా అతడే నీవు. అటువంటివాడు మాకు ఉన్నతదైవము, పరమాత్మ అని భావించి, పద్మాల్లాంటి మీపాదాలను కీర్తించి సేవిస్తాను.

వ్యా: ఈ పద్యంలో తనకు పరమాత్మగా భాసించిన శ్రీరాముని భక్తితో స్తుతి చేస్తున్నాడు కవి కంచెర్ల గోపన్న. భక్తిలో నవవిధాలున్నాయి. వాటిలో స్తుతి లేక కీర్తన అనేది ఒకటి. తనభక్తిని వెల్లడించడానికి, తన మనస్సులోని భావాలను నివేదించుకోవడానికి భక్తుడైన కవి ఈ పద్యంలో కీర్తనను మాధ్యమంగా ఉపయోగించుకొన్నాడు. శ్రీరామునిగుణగణాలను వర్ణిస్తూ అతడు 'రాముడు' అంటే రమింపచేసేవాడు అని, పాపాలను పోగొట్టేవాడని, మంచిగుణాలకు స్థానమని, ఆరువికారాలు జయించినవాడని, సజ్జనులను కాపాడే శ్రేష్ఠమైన వ్రతం కలవాడని, అతనిని కొనియాడినాడు. ఇన్ని మంచిలక్షణాలున్న శ్రీరాముడు అతనికి పరమదైవమైనాడు. అందుచే అతని ఎర్రని పద్మాల్లాంటి పాదాలను ఎప్పుడూ భజిస్తానని తనకోరికను వ్యక్తం చేసినాడు.

కవి ఈ విశేషణాలు రామునికి కేవలం ఔపచారికంగాఉపయోగించలేదనే మాట కొద్ది పరిశీలనతో తేల్చిచెప్పవచ్చు.

'రమంతే యోగినో ఽస్మిన్నితి రామః'

దేనియందు యోగీశ్వరులు ఆనందింతురో దానిపేరు శ్రీరాముడు.

*రమంతే యోగినో ఽనంతే నిత్యానందే చిదాత్మని ।*
*ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే ॥*

ప్ర : రాముఁడు = రమింపచేసేవాడు, ఆనందం కలిగించేవాడు, ఘోరం = భయంకరమైన, పాతక = పాపములను, విరాముఁడు = తొలగించేవాడు, సద్గుణ = మంచిగుణములనే, కల్పవల్లికా = కల్పవృక్షపుతీగలకు, ఆరాముఁడు = తోటయైనవాడు, స్థానమైనవాఁడు, షడ్వికార = ఉండుట, పుట్టుట, పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, అనే ఆరురకాల వికారాల, జయ = గెలుపుచేత, రాముడు = అందమయినవాడు, మనోజ్ఞమైనవాడు, సాధుజన = మంచివారిని, సజ్జనులను, అవన = రక్షించడం అనే, వ్రత = నియమంచేత, ఉద్దాముఁడు = అధికుడైనవాడు, శ్రేష్ఠుడు, రాముడే = శ్రీదశరథరాముడే, మాకు, పరమదైవమని = పరమాత్మ అని, మీ అడుంగుకెందామరలే = మీపాదపద్మాలనే, భజించెదను = స్తుతిచేస్తాను, కీర్తిస్తాను.

తా: సకలజనులను ఆనందింపచేసేవాడు, ఘోరమైన పాపాలను తొలగించేవాడు, కల్పవృక్షం తీగలలాంటి మంచిగుణాలకు ఉద్యానంలాంటివాడు, జన్మ, జర, మొదలైన ఆరుమానవసహజమైనవికారాలను జయించినవాడు, మంచివారిని, సజ్జనులను రక్షించడమనే వ్రతాన్ని ఆచరించడంలో శ్రేష్ఠమైనవాడు, అతడే శ్రీరాముడు. ఓ దశరథరామా అతడే నీవు. అటువంటివాడు మాకు ఉన్నతదైవము, పరమాత్మ అని భావించి, పద్మాల్లాంటి మీపాదాలను కీర్తించి సేవిస్తాను.

వ్యా: ఈ పద్యంలో తనకు పరమాత్మగా భాసించిన శ్రీరాముని భక్తితో స్తుతి చేస్తున్నాడు కవి కంచెర్ల గోపన్న. భక్తిలో నవవిధాలున్నాయి. వాటిలో స్తుతి లేక కీర్తన అనేది ఒకటి. తనభక్తిని వెల్లడించడానికి, తన మనస్సులోని భావాలను నివేదించుకోవడానికి భక్తుడైన కవి ఈ పద్యంలో కీర్తనను మాధ్యమంగా ఉపయోగించుకొన్నాడు. శ్రీరామునిగుణగణాలను వర్ణిస్తూ అతడు 'రాముడు' అంటే రమింపచేసేవాడు అని, పాపాలను పోగొట్టేవాడని, మంచిగుణాలకు స్థానమని, ఆరువికారాలు జయించినవాడని, సజ్జనులను కాపాడే శ్రేష్ఠమైన వ్రతం కలవాడని, అతనిని కొనియాడినాడు. ఇన్ని మంచిలక్షణాలున్న శ్రీరాముడు అతనికి పరమదైవమైనాడు. అందుచే అతని ఎర్రని పద్మాల్లాంటి పాదాలను ఎప్పుడూ భజిస్తానని తనకోరికను వ్యక్తం చేసినాడు.

కవి ఈ విశేషణాలు రామునికి కేవలం ఔపచారికంగాఉపయోగించలేదనే మాట కొద్ది పరిశీలనతో తేల్చిచెప్పవచ్చు.

'రమంతే యోగినో ఽస్మిన్నితి రామః'

దేనియందు యోగీశ్వరులు ఆనందింతురో దానిపేరు శ్రీరాముడు.

*రమంతే యోగినో ఽనంతే నిత్యానందే చిదాత్మని ।*
*ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే ॥*

అనంతమైన చిదాత్మయైన ఏ పరంబ్రహ్మంలో యోగీశ్వరులు ఆనందిస్తారో అదియే రామనామము.

*రమతే సర్వభూతేషు స్థావరేషు చరేషు చ*
*అంతరాత్మస్వరూపేణ యశ్చ రామేతి కథ్యతే.*

పరమాత్ముడు నిరాకారరూపంతోస్థావరజంగమాదిసమస్తప్రాణుల్లోరమణమొనర్చడం చేత రాముడైనాడు.

రాముడు తన భక్తులకు, అభిమానులకు ఆనందం కలిగించడం ఆశ్చర్యం కాదు. శూర్పణఖ లక్ష్మణునివలన ముక్కు ఖండింపబడినతరువాత, రక్తమోడుచూ పెద్దపెట్టున ఏడుస్తూ ఖరుడు అనే సోదరునిదగ్గరకు వెళ్లి తన పరాభవాన్ని గూర్చి చెప్పి రామలక్ష్మణులను ఇట్లా వర్ణించింది.

*తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ*
*పుండరీక విశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ॥*
*ఫలమూలాశినౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ*
*పుత్రౌ దశరథస్యైతే భ్రాతరౌ రామలక్ష్మణౌ॥*

శత్రుపక్షంలోని వారినికూడ రమింపచేసేది శ్రీరామునిమూర్తి.

విశ్వామిత్రయాగరక్షణకై అతనివెంట వచ్చి కేవలం పాపం తలపెట్టి యాగానికి విఘ్నం కలిగిస్తున్న రాక్షసులను నిర్మూలించినరాముడు 'ఘోరపాతక విరాముడు'.

శ్రీరాముడు ఎన్ని సద్గుణాలు కల్గినట్టివాడో శ్రీమద్రామాయణమే వర్ణించి చెబుతున్నది.

ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః -ఇత్యాదిగా.

రామాయణంలోని ఇన్ని గుణాలనుచదివి కవి శ్రీరాముని సద్గుణకల్పవల్లికారాముడు అని స్తుతిచేయడంలో ఆశ్చర్యమేమి?

వికారాలు ఆరు అని శాస్త్రం చెబుతున్నది. ఉండుట, పుట్టుట, పెరుగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట అనేవి. ఇవి మానవసహజమైన వికారాలు. శ్రీరాముడు పురుషోత్తముడు కాబట్టి ఈ వికారాలను జయించినవాడే. ఇదికాక, మానవజీవితంలో కామ,క్రోధ,లోభ, మోహ, మద,మాత్సర్యాలు అన్న ఆరు వ్యామోహాలు -వీటినే అంతఃశత్రువులని, అరిషడ్వర్గమని అంటారు. రామాయణంలో వర్ణింపబడిన శ్రీరామునిగుణగణాలు చూస్తే ఈ అరిషడ్వర్గాన్ని, ఈ మహానుభావుడు అవలీలగా జయించి ఉంటాడు. రామాయణం పఠించినప్పుడు, కథానాయకుడైన శ్రీరాముడు కామక్రోధాదులకు లోబడినట్టి సందర్భం మనకు ఒకటి కూడ కన్పించదు. ఆ విధంగా చూచినా, రాముడు షడ్వికారజయ రాముడే.

సాధువులంటే సజ్జనులు, మంచివారు, పండితులు, మునులు, ఋషులు, మొదలైన అర్థాలున్నాయి. శ్రీరాముని గాథయైన రామాయణంలో శ్రీరాముడు చేసినపని సాధుశబ్దానికుండే అర్థంకలవారినందరిని కాపాడడమే. శ్రీరామావతారఉద్దేశ్యమే శిష్టరక్షణ చేయడం అయినప్పుడు ప్రత్యేకసంఘటనల ఉటంకించడం అవసరం కాదేమో.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. (గీత)

ఇటువంటి శ్రీరాముని పరమాత్మగా భావించి ఆయన పాదపద్మాలను కవి కొలువడానికి సంకల్పించడంకంటే ఉదాత్తమయిన మరొక విషయమేది?

**25.ఉ. చక్కెరమాని వేము దినఁజాలినకైవడి, మానవాధముల్**
**పెక్కురు బక్కదైవముల వేమరు గొల్చెదరట్లకాదయా**
**మ్రొక్కిన నీకు మ్రొక్కవలె; మోక్షమొసంగిన నీవ యీవలెన్**
**దక్కినమాటలేమిటికి, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చక్కెరన్ =తీయనిపంచదారను, మాని = తినడం విడిచి, వేమును = చేదును= చేదుపదార్థాలను, తినన్ = తినుటకు, భుజించడానికి, చాలినకైవడి = నేర్చినవిధంగా, మానవాధముల్ = మనుష్యుల్లో నీచప్రవృత్తికలిగినవారు, పెక్కురు = అనేకులు, చాలమంది, బక్కదైవములను = అల్పదేవతలను, క్షుద్రదేవతలను, వేమరు = వేయిసార్లు, చాలసార్లు, కొల్చెదరు = సేవిస్తారు. అట్ల = ఆవిధం, కాదయా = సరియైంది కాదుసుమా! మ్రొక్కినన్= నమస్కరిస్తే, నీక = నీకుమాత్రమే, మ్రొక్కవలెన్ = నమస్కరించవలె, మోక్షము = ముక్తిని, కైవల్యాన్ని, ఒసంగినన్ = ఇచ్చినన్, అనుగ్రహిస్తే, నీవ = నీవుమాత్రమే, ఈవలెన్ = ఈయవలెను, అనుగ్రహించవలె. తక్కినమాటలు= ఇతరవిషయాలు, (ముక్తిని తప్పించినవిషయాలు), ఏమిటికి = ఎందుకు?

తా: మానవులలో హీనులైనవారు, శ్రీరాముడవైన నిన్ను వదలి, క్షుద్రదేవతలను అనేకులైనవారిని సేవిస్తారు. ఇది ఎట్లున్నదంటే, తీయని రుచి కలిగిన చక్కెరను వదలిపెట్టి చేదు పదార్థమును తినునట్టిదే. (తీయనిపదార్థాన్ని తినడానికి అభ్యాసం అక్కరలేదు. కాని చేదు పదార్థాన్ని తినడానికి నేర్పు, అభ్యాసంకావలె) ఇదిసరియైన పద్ధతికాదు. దైవంగా భావించి నీకే నమస్కారం చేయవలె. ముక్తిని కైవల్యాన్ని ప్రసాదించేవాడవు నీవే. ఇతరదైవాలవలన ముక్తి లభించదని భావం.

వ్యా: విశిష్టాద్వైత సంప్రదాయంలో విష్ణుమూర్తి తప్ప ఇతరదైవతములు మోక్షమును ప్రసాదించలేరు అని చాల చోట్ల చెప్పబడింది. కృష్ణభగవానుడు భగవద్గీతలో ఇదే విషయాన్ని తన భక్తునికి ఆదేశించినాడు.

సాధువులంటే సజ్జనులు, మంచివారు, పండితులు, మునులు, ఋషులు, మొదలైన అర్థాలున్నాయి. శ్రీరాముని గాథయైన రామాయణంలో శ్రీరాముడు చేసినపని సాధుశబ్దానికుండే అర్థంకలవారినందరిని కాపాడడమే. శ్రీరామావతారఉద్దేశ్యమే శిష్టరక్షణ చేయడం అయినప్పుడు ప్రత్యేకసంఘటనల ఉటంకించడం అవసరం కాదేమో.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. (గీత)

ఇటువంటి శ్రీరాముని పరమాత్మగా భావించి ఆయన పాదపద్మాలను కవి కొలువడానికి సంకల్పించడంకంటే ఉదాత్తమయిన మరొక విషయమేది?

**25.ఉ. చక్కెరమాని వేము దినఁజాలినకైవడి, మానవాధముల్**
**పెక్కురు బక్కదైవముల వేమరు గొల్చెదరట్లకాదయా**
**మ్రొక్కిన నీకు మ్రొక్కవలె; మోక్షమొసంగిన నీవ యీవలెన్**
**దక్కినమాటలేమిటికి, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చక్కెరన్ =తీయనిపంచదారను, మాని = తినడం విడిచి, వేమును = చేదును= చేదుపదార్థాలను, తినన్ = తినుటకు, భుజించడానికి, చాలినకైవడి = నేర్చినవిధంగా, మానవాధముల్ = మనుష్యుల్లో నీచప్రవృత్తికలిగినవారు, పెక్కురు = అనేకులు, చాలమంది, బక్కదైవములను = అల్పదేవతలను, క్షుద్రదేవతలను, వేమరు = వేయిసార్లు, చాలసార్లు, కొల్చెదరు = సేవిస్తారు. అట్ల = ఆవిధం, కాదయా = సరియైంది కాదుసుమా! మ్రొక్కినన్= నమస్కరిస్తే, నీక = నీకుమాత్రమే, మ్రొక్కవలెన్ = నమస్కరించవలె, మోక్షము = ముక్తిని, కైవల్యాన్ని, ఒసంగినన్ = ఇచ్చినన్, అనుగ్రహిస్తే, నీవ = నీవుమాత్రమే, ఈవలెన్ = ఈయవలెను, అనుగ్రహించవలె. తక్కినమాటలు= ఇతరవిషయాలు, (ముక్తిని తప్పించినవిషయాలు), ఏమిటికి = ఎందుకు?

తా: మానవులలో హీనులైనవారు, శ్రీరాముడవైన నిన్ను వదలి, క్షుద్రదేవతలను అనేకులైనవారిని సేవిస్తారు. ఇది ఎట్లున్నదంటే, తీయని రుచి కలిగిన చక్కెరను వదలిపెట్టి చేదు పదార్థమును తినునట్టిదే. (తీయనిపదార్థాన్ని తినడానికి అభ్యాసం అక్కరలేదు. కాని చేదు పదార్థాన్ని తినడానికి నేర్పు, అభ్యాసంకావలె) ఇదిసరియైన పద్ధతికాదు. దైవంగా భావించి నీకే నమస్కారం చేయవలె. ముక్తిని కైవల్యాన్ని ప్రసాదించేవాడవు నీవే. ఇతరదైవాలవలన ముక్తి లభించదని భావం.

వ్యా: విశిష్టాద్వైత సంప్రదాయంలో విష్ణుమూర్తి తప్ప ఇతరదైవతములు మోక్షమును ప్రసాదించలేరు అని చాల చోట్ల చెప్పబడింది. కృష్ణభగవానుడు భగవద్గీతలో ఇదే విషయాన్ని తన భక్తునికి ఆదేశించినాడు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

ఇక్కడ సర్వధర్మాలు, అంటే ఇతరదైవతాలను కొలువడం అని విజ్ఞులు వ్యాఖ్యానిస్తారు. కంచెర్ల గోపన్నకవి ఈ చరమ శ్లోకాన్ని స్మరించుకొంటూనే ఈ పద్యం వ్రాసినాడనిపిస్తుంది. 'పెక్కురుబక్కదైవముల' కొలవకుండా ఉండడమే సర్వధర్మపరిత్యాగము. 'మ్రొక్కిన నీకు మ్రొక్కవలె'- అనడం 'మామేకం శరణం వ్రజ' అనడంలోనిభావం. 'మోక్షయిష్యామి మాశుచః' అనే విషయాన్ని 'మోక్షమొసంగిన నీవ యీవలెన్' అని కవి ఉద్ఘాటించినాడు.

శ్రీహరిని స్మరించడంలోని మహత్త్వాన్ని అనేక ప్రామాణికగ్రంథాలు వక్కాణిస్తున్నాయి. కలిసంతరణోపనిషత్తులో

హరే రామ హరే రామ రామ రామ హరే హరే 36599

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.

అని దీన్ని మహామంత్రంగా ఉల్లేఖించినాడు. ఈ పదునారు నామాలను శ్రద్ధాసక్తులతో ఉచ్చరిస్తే కలిప్రభావంవల్లకలిగిన సర్వపాపాలు నష్టమైపోతాయని చెప్పబడింది.

'హరతి యోగిచేతాంసీతి హరిః' యోగులచిత్తాన్ని హరించువాడే హరి.

హరిర్హరతి పాపాని- దుష్టచిత్తైరపి స్మృతః

అనిచ్ఛయాపి సంస్పృష్టో- దహత్యేవ హి పావకః

అనిచ్ఛతో తాకినప్పటికి అగ్ని తాకినవానిని అంటుకొనేవిధంగా దుష్టచిత్తుడుసైతం ఇష్టంలేకయే హరిని స్మరిస్తే అతని పాపాలు భస్మీపటలమవుతాయి.

'సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్' అని గీత చెబుతూ ఉన్నది.

నామ్నో ఽస్య యావతీ శక్తిః పాపనిర్హరణే హరేః ।

తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జనః॥

బృహద్విష్ణుపురాణమ్.

శ్రీహరి అనే నామంలో పాపవినాశనశక్తి ఉన్నంతగాపాతకులకు పాపం చేసేశక్తి ఉండదట!

హరినామపరా యే చ ఘోరా కలియుగే నరాః

తఏవ కృతకృత్యాశ్చ న కలిర్బాధతే హి తాన్॥

(బృహన్నారదీయమ్)

ఈ ఘోరమైన కలియుగంలో మనుష్యులు హరినామాన్ని శరణుపొందితే, ధన్యులవుతారు. కలికాలం వారిని బాధించదు.

శుకమహర్షి పరీక్షన్మహారాజుకు ఈ విధంగా ఉపదేశించినాడు :

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ:

ఇక్కడ సర్వధర్మాలు, అంటే ఇతరదైవతాలను కొలువడం అని విజ్ఞులు వ్యాఖ్యానిస్తారు. కంచెర్ల గోపన్నకవి ఈ చరమ శ్లోకాన్ని స్మరించుకొంటూనే ఈ పద్యం వ్రాసినాడనిపిస్తుంది. 'పెక్కురుబక్కదైవముల' కొలవకుండా ఉండడమే సర్వధర్మపరిత్యాగము. 'మ్రొక్కిన నీకు మ్రొక్కవలె'- అనడం 'మామేకం శరణం వ్రజ' అనడంలోనిభావం. 'మోక్షయిష్యామి మాశుచ:' అనే విషయాన్ని 'మోక్షమొసంగిన నీవ యీవలెన్' అని కవి ఉద్ఘాటించినాడు.

శ్రీహరిని స్మరించడంలోని మహత్త్వాన్ని అనేక ప్రామాణికగ్రంథాలు వక్కాణిస్తున్నాయి. కలిసంతరణోపనిషత్తులో



హరే రామ హరే రామ రామ రామ హరే హరే

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.

అని దీన్ని మహామంత్రంగా ఉల్లేఖించినాడు. ఈ పదునారు నామాలను శ్రద్ధాసక్తులతో ఉచ్చరిస్తే కలిప్రభావంవల్లకలిగిన సర్వపాపాలు నష్టమైపోతాయని చెప్పబడింది.

'హరతి యోగిచేతాంసీతి హరి:' యోగులచిత్తాన్ని హరించువాడే హరి.

*హరిర్హరతి పాపాని- దుష్టచిత్తైరపి స్మృత:*

*అనిచ్ఛయాపి సంస్పృష్టో- దహత్యేవ హి పావక:*

అనిచ్ఛతో తాకినప్పటికి అగ్ని తాకినవానిని అంటుకొనేవిధంగా దుష్టచిత్తుడుసైతం ఇష్టంలేకయే హరిని స్మరిస్తే అతని పాపాలు భస్మీపటలమవుతాయి.

'*సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్*' అని గీత చెబుతూ ఉన్నది.

*నామ్నో ఽస్య యావతీ శక్తి: పాపనిర్హరణే హరే: ।*

*తావత్కర్తుం న శక్నోతి పాతకం పాతకీ జన:॥*

బృహద్విష్ణుపురాణమ్.

శ్రీహరి అనే నామంలో పాపవినాశనశక్తి ఉన్నంతగాపాతకులకు పాపం చేసేశక్తి ఉండదట!

*హరినామపరా యే చ ఘోరా కలియుగే నరా:*

*తఏవ కృతకృత్యాశ్చ న కలిర్బాధతే హి తాన్॥*

(బృహన్నారదీయమ్)

ఈ ఘోరమైన కలియుగంలో మనుష్యులు హరినామాన్ని శరణుపొందితే, ధన్యులవుతారు. కలికాలం వారిని బాధించదు.

శుకమహర్షి పరీక్షన్మహారాజుకు ఈ విధంగా ఉపదేశించినాడు :

క. కావున సర్వాత్మకుఁడు మ-హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను - భావింపను భావ్యుఁడభవభాజికి వధిపా.

ఆ. మోక్ష కామునకును మోక్షంబు సిద్ధించు భవభయంబులెల్లఁ బాపిపోవు
యోగిసంఘమునకు నుత్తమవ్రతములు వాసుదేవనామ వర్ణనములు.

మానవులకు హరినామం సర్వదా స్మరణీయం అనేవిషయం ఇక్కడ వక్కాణింపబడింది.
ఇంకా శుకుడు చెప్పిన పద్ధతి :

గోవిందనామకీర్తన -గావించి భయంబు దక్కి ఖట్వాంగధరి
త్రీవిభుఁడు సూరగొనియెను- గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్. భాగ. 2.॥

శ్రీహరియె లోకసంరక్షణార్థం శ్రీరాముడుగా అవతరించినాడు. శ్రీరామునిగురించి, ఆయననామమహత్త్వం గురించి చాలచోట్ల చెప్పబడింది.

శ్రీ తులసీదాసగోస్వామి తన శ్రీరామచరితమానసంలో శ్రీరామనామాన్నిగురించి చెప్పేవిధానం చూడవలసిందే.

ఎది కృశానుభానులకును హిమకరునకు
కారణంబగు నా రఘుకాంతురామ
నామమునకెప్పుడును వందనంబొనర్తుఁ
బరమభక్తిసంపూరితభావమునను.

రామదాసులాగ ఈ కవికూడ రామనామానికి నమస్కరిస్తున్నాడు.

శ్రీరామనామమహహో, నీరజభవవిష్ణురుద్రనిలయము, వేదా
ధారము నిర్గుణమసమము చారుసుగుణరత్నములకు సాగరమెన్నన్.

శ్రీరామనామము త్రిమూర్త్యాత్మికమైనట్టిది.

వరరామమంత్రమహిమం బెరుఁగును గణనాథుఁడాతఁ డీయాక్రియలన్
స్థిరముగఁ దొలిపూజలు గొను టరయమె శ్రీరామనామమందలి మహిమన్

గణపతి శ్రీరామమంత్రమహిమ తెలియడంచేతనే ప్రథమపూజనుగ్రహిస్తున్నాడు.

తెలియును ప్రథమకవీంద్రుండలఘుశ్రీరామనామమందలిమహిమన్
దలక్రిందుగ నామంత్రముఁ బలికియు వాల్మీకి లోకపావనుఁడయ్యెన్.

వాల్మీకికి మహర్షులు రామమంత్రముపదేశింపగా అతడు మహర్షి మహాకవి అయినాడు.

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే

అని స్వయంగా శ్రీ పరమేశ్వరుడే సెలవిచ్చిఉన్నాడు.

రామదాసుగా ప్రఖ్యాతినిగన్న కంచెర్ల గోపన్నగారు రామనామ మహాత్మ్యాన్ని పద్యాల్లో (శతకంలో) చెప్పడమే కాదు. తమ కీర్తనల్లో చాలచోటులందు ఆ భావాన్నే వ్యక్తంచేసినారు. ఒకటి రెండుదాహరిస్తాను.

శ్రీరాములదివ్యనామస్మరణ చేయుచున్న
ఘోరమైన తపములను కోరనేటికే మనసా.
తారకశ్రీరామనామధ్యానము చేసిన చాలు
వేరువేరు దైవములను వెదుకనేటికే మనసా.॥
రామనామమే జీవనము, అన్యమేమిరా కృపావనము
రామనామసుధామధురము అది యేమరక భజియించు మాకిక॥
శ్రీల మేలు భయానకము రఘువీరులపేరే పానకము
పాలు మీగడ జారుతేనియపాలకన్నను మేలైనది.

ఈ భావాలన్ని ఈ పద్యంలో సమకూర్చి ఉన్నాడు కవి.

**26.ఉ. 'రా' కలుషంబులెల్ల బయలంబడఁద్రోచిన, 'మా' కవాటమై**
**దీకొని ప్రోచు నిక్కమది ధీయుతులైనఁ దదీయవర్ణముల్**
**గైకొని భక్తిచే నుడువఁ గానరుగాక విపత్పరంపరల్**
**దాకొనునే జగజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : రా = రామ అనెడు పేరులోని 'రా' అనే మొదటి అక్షరము. కలుషంబులు+ఎల్లన్ = దోషములను అన్నింటిని, అన్నిపాపాలను. బయలన్ = వెలుపల, బయట, పడన్ త్రోయగాన్ = పడిపోయేటట్లు త్రోసివేయగా, మా = రామ అనే పదంలోని రెండవ అక్షరమైన 'మ' అనే అక్షరము. కవాటమై = తలుపై, ద్వారమై, దీకొని = ఎదుర్కొని, తాకి, ప్రోచును = రక్షించును, కాపాడును, నిక్కము = ఇది నిజముసుమా! యథార్థమైందికదా. ధీ = బుద్ధితో, యుతులు = కూడినవారు, బుద్ధిమంతులు, జ్ఞానులు, ఎన్నన్ = పరికించగా, తలపగా, తదీయవర్ణముల్ = ఆ అక్షరాలను,రామ అనే రెండక్షరాలను, కైకొని= స్వీకరించి, చేకొని, గ్రహించి, భక్తిచేన్ = భక్తిపూర్వకంగా, నుడువ = పలుక, ఉచ్చరించ, కానరు = తెలియరు, కాక = కానిచో, విపత్ = ఆపదల, కష్టాల, పరంపరలు = వరుసలు, ఎడతెగనివరుసలు, జగత్+జనులకు = లోకంలోని మనుష్యులకు, పైకొనునే = ఆక్రమించునా? సంభవించునా?

తా: 'రామ' అనే దివ్యనామంలోని రేఫాక్షరము, మనుజుల పాపాలను అన్నింటిని బయటికి తరుముతుంది. ఇక ఈ పేరులోని 'మ'అనే అక్షరం తలుపు వలె అడ్డుపడి,

పాపాలను ఎదిరించి లోపలికి రాకుండునట్లుచేసి, ఆశ్రితులను కాపాడుతుంది. ఈ విషయం యథార్థమని, బుద్ధిమంతులు, జ్ఞానవంతులు చెప్పినప్పటికి మూఢులైనవారు, అజ్ఞానులైనవారు, ఆ అక్షరాలను (రామఅనేఅక్షరాలను) గ్రహించి ఉచ్చరించజాలకున్నారు. జపింపనేరకున్నారు. అట్లు కాక, జనులు ఆ రామ అనే అక్షరాలను జపించినట్లయితే, వరుసగా వారికి ఆపదలు కలుగనే కలుగవు. ఆపదలు వారిని సమీపించవు.

వ్యా: ఈ పద్యంలో కవి రామనామప్రభావాన్ని చెప్పుతున్నాడు. కిరాతుడుగా ఉండినవాల్మీకి, మహర్షులవలన రామశబ్దాన్ని గ్రహించి, నిరంతరంగా జపించి, తపించి, మహర్షిగా, మహాకవిగా లోకంలో ప్రఖ్యాతి చెందినాడు. ఇది 'రామ'నామమహత్త్వమని నేరుగా చెప్పబనిలేదు. కవి ఈ పద్యం వ్రాస్తున్నప్పుడు వాల్మీకిచరిత్ర స్మరించిఉండవచ్చు.

లోకంలో మహామంత్రాలు రెండున్నాయి. మహేశ్వరుని కొల్చేవారు నిరంతరం జపించే ఓం నమః శివాయ అనే పంచాక్షరీమంత్రం. విష్ణుమూర్తిని సేవించేవారు నిత్యం జపించే నారాయణాత్మకమైన అష్టాక్షరీమంత్రం. దీన్నే విశిష్టాద్వైతసంప్రదాయంలో తిరుమంత్రమని అంటారు. తాత్త్వికులు, సంప్రదాయం తెలిసినవారు భావించేదేమంటే, రామనామంలో ఈ మహామంత్రాలసారం ఉన్నదని. ఓం నమః శివాయ లో 'మ'కారం ఉంది. అష్టాక్షరీమంత్రంలో 'రా' ఉంది. ఈ రెండింటిని జతచేస్తే రామ అయింది. రామనామంలో మహేశ్వర, నారాయణమంత్రాల అక్షరాలు చేరి ఉండడంచేత, ఆ రెండు మహామంత్రాల ప్రభావం దీనిలో ఉన్నది. అందుచేత వైష్ణవులు భావించినవిధంగా 'రా' అనే అక్షరం సర్వపాపాలను బయటకు త్రోసి వేస్తుంది. 'మ' అనే అక్షరం, శైవభక్తుల అభిప్రాయానుగుణంగా, పాపాలను దరిచేరనీయకుండ అరికడుతుంది. రెండుమహామంత్రాలను జపిస్తే కలిగే మంచిఫలితం, పాపాలను పోగొట్టుకొని, పుణ్యాలను సంపాదించేఫలితం కేవలం రెండుఅక్షరాలైన 'రామ'శబ్దాన్ని జపించడంలో లభిస్తుంది. విశేషమేమంటే, రామశబ్దం ఇంతటి మహత్త్వం కలిగింది. కాబట్టి శివకేశవులను విడివిడిగా కొలిచేవారికి ఇది అంగీకార్యమయింది.

రామనామమునుగురించి తులసీదాసగోస్వామి తన శ్రీరామచరితమానసంలో చెప్పినమాటలు ఉటంకించడం ఈ సందర్భంలో సముచితంగా ఉంటుంది.

*శ్రీరామమంత్రమహిమను -గౌరీపతి యెరుఁగు బాగుగాఁ గావుననే*
*ఘోరవిషానలమౌరా -మారెను దివ్యామృతముగ మంగళకరమై.*

ప్రథమభాగవతోత్తముడైన మహేశ్వరునకు, శ్రీరామమంత్రమహిమ బాగా తెలుసును. దానిమహిమవలననే అతడు మ్రింగిన భయంకరమైనవిషం, అమృతప్రాయమైంది.

*రామపదపద్మభక్తి వర్షర్తు; వమలభక్తులే వరిమొక్కలవంటివారు*

*'రామ' యనునట్టి రెండు వర్ణంబులెన్నఁదగును శ్రావణభాద్రపదంబులుగను*

శ్రీరామునిపాదములపై భక్తి వర్షఋతువులాంటిది. ఇక స్వచ్ఛమైన రామభక్తులు వరిమొక్కలవంటివారు. శ్రావణభాద్రపదమాసాల్లో వరిచేను వృద్ధిచెందినట్లుగా రామ నామ ప్రభావం చేత రామభక్తులు వృద్ధి చెందుతారు.

*సులభము, సుఖదము, స్మరణము సలుపఁగ నెల్లరకు రామ సన్మంత్రమహా*

*కలిగెడు నిహపరసుఖములు సలలితమగు రామనామ సంస్మరణమునన్*

మహామంత్రాలు పఠించినంత కష్టము రామమంత్రం పఠించడంలో లేదు. దీనివలన ఇహపరసౌఖ్యాలు తేలికగా లభిస్తాయి.

*పలుకఁగ, వినఁగ, స్మరింపఁగ సలలితమధురములు 'రా' 'మ' సద్వర్ణంబుల్*

*తులసికి రాఘవ సౌమిత్రులవలెఁ బ్రియమైన వివిధ స్తోత్రము సేయన్*

రామనామం మధురమైంది. ఈ అక్షరాలు తులసీదాసుకు రామలక్ష్మణులలాగ ప్రియమైనవి. రెండక్షరాలు రామలక్ష్మణ సోదరులవలె విడనట్టివి.

*నరనారాయణులట్టుల వరలెడు నా 'రామ' నామవర్ణద్వయమే*

*పరిపాలించును జగములఁ గరుణను నిజభక్తకోటి గాచు సతంబున్*

విష్ణుమూర్తిఅవతారాలైన నరనారాయణులు లోకాన్ని కాపాడినట్లుగా ఈ రెండక్షరములు, రామ అనేవి, భక్తకోటిని రక్షిస్తూ ఉంటాయి.

భక్తమానససుందర పద్మములకు- భ్రమరరాజమంత్రంబు సతము

జిహ్వాయను యశోదను సంతసింపఁజేయు. రామకృష్ణులీ రా, మ, వర్ణములు రెండు.

భక్తుల మనస్సులు పద్మాలని భావిస్తే, రామమంత్రం వారిమనస్సులచుట్టూ తిరుగుతుంది. కాబట్టి అది తుమ్మెదలాంటిది. భక్తుల నాలుక యశోదాదేవిగా తలిస్తే రా, మ, అనే రెండక్షరాలు బలరామకృష్ణులవంటివి అవుతాయి.

*సర్వవర్ణంబులకును రా ఛత్రముగను మకుటమణిగా మకారము మరి వెలుంగ*

*రామచంద్రునిపావననామమఖిలదివ్యమంత్రరాజంబయి తేజరిల్లు.*

అక్షరమాలకంతటికి రా అనేది ఛత్రంలాంటిది. మకారం కిరీటంవంటిది. అందుచేత రామమంత్రం దివ్యమంత్రాల్లో సర్వశ్రేష్ఠమయింది.

వాల్మీకి రామనామస్మరణ చేసి, తపముచేసి మహాకవియై రామాయణము వ్రాసినాడు. ఆవిధంగానే, తులసీదాసగోస్వామి, రామమంత్రప్రభావాన్ని గ్రహించి, దాన్ని జపించి మరొక వాల్మీకి రామాయణంవంటి శ్రీరామచరితమానసం వ్రాసి లోకానికి అందించి, రామభక్తులకు సంప్రీతి చేసినాడు.

రామదాసుగా ప్రఖ్యాతి వహించిన కంచెర్ల గోపన్నకవి రామనామాన్ని కేవలం ఈ పద్యంలో చెప్పడంతోనే విరమించడం లేదు. ఈ మహత్త్వాన్ని అనేక కీర్తనల్లో ప్రశంసించినాడు.

**27.ఉ. రామ హరే కకుత్స్థకుల రామ హరే రఘురామ రామ శ్రీ**
**రామ హరే యటంచు మది రంజిల భేకగళంబులీల నీ**
**నామము సంస్మరించినజనంబు భవంబెడబాసి తత్పరం**
**ధామనివాసులౌదురఁట దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: రామ = శ్రీరామా, హరే = శ్రీహరీ, కకుత్స్థకులరామ = కకుత్స్థవంశంలో జన్మించిన శ్రీరామా, హరే = హరీ,రఘురామ = రఘుమహారాజువంశ పరంపరలో పుట్టిన శ్రీరామ,రామా, అటంచు = అని, మది = మనస్సు, రంజిలన్ = ఆనందించేటట్లుగా, భేక = కప్పయొక్క, గళంబులీలన్ = కంఠమువిధంగా, స్మరించినజనంబు = భావించిన, అవగాకీర్తించిన, జనంబు = మనుష్యులు, జీవులు, భవంబు = జన్మములు, ఎడబాసి = విడిచి, తత్ = ఆ ప్రసిద్ధమైన,పరంధామ = మోక్షమునందు, ముక్తిని పొంది, అక్కడ, నివాసులౌదురఁట = అచటనే నివసిస్తారట. ఓ దశరథరామా.

తా: ఓ దశరథరామా, రామ, హరే,కాకుత్స్థరామా, రఘురామా, శ్రీరామా, హరే అనేవి నీపేర్లు. ఈ నీ నామములను మానవులు కప్పగొంతువలె మాటిమాటికి తలంచువారు ఇంక జన్మములు ఎత్తే అవస్థను దాటి పరమపదమందు నివసిస్తారటగదా.

వ్యా: ఈ పద్యంలో కవి రామనామస్మరణము మోక్షమార్గమునకు దారి అనే విషయాన్ని సూచిస్తున్నాడు. రామనామాన్ని స్మరించే భక్తుల నామోచ్చారణ భేకగళంబువలె ఉంటుందని ఉపమించినాడు. వర్షకాలంవచ్చినప్పుడు, చెరువులు గుంటలు సమృద్ధిగా నీటితో నిండినప్పుడు అంతవరకు భూమిబొరియలలో నిద్రావస్థల్లో ఉండిన కప్పలు, వర్షజలాన్ని చూచి హర్షించి బెక బెక చప్పుళ్ళు ఎడతెగకుండా చేస్తాయి. అట్లాగా,శ్రీరామభక్తి కలిగిన జనులు తమమనస్సులో రామస్మరణ నిరంతరాయంగా చేస్తారు. శ్రీరామునిభక్తులు శ్రేష్ఠులు. వారిని కప్పగొంతుకలతోను, రామశబ్దాన్ని బెకబెక చప్పుళ్లతోను కవి పోల్చినప్పుడు ఇతడు నీచోపమను గ్రహించినాడా అనే సందేహం కలుగక మానదు. కాని, వర్షపాతానికి కప్పలు హర్షించి కూసినట్లుగానే, శ్రీరామునిభక్తికి జనులు సంతసించి స్మరిస్తారని కవిభావంగా గ్రహించవలె. శ్రీరామ నామోచ్చారణ, స్మరణమని మహత్త్వం తెలియని భక్తులు, అంతగా జ్ఞానం లేనివారుకూడ శ్రీరాముని నామస్మరణ చేసి తరించిన సందర్భాలున్నాయి. వాల్మీకి రామనామస్మరణవలన ఫలితం తెలియకపోయినా, ఆ

నామోచ్చారణచేసి తరించినాడు. మహర్షి అయినాడు. అందుచే అజ్ఞానులైన భక్తులను కూడ మనస్సులో పెట్టుకొని, వారిని భేకములతో ఉపమించి ఉండవచ్చు.

సముద్రునికి శ్రీరాముని వేడుకొంటే ఆపద తప్పిపోయినవృత్తాంతం శ్రీమద్భాగవతంలో నవమస్కంధంలో ఉన్నది.

*ఈశ్వరస్సర్వభూతానామ్, హృద్దేశే ఽర్జున తిష్ఠతి,*
*తమేవ శరణం గచ్ఛ, సర్వభావేన భారత,*
*తత్ప్రసాదాత్పరాం శాన్తిమ్, స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥* (గీత - 18-61)

అందరిహృదయాల్లో ఈశ్వరుడున్నాడు. సర్వభావంచేత ఆ ఈశ్వరుని శరణుపొందు. ఆ ఈశ్వరునిప్రసాదంవలన శాశ్వతమైన శాంతిని పొందుతావు అని భగవద్గీత బోధిస్తున్నది. ఇక్కడ చెప్పబడిన ఈశ్వరుడు. లోకాన్ని శాసించే తత్త్వం కలిగిన తత్త్వం, శ్రీమహావిష్ణువే, నారాయణుడే- శ్రీరాముడే. సచ్చిదానందపరబ్రహ్మమే శ్రీరాముడని రామాయణం నిరూపించింది.

పైపద్యంలో ఉండేభావాన్ని రామదాసుగారు తమ కీర్తనల్లోను వ్యక్తంచేసినారు.

*శ్రీరాములదివ్యనామస్మరణ చేయుచున్న*
*ఘోరమైన తపములను కోరనేటికే మనసా*
*తారకశ్రీరామనామధ్యానము చేసిన చాలు*
*వేరు దైవముల వెదుక నేటికే మనసా*
*రామ రామ శ్రీరామ రామ- రామ యనరాదా మనసా,*
*కామితఫలదుండగు శ్రీసీతాకాంతుని గనరాదా మనసా.*

ఈ పద్యంలో కవి ఉపమాలంకారాన్ని ప్రయోగించినాడు.

**28.ఉ. చక్కెరలప్పకున్ మిగులజవ్వనికెంజిగురాకుమోవికిన్**
**జొక్కపుజుంటితేనియకుఁ జొక్కిలుచుంగనలేరు గాక నేఁ**
**డక్కట! రామనామ మధురామృతమామటకంటె సౌఖ్యమా**
**తక్కినమాధురీమహిమ! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చక్కెర = పంచదార, లప్పకున్ = రాశికి=కుప్పకు, జవ్వని = యౌవనముగల స్త్రీయొక్క, కెంపు+చిగురాకు = ఎర్రని చిగురువంటి అధరానికి, చొక్కపు = శ్రేష్ఠమైన, అచ్చమైన, జుంటి తేనియకు = అచ్చమైనజుంటీగలు గూర్చినతేనెకును, మిగులన్ = మిక్కిలి, అధికంగా, చొక్కిలుచు= పరవశిస్తూ, ఆనందిస్తూ, మదిస్తూ, కనలేదుగాక = (రామనామమాధుర్యాన్ని) చూడలేరుకదా, అనుభవించలేరుకదా. తెలిసికొనలేరుకదా,

అక్కట = అయ్యో, ఆశ్చర్యార్థకం, రామనామ = రామునిపేరుఅనే, మధుర = తీయనైన అమృతము, అనుటకంటె = రుచిచూడడంకంటె, ఆస్వాదించడంకంటె, తక్కిన = ఇతరమైన, మాధురీ = తీపియొక్క, మహిమ = గొప్పతనం,పేరిమి, సౌఖ్యమా = ఆనందమా, సుఖమైన అనుభూతియా?

తా: దశరథరామా, లోకంలోని జనులు చక్కెరరాశికి, యౌవనంలో ఉన్న సుందరమైన స్త్రీల చిగురాకువంటి ఎర్రని పెదవులకు, తేనెటీగలు గూర్చిన అచ్చమైనతేనెకు, అన్నా వాటిరుచికి, పరవశించి, మైమరిచి, ఆనందించి, రామనామములోని మాధుర్యమును తెలుసుకొనలేకున్నారు. అమృతంవలె అతిభోగ్యమైన రామనామాన్ని ఆస్వాదించడంకంటె, తక్కినవాటిమాధుర్యాతిశయాలు సుఖప్రదం కానేరవు. రామనామమే అన్నింటికంటె మధురమైంది.

వ్యా: మొదట ముఖ్యమైన పదాలు, వాటి అర్థవిశేషాలు చూద్దాము.

లప్ప = రాశి అనేది సామాన్యార్థం. చేరెడు-చేతికింద అనే అర్థాలుకూడ ఉన్నాయి. మంచులప్పల మించుమండెంగమదుపులు పొరలి తెట్టువగట్టు మరువులయ్యె అనేది నైషధప్రయోగం. ఇక్కడ రాశి అనే అర్థంలోనే ఉపయుక్తమైంది. 'లప్పలకొద్ది క్రొంబెరుగు లక్ష్మణ వజ్జలఇంట రూకకువ్' అని శ్రీనాథునిప్రయోగం. చొక్కము = దోషము కానిది, స్వచ్ఛము, చొక్కపుబంగారము అనేది లోకవ్యవహారము- విష్కళంకమైన చరిత్రకలవాడు (కలది) అనే అర్థంలో ప్రాచీనప్రయోగం చూడండి.

'నీచొక్కపుకొడుకున్నీవును-నొక్కతవైప్రముక్కు మాని యుండుఁడు నెమ్మిన్' హరివంశము.

జుంటితేనె = జున్ను+తేనె = జుంటీగలు కూర్చినతేనె- క్షౌద్రము. చొక్కు = పరవశమగు, 'సుదతికి మధుసేవ తమవు చొక్కఁగఁజొచ్చెన్' కవికర్ణరసాయన ప్రయోగము. దీనికి మూర్ఛ అనే అర్థంకూడ ఉన్నది. 'ఎల్లవారు వెరుక లెడలి చొక్కొక్కిన నిద్రాతిశయముగూరినట్టులైరి' మ.భా.విరాటపర్వం.

ఈ పద్యంలో లౌకికమైన ఆనందాలు అనుభవిస్తున్న సామాన్యజనులు, ఆ మధురమైన వస్తువుల మోహంలోపడి,రామభక్తిని విస్మరించి, ఆముష్మిక సౌఖ్యానికి దూరం అవుతూఉన్నారని, భక్తితో శ్రీరామనామాన్ని ఉచ్చరించడంలో ఉండే సౌఖ్యం స్త్రీ సంపర్కాదులలో లేదని కవి ప్రబోధం చేస్తున్నాడు. భారతీయసంస్కృతిప్రకారం ఆధ్యాత్మికచింతనయే మానవునికి ముఖ్యమైంది. ఆదిశంకరులు

'భజగోవిందం భజగోవిందం- గోవిందం భజ మూఢమతే' అని ప్రబోధించడం ఇటువంటిదే.

కంచెర్లగోపన్న గొప్పభక్తుడు- నిరంతరం రామనామధ్యానంచేసి తరించినవాడు. ప్రాపంచికసౌఖ్యాలు మోహంలోపడడం సముచితం కాదని చెప్పడంలో ఔచిత్యం ఉన్నది. శ్రీమద్భాగవతంలోని ఈ పద్యాన్ని ఇచట మననం చేసికోవలె.

*మందారమకరందమాధుర్యమునఁ దేలు*
*మధుపంబు బోవునే మదనములకు,*
*నిర్మలమందాకినీవీచికలఁదూగు*
*రాయంచ చనునె తరంగిణులకు?*
*లలితరసాలపల్లవఖాదియై చొక్కు*
*కోయిల చేరునే కుటజములకు*
*పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక*
*మరుగునే సాంద్రనీహారములకు*
*అంబుజోదరదివ్యపాదారవింద*
*చింతనామృతపానవిశేషమత్త*
*చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు*
*వినుతగుణశీల మాటలు వేయునేల*

పద్మనాభుడైన శ్రీమహావిష్ణువుయొక్క దివ్యపాదారవిందములను స్మరించే, ఉచ్చరించేవాడు పొందేవాడు అమృతం తాగినట్టుగా పారవశ్యం చెందుతాడు. అది భక్తుని అనుభూతి. పంచదారపానకాలు, జవ్వనిఅధరాలు, జుంటితేనెలు, శ్రీరామ నామోచ్చారణతో, ఆ అమృతాన్ని అనుభవిచడంతో పొందే మధురానుభూతికి సమానం కావు. ప్రాపంచిక సౌకర్యాలు, ఆధ్యాత్మికచింతనకు సమానం కావు. ఈ భావాన్నే రామదాసుగారు తమ కీర్తనలో కూడ చెప్పిఉన్నారు.

*రామనామమే జీవనము అన్యమేమిరా కృపావనము*
*రామనామసుధామధురము అది యేమరక భజియించు మాకిక*
*శ్రీలమేలు భయానకము, రఘువీరులపేరే పానకము*
*పాలు మీగడ జారు తేనియ పాలకన్నను మేలైనది.*
*సుందరశ్రీరాములు రఘునందనాంఘ్రిసరోజములు*
*చెంది బ్రహ్మానందభావము అందరికి నింపొందజేసిన* *రామ-॥*

ఈ గీతంలోకూడ! రామనామము, అమృతం-సుధ-వంటి మధురమైందని చెప్పడమే కాక, అది 'పాలుమీగడ జారుతేనియపాలకన్నను మేలైనది' అని పునరుద్ఘాటించినాడు.

శ్రీరాముచరణసరోజాలు కలిగించేసుఖము, పారవశ్యము 'బ్రహ్మానందభవము' అని, అది కొందరికే కాక, అందరికి ఇంపును కలిగిస్తుందని కవి ప్రబోధించినాడు.

**29. ఉ. అండజవాహ, నిన్ను హృదయంబున నమ్మినవారిపాపముల్**
**కొండలవంటివైన వెస(గూలి నశింపక యున్నె, సంతతా**
**ఖండలవైభవోన్నతులు గల్గక మానునె? మోక్షలక్ష్మి కై**
**దండ యొసంగకున్నె తుద, దాశరథీ కరుణాపయోనిధీ!**

ప్ర : అండజవాహ = గరుడ పక్షివాహనా, నిన్ను, హృదయంబునన్ = మనస్సులోన నమ్మిన = విశ్వసించిన, వారి పాపములు = వారి దోషాలు, కొండలవంటివి = రాతి గుట్టలవలె = గొప్ప రాసులవంటివి, కఠినమైనవి, ఐనన్ = ఐనప్పటికి, వెసన్ = వేగంగా, త్వరగా, కూలి = క్రిందపడి, నశింపకయున్నె = అదృశ్యమైపోవా? చెడిపోవా (పోవునని అర్థము) సంతత = ఎల్లప్పుడు = నిరంతరం, ఆఖండల = ఇంద్రునియొక్క, వైభవ = విభవముయొక్క = గొప్పతనముయొక్క, ఉన్నతులు = అతిశయములు, కల్గకమానునె = లభించకపోవునా? (లభించునని భావం), తుదన్ =చివరకు, కడపట, మోక్షలక్ష్మి = ముక్తి అనే లక్ష్మీదేవి, కైదండ = చేయూత, సాహాయ్యము, ఒసంగక యున్నె = ఈయకుండునా? (ఇచ్చునని భావం.)

తా: ఓ పక్షివాహనా, విష్ణుమూర్తీ, శ్రీరామా, మనస్సులో నిన్ను నమ్మినవారికి కొండలవంటి గొప్పవైన, కఠినమైన ఎన్ని కష్టాలు కలిగినప్పటికి, ఎన్నిపాపాలు సంభవించినప్పటికి, అవి నశించక మానవు. తప్పక మాసిపోతాయి. తరువాతి పరిణామంగా, నిన్ను విశ్వసించినవారికి, ఇంద్రునిగొప్పదైన విభవమువలె, ఐశ్వర్యమువలె, మహైశ్వర్యము కలుగుతుంది. చివరన మోక్షమనే లక్ష్మీదేవి అతన్ని వరిస్తుంది. అంటే జన్మరాహిత్యం సంభవిస్తుంది.

వ్యా: పక్షివాహనుడైన విష్ణుమూర్తి అవతారమైన శ్రీరాముని త్రికరణశుద్ధిగా విశ్వసించినవారికి సర్వదోషాలు తొలగిపోతాయని, చివరకు మోక్షం లభిస్తుందని కవి ఈ పద్యంలో వ్యక్తం చేసినాడు. ఈ పద్యం కవి స్వానుభవపూర్వకంగా వ్రాసినట్లు కన్పిస్తుంది. ఆ వృత్తాంతం చూడవలసిందే.

రామనామభక్తిరసాన్ని వెల్లివిరియించే రామదాసుకీర్తనలను, దాశరథీశతకాన్ని రచించిన భక్తిశిఖామణి వాగ్గేయకారుడుకంచెర్ల గోపన్న. క్రీ.శ. 1620-1687 సంవత్సరాలనడుమ గోలకొండరాజ్యాన్ని పరిపాలించిన కుతుబ్షాహివంశస్థులైన అబ్దుల్లా, అబుల్‌హసన్ తానాషాకు మంత్రిత్వం నెరపిన అక్కన్న, మాదన్నగార్లు గోపన్నకు మేనమామలు. వారిద్వారా ఆయనకు భద్రాచలం తహశీల్దారుపదవి లభించింది.

గోపన్న సహజంగా అపారమైన రామభక్తి కలిగినవాడు. దమ్మక్క తాత్కాలికంగా ఏర్పాటుచేసినమండపంలో నివసించిఉండే భద్రాచలరాముడు, సీతాలక్ష్మణులు ఆయనకంట బడ్డారు. ఇంకేమి? వారిమీద ఉండే భక్తి ప్రేరణ కాగా భద్రాద్రిరామాలయానికి మరమ్మత్తులు చేయించినాడు. గోపురమండపాలు నిర్మాణం గావించినాడు. ఆళ్వారుల సన్నిధులు ఏర్పాటు చేసినాడు. కాని ఈ ధనమంతా తన సొంతం కాదు. తహసీల్దారుపదవిలోఉండినందుకు సర్కారుధనం తనఅధీనంలోఉండింది. దానినే దేవుని కైంకర్యానికి నిరాటంకంగా ఉపయోగించినాడు. విధిపూర్వకంగా చూసినా, సామాజికంగా చూసినా గోపన్న చేసింది అపరాధమే. ఈ దోషానికి అతడు గోల్కొండ నవాబు ఆగ్రహానికి గురియైనాడు. నవాబు అతనికి కారాగారశిక్ష విధించినాడు. ప్రభుత్వ ద్రవ్యాన్ని ఉపయోగించినందుకుగాను ఈ దండన పడింది. నవాబు అనుచరులు కఠినంగా ప్రవర్తించగా, గోపన్ననరకప్రాయమైన పండ్రెండు సంవత్సరాల కారాగారశిక్షను అనుభవించినాడు. అయినా, ఆ మహానుభావుడు శ్రీరామభక్తిని వదలినవాడు కాదు. ఆర్తితో అనునిత్యం శ్రీరామునిమీద అనేకకీర్తనలను రచించి, ఏకాంతంగా ఆయనకే వినిపించినాడు. అతన్ని వేడుకొన్నాడు. దోషాలకు క్షమాపణ చెప్పుకొన్నాడు.

*రామా దయజూడవే భద్రాచల*

*రామా నను బ్రోవవే, సీతారామా!-ఇత్యాదిగా.*

శ్రీరాముడు దయార్ద్రహృదయుడు- కరుణాపయోనిధి. గోపన్నమొర విన్నాడు. తాను స్వయంగాను, సోదరుడు లక్ష్మణునితోను సుల్తానుస్వప్నంలో సాక్షాత్కరించినాడు. రామదాసు ఆలయకైంకర్యానికి వెచ్చించినధనం చెల్లించినాడు. రసీదు పొందినాడు. రామదాసుకు (గోపన్నకు) చెరనుండి విముక్తి లభించింది. ఈ కథ ఆంధ్రులకు చాల యిష్టం. అందుచేతనే కాబోలు వారు రంగస్థల నాటకాలద్వారా, హరికథలవలన, యక్షగానాలముఖంగా వ్రాసికొని నిత్యం జ్ఞాపకం చేసుకొంటూ ఉంటారు.

అబుల్ హసన్ తానాషా రామదాసును చెరనుండి విడిపించడమే కాక, భద్రాచలరాముని మహారాజు బిరుదుతో సత్కరించి, భద్రాచలాన్ని జాగీర్‌గా సమర్పించి, శిలాశాసనం చేయించినాడు.

గోపన్నగారు అధికారంలో ఉండినప్పుడు దోషంచేసినమాట యథార్థమే. కాని, ఆయన తనకు సహజంగా లభించిన రామభక్తిని విస్మరించినవాడు కాదు. అధికారంలో ఉండినప్పుడు ఆలయకైంకర్యాలు నిర్వహించి రామునికి సేవ చేసినాడు. అంధకారబంధురమైన కారాగృహంలోను శ్రీరామునిసదాధ్యానం మరువలేదు. అందుచేతనే ఆయన చేసినదోషాలు శ్రీరాముని కరుణాకటాక్షంవలన పటాపంచలైపోయినాయి.

కారాగృహవాసం యథార్థానికి కొండవంటి కష్టమే. అయినా శ్రీరామునిఅనుగ్రహంతోఈ క్షణంలో కూలి నశించిపోయింది. తిరిగి శ్రీరామునిసన్నిధానం లభించింది. ఈ భక్తుడికి తన దైవసాన్నిధ్యంలో లభించినసౌఖ్యం ఇంద్రునికి కలిగే మహోన్నతసౌఖ్యాలకు తీసిపోయేది ఏమికాదు. రామదాసుగారు వ్రాసిన కీర్తనలవలన, ఆయనపద్యాలవలన మూడువందల సంవత్సరాలు గడచిపోయినా, తెలుగువారు, రామభక్తులు ఆయనను నిరంతరం జ్ఞాపకంచేసుకొంటూ ఉన్నారు. ఇది ఆయనను మోక్షలక్ష్మి వరించడంకంటె అల్పమేమీ కాదు.

ఈ శతకకర్త తన కథను అందరికథల్లాగా చెప్పేనేర్పు కలవాడు. దీనిని సాహిత్యపరిభాషలో ఆత్మాశ్రయత్వం అంటారు. అధికారం రావడం, దానిప్రేరణచేత దోషాలు చేయడం, భగవద్ధ్యానంవలన ఆదోషాలు మాసిపోవడం ప్రతిమానవునిజీవితంలో సామాన్యమైనవే. ఈ కవి తనజీవితాన్ని ఈ పద్యంలో సాధారణీకరణంచేసి భగవంతునిమీద భక్తులు విశ్వాసం కలిగిఉండాలని రమణీయంగా ప్రబోధం చేసినాడు.

**30. ఉ.చిక్కనిపాలపై మిసిమి జెందిన మీగడ పంచదారతో**
**మెక్కినభంగి మీవిమలమేచకరూపసుధారసంబు నా**
**మక్కువపళ్లెరంబున సమాహితదాస్యమనేటి దోయిటన్**
**దక్కెనటంచు జుర్రెదను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చిక్కనిపాలపై = నీరు కలుపని చిక్కనైన పాలమీది, మిసిమిన్ = కాంతిని చెందిన = పొందిన (చమురుతో) కాంతిమంతమైనదనుట, మీగడను = పాలు కాచగా పైన పేరుకొనే మీగడను, పంచదారతో = చక్కెరతో చేర్చి, మెక్కినభంగిన్ = తృప్తిగా భుజించినవిధంగా, మీ = మీయొక్క, విమల = స్వచ్ఛమయిన, మేచక = నల్లని, శ్యామలమైన, రూప = ఆకారమనెడు,స్వరూపమనెడు, సుధారసము = అమృతరసమును, అమృతంవంటి ద్రవాన్ని, నా = నా యొక్క, మక్కువ = ప్రేమ అనే, పళ్లెరంబునన్ = భోజనపాత్రలో, సమాహిత = తగినట్టి, హెచ్చరికగల, దాస్యము = సేవ, కొలువు, అనేటి = అనునట్టి, దోయిటన్ = దోసిలితో, తక్కెను = లభించెను, అటంచు = భావించి, అనుచు, జుర్రెదన్ = జుర్రుతున్నాను, త్రాగుతున్నాను, సమృద్ధిగా రుచిచూస్తున్నాను.

తా: చిక్కనిపాలను కాచినప్పుడు, దానిమీదిమిసమిసలాడే మీగడను చక్కెరలో కలిపి తిన్నవిధంగా, అమృతరసంలాగా ఉండే స్వచ్ఛమైన నీనల్లనిరూపాన్ని నేను ప్రేమతో స్వీకరించి, దాస్యరూపమైన కైంకర్యం చేసి తనివితీర అనుభవిస్తాను.

వ్యా: శ్రీరాముని త్రిజగన్మోహనరూపాన్ని సందర్శించగా కలిగే ఆధ్యాత్మికానందాన్ని

కారాగృహవాసం యథార్థానికి కొండవంటి కష్టమే. అయినా శ్రీరామునిఅనుగ్రహంచేత క్షణంలో కూలి నశించిపోయింది. తిరిగి శ్రీరామునిసన్నిధానం లభించింది. ఈ భక్తునికి తన దైవసాన్నిధ్యంలో లభించినసౌఖ్యం ఇంద్రునికి కలిగే మహోన్నతసౌఖ్యాలకు తీసిపోయేది ఏమికాదు. రామదాసుగారు వ్రాసిన కీర్తనలవలన, ఆయనపద్యాలవలన మూడువందల సంవత్సరాలు గడచిపోయినా, తెలుగువారు, రామభక్తులు ఆయనను నిరంతరం జ్ఞాపకంచేసుకొంటూ ఉన్నారు. ఇది ఆయనను మోక్షలక్ష్మి వరించడంకంటె అల్పమేమి కాదు.

ఈ శతకకర్త తన కథను అందరికథల్లాగా చెప్పేనేర్పు కలవాడు. దీనినే సాహిత్యపరిభాషలో ఆత్మాశ్రయత్వం అంటారు. అధికారం రావడం, దానిప్రేరణచేత దోషాలు చేయడం, భగవద్ధ్యానంవలన ఆదోషాలు మాసిపోవడం ప్రతిమానవునిజీవితంలో సామాన్యమైనవే. ఈ కవి తనజీవితాన్ని ఈ పద్యంలో సాధారణీకరణంచేసి భగవంతునిమీద భక్తులు విశ్వాసం కలిగిఉండాలని రమణీయంగా ప్రబోధం చేసినాడు.

**30. ఉ.చిక్కనిపాలపై మిసిమి జెందిన మీగడ పంచదారతో**
**మెక్కినభంగి మీవిమలమేచకరూపసుధారసంబు నా**
**మక్కువపళ్లెరంబున సమాహితదాస్యమనేటి దోయిటన్**
**దక్కెనటంచు జుర్రెదను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చిక్కనిపాలపై = నీరు కలుపని చిక్కనైన పాలమీది, మిసిమిన్ = కాంతిని చెందిన = పొందిన (చమురుతో) కాంతిమంతమైనదనుట, మీగడను = పాలు కాచగా పైన పేరుకొనే మీగడను, పంచదారతో = చక్కెరతో చేర్చి, మెక్కినభంగిన్ = తృప్తిగా భుజించినవిధంగా, మీ = మీయొక్క, విమల = స్వచ్ఛమయిన, మేచక = నల్లని, శ్యామలమైన, రూప = ఆకారమనెడు,స్వరూపమనెడు, సుధారసము = అమృతరసమును, అమృతంవంటి ద్రవాన్ని, నా = నా యొక్క, మక్కువ = ప్రేమ అనే, పళ్లెరంబునన్ = భోజనపాత్రలో, సమాహిత = తగినట్టి, హెచ్చరికగల, దాస్యము = సేవ, కొలువు, అనేటి = అనునట్టి, దోయిటన్ = దోసిలితో, తక్కెను = లభించెను, అటంచు = భావించి, అనుచు, జుర్రెదన్ = జుర్రుతున్నాను, త్రాగుతున్నాను, సమృద్ధిగా రుచిచూస్తున్నాను.

తా: చిక్కనిపాలను కాచినప్పుడు, దానిమీదిమిసమిసలాడే మీగడను చక్కెరతో కలిపి తిన్నవిధంగా, అమృతరసంలాగా ఉండే స్వచ్ఛమైన నీనల్లనిరూపాన్ని నేను ప్రేమతో స్వీకరించి, దాస్యరూపమైన కైంకర్యం చేసి తనివితీర అనుభవిస్తాను.

వ్యా: శ్రీరాముని త్రిజగన్మోహనరూపాన్ని సందర్శించగా కలిగే ఆధ్యాత్మికానందాన్ని

తృప్తిని కవి ఈ పద్యంలో ఒక భౌతికమైన అనుభవంతో పోల్చి దాన్ని అందరికి అందుబాటులో ఉండే విధంగా చెబుతున్నాడు. పాలమీగడ పంచదారతో కలిపి దోసిలి నిండా తింటే ఎంతటి తృప్తి కలుగుతుందో (భౌతికంగా) శ్రీరాముని సుందర మనోహరశ్యామలరూపాన్ని దర్శించినప్పుడు, ఆయనభక్తునికి, ఈ కవికి అంతటితృప్తి కలుగుతున్నదట. మధురపదార్థాన్ని భుజించినప్పుడు ఒక విధమయినమత్తు కలుగడం అందరికి అనుభవమే. అదే విధంగా పుంసాం మోహనరూపుడైన శ్రీరాముని దర్శించినప్పుడు భక్తునికి అటువంటిమత్తు, పారవశ్యం కలుగుతుందని కవి వక్కాణిస్తున్నాడు.

ఈ పద్యంలో కవి భక్తితో, 'దాస్యమనేటిదోయిటన్' శ్రీరామునిమేచక రూపసుధారసంబును జుర్రుతానని చెబుతున్నాడు. తాను భగవంతుని సేవించడానికి దాస్యం అనేదాన్ని సాధనంగా చేసుకొన్నానని చెప్పినట్లున్నది. భగవంతుణ్ణి సేవించడానికి నిర్దేశింపబడిన నవవిధభక్తిమార్గాల్లో దాస్యం ఒకటి. పూర్వం పన్నిద్దరాళ్వారుల్లోఒకరైన విప్రనారాయణుడు నారాయణునికి మాలాకైంకర్యం చేసి, కైవల్యాన్ని పొందినాడు. అటులే, ఆళ్వారుల్లో ముఖ్యుడైన పెరియాళ్వారు- ఆయనే విష్ణుచిత్తుడు- కూడ దాస్యమార్గాన్ని అవలంబించినవాడే.

ఈ పద్యం చదివినప్పుడు ఈ రామదాసకీర్తన మననం చేసుకోవలసిందే.

ఓరామ నీనామమేమి రుచిరా- శ్రీరామ నీనామమేమి రుచిరా - ఇత్యాదిగా

ఈ పద్యంలో ఉపమాలంకారం ప్రయోగింపబడింది.

**31.చ. సిరులిడ సీత, పీడలెగఁజిమ్ముటకున్ హనుమంతుఁడార్తిపోఁ**
**దరుమ సుమిత్రసూతి, దురితంబులు మానప రామనామమున్**
**గరుణదలిర్ప, మానవులఁ గావఁగఁ బన్నిన వజ్రపంజరో**
**త్కరముగదా భవన్మహిమ, దాశరథీ-కరుణాపయోనిధీ.**

ప్ర: సిరులు = సంపదలు, ఇడన్ = ఇవ్వడానికి, సీత = సీతాదేవి, పీడలు = బాధలు, కష్టాలు, ఎగజిమ్ముటకున్ = అవలీలగా పోగొట్టడానికి, దూరంగా పారవేయడానికి హనుమంతుఁడు = ఆంజనేయుడు, ఆర్తి = సంకటాలను, కష్టాలను, పోన్+తరుమన్ =త్రోలివేయటానికి, సుమిత్రసూతి = సుమిత్రాకుమారుడైన లక్ష్మణుడు, దురితంబులు = పాపములు, మానుపన్ = తొలగించడానికి, రామనామము = రామునిపేరు, రామ అనే ఏ నామము, కరుణ = దయ, తలిర్పన్ = మీరగా, అతిశయించగా, మానవులకు =మనుష్యులను, కావఁగన్ = కాపాడడానికి, రక్షించడానికి, పన్నిన = ఏర్పాటు చేసిన వజ్ర = రత్నాలలో ఒకటియైన వజ్రంతో తయారుచేసిన, పంజరము = గూండ్లయొక్క

తృప్తిని కవి ఈ పద్యంలో ఒక భౌతికమైన అనుభవంతో పోల్చి దాన్ని అందరికి అందుబాటులో ఉండే విధంగా చెబుతున్నాడు. పాలమీగడ పంచదారతో కలిపి దోసిలి నిండా తింటే ఎంతటి తృప్తి కలుగుతుందో (భౌతికంగా) శ్రీరాముని సుందర మనోహరశ్యామలరూపాన్ని దర్శించినప్పుడు, ఆయనభక్తునికి, ఈ కవికి అంతటితృప్తి కలుగుతున్నదట. మధురపదార్థాన్ని భుజించినప్పుడు ఒక విధమయినమత్తు కలుగడం అందరికి అనుభవమే. అదే విధంగా పుంసాం మోహనరూపుడైన శ్రీరాముని దర్శించినప్పుడు భక్తునికి అటువంటిమత్తు, పారవశ్యం కలుగుతుందని కవి వక్కాణిస్తున్నాడు.

ఈ పద్యంలో కవి భక్తితో, 'దాస్యమనేటిదోయిటన్' శ్రీరామునిమేచక రూపసుధారసంబును జుర్రుతానని చెబుతున్నాడు. తాను భగవంతుని సేవించడానికి దాస్యం అనేదాన్ని సాధనంగా చేసుకొన్నానని చెప్పినట్లున్నది. భగవంతుణ్ణి సేవించడానికి నిర్దేశింపబడిన నవవిధభక్తిమార్గాల్లో దాస్యం ఒకటి. పూర్వం పన్నిద్దరాళ్వారుల్లోఒకరైన విప్రనారాయణుడు నారాయణునికి మాలాకైంకర్యం చేసి, కైవల్యాన్ని పొందినాడు. అటులే, ఆళ్వారుల్లో ముఖ్యుడైన పెరియాళ్వారు- ఆయనే విష్ణుచిత్తుడు- కూడ దాస్యమార్గాన్ని అవలంబించినవాడే.

ఈ పద్యం చదివినప్పుడు ఈ రామదాసకీర్తన మననం చేసుకోవలసిందే.

ఓరామ నీనామమేమి రుచిరా- శ్రీరామ నీనామమేమి రుచిరా - ఇత్యాదిగా

ఈ పద్యంలో ఉపమాలంకారం ప్రయోగింపబడింది.

**31.చ. సిరులిడ సీత, పీడలెగఁజిమ్ముటకున్ హనుమంతుఁడార్తిపోఁ**
**దరుమ సుమిత్రసూతి, దురితంబులు మానుప రామనామమున్**
**గరుణదలిర్ప, మానవులఁ గావఁగఁ బన్నిన వజ్రపంజరో**
**త్కరముగదా భవన్మహిమ, దాశరథీ-కరుణాపయోనిధీ.**

ప్ర: సిరులు = సంపదలు, ఇడన్ = ఇవ్వడానికి, సీత = సీతాదేవి, పీడలు = బాధలు, కష్టాలు, ఎగజిమ్ముటకున్ = అవలీలగా పోగొట్టడానికి, దూరంగా పారవేయడానికి హనుమంతుఁడు = ఆంజనేయుడు, ఆర్తి = సంకటాలను, కష్టాలను, పోన్+తరుమన్ = త్రోలివేయటానికి, సుమిత్రసూతి = సుమిత్రాకుమారుడైన లక్ష్మణుడు, దురితంబులు = పాపములు, మానుపన్ = తొలగించడానికి, రామనామము = రామునిపేరు, రామ అనే నీ నామము, కరుణ = దయ, తలిర్పన్ = మీరగా, అతిశయించగా, మానవులకు = మనుష్యులను, కావఁగన్ = కాపాడడానికి, రక్షించడానికి, పన్నిన = ఏర్పాటు చేసిన వజ్ర = రత్నాలలో ఒకటియైన వజ్రంతో తయారుచేసిన, పంజరము = గూండ్లయొక్క

ఉత్కరము కదా = సమూహము, భవత్+మహిమ = నీయొక్క మాహాత్మ్యము అగును.

తా : ఓ దశరథరామా, ఓ దయాసముద్రమా, నిన్ను సేవించుమానవులకు సిరిసంపదలను అందించడానికి సీతాదేవి ఉన్నది. బాధలను తొలగించడాని నీభృత్యుడైన హనుమంతుడున్నాడు. సంకటాలు వచ్చినప్పుడు, వాటినితరిమివేయటానికి లక్ష్మణమూర్తి ఉన్నాడు. పాపాలను నిర్మూలించడానికి నీ నామమున్నది. పక్షులను వజ్రపుగూండ్లు కాపాడినట్లుగా నీమాహాత్మ్యము భక్తులైన మానవులను రక్షచేస్తుంది.

వ్యా: కంచెర్ల గోపన్నకవి, భద్రాచలంలో నివసించిఉండే శ్రీసీతారామలక్ష్మణులు తమ భక్తులైన మానవులను ఏ విధంగా కాపాడుతారో, ఒక్కొక్కరు తమ విధులను తమ భక్తులపట్ల నిర్వహిస్తారో ఈ పద్యంలో చెబుతున్నాడు.

శ్రీమహావిష్ణువు దశరథమహారాజుకుమారుడుగా అవతరించినాడు. విష్ణుమూర్తి మానవలోకానికి వచ్చినప్పుడు శ్రీమహాలక్ష్మి సీతాదేవిరూపంలో జనకమహారాజుకుమార్తెగా అవతరించి, శ్రీరాముని వరించి వివాహం చేసికొన్నది. వైకుంఠంలో అనునిత్యం సేవచేసి, విష్ణుమూర్తిని మెప్పించే ఆదిశేషుడు లక్ష్మణమూర్తిగా అవతరించి, మానుషజన్మలోను శ్రీరామునిసేవచేసి తన విధ్యుక్తధర్మాన్ని నిర్వహించినాడు. దేవతలు వానరరూపాల్లో జన్మించి శ్రీరాముని అనుసరిస్తామన్నారుకదా. హనుమంతుడు అటువంటివాడే. భద్రాచలంలో ఉండే శ్రీ సీతారామలక్ష్మణులు, హనుమంతుడు నరవానరులవంటి స్వరూపాలు కలిగినవారైనప్పటికి వారిమహిమలు ఇట్టివని వాల్మీకి రామాయణం వక్కాణిస్తున్నది.

సీతాదేవిశక్తినిగురించి రామాయణం వర్ణించింది. సీతారామలక్ష్మణహనుమంతులు, సంపదలనీయడంలోను, బాధలను పోగొట్టడంలోను, కష్టాలను తొలగించడంలోను, పాపాలను నిర్మూలించడంలోను, దయను చూపించడంలోను, భక్తులను కాపాడడంలోను నిత్యం అండగా ఉండి, వారికి కఠినాతికఠినమైన వజ్రపంజరంలాగ ఉండడంలో ఆశ్చర్యమేమున్నది? రాముడు తనమహిమలచేత ఈ వజ్రపంజరాన్ని నిర్మించి తనభక్తులను, మానవులను కాపాడుతున్నాడని కవి వర్ణించినాడు.

**32.చ హలకులిశాంకుశధ్వజశరాసనశంఖరథాంగకల్పకో**
**జ్జ్వలజలజాతరేఖలను సాంకములై కనుపట్టుచున్న మీ**
**కలితపదాంబుజద్వయము గౌతమపత్నికొసంగినట్లు నా**
**తలఁపునఁజేర్చి కావఁగదె దాశరథీ కరుణాపయోనిధీ.**

ఉత్కరము కదా = సమూహము, భవత్+మహిమ = నీయొక్క మాహాత్మ్యము. అగును.

తా : ఓదశరథరామా, ఓదయాసముద్రమా, నిన్ను సేవించుమానవులకు సిరిసంపదలను అందించడానికి సీతాదేవి ఉన్నది. బాధలను తొలగించడాని నీభృత్యుడైన హనుమంతుడున్నాడు. సంకటాలు వచ్చినప్పుడు, వాటినితరిమివేయటానికి లక్ష్మణమూర్తి ఉన్నాడు. పాపాలను నిర్మూలించడానికి నీ నామమున్నది. పక్షులను వజ్రపుగూండ్లు కాపాడినట్లుగా నీమాహాత్మ్యము భక్తులైన మానవులను రక్షచేస్తుంది.

వ్యా: కంచెర్ల గోపన్నకవి, భద్రాచలంలో నివసించిఉండే శ్రీసీతారామలక్ష్మణులు తమ భక్తులైన మానవులను ఏ విధంగా కాపాడుతారో, ఒక్కొక్కరు తమ విధులను తమ భక్తులపట్ల నిర్వహిస్తారో ఈ పద్యంలో చెబుతున్నాడు.

శ్రీమహావిష్ణువు దశరథమహారాజుకుమారుడుగా అవతరించినాడు. విష్ణుమూర్తి మానుషలోకానికి వచ్చినప్పుడు శ్రీమహాలక్ష్మి సీతాదేవిరూపంలో జనకమహారాజుకుమార్తెగా అవతరించి, శ్రీరాముని వరించి వివాహం చేసికొన్నది. వైకుంఠంలో అనునిత్యం సేవచేసి, విష్ణుమూర్తిని మెప్పించే ఆదిశేషుడు లక్ష్మణమూర్తిగా అవతరించి, మానుషజన్మలోను శ్రీరామునిసేవచేసి తన విధ్యుక్తధర్మాన్ని నిర్వహించినాడు. దేవతలు వానరరూపాల్లో జన్మించి శ్రీరాముని అనుసరిస్తామన్నారుకదా. హనుమంతుడు అటువంటివాడే. భద్రాచలంలో ఉండే శ్రీ సీతారామలక్ష్మణులు, హనుమంతుడు నరవానరులవంటి స్వరూపాలు కలిగినవారైనప్పటికి వారిమహిమలు ఇట్టివని వాల్మీకి రామాయణం వక్కాణిస్తున్నది.

సీతాదేవిశక్తినిగురించి రామాయణం వర్ణించింది. సీతారామలక్ష్మణహనుమంతులు, సంపదలనీయడంలోను, బాధలను పోగొట్టడంలోను, కష్టాలను తొలగించడంలోను, పాపాలను నిర్మూలించడంలోను, దయను చూపించడంలోను, భక్తులను కాపాడడంలోను నిత్యం అండగా ఉండి, వారికి కఠినాతికఠినమైన వజ్రపంజరంలాగ ఉండడంలో ఆశ్చర్యమేమున్నది? రాముడు తనమహిమలచేత ఈ వజ్రపంజరాన్ని నిర్మించి తనభక్తులను, మానవులను కాపాడుతున్నాడని కవి వర్ణించినాడు.

**32.చ హలకులిశాంకుశధ్వజశరాసనశంఖరథాంగకల్పకో**
**జ్జ్వలజలజాతరేఖలను సాంకములై కనుపట్టుచున్న మీ**
**కలితపదాంబుజద్వయము గౌతమపత్నికొసంగినట్లు నా**
**తలఁపునఁజేర్చి కావఁగదె దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : హల = నాగేలు, కులిశ = వజ్రాయుధము, అంకుశ = బల్లెమువంటి పొడిచే ఆయుధము, ధ్వజము = టెక్కెము, జెండా, శరాసనము = ధనుస్సు, విల్లు, శంఖ = సంకువు, రథాంగము = చక్రము, కల్పక = కల్పవృక్షము, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న జలజాత = తామర, ఇవన్ని, రేఖలను = రేఖలచేత, సాంకములు = గురుతులతోగూడినవి, అయి, కనుపట్టుచున్న = అగుపడుతున్న, మీ, కలిత = ఒప్పుతున్న, పద+అంబుజ = అడుగుపద్మాలయొక్క, ద్వయము = జంటను, రెండింటిని, గౌతమపత్నికి = గౌతమునిభార్య అయిన అహల్యకు, ఒసంగినట్లు, నా తలంపునన్ = నామనస్సునందు, చేర్చి, = కూర్చి, కావన్ కదె = రక్షింపుమా, కాపాడుమా.

తా: నాగేలు, వజ్రాయుధము, అంకుశము, జెండా, ధనుస్సు, శంఖము, చక్రము, కల్పవృక్షము, ప్రకాశించేపద్మమువంటిరూపాలతో ఉండే మీ పాదారవిందములు, వాటివలన గౌతముని పత్నియైన అహల్యకిచ్చి ఆమెజడరూపాన్ని మార్చికాపాడినావుకదా. ఆ విధంగానే నా మనస్సులో నీ పాదపద్మాలను కూర్చి నన్ను రక్షించుమయ్యా ఓ దశరథరామా.

వ్యా: విష్ణుమూర్తిభక్తుడు ఎల్లప్పుడు తనదైవము పాదపద్మాలను స్మరించుకోవడమనేది విశిష్టాద్వైత సంప్రదాయం. భగవన్నామాంకితమైనవి, నారాయణాత్మకమైనవి అయిన రెండు వాక్యాలు ద్వయం అనే పేరుతో వైష్ణవులు నిరంతరం ధ్యానించుకొని విష్ణుమూర్తిపాదాలను ఆశ్రయిస్తారు. దానివలన వారికి కైవల్యం లభిస్తుందని విశ్వసిస్తారు. పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుని గురించి శ్రీమద్భాగవతంలో ఈ విధంగా చెప్పబడింది:

> **పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ**
> **లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత**
> **శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాద సం**
> **ధానుండై మరచెన్ సురారిసుతుఁడేతద్విశ్వమున్ భూవరా**

మంచినీటిని గ్రహించినా, భోజనం చేసినా, మాటాడినా, నవ్వినా, నిద్రపోయినా, తిరిగినా, ఎల్లప్పుడు శ్రీమన్నారాయణపాదపద్మాలను స్మరించుకొనే పరమభక్తుడు ప్రహ్లాదుడు.

సాముద్రికశాస్త్రంలో, నాగలి, వజ్రాయుధం, అంకుశం, జెండా, ధనుస్సు, శంఖచక్రాలు, కల్పవృక్షం, పద్మం అనే రేఖలు, మానవుల అరచేతుల్లో కనిపిస్తే శుభసూచకాలు అని చెబుతారు. విష్ణుమూర్తిపాదాల్లో ఈ గుర్తులన్ని ఉన్నాయని గోపన్నగారు వర్ణిస్తున్నారు. కలియుగ శ్రీమహావిష్ణువుగా భావింపబడే శ్రీ వేంకటేశ్వరస్వామి పాదపద్మాల్లో శంఖచక్రాలున్నాయని, శ్రీ వేంకటేశ్వరప్రపత్తిలో చెప్పబడి ఉన్నది. భగవానునికి ఏ మంచి

లక్షణాలున్నా, అవి భక్తులకే ఉపయోగిస్తాయి. కాబట్టి ఈ సల్లక్షణాలు కలిగిన పాదపద్మాలు కవిమనస్సులో చేర్చమని శ్రీరాముని, తనదైవాన్ని కవి ప్రార్థిస్తున్నాడు. కవియే కాదు, ఆయన వ్రాసిన ఈ పద్యం చదివినవారెవరైనా భగవంతునితో ఈ ప్రార్థన చేసినట్లే.

రామాయణంలోని ఒక వృత్తాంతాన్ని మనస్సులో పెట్టుకొని, ఇన్ని సల్లక్షణాలు కలిగిన శ్రీరామపాదాలు గౌతమపత్నిని కాపాడినట్లు తనను కాపాడమనికూడ ప్రార్థించడం జరిగింది.

రాతిని నాతిగ చేసిన శ్రీరామ పాదపద్మాలపై విశ్వాసం ఉన్న ఈ కవి తన కీర్తనల్లో చాలచోట్ల వాటిని స్మరించి ఉన్నాడు. ప్రఖ్యాతమైన రామదాసుకీర్తన

*చరణములే నమ్మితి- నీదివ్యచరణములే నమ్మితి*

*బాగుగ నన్నేలు భద్రాచలరామ-దాసుడ దాసుడ దాసుడ నీ దివ్య॥*

అందరికీ తెలిసిందే. అందరు మననం చేసికొనేదే.

**33.చ. జలనిధిలోన దూటి, కులశైలముమీటి, ధరిత్రిఁగొమ్మునం**
**దలవడమాటి, రక్కసునియంగముగీటి, బలీంద్రునిన్ రసా**
**తలమునమాటి, పార్థివకదంబము గూల్చినమేటి రామ, నా**
**తలఁపువనాటి రాఁగదవె, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : జలనిధిలోనన్ = సముద్రంలోపల, దూటి = ప్రవేశించి, చొచ్చి, కులశైలమున్= కులపర్వతాన్ని, మీటి = ఎగనెత్తి, ధరిత్రిన్ = భూమిని, భూగోళాన్ని, కొమ్మునందున్ = కోరయందు, కొమ్మునందు, అలవడన్ = పొందికగా, అవలీలగా, మాటి = తగిల్చి, రక్కసుని = రాక్షసుని (హిరణ్యకశిపుని), అంగమును = శరీరాన్ని, గీటి = చీల్చి, నశింపచేసి, బలీంద్రునిన్ = బలిచక్రవర్తిని, రసాతలమునన్ = పాతాళలోకమునందు, మాటి = చాటుచేసి, పార్థివకదంబమున్ = రాజుల, క్షత్రియసమూహాన్ని, కూల్చిన, = పడవేసిన, నాశముచేసిన, మేటి = దిట్టవు, ప్రముఖుడవు, అయిన, రామ = రామచంద్రా, నా తలఁపునన్ = నాభావంలో, నా చింతనమందు, నాటి = నెలకొని, నివసించి, రాఁగదవె = రమ్ము.

తా : ఓ దశరథరామా, నీవుమత్స్యమవై, వేదాలనుద్ధరించడానికి సోమకాసురుని సంహరించడానికి సముద్రగర్భంలో ప్రవేశించినావు. కూర్మముగా మారి మందరపర్వతాన్ని పాలసముద్రంలోమునిగి దాన్ని ఎత్తి నిలిపినావు. వరాహరూపాన్ని ధరించి ప్రళయజలంలో మునిగిన భూమిని కోరకొమ్మున నెత్తికొని వచ్చినావు. ఉద్ధరించినావు. నరసింహుడవై

నీ భక్తుడైన ప్రహ్లాదుని రక్షించడానికి హిరణ్యకశిపునిదేహమును చీల్చినావు. వామనుడవై బలిచక్రవర్తిని పాతాళమునకు అణగద్రొక్కినావు. పరశురాముడవుగా, రాజసమూహాన్ని సంహరించినావు. అట్టి నీవు నామనస్సులో స్థిరంగా నిలిచి ఉండుమా.

వ్యా: ఈ పద్యంలో విష్ణునిఅవతారమైన శ్రీరాముడు ఎన్నిరూపాలలో అవతరించినాడో వర్ణించి చెప్పినాడు. జగదుత్పత్తి-స్థితి-ప్రళయాలకు భగవానుడు అహేతువు, హేతువునై దయామయుడై, సచ్చిదానందుడై అనేక లీలలను నిర్వహిస్తూ ఉంటాడు. ఆ భగవానుడు సగుణ సాకార చిన్మయరూపాన్ని ధ్యాన - ధారణ - నామజప - లీలాచింతనలతో భక్తుని, సాధకునిహృదయం పరిశుద్ధమవుతుంది. లోకంలో ధర్మసంస్థాపనకు, జ్ఞానసంరక్షణకు, భక్తులను రక్షించడానికి, దుష్టులను దుండగులను శిక్షించడానికి, భగవానుడు పదేపదే అవతరిస్తుంటాడు. ఈ అవతారరూపాలు దివ్యమైనవి. సచ్చిదానందమయములు. పరమమంగళకరములు. అతిమానుషశక్తి స్వరూపుడు, సత్యస్వరూపుడైన భగవంతుని అవతారాలు అసంఖ్యాకాలుగా ఉంటాయని భావిస్తారు. కాని, మన అష్టాదశపురాణాలలో చాలచోట్ల దశావతారాల ప్రస్తావన ఉన్నది. అవి ఇవి: మత్స్యావతారము. కూర్మావతారము, వరాహావతారము, శ్రీనృసింహావతారము, వామనావతారము, పరశురామావతారము, శ్రీరామావతారము, బలరామావతారము, బుద్ధావతారము, కల్కి అవతారము. ఇన్ని అవతారాలు శ్రీమన్నారాయణుడే. త్రేతాయుగంలో మానవాకారంగ శ్రీరామునిరూపంలో భూలోకంలో శ్రీమన్నారాయణుడు అవతరించినాడు. శ్రీరాముడు సర్వజగద్వ్యాపి. సర్వగతుడు. సమస్తలోకానికి ఆప్తబంధువు. జయదేవకవి తన గీతగోవిందంలో శ్రీమన్నారాయణుని అవతారాలను ఈ విధంగా వర్ణించినాడు.

*వేదానుద్ధరతే, జగన్నివహతే, భూగోళముద్బిభ్రతే,*
*దైత్యం దారయతే, బలిం ఛలయతే, క్షత్రక్షయం కుర్వతే,*
*పౌలస్త్యం జయతే, హలం కలయతే, కారుణ్యమాతన్వతే,*
*మ్లేచ్ఛాన్మూర్ఛయతే, దశాకృతికృతే కృష్ణాయ తుభ్యం నమః.*

తెలుగు సాహిత్యంలోశ్రీకృష్ణదేవరాయులు తన ఆముక్తమాల్యదలోను, తెనాలిరామకృష్ణకవి తన పాండురంగమాహాత్మ్యంలోను, దశావతారపద్యాలను మనోహరంగా రచించి తమ విష్ణుభక్తిని చాటుకొన్నారు. విష్ణుకథాత్మకమైన ఈ పద్యాలు వ్రాయడం చేతనే ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యాలు, కావ్యాలైనా వాటికి ప్రబంధాలు అనేవ్యాప్తి కలిగింది. విశిష్టాద్వైతసంప్రదాయంలో విష్ణుకథాత్మకమైన

కావ్యాలను దివ్యప్రబంధాలు, ప్రబంధాలు అని వ్యవహరించడం ఉన్నది. అదే సంప్రదాయాన్ని అనుసరించి ఈ కావ్యాలకుకూడ ప్రబంధసంకేతం సముచితంగా భాసించింది.

మహాభారతంశాంతిపర్వంలో విష్ణుమూర్తిదశావతారాలప్రసంగం ఇట్లా ఉన్నది:

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః

రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిశ్చ తే దశ

ఇక శ్రీమద్భాగవతంలో వ్యాసమహర్షి విష్ణుమూర్తి పదిఅవతారాలనుగురించి చాల వివరంగా వ్రాసి ఉన్నాడు. ఆ కథలను అన్నింటిని విశదంగా తిరిగి ఉల్లేఖించడం సాధ్యం కాదు.

ఋగ్వేదంలోను, తైత్తిరీయబ్రాహ్మణంలోను దశరథ విదేహరాజజనక సీతాదేవీశ్రీరాములప్రస్తావన ఉన్నది. శ్రీరాముడు మర్యాదాపురుషుడు. మూర్తిమంతమైన ధర్మస్వరూపుడు. భారతీయసంస్కృతి పూర్తిగా శ్రీరామునిచరితలో సుప్రతిష్ఠితమై ఉన్నది. భారతదేశంలో ఆదర్శమూర్తి అయిన శ్రీరాముడు మానవసంస్కృతికి ఆదర్శమూర్తిగా భావింపబడినాడు. ఇటువంటి రాముడు- అతనిపేరు-సదా తనభావంలో నిలువవలెనని కవి వాంఛించడం, అతన్ని ప్రార్థించడం- సముచితంగా ఉన్నది.

**34.చ. భండనభీముఁడార్తజనబాంధవుఁడుజ్జ్వలబాణతూణకో**

**దండకళాప్రచండభుజతాండవకీర్తికి రామమూర్తికిన్**

**రెండవసాటిదైవమిఁక లేఁడనుచున్ గడగట్టి భేరికా**

**డాండడడాండడాండనినదంబులజాండము నిండ మత్తవే**

**దండమునెక్కి చాటెదను, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : భండన = యుద్ధంలో, భీముడు = భయంకరమైనవాడు, శివునివంటివాడు, ఆర్తజన = సంకటములో, బాధలో ఉన్న జనములకు, బాంధవుడు = చుట్టము, ఆప్తుడు, ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న, బాణ = అమ్ములును, తూణ = పొదులును గల, కోదండకళా = విలువిద్యయందు, ధనుర్వేదమునందు, ప్రచండ = తీవ్రమైన, భయంకరమైన, భుజ = బాహువులయొక్క, భుజములయొక్క, తాండవ = నటనము చేత గలిగిన, కీర్తికిన్= యశస్సుగలవాడగు, రామమూర్తికిన్ = శ్రీరామచంద్రునికి, రెండవ సాటిదైవము = అతనితో సమానమైన మరియొక దైవము, ఇఁక లేడనుచున్ = మరెక్కడ లేడు సుమా అనుచు, గడగట్టి = స్తంభమునాటి, జెండాగట్టి, భేరికా = ఢంకాయొక్క, డాండడడాండడాండ = ధ్వనిఅనుకరణ, నినదంబులు = చప్పుళ్లు, శబ్దములు, అజాండము = బ్రహ్మాండము,

నిండన్ = వ్యాపించగా, మత్తవేదండమున్ = మదించిన ఏనుగును, ఎక్కి చాటెదను = అధిరోహించి ప్రకటిస్తాను.

తా: ఓ దశరథరామా, శ్రీరాముడు శత్రువులకు యుద్ధంలో భయంకరుడు, భక్తులకు, కష్టాల్లో ఉన్నవారికి చుట్టమువంటి ఆప్తుడు. బాణములును, అమ్ములపొదులును ప్రకాశించే విలువిద్య నెరపే తీవ్రమైన భుజముల కదలికలోని నేర్పుచేత, లాఘవంచేత పొగడ్తగన్న శ్రీరామచంద్రునకు, సాటిదైవము మరిఒకరు లేరనుచు, బహ్మాండమదిరి పోయేటట్లుగా, డాండాం అనే భేరీ ధ్వని చేస్తూ, మదించిన ఏనుగును ఎక్కి సర్వప్రపంచంలో ప్రకటిస్తాను.

వ్యా: ఈ పద్యంలో కవికి శ్రీరామునిపైగల భక్తివిశ్వాసములు అనన్యమైనవి అనే భావాన్ని ప్రకటన చేసినాడు. శ్రీరాముని గుణగణాలనుకూడ ఈ పద్యంలో వర్ణించినాడు.

శ్రీరాముడు భండనభీముడు- అంటే యుద్ధంలో భయంకరమైనవాడు. అనేది సామాన్యార్థం. భీముడు అంటే శివుడు అనే అర్థంకూడ ఉన్నది కాబట్టి, శివుడుతనయుద్ధంలో సర్వశత్రువులను ఏ విధంగా నాశనంచేస్తాడో శ్రీరాముడుకూడ అంతటిభయంకర యుద్ధంచేసి శత్రుసంహారంచేస్తాడని కవిసూచన.

శ్రీరాముని చరిత్రయే శరణాగతవాత్సల్యం. ఆయన తనజీవితంలో ఎంతమంది శరణువేడినవారిని రక్షించినాడో లెక్కలేదు. ఉదాహరణకు అహల్యాదేవిని శాపవిముక్తను జేసినాడు. సుగ్రీవుని కాపాడి ఆయనకు రాజ్యాన్ని ఇప్పించినాడు. అన్నచేత అవమానాలపాలై దేశబహిష్కారం పొందిన విభీషణునికి లంకారాజ్యం ధారాదత్తం చేసినాడు. ఇంకా మరెందరినో. చివరకు ఆర్తుడైన గోపన్నను చెరసాలవిముక్తుని గావించలేదా? అందుకే ఆయన ఆర్తజనబాంధవుడు.

దండకారణ్యంలో శ్రీరామునికి ఖరునితో యుద్ధం చేయవలసివచ్చింది. అతడు అసంఖ్యాకసైన్యంతో వచ్చి శ్రీరామునిమీద అస్త్రశస్త్రాలు ఖడ్గాలు కురిపిస్తాడు. శ్రీరాముని శరీరం రక్తసిక్తం అవుతుంది. అయినా అతనిశక్తి ఉత్సాహం క్షీణించవు. రాముడు తన ధనుస్సును వలయాకారంగా లాగి వేలకొద్ది బాణాలను ఒక్కసారిగా ప్రయోగించినాడు. ప్రజ్వలితవహ్నికణాల్లాగా ఆ బాణాలు శత్రుసైన్యాన్ని ముహూర్తకాలంలో సంహరించి ఆకాశంలో ప్రకాశించినాయి. ఏనుగులు, గుర్రాలు, రథాలు, సారథులు, యోధులు సైన్యాధిపతులు ఛిన్నాభిన్నమై క్షతగాత్రులైనారు. రక్తసిక్తమై రణరంగంలో పడిపోయినారు. ఈ యుద్ధంలో చూపించిన రాముని ధనుర్విద్య అనన్యమైంది. లక్ష్మణుడు సీతాదేవికి రక్షకుడుగా ఉండినాడు. కాబట్టి ఇది శ్రీరాముని ఒంటరి యుద్ధమే. కంచెర్లగోపన్నగారు

ఇటువంటియుద్ధాన్ని స్మరించి కాబోలు శ్రీరామునికి 'ఉజ్జ్వల బాణతూణకోదండకళాప్రచండభుజతాండవకీర్తి' అనే బిరుదాన్ని ప్రదానించి ధన్యుడనిపించుకొన్నాడు.

పూర్వం రాచరిక వ్యవస్థ మనదేశంలో ఉన్నప్పుడు వందిమాగధులు రాజులకుగల బిరుదాలను, వారికీర్తిని లోకంలో పొగడుతూఉండేవారు. అట్లాగే శ్రీరాముడు చేసినఘనకార్యాలను గోపన్నగారు ఢంకా వాయిస్తూ, ఏనుగుమీద కూర్చుని లోకానికి చాటిచెబుతానని అంటున్నారు. మదేభంపై ఎక్కి ఈ పని చేసినారో లేదో కాని, ఈ పద్యం వ్రాసి శ్రీరామునిఘనత ఎటువంటిదో చాటి,భక్తులకు, కవులకు, పాఠకులకు విదితం చేసి తమ కవిత్వాన్ని సార్థకం చేసికొన్నారు.

**35.చ. అవనిజకన్నుదోయితొగలందు వెలింగెడుసోమ, జానకీ**
**కువలయనేత్రిగబ్బిచనుగొండల నుండు ఘనంబ, మైథిలీ**
**నవనవయౌవనంబను వనంబునకున్ మదదంతి నీవె కాఁ**
**దవిలి భజింతునెల్లపుడు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : అవనిజ = భూమిపుత్రిక సీతయొక్క, కన్నుదోయి = రెండు కన్నులనెడు (నేత్రద్వయి), తొగలందు = కలువపూవులందు, వెలింగెడు = ప్రకాశించే, సోమ = చంద్రుడైనవాడా, జానకీ = జనకుని కుమార్తె అయిన సీత అనే, కువలయనేత్రి = కలువపూవులవంటి కన్నులు గల వనిత-సుందరి, గబ్బి చనుగొండల = ఎత్తైన కొండలవంటి కుచములపై, ఉండు ఘనంబ = ఉండే మేఘమా, మైథిలి = మిథిలానగరాధీశునికుమార్తె సీతాదేవి యొక్క, నవనవ = చాలక్రొత్తగా ఉండే, యౌవనంబు = వయస్సు, ప్రాయము, అను వనంబునకు = అనే అందమైన తోటకు - ఉద్యానమునకు, మదదంతి = మదించిన ఏనుగవు, నీవె కాన్ = నీవే అని, తవిలి = ఆసక్తిగాని, ఎల్లప్పుడున్ = సతతము, సర్వదా, భజింతును = సేవింతును, కీర్తింతును.

తా: ఓ దశరథరామా, నీవు సీతాదేవి కనుదోయి అనే కలువలను వికసింపచేసే చంద్రుడవు. సీతాదేవి అనే కలువకంటి ఉన్నత గిరులవంటికుచములయందు నిలిచేమేఘమవు. మిథిలాపతికుమార్తె సీతాదేవి లేతప్రాయమనే పూలదోటలో విహరించే మదపుటేనుగులాంటివాడవు. అటువంటి సీతాదేవికి ప్రియుడైన నిన్ను ఎల్లప్పుడు భజిస్తాను, కీర్తిస్తాను. సేవిస్తాను.

వ్యా: సుందరమైన వనితకన్నులను కలువలతో పోల్చి చెప్పడం కవిసమయం. సీతాదేవికన్నులు కలువపూవులవంటివి. కలువలను వికసింపచేసేవాడుచంద్రుడు కాబట్టి

ఇటువంటియుద్ధాన్ని స్మరించి కాబోలు శ్రీరామునికి 'ఉజ్జ్వల బాణతూణకోదండకళాప్రచండభుజతాండవకీర్తి' అనే బిరుదాన్ని ప్రదానంచేసి ధన్యుడనిపించుకొన్నాడు.

పూర్వం రాచరిక వ్యవస్థ మనదేశంలోఉన్నప్పుడు వందిమాగధులు రాజులకుగల బిరుదాలను, వారికీర్తిని లోకంలో పొగడుతూఉండేవారు. అట్లాగే శ్రీరాముడు చేసినఘనకార్యాలను గోపన్నగారు ఢంకా వాయిస్తూ, ఏనుగుమీద కూర్చుని లోకానికి చాటిచెబుతానని అంటున్నారు. మదేభంపై ఎక్కి ఈ పని చేసినారో లేదో కాని, ఈ పద్యం వ్రాసి శ్రీరామునిఘనత ఎటువంటిదో చాటి,భక్తులకు, కవులకు, పాఠకులకు విదితం చేసి తమ కవిత్వాన్ని సార్థకం చేసికొన్నారు.

**35.చ. అవనిజకన్నుదోయితొగలందు వెలింగెడుసోమ, జానకీ**
**కువలయనేత్రిగబ్బిచనుగొండల నుండు ఘనంబ, మైథిలీ**
**నవనవయౌవనంబను వనంబునకున్ మదదంతి నీవె కా**
**దవిలి భజింతునెల్లపుడు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : అవనిజ = భూమిపుత్రిక సీతయొక్క, కన్నుదోయి = రెండు కన్నులనెడు (నేత్రద్వయి), తొగలందు = కలువపూవులందు, వెలింగెడు = ప్రకాశించే, సోమ = చంద్రుడైనవాడా, జానకీ = జనకుని కుమార్తె అయిన సీత అనే, కువలయనేత్రి = కలువపూవులవంటి కన్నులు గల వనిత-సుందరి, గబ్బి చనుగొండల = ఎత్తైన కొండలవంటి కుచములపై, ఉండు ఘనంబ = ఉండే మేఘమా, మైథిలి = మిథిలానగరాధీశునికుమార్తె సీతాదేవి యొక్క, నవనవ = చాలక్రొత్తగా ఉండే, యౌవనంబు = వయస్సు, ప్రాయము, అను వనంబునకు = అనే అందమైన తోటకు - ఉద్యానమునకు, మదదంతి = మదించిన ఏనుగవు, నీవె కాన్ = నీవే అని, తవిలి = ఆసక్తిగొని, ఎల్లప్పుడున్ = సతతము, సర్వదా, భజింతును = సేవింతును, కీర్తింతును.

తా: ఓ దశరథరామా, నీవు సీతాదేవి కనుదోయి అనే కలువలను వికసింపచేసే చంద్రుడవు. సీతాదేవి అనే కలువకంటి ఉన్నత గిరులవంటికుచములయందు నిలిచేమేఘమవు. మిథిలాపతికుమార్తె సీతాదేవి లేతప్రాయమనే పూలదోటలో విహరించే మదపుటేనుగులాంటివాడవు. అటువంటి సీతాదేవికి ప్రియుడవైన నిన్ను ఎల్లప్పుడు భజిస్తాను, కీర్తిస్తాను. సేవిస్తాను.

వ్యా: సుందరమైన వనితకన్నులను కలువలతో పోల్చి చెప్పడం కవిసమయం. సీతాదేవికన్నులు కలువపూవులవంటివి. కలువలను వికసింపచేసేవాడుచంద్రుడు కాబట్టి

కలువకు చంద్రునికి ప్రేయసీప్రియులసంబంధం చెప్పడం సంప్రదాయం. సీతాదేవికన్నులు కలువపూలైతే, శ్రీరాముడు వాటిని వికసింపచేసే చంద్రుడు. అంటే ఆమెభర్తగా, ప్రియుడుగా ఆమెమనస్సును సంతోషింపచేసి కన్నులు సంతసంతో వికసించేటట్లు చేస్తాడు.

ఉన్నతకుచములుండడం వనితలకు సౌందర్యలక్షణం. సీతాదేవి లోకోత్తరసౌందర్యం కలిగింది. కాబట్టి ఆ సల్లక్షణం ఆమెకు ఉన్నది. సీతాదేవిభర్త శ్రీరాముడు ఆ సౌందర్యానికి ముగ్ధుడు అయినాడు. ఎత్తైన కుచములను కొండలతో పోల్చడం కవి సమయం. కొండలు వర్షాకాలంలో మేఘాలను ఆకర్షిస్తాయి. ఆ విధంగానే సీతాదేవి గబ్బిచనుకొండలు శ్రీరాముని ఆకర్షిస్తే ఆయన అక్కడ చేరినాడు. కొండలకు మేఘాలకు ప్రేయసీప్రియసంబంధం చెప్పడం కవి సంప్రదాయమే. కాళిదాసు మేఘ సందేశప్రారంభంలో 'ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం' అని చెప్పినాడుకదా. సీతాదేవి లోకమాత. ఆమె వక్షోజములను గురించి చెప్పవచ్చునా అనే సందేహం రాకమానదు. కాని కవులు వనితకుచములను వర్ణించిన సందర్భాలున్నాయి. 'కుచోన్నతే కుంకుమరాగశోణే' అని దేవీస్తవంలో ఉన్నది. (వారు జగన్మాతలు. జీవులు ఆ తల్లులసంతతి. పసివారికి అమ్మపాలిండ్లపైనే దృష్టి. వాటిని గురించి చెప్పడమంటే వారిజగత్పోషణసామర్థ్యం గురించి చెప్పడమే.)

ఏనుగులు, అందులో మదించినవి, సుందరమైన వనాల్లో విహరించడం ప్రీతికరంగా భావిస్తాయి. మహావీరుడు, లోకోత్తరసుందరుడు, జగన్మోహనాకారుడు అయిన శ్రీరామచంద్రుని కవి మదగజంతో పోల్చినాడు. ఇట్లాచేయడంలో ఆయనశక్తి గాంభీర్యాలు వ్యక్తమైనాయి. ఇక ఆయన విహరించేది తనకు ప్రియాతిప్రియమైన సీతాదేవి సమీపంలోనే. ఆమె నవయౌవనం అనేది సుందరమైన ఉద్యాన వనంలాంటిది. దానిలో మదించిన ఏనుగులాగ ఆయన విహారం చేస్తాడు. అంటే సీతాదేవితో మనసార ఆనందిస్తాడు అని కవి చెప్పినాడు. నవవిధభక్తిమార్గాల్లో భజనం అనగా సేవ (పాదసేవనం) కూడ ఒకటి కాబట్టి సీతాదేవితో అనేకవిధాల ఆనందాన్ని పొందే శ్రీరాముని కవి భజించి తరిస్తానని అంటున్నాడు.

దాశరథి శతకం మౌలికంగా భక్తి శతకం. చాలపద్యాల్లో భక్తిభావాలే కవివలన వ్యక్తమైనాయి. కాని, శృంగారం అనేది రసరాజంగా ప్రఖ్యాతి చెందింది. కవి యైనవాడు ప్రధానరసమైన శృంగారంవైపు ఆకర్షితుడు కాక ఉండడు. గోపన్నగారుకూడ, సీతారాముల ప్రణయాన్ని మనస్సులో పెట్టుకొని శృంగారరసాత్మకంగా ఈ పద్యం వ్రాసి చదువరులను అలరింపజేయడమేకాక తాను చరితార్థుడైనాడు. ఇట్లా చేయడంలో అనుచితం ఏమీ

లేదు. జగదీశ్వరుడైన శ్రీనివాసుని వర్ణిస్తూ ఆయన వక్షస్థలంలో కమలాదేవికుచకుంభముల కుంకుమ శోభాయమానంగా ఉన్నది అని వర్ణించినాడుకదా కవి.

శ్రీసీతారాముల నేకంగా సేవించి స్తుతించే సంప్రదాయం మనకు అనాదిగా వస్తున్నది. 'వైదేహీసహితం' అనే ప్రఖ్యాతశ్లోకంలోను, 'శ్రీరాఘవమ్' అనే నిత్యపఠనీయ శ్లోకంలోను, ఇదే సంప్రదాయం. ఇదే పద్ధతిలో కవులుకూడ పేర్కొన్నారు.

అనుపమగుణహారా, హన్యమానారివీరా,

జనవినుతవిహారా, జానకీచిత్తచోరా,

దనుజఘనసమీరా, దానవశ్రీవిదారా,

ఘనకలుషకఠోరా,కంధిగర్వాపహారా.

రామదాసుగారికీర్తనల్లోను ఈ పద్ధతి దర్శనమిస్తుంది.

కంటి మా రాములను కనుగొంటి నేను -ఇత్యాదిగా.

కొనచూపులనె వింత కోరికలు దైవార - పెనగొన్న తమకములఁ బెనగుటెన్నడురా - ఇత్యాదిగా.

పురాణదంపతులైన లక్ష్మీనారాయణులశృంగారవైభవం భక్తులు స్మరించడం, కీర్తించడం సామాన్యంగానే ఉన్నది.

అందువలన భక్తకవులరచనల్లో స్థూలదృష్టికి శృంగారవర్ణన అనిపించినా, వారిపరమార్థము జీవాత్మ పరమాత్మతోడి సంశ్లేషం కోరడంగానే భావించవలె. సాక్షాత్తు శ్రీమన్నారాయణుని దివ్యశృంగారలీలావర్ణనలుగానే గణించవలె. కాని లౌకికమైన భౌతికదృష్టితో వాటిని పరికించి అపార్థాలు ఆపాదించడం సముచితం కాదు.

**36.చ. ఖరకరవంశజా, వినుమఖండితభూతపిశాచఢాకినీ**

**జ్వరపరితాపసర్పభయవారకమైన భవత్పదాబ్జవి**

**స్ఫురదురువజ్రపంజరముఁ జొచ్చితి నీయెడ దీనమానవో**

**ద్ధరబిరుదాంకమేమరకు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ఖరకర = తీక్ష్ణమైనకిరణములుకల సూర్యునియొక్క, వంశ = వంశమునందు కులమునందు, జా = పుట్టినవాడా. అఖండిత = ఎడతెగని, కొట్టువడని, భూతములు = దయ్యాలు, పిశాచ = దేవయోనులు, ఢాకినీ =ఢాకిని అనే దయ్యములు, జ్వర = వేకి - తాపము, రోగము, పరితాప = బాధ - తాపము, సర్ప = విషముతోగూడినపాములు, వీటివల్లకలిగే, భయ = భయములును వీటిని, వారకము = నివారించునది, పోగొట్టునది - నిర్మూలించేది, అయిన = అయినట్టి, భవత్ = నీయొక్క, పదాబ్జ = పాదపద్మాలనెడు, విస్ఫురత్ = ప్రకాశిస్తున్న, ఉరు = శ్రేష్ఠమయిన, వజ్రపంజరమున్ = వజ్రముతో

చేయబడినగూటిని, చొచ్చితిని = ప్రవేశించినాను. నీయెడ = నీయందు, దీన = దీనులైన, దిక్కులేనివారైన, మానవ = జనులను, ఉద్ధర = ఉద్ధరించువాడనెడి, బిరుద+అంకము = బిరుదరూపమున చిహ్నము, ఏమరకు = మరచిపోకుము, నిర్లక్ష్యము చేయకుము. కోలుపోకుము.

తా: సూర్యవంశంలో పుట్టిన శ్రీదశరథరామా, భూతాలు, పిశాచాలు, ఢాకినులు, తాపాలు, జ్వరాలు, వ్యాధులు, విషసర్పాలు మొదలగువాటివలని భయాలను పోగొట్టే వజ్రపంజరంలాగా రక్షించే నీ చరణాబ్జాలను శరణుజొచ్చినాను. నీవు దీనమానవోద్ధారకుడనే బిరుదు గలవాడవు. కాబట్టి నన్ను ఉద్ధరించక, నీబిరుదాన్ని పోగొట్టుకొనకుమా!

వ్యా: కవి భక్తుడు కాబట్టి, తన దైవమైన శ్రీరామునితో ఆత్మనివేదనం చేసికొంటున్నాడీ పద్యంలో. నవవిధభక్తుల్లో ఆత్మనివేదనం ఒకటికదా.

విశిష్టాద్వైత సంప్రదాయంలో సాధన, సాధ్య భక్తులకు, భక్తి ప్రపత్తి అనిపేరు. వీటిలో సాధనభక్తినిగూర్చి శ్రీమద్భాగవతం తెలియజేస్తుంది. కర్మజ్ఞానానుగ్రహీతమైన భక్తియే సాధనభక్తి. ఇదియే ఉపాయము, భగవంతుడు ఉపేయము.

భగవంతుని నిర్హేతుకజాయమాన కటాక్షముచే కలిగేది సాధ్యభక్తి. దీనికే ప్రపత్తి అనే పేరున్నది. దీనిలో ఉపాయోపేయములు భగవంతుడే. ఈ సాధ్యభక్తికే శరణాగతి, న్యాసము, ఉపాయస్వీకారము అనే పేర్లున్నాయి. ఈ ప్రపత్తి లేక శరణాగతివలననే జాంబవంతుడు, హనుమంతుడు, గజేంద్రుడు మొదలైనవారు 'పునరపి జననం పునరపి మరణమ్' అనేదానికి అతీతంగా ఉండే పరమపదాన్ని పొందినారు. ఈ ప్రపత్తిమార్గానికి వయస్సు, జ్ఞానము, జాతి అనేవాటితో ప్రమేయం లేదు. యజ్ఞాదికర్మలచే చేసే సాధనకుండే దుర్లభమార్గం దీనికి లేదు. దురవస్థ లేదు. ఏ జీవియైనా దీనివలన పరమానందస్థితి పొందవచ్చు.

ఇటువంటి ప్రపత్తి వలననే గజేంద్రాదులు పరమపదాన్ని అందుకొన్నారు. మానవుల్లో విద్యాగంధం గలవారికే దక్క ఇతరజీవులకు భక్తియందధికారముండదని భావించేవారున్నారు. కాని, అది సరి కాదు. గజేంద్రాది జంతువులకు గ్రంథపఠనాజ్ఞానం లేదుకదా. వాటికి మోక్షం భగవత్కృపచేత లభించలేదా? అందుచేత మోక్షార్థం గ్రంథజ్ఞానం కాని, కనీసం అక్షరజ్ఞానం కాని అవసరం లేదు.

*వ్యాధస్యాచరణం ధ్రువస్య చ వయో విద్యా గజేంద్రస్య కా?*
*కా జాతి ర్విదురస్య? యాదవపతే రుగ్రస్య కిం పౌరుషమ్?*
*కుబ్జాయాః కమనీయరూపమధికం కిం? తత్సుదామ్నో ధనమ్*
*భక్త్యా తుష్యతి కేవలం న చ గుణైర్ భక్తిప్రియో మాధవః॥*

భగవద్గీతకూడ ఈ శరణాగతినే బోధిస్తూ ఉన్నది.

'శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్'

గీతావతరణకు కారకుడు అర్జునుడే. అతని ప్రపత్తియే దానికి కారణం.

'నన్నే శరణుపొందుము. అన్నింటికి మూలమైన నాకరుణచే శాశ్వతశాంతిపదాన్ని చేరుకొంటావు' అని పరమాత్మ అర్జునునికి బోధించినాడు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనే శ్లోకంకూడ ఇదే భావాన్ని వక్కాణిస్తున్నది.

కర్మమునకు జ్ఞానం సహకారి. జ్ఞానానికి భక్తి సహకారి. భక్తికి ప్రపత్తి సహకారి. కర్మజ్ఞానభక్తులను ఆచరింపలేనివారికి ఆధారం ప్రపత్తి. దీన్ని ఆచరించగలిగిన మిగిలినవన్నీ త్యాజ్యాలే.

ఇందుగల డందులేడనే సందేహాన్ని వదలిపెట్టి సర్వవ్యాపి నారాయణుడు అనే భావం కలిగి 'త్వమేవ శరణం మమ' అన గలిగిన జీవుడే ప్రపన్నుడు. ఏజన్మలో జీవుడు ప్రపన్నుడు అవుతాడో ఆ జన్మలోనే వానికి మోక్షప్రాప్తి. దేహాంతరప్రాప్తి లేదుకదా. దానికి నియమనిష్ఠలు లేవు. కేవలం శరణాగతియే ప్రధానం. ఒక్కమాటలో చెప్పాలంటే, 'నేను నీవాడను కాపాడుము' అని రెండు చేతులెత్తి అచంచల విశ్వాసంతో పరమాత్మను వేడుకొనడమే ప్రపత్తి.

*న జాతిభేదం న కులం న లింగం న గుణక్రియా ।*

*సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వదాతారమచ్యుతమ్॥*

కంచర్లగోపన్నగారు వ్రాసిన పద్యంలో'వజ్రపంజరము జొచ్చితి' అని వాక్రుచ్చినాడు. అంటే పైన వివరించిన ప్రపత్తిమార్గంలో దైవాన్ని శరణాగతి పొందినాడని అర్థం. 'దీనమానవోద్ధర బిరుదాంకుడు శ్రీరామచంద్రుడు' అనికూడ ఆయనకు తెలుసును. శ్రీరాముని పాదాబ్జములు 'అఖండిత భూతపిశాచఢాకినీ జ్వరపరితాపసర్పభయవారకమైనవి' అనే విశ్వాసంకూడ ఆయనకున్నది. దాశరథి, కరుణాపయోనిధికదా. అందుచేత శరణువేడినవారిని రక్షిస్తాడు.

కవి ఆత్మనివేదన చేసి, తన పద్యాన్ని చదివే పాఠకుల్లో ప్రపత్తిమార్గాన్ని ఉద్బుద్ధం చేస్తున్నాడు. శ్రీరాముడు శరణాగతవజ్రపంజరుడు. ఎన్ని పిశాచాలు, సర్పాలు, జ్వరాలు,పరితాపాలు మిమ్ము బాధించినప్పటికి వాటివలన మిమ్ములను కాపాడేవాడు. ఆయనకు 'దీనమానవోద్ధర' అనే బిరుదం ఉన్నది. దాన్ని ఆయన వృథా కానిస్తాడా? అందుచేత ఆ పరమాత్ముని శరణువేడి, సర్వపాపపరిహారం చేసికొని ముక్తిమార్గాన అధిగమించండి అని భక్తులకు ప్రబోధం చేసినాడు.

'శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్'

గీతావతరణకు కారకుడు అర్జునుడే. అతని ప్రపత్తియే దానికి కారణం.

'నన్నే శరణుపొందుము. అన్నింటికి మూలమైన నాకరుణచే శాశ్వతశాంతిపదాన్ని చేరుకొంటావు' అని పరమాత్మ అర్జునునికి బోధించినాడు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనే శ్లోకంకూడ ఇదే భావాన్ని వక్కాణిస్తున్నది.

కర్మమునకు జ్ఞానం సహకారి. జ్ఞానానికి భక్తి సహకారి. భక్తికి ప్రపత్తి సహకారి. కర్మజ్ఞానభక్తులను ఆచరింపలేనివారికి ఆధారం ప్రపత్తి. దీన్ని ఆచరించగలిగితే మిగిలినవన్ని త్యాజ్యాలే.

ఇందుగల డందులేడనే సందేహాన్ని వదలిపెట్టి సర్వవ్యాపి నారాయణుడు అనే భావం కలిగి 'త్వమేవ శరణం మమ' అన గలిగిన జీవుడే ప్రపన్నుడు. ఏజన్మలో జీవుడు ప్రపన్నుడు అవుతాడో ఆ జన్మలోనే వానికి మోక్షప్రాప్తి. దేహాంతరప్రాప్తి లేదుకదా. దానికి నియమనిష్ఠలు లేవు. కేవలం శరణాగతియే ప్రధానం. ఒక్కమాటలో చెప్పాలంటే, 'నేను నీవాడను కాపాడుము' అని రెండు చేతులెత్తి అచంచల విశ్వాసంతో పరమాత్మను వేడుకొనడమే ప్రపత్తి.

*న జాతిభేదం న కులం న లింగం న గుణక్రియా ।*
*సర్వ ఏవ ప్రపద్యేరన్ సర్వదాతారమచ్యుతమ్॥*

కంచర్లగోపన్నగారు వ్రాసిన పద్యంలో'వజ్రపంజరము జొచ్చితి' అని వాక్రుచ్చినాడు. అంటే పైన వివరించిన ప్రపత్తిమార్గంలో దైవాన్ని శరణాగతి పొందినాడని అర్థం. 'దీనమానవోద్ధర బిరుదాంకుడు శ్రీరామచంద్రుడు' అనికూడ ఆయనకు తెలుసును. శ్రీరాముని పాదాబ్జములు 'అఖండిత భూతపిశాచఢాకినీ జ్వరపరితాపసర్పభయవారకమైనవి' అనే విశ్వాసంకూడ ఆయనకున్నది. దాశరథి, కరుణాపయోనిధికదా. అందుచేత శరణువేడినవారిని రక్షిస్తాడు.

కవి ఆత్మనివేదన చేసి, తన పద్యాన్ని చదివే పాఠకుల్లో ప్రపత్తిమార్గాన్ని ఉద్బుద్ధం చేస్తున్నాడు. శ్రీరాముడు శరణాగతవజ్రపంజరుడు. ఎన్ని పిశాచాలు, సర్పాలు, జ్వరాలు,పరితాపాలు మిమ్ము బాధించినప్పటికి వాటివలన మిమ్ములను కాపాడేవాడు. ఆయనకు 'దీనమానవోద్ధర' అనే బిరుదం ఉన్నది. దాన్ని ఆయన వృథా కానిస్తాడా? అందుచేత ఆ పరమాత్ముని శరణువేడి, సర్వపాపపరిహారం చేసికొని ముక్తిమార్గాన అధిగమించండి అని భక్తులకు ప్రబోధం చేసినాడు.

**37.చ. జుర్రెద మీ కథామృతము, జుర్రెద మీ పదకంజతోయమున్
జుర్రెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుర్రెద జుర్రజుర్రఁగ రుచుల్ గనువారి పదంబుఁ గూర్పవే
తర్రులతోడి పొత్తిడక దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : మీ కథామృతము = మీయొక్క కథలనే అమృతాన్ని, జుర్రెద = దోసిటితో త్రాగుతాను. మీపదకంజ =పద్మములవంటి మీ పాదముల, తోయమును = నీటిని, మీ పాదతీర్థమును అనుట, జుర్రెద = రుచిచూస్తాను. రామరామమున్ = రాముడు అనే పేరులోని, జొబ్బిలుచున్న = స్రవించుచున్న, సుధారసంబు = అమృతరసాన్ని, జుర్రెద = పుచ్చుకొంటాను. జుర్రజుర్రఁగ = త్రాగగ త్రాగగా, రుచులు = చవులు, కనువారి = తెలిసినవారి, కనుగొన్నవారియొక్క, పదంబు = స్థానమును, కూర్పవే = చేరనిమ్ము, తర్రులతోడి = నీచులతోడి, పొత్తు = సాన్నిహిత్యము, స్నేహము, ఇడక = పెట్టక.

తా: ఓ దశరథరామా, ఓ కరుణాసముద్రమా, నీ కథలు, నీ చరిత్రలు అమృతప్రాయమైనవి. ఆ అమృతాన్ని దోసిలితో గ్రహించి త్రాగుతాను. అనగా విని ఆనందిస్తాను. నీపాదతీర్థాన్ని, నీ నామంలో స్రవిస్తున్న అమృతరసాన్ని జుర్రుతాను. నీ చరిత్రాదులను, నిన్ను గురించిన జ్ఞానాన్ని తెలిసికొన్నవారికిగల స్థానాన్ని నాకు కలిగింపుము. ఈ లోకంలో ఉండేనీచులతోడి సహవాసము నాకు కలిగింపకుము.

వ్యా: శ్రీరామునిపై భక్తికలిగి మానవుడు ఏమి చేయవలెనో ఈ శతకకర్త పాఠకులకు బోధిస్తున్నాడు. శ్రీరామునికథ సుదీర్ఘమైంది. బాలకాండ, అయోధ్యకాండ, అరణ్యకాండ కిష్కంధకాండ, సుందరకాండ, యుద్ధకాండ అనే ఆరుకాండల్లో విస్తరింపబడింది. 'రామస్య అయనం ప్రాపయతీతిరామాయణమ్' రాముని పదమునకు, అంటే ధామమునకు చేర్చేదే రామాయణం. పుట్టి, పెరిగి, పెళ్లిచేసుకొని, భార్యావియోగంలో దుఃఖించి తిరిగి భార్యను తెచ్చుకొన్న రామునిగొప్పతనం ఏమిటి? ఆయనధామం ఏది? ఈ ఆలోచనతో శ్రీమద్రామాయణ కథాగ్రహణం చేస్తేశ్రీరాముడు శ్రీమన్మహావిష్ణువు. నిర్గుణ, నిర్వికార, నిరంజనమైన పరబ్రహ్మం. సకలప్రాణి హృదయాంతర్గత పరమాత్మయే రాముడు. మానవులసాధన వ్యవస్థయే రామాయణం. రామాయణంలోని పాత్రలన్ని మానవునిలోని, సాధకునిలోని, విభిన్నమైన భావాలే. రాముడు, సీత, లక్ష్మణుడు, రావణుడు అనే బాహ్యదృష్టితో ఈ పాత్రలను చూడనవసరం లేదు. రామాయణప్రారంభంలోనే వాల్మీకి ఈ విషయాన్ని సూచనచేసి ఉన్నాడు. అతడు నారదుని, సకలగుణాలుకలిగిన

పురుషుడెవరని అడిగాడు. పురుషుడు అంటే, కథలో కథాపరమైన పుంలింగపురుషుడని అర్థం కాదు. దేహానికి పురుషసంకేతం ఉన్నది. జీవునికి పురుషుడనేపేరున్నది. వాల్మీకి అడిగిన పురుషుడు ఈ రెండును కాదు. 'పురి శయాత్ పూర్ణత్వాత్'. దేహం అనే పురంలో ఉన్న పూర్ణ పురుషుడే నిజమైన పురుషుడు. త్రిగుణాత్మక ప్రకృతి లక్షణాలకు అతీతమైన గుణాలనువర్ణిస్తూ,రాముడే సకల సుగుణాభిరాముడని బోధిస్తాడు నారదుడు. దాన్ని అవగాహన చేసికొన్న వాల్మీకి శ్రీరాముడే విష్ణుస్వరూపుడైన సుగుణాభిరాముడు, పరమాత్మ అని విశ్వాసం వహించి నారదుడు చెప్పినప్రకారం రామాయణం అర్థం చేసికొన్నాడు. 'వ్యక్తమన్వేషతే' అని భావించి, వ్యక్తమవుతున్న తత్త్వాన్ని, కథను, అన్వేషించినాడు. కావ్యరూపంలో రామాయణరచన చేసినాడు.

రామాయణం అవగాహన చేసికోవడానికి పరిమితదృష్టి చాలదు. రాముడు మానవ మాత్రుడు. రాజామాత్రమే అయితే, ఆయనచరిత్రతో తరతరాలుగా మనకేంపని? మనకేమి లాభం? ఈ లోకంలో ఎంతమంది రాజులు పుట్టలేదు. ఎంతమంది రాజ్యమేల లేదు? ఎంతమంది మట్టిపాలు కాలేదు? కాని, రామాయణంలో ఒక కథావిశేషం ఒకతత్త్వం ఉన్నాయి. కథలో రాముడు రావణుని సంహరించడం ముఖ్యఘట్టం. రామాయణానికి అసలు పౌలస్త్యవధ అని పేరు పెట్టుకొందామనుకొన్నాడట వాల్మీకి. రావణుడు బ్రహ్మనుంచి వరం అడిగినప్పుడు, తాను, దేవదానవజంతుసర్పాదికములచేత మరణించకూడదని అడిగినాడు. రావణునిదృష్టిలో మానవులు అల్పప్రాణులు. కనుక మానవులవల్ల మరణం రాకూడదని వరంలో అడుగలేదు. అందుచేత, వాల్మీకి, రామునిపాత్రను మానవునివలె పోషించుకొన్నాడు. అయినా, రామాయణ ప్రారంభంలోనే, రాముడు పరమాత్మ అని తాను గుర్తించి పాఠకులకు సూచనచేసినాడు. ఇతరములైన అనేక పాత్రలద్వారా రాముడు శ్రీమన్మహావిష్ణువని చెప్పి ఆ భావాన్నికూడ పోషించినాడే కాని విస్మరించలేదు. రావణసంహారదృష్టిలో కవి స్వయంగారాముడు విష్ణుస్వరూపుడని చెప్పకపోయినా, పాఠకులకు రాముడు పరబ్రహ్మ అనే పవిత్రభావం కలిగేటట్లు శ్రీరామునిపాత్రను చిత్రించినాడు.

ఇటువంటి రామాయణంలో ఉండే శ్రీరామకథ అమృతంలాంటిదని, భక్తుడైన కవి దాన్ని దోసిటిలో గ్రహించి తృప్తి పొందేటట్లు జుర్రుతానని అంటున్నాడు. ఈ రామునికథ ఇంత మధురమైందా? దీనిమాధుర్యం ఎంతటిది? అనే ప్రశ్న రాకమానదు. కవికి తగినగాయకుడు దొరికితే కవితామాధురి మధురాతిమధురమవుతుంది. గాయత్రీబీజసమ్మిశ్రితమైన రామాయణకావ్యాన్ని ఇరువదినాల్గువేల శ్లోకాల్లో ఆరుకాండలుగా ఆదికవి అక్షరబద్ధం చేసినాడు. దాన్ని ప్రజారంజకంగా అందరికీ

అందించే అవకాశం మునికుమారులరూపంలో ఉండే లవకుశులకు లభించింది. వారు శ్రీరామునిసభలో మధురస్వరంతో వినిపించి సభ్యులను, సభాపతిని తన్మయులను గావించినారు. రామాయణానికి 'పాఠ్యే గేయే చ మధురమ్' అనే ఖ్యాతి కలిగింది. ఇంక గోపన్నగారు ఈ కథామృతాన్ని జుర్రక ఏం చేస్తారు?

విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ఆచరించేవారు అష్టాక్షరీమంత్రానుసంధానం చేయడంతో పాటు శ్రీపాదతీర్థాన్ని గ్రహించడం నిత్యవిధి. అందుచేత భాగవతోత్తముడైన గోపన్న శ్రీరామునిపాదతీర్థాన్ని, శ్రీపాదతీర్థాన్ని నిత్యం రుచి చూస్తానని, ఆనందాన్ని అనుభవిస్తానని చెబుతున్నాడు. ఆలయంలో స్వామిదర్శనం కాగానే, అర్చకులు శ్రీపాదతీర్థాన్ని వినిమయం చేయడంలోనివిశేషం ఇదే సంప్రదాయం.

రామనామంలో ఉండే మాధుర్యాన్నిగురించి కవి అనేకపద్యాల్లో చెబుతూనే ఉన్నాడు.

ప్రహ్లాదనారద పరాశరపుండరీక వ్యాసాంబరీషాదులు శ్రీమన్నారాయణుని ధ్యానించి తరించిన భాగవతోత్తములు. ఇక్కడ కవి ఇటువంటి విష్ణుభక్తులను మనస్సులో స్మరించి 'జుర్రజుర్రఁగ రుచుల్ గనువారి పదంబు గూర్పవే' అని తన స్వామిని శ్రీరాముని ప్రార్థిస్తున్నాడు.

ఈ ప్రపంచం విచిత్రమైంది. ఎంతటి ఉత్తముడైనా ప్రాపంచికమైన మాయలోపడి, దుష్టుల సహవాసంలో పడి, నారాయణనామచింతనను మరచిపోయే అవకాశం ఉన్నది. మహాభక్తుడైన విప్రనారాయణుడు దేవదేవిఆకర్షణలో పడి తన మాలాకైంకర్యాన్ని మరచిపోయి, నారాయణ పాదసేవను విస్మరించలేదా? ఆ విధంగా భక్తుడైన తనకు అటువంటి ప్రమాదం సంభవించనీయవలదని శ్రీరాముని కవి వేడుకొంటున్నాడు. శ్రీరామభక్తులు నిరంతరం రామకథా విశేషాలను వినాలని, శ్రీరామనామామృతాన్ని గ్రహించాలని, నీచుల సహవాసంలోనికి వెళ్లవద్దని కవి ధ్వనిపూర్వకంగా ఈపద్యంలో హెచ్చరించినాడు.

**38. ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్, దరిద్రతా**
**కారపిశాచసంహరణకార్యవినోది, వికుంఠమందిర**
**ద్వారకవాటభేది, నిజదాసజనావళికెల్లప్రొద్దు నీ**
**తారకనామమెన్నుకొన దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : నీ తారకనామము = సంసారము తరింపచేసే, దాటవేసే నీ నామము, ఎన్నుకొనన్ = తలచుకొనగా, భావించగా, ఘోర = భయంకరుడైన, కృతాంత = యమునియొక్క, వీర= శూరులైన, భటకోటికిన్ = కింకరులసమూహానికి, గుండెదిగుల్ = గుండెలో భయం కలిగించేది. దరిద్రతా = దారిద్ర్యంయొక్క, ఆకార = స్వరూపంగల,

పిశాచ = దయ్యాన్ని, రాక్షసాన్ని,సంహరణ = చంపడం అనే, కార్య = పనిలో, వినోది = క్రీడించేది, ఆనందించేది, నీ = నీవారైన, దాస = భక్తులైన, జనావళికి = జనులందరికి జనులసమూహానికి, ఎల్లప్రొద్దు = నిరంతరము, ప్రతిదినం, వికుంఠ = వైకుంఠము, విష్ణుమూర్తినివాసస్థానమైన, పరమపదమనెడి, మందిర = గృహంయొక్క, ద్వార = ద్వారంలో ఉండే,కవాట = తలుపురెక్కలను, ఛేది = విరుగగొట్టేది, తెరిచేది.

తా : ఓ దశరథరామా, సంసారభారం నుండి తరింపచేసే నీపేరు, భయంకరులైన యముని దూతలకు గుండెలు అదరజేస్తుంది. దయ్యంలాగ మనుష్యులను బాధించే దారిద్ర్యం అనేదాన్ని పోగొట్టి ఆనందిస్తుంది. ఎల్లప్పుడు నీ దాసులు, భక్తులు పరమపదానికి పోతున్నప్పుడు కలిగే ఆటంకాలను తొలగిస్తుంది. అంటే మోక్షాన్ని సంపాదించి పెట్టుతుంది.

వ్యా: మనుష్యుడు ఈ లోకంలో పుణ్యకార్యాలు చేస్తే మరణంతరువాత స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తాడని, పాపంచేస్తే యమదండన నరకంలో అనుభవించవలసి వస్తుందని మనప్రాచీన గ్రంథాల్లో చెప్పబడి ఉంటుంది. అందుచేత మానవుడీ లోకంలో సచ్ఛీలంతో ప్రవర్తించాలని పెద్దలు చెబుతారు. కాని, తెలిసో తెలియకయో, మనుష్యుడు పాపం చేసినా,యముని బాధనుండి తప్పించుకోవడానికి సంసారబాధలనుండి తప్పింపచేసే. రామనామం, భగవన్నామం కాపాడుతుందని మనపురాణాలు చెబుతున్నాయి. రామభక్తుడైన ఈ కవి కూడ అదే మాటను ఉద్ఘాటిస్తున్నాడు.

పిశాచంలాంటి దారిద్ర్యాన్ని భగవానుడు ఎట్లా పోగొట్టుతాడో అనేదానికి నిదర్శనగా కుచేలునివృత్తాంతం శ్రీమద్భాగవతంలో ఉన్నది.

శ్రీకృష్ణునిఅనుగ్రహంవల్ల భౌతికమైన, ఆధ్యాత్మికమైన సుదాముని దారిద్ర్యం నశించింది.

హరిభక్తి కలిగిన భక్తుడు శ్రీహరిని స్మరించి తరించేమార్గాన్ని, ప్రహ్లాదుడు అనుసరించినపద్ధతి శ్రీమద్భాగవతంలో వర్ణింపబడింది పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ -ఇత్యాదిగా.

శ్రీరామనామమహాత్మ్యాన్ని అనేక సందర్భాలో ఇదివరకే ఉల్లేఖించడమైంది.

**39.ఉ. విన్నపమాలకించు రఘువీర, నహి ప్రతిలోకమందు నా**
**కన్న దురాత్ముఁడుం బరమకారుణికోత్తమ, వేల్పులందు నీ**
**కన్న మహాత్ముఁడుం బతితకల్మషదూరుఁడు లేఁడు నాకు వి**
**ద్వన్నుత నీవె నాకు గతి! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : రఘువీర = రఘుమహారాజుకులమున బుట్టిన శూరుడైనవాడా! విన్నపము =మనవి, ఆలకించు = వినుము, ప్రతిలోకమందు = ఒక్కొక్క జగములో, నాకన్నన్ = నా కంటెను, దురాత్ముఁడు =దుష్టుడు, నహి = లేడు, కారుణికోత్తమ = దయగలవారిలో శ్రేష్ఠుడైనవాడా, వేల్పులందున్ = దేవతలందు, నీకన్నన్ = నీకంటెన్, మహాత్ముఁడున్ = గొప్పవాడును, అధికుడును, పతిత = పతనమైన, పాపాత్ములయొక్క, కల్మష = పాపములను, దూరుఁడు = దూరంచేసేవాడు, నిర్మూలించేవాడు, నాకున్ లేఁడు = కలుగడు. విద్వత్+నుత = పండితులచేతకొనియాడబడేవాడా. నీవె, నాకు గతి = నీవే నాకు దిక్కు.

తా: ఓ రఘువీరా, ఒక మనవి ఆలకింపుము, ఏలోకంలోను, నాకంటె దుష్టుడు లేడు. దేవతలలో నీకంటె మహాత్ముడు లేడు. పాపాత్ములను ఉద్ధరించేవాడు, వారిపాపాలను నిర్మూలించేవాడు లేడు. అందుచేత దుష్టులలో శ్రేష్ఠుడనైన నాకు, దేవతలలో శ్రేష్ఠుడవైన నీవు దిక్కుగానుండి, ఆధారంగా ఉండి ఉద్ధరింప శక్తుడవగుదువు గాని మరి ఒకరు కాజాలరు.

వ్యా: విశిష్టాద్వైతసిద్ధాంతాన్ని ప్రచారం చేసిన మహానుభావుల్లో శ్రీయామునాచార్యులు ఒకరు. ఆయన తన ఆళువందారుస్తోత్రంలో

*అపరాధసహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే,*

*అగతిం శరణాగతం హరే కృపయా కేవలమాత్మసాత్కురు॥*

అని భక్తుడు తన దోషాలను, తాను చేసిన అపరాధాలను క్షమింపుమని తనను ఉద్ధరింపుమని, భగవంతుని ప్రార్థించినాడు. గోపన్నకవికూడ, 'నాకన్న దురాత్ముఁడు లేఁడు' అన్నప్పుడు పై శ్లోకభావమే స్ఫురిస్తుంది. ఇట్లా తనను తాను దోషములు చేసినవానిని అని చెప్పడాన్ని వైష్ణవులు నైచ్యానుసంధానం అంటారు. దాన్నిబట్టి వైష్ణవులందరు అపరాధాలుచేసినవారని కాదు. దాన్ని వైష్ణవోచిత స్వభావసులభవినయగుణ సంపన్నత్వంగా, స్వాహంకారపరిత్యాగంగా భావించవలసి ఉంటుంది. ఈ జన్మలో చేసిన భక్తుడెవడైనా తన తప్పులను గుర్తుంచుకొని ఉండవచ్చు. కాని గడిచిన జన్మల్లో జరిగిన అపరాధాలు ఆ పరాత్పరునికి తప్ప మరెవరికి తెలుసును? ఆ అపరాధాలు ఒక్కొక్క జన్మలో పరిహరింపబడడంవలన ఈ జన్మలో విష్ణుభక్తి సంక్రమించింది. 'నరాణాం క్షీణపాపానాం విష్ణౌ భక్తిః ప్రజాయతే' అన్నట్లు, జీవునికి పాపాలు క్షీణదశకు వచ్చే సమయానికివిష్ణుమూర్తిపై భక్తి కలుగుతుందట.

భగవద్గీతలోఇదే విశేషం ఈ విధంగా ఉన్నది :

***అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,***

***సాధురేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః॥(గీత 9-30)***

"ఎంతటి దురాచారుడైనప్పటికి, అనన్యభక్తితో నన్ను సేవిస్తే, అతన్ని నేను సాధువుగా, వైష్ణవాగ్రేసరునిగా భావిస్తాను" అనే గీతార్థాన్ని భావించి ఈ కవి ఈ పద్యం వ్రాసి ఉంటాడు.

విష్ణుభక్తి సాహిత్యంలో స్తుతివచనాలు అనే సంప్రదాయం ఉన్నది. దీనిని మున్ముందు ప్రారంభించినవారు ఉభయవేదాంతసంప్రదాయప్రవర్తకులు శ్రీరామానుజాచార్యులు. వారు శరణాగతిగద్య, శ్రీరంగగద్య, వైకుంఠ గద్య అనే గద్యత్రయం వ్రాసినారు. తెలుగులో మొట్టమొదట కాంత కృష్ణమాచార్యులవారు చాతుర్లక్షసంఖ్యలో సింహగిరి నరహరివచనాలు రచించినారు. తరువాత తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు శ్రీవేంకటేశ్వరవచనాలను కూర్చినారు. ఇంకా శఠకోపవచనాలు, శేషగిరినాథవిన్నపాలు మొదలైన స్తుతి వచనాలు వెలువడినాయి. ఈ వచనాల్లో చాలచోటులందు వైష్ణవసంప్రదాయంలోని నైచ్యానుసంధానము ప్రవర్తితమవుతుంది. సింహగిరివచనాల్లోని ఈ వచనం చూడదగింది.

> దేవా, పెద్దతనంబున మిమ్ములను మెప్పించెదనంటినా జాంబవంతుండు మీసన్నిధినే యున్నాడే.
> దేవా, బుద్ధిచే మెప్పించెదనంటినా విభీషణుండు మీసన్నిధినే యున్నాడే.
> దేవా, బంటుతనంబుసేసి మెప్పించెదనంటినా హనుమంతుండు మీసన్నిధినే యున్నాడే.
> దేవా, తీర్థంబులాడి మెప్పించెదనంటినా గంగాభవాని మీయంగుష్ఠంబునందే యుద్భవించియున్నదే.
> దేవా, ప్రదక్షిణలుచేసి మిమ్ము మెప్పించెదనంటినా సూర్యచంద్రాదులుమీసన్నిధినే యున్నారే.
> దేవా, వేదవేద్యుండనై మిమ్ము మెప్పించెదనంటినా బ్రహ్మ మీనాభికమలమందు ఉద్భవించియున్నాడే.
> దేవా, గీతప్రబంధములచేత మిమ్ము మెప్పించెదనంటినా కిన్నరకింపురుషగరుడ గంధర్వసనకసనందన సనత్కుమారపరమభాగవతులు నారదాదులు మీసన్నిధినే యున్నారే.
>
> నేనా మిమ్ము నుతించువాడను? ఎనుబదినాల్గులక్షలకోట్ల జీవజంతువులలో నేనొక్క నరజీవుండనే. దేవా, మిమ్ము వేయి శిరస్సులు, రెండువేల జిహ్వలు గల శేషాహి నుతియించి కొనియాడవలెనంతే గాక! సింహగిరినరహరీ,నమో నమో దయానిధీ!

ఇటువంటిసంప్రదాయమే గోపన్నగారి ఈ పద్యంలో గోచరించింది.

విష్ణుమూర్తి ఆధిక్యం ఈ పద్యంలోనిరెండవభాగం. శ్రీమద్భాగవతంలో సృష్టికర్తయైన బ్రహ్మ విష్ణుమూర్తిని స్తుతించినవిధానం ఈ సర్వాధిక్యాన్ని ప్రస్ఫుటం చేస్తుంది.

ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ కల్పించి రక్షించి భే
దనముంజేయు దురంతశక్తికి ననంతజ్యోతికిన్ జిత్రవీ
ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నేనుత్కంఠతో నవ్యయా
త్మునికిన్ వందనమాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై.

40. ఉ.**పెంపను దల్లివై కలుషబృందసమాగమ మొందకుండ ర**
**క్షింపను దండ్రివై మెయి వసించు దశేంద్రియరోగముల్ నివా**
**రింపను వెజ్జవై కృపగురించి పరంబు దిరంబుగాఁగ స**
**త్పంపదలియ్య నీవె గతి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: పెంపను =పోషించుటకు,తల్లివిఅయి = మాతృమూర్తివంటివాడవు అయి, కలుష = పాపాలయొక్క, బృంద = సమూహాన్ని, సమాగమము = కలయిక, కూడుట,ఒందకుండన్ = చెందకుండునట్లుగా, రక్షింపను = కాపాడను, తండ్రివి అయి = పితృమూర్తివి అయి. మెయిన్ = శరీరంలో, వసించు = ఉండునట్టి, దశేంద్రియ = పదిరకాలైన అవయవాల్లోని, రోగముల్ = వ్యాధులను, తెవుళ్లను, నివారింపను = పోగొట్టడానికి, వెజ్జవై = వైద్యునివై, కృప = దయను, గురించి = కలిగి, వహించి, పరంబు = మోక్షము, ముక్తి, తిరంబుగాఁగన్ = స్థిరమగునట్లుగా, నిశ్చయమయ్యేటట్లుగా, సత్పంపదలు = మేలైన సంపదలు, ధనధాన్యములు, ఇయ్యన్ = అనుగ్రహించుటకు, దానం చేయడానికి, నీవె గతి = నీవె దిక్కు.

తా: ఓ దశరథరామా, పోషించడానికి తల్లివలెను, దోషాలను, పాపాలను పొందకుండ రక్షించడానికి తండ్రివలెను, శరీరములోని పది అవయవాలలో కలిగే రోగాలను తొలగించడానికి వైద్యునివలెను, శుభప్రదములైన సంపదలను అనుగ్రహించడానికి, మోక్షమును స్థిరంచేయడానికి నాకు నీవే దిక్కు.

వ్యా: మానవుని జీవితంలో చక్కగా నివసించడానికి ఏడు ఆధారాలు అవసరం. వాటిని ఏడుగడ అని వ్యవహరిస్తారు. ఆ ఏడు ఆధారాలు. 1. గురువు 2. తల్లి, 3. తండ్రి 4. పురుషుడు. 5. విద్య, 6. దైవము, 7. దాత. వీరు సప్తప్రకారరక్షకులు.

**గురువును దల్లియు తండ్రియు పురుషుఁడు విద్యయును దైవమును దాతయునాఁ**
**బొరి నేడుగడయు దానై హరి వను రక్షించుఁగాత వవవరతంబున్** - వాసిష్ఠరామా 1 - ఆ

దశవిధ ఇంద్రియములు - దశరంధ్రములు : నాసికారంధ్రములు, నేత్రములు, కర్ణములు, మూత్రద్వారము, మలద్వారము, వాక్కు, బహ్మరంధ్రము, స్తనరంధ్రములు, గర్భమార్గము, (ఇంద్రియములు పదింటిలో ఐదు జ్ఞానేంద్రియాలు: త్వక్-చక్షుస్ -

శ్రోత్ర-జిహ్వా-ఘ్రాణాలు, ఐదుకర్మేంద్రియాలు:వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థలు ప్రసిద్ధాలు. వీటికి సంబంధించిన రోగాలు అని కవి చెప్పదలచినాడు.)

దశవిధనాడులు 1. ఇడానాడి (చంద్రనాడి) ఇది ముక్కుకు ఎడమ భాగంలోఉంటుంది. దీనికి శివుడు అధిదేవత.

2. పింగళనాడి (సూర్యనాడి) ముక్కుకుడిభాగంలో ఉంటుంది. విష్ణువు దానికి అధిదేవత.

3. సుషుమ్నునాడి - (అగ్నినాడి) ముక్కుమధ్యభాగంలో ఉంటుంది. దానికి బ్రహ్మ అధిదేవత.

4. గాంధారినాడి - కుడి కన్నులో ఉంటుంది. దానికి ఇంద్రుడధిదేవత.

5. హస్తినినాడి - నాలుకపై ఉంటుంది. వామనేత్రంలో ఉంటుంది. దానికి వరుణుడు అధిదేవత.

6. పుషానాడి - కుడిచెవిలో ఉంటుంది. దిగ్దేవత దానికి అధిదేవత.

7. పయస్విని నాడి - ఎడమచెవిలో ఉంటుంది. దానికి బ్రహ్మ అధిదేవత.

8. అలంబసనాడి - ఇది శిశ్నంలో ఉంటుంది. దీనికి అగ్ని అధిదేవత.

9. లకుహనాడి - ఇది గుదస్థానంలో ఉంటుంది. భూమి దీని అధిదేవత.

10. శంఖినీనాడి - ఇది నాభిస్థానంలో ఉంటుంది. దీనికిచంద్రుడు అధిదేవత. ఈ విషయాలు ఆయుర్వేదశాస్త్రంలో చెప్పబడినాయి.

కవి తన దైవమైన శ్రీరాముని తల్లిగాను తండ్రిగాను భావించుకొంటున్నాడు. పైన చెప్పిన ఏడుగడలోతల్లిదండ్రులదే ప్రముఖమైన స్థానం. ఈ ప్రార్థన నిత్యపఠనీయమైంది:

**త్వమేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ**
**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవదేవ.**

గీతోపదేశసందర్భంలో శ్రీకృష్ణునివిశ్వరూపాన్ని సందర్శించిన అర్జునుడు ఆశ్చర్యచకితుడై

**పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతో ఽన్యో లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ**

**శ్రీకృష్ణా, నీవు ఈ చరాచరప్రపంచానికి, తండ్రివి,ఆచార్యుడవు. నీతో సమానుడుగాని, నీకంటె అధికుడు గాని లేడు. నీ ప్రభావం సాటిలేనిది.**

ఆ పరమేశ్వరుడు భక్తునికి తల్లి దండ్రి మొదలైన ఏడుగడగా కనిపించడం, ఇతడు

వారిని కాపాడుమని కోరడం సామాన్యమే. భగవంతుడు విశ్వరూపుడు. అందుచేతనే భక్తులు అతనిని ఒకరూపంలో కాక పెక్కురూపాల్లో స్తుతించి తరిస్తారు.

ఆరోగ్యశాస్త్రంలో చెప్పినట్లుగా, మానవుడు దశేంద్రియాలు కలిగి, శీతవాతాతపములచేత రోగగ్రస్తుడు కావడం స్వాభావికమే. మానసికమైన బాధ ఎంత కష్టాన్ని కలిగిస్తుందో, శరీరబాధ కూడ అంతటిక్లేశాన్ని కలిగిస్తుంది మానవునికి. అందుచేత దేహబాధానివారణార్థమై రోగగ్రస్తుడైనవాడు వైద్యుని ఆశ్రయించక తప్పదు. కాని, రోగనిర్మూలనకు కూడ శ్రీరామునికరుణ అవసరమే. దైవానుగ్రహంలేనిది వైద్యుడేమి చేయలేడు. కేవలం శారీరకబాధలనే కాక, భగవన్నామం ఎన్నివిధాల ఔషధంగా ఉపయోగపడుతుందో ముకుందమాలాకర్త కులశేఖరాళ్వార్లు చెబుతున్నారు.

> వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
> దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీసంజీవనైకౌషధమ్
> భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
> శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీకృష్ణదివ్యౌషధమ్

ఇన్ని వ్యాధుల్లో ఉపయోగించేనామౌషధం కలవాడు ఉన్నతోన్నతుడైన వైద్యుడేకదా. యథావాక్కులఅన్నమయ్య అనే కవి 12,13వతాబ్దుల్లో జీవించినాడు. ఇతడు సర్వేశ్వరశతకమనే మంచి శతకం వ్రాసి ఉన్నాడు. గోపన్న వ్రాసినపద్యంవంటిదే ఆ సర్వేశ్వరశతకంలోఒక పద్యం కనిపిస్తున్నది. గమనించండి.

> *పెంపన్ దల్లియగున్ రుజాపటలదుష్పీడావిధిక్షోభ వా*
> *రింపన్ వైద్యుఁడగుం గుమార్గవిధులన్ గ్రీడింపఁ బోకుండ శి*
> *క్షింపంబల్లిదుఁడైన తండ్రియగు సుశ్రీమంతుగానెంతయున్*
> *సంపద్వృద్ధియొసంగ దాత యగు నీ సద్భక్తి సర్వేశ్వరా.*

> **41.ఉ. కుక్షినజాండపంక్తులొనగూర్చి చరాచరజంతుకోటి సం**
> **రక్షణచేయుతండ్రివి, పరంపర నీతనయుండనైననా**
> **పక్షము నీవు గావలదె? పాపములెన్ని యొనర్చినన్, జగ**
> **ద్రక్షక, కర్తనీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : కుక్షిన్ = ఉదరమందు, అజాండ = బ్రహ్మాండములయొక్క, పంక్తులు = వరుసలు, సమూహాలు, ఒనగూర్చి = ఏర్పాటుచేసి, పొందికపరచి, చరాచర = కదిలిక కలిగిన. కదలికలేని జంగమ, స్థావర, జంతుకోటి = ప్రాణులసమూహాన్ని, రక్షణచేయు = కాపాడునట్టి, తండ్రివి = పితవు. పరంపరన్ = వరుసగా, తరతరములుగా.

అనుపూర్విగా, నీతనయుఁడన్ = నీకుమారుడను, కొడుకును, అనిశము, పక్షపాతివి = నా పాలిటివాడవు, ఎన్నిపాపములు = ఎన్నిదోషాలు, ఒనర్చినన్ = చేసినప్పటికీ, నిన్ను కావలదె = నీవుండవలెకదా. జగత్ = లోకాలకు, రక్షక = కాపాడువాడా, కర్త = పనిచేసేవాడవు, నీవుకద = నీవేకదా.

తా: కుక్షిలోపల అంటే గర్భంలోపల బ్రహ్మాండసమూహాలను నిండుగా పెట్టుకొని, చేతనములు, అచేతనాలు అయిన సకలప్రాణిసమూహాలనురక్షించుతండ్రివి నీవే కాబట్టి తరతరములుగా, నీకుమారుడనై ఉన్న నాపాలిట నీవు పక్షపాతివై ఉండవలె. నేను పాపాలను చేసినానని నన్ను విడువరాదు. ఎన్ని పాపాలు చేసినా, లోకములను రక్షించేవాడవు నీవే కాబట్టి, ఆ పని చేసేవాడవు నీవొక్కడివే కాబట్టి నీవేనన్ను కాపాడవలెను.

వ్యా: భగవంతుడైన వాసుదేవుడు అతని అవతారరూపమైన శ్రీరాముడు ఈ బ్రహ్మాండాన్ని, పదునాల్గులోకాలను, తనకుక్షిలో ఇముడ్చుకొన్నాడు. ఈ లోకాలు ఆయన గర్భంలోనుండి వెలువడినాయి. కాబట్టి ఈ లోకాలకు, బ్రహ్మాండానికి ఆయన తండ్రియేకదా. లోకాలను, వాటిలోని ప్రాణులను సృష్టి చేసిన భగవానుడు, మనుష్యమాత్రులందరికి తండ్రివంటివాడు. ఈ మనుజులు ఆయనకుమారులు. మనుజుడైన కవికూడ ఈ భగవానునికుమారుడే. భక్తులందరు ఆయనకుమారులే. ఈ ప్రపంచం అనేకవిధాల వ్యామోహాలకు, ఆశలకు, మోహాలకు, ఆలవాలమైనట్టిది. భగవంతునికుమారులైన మనుజులు ఈ వ్యామోహాలలో కర్మవశాన చిక్కుకొని, దోషాలకు, పాపాలకు గురికావడంలో ఆశ్చర్యం లేదు. కాని, భగవానుడైన శ్రీరాముడు జగద్రక్షకుడు కాబట్టి దోషాలు చేసిన తన తనయులవంటి భక్తులను, కాపాడడంకూడ ఆయనవిధి. విష్ణుమూర్తికి భక్తపక్షపాతి అనే ప్రఖ్యాతి ఉన్నది. దోషానికి లోనైనవాడు, పశ్చాత్తాపం చెంది తనను ప్రార్థించితే, అతని పాపాలను నిర్మూలించి ముక్తిని ప్రసాదిస్తాడు. 'నీవే తప్ప ఇతఃపరంబెరుగ' అని అన్న గజేంద్రుని కాపాడినాడుకదా. జీవునివేదనను విన్న భక్తునికి ఎవరికైనా శ్రీనాథుడు కరుణను ప్రసాదిస్తాడు. గోపన్నగారు ఈ పద్యంలో మానవసహజమైన బాధలకు గురియైనట్లుగాను, తనను, కుమారునిగా భావించి రక్షించవలెనని ప్రార్థించడమే కాక భగవానుని విధిని గుర్తు చేస్తున్నాడు. తండ్రిని కుమారుడు స్వతంత్రంగా కోరికలు కోరినట్లుగానే ఉన్నది ఈ పద్యంలోనిభావం. శ్రీమన్నారాయణుడు సర్వాధీశుడు, సర్వేశ్వరుడు, చరాచర ప్రాణికోటిని సంరక్షించేసమర్థుడు అనే విశేషాలను సూచించడానికే, గోపన్నగారీ పద్యం వ్రాసిఉంటాడు.

అనుపూర్విగా, నీతనయుండన్ = నీకుమారుడను, కొడుకును, ఐనట్టి, నాపక్షము = నా పాలిటివాడవు, ఎన్నిపాపములు = ఎన్నిదోషాలు, ఒనర్చినన్ = చేసినప్పటికి, నీవు కావలదె = నీవుండవలెకదా. జగత్ = లోకాలకు, రక్షక = కాపాడువాడా, కర్తవు = పనిచేసేవాడవు, నీవుకద = నీవేకదా.

తా: కుక్షిలోపల అంటే గర్భంలోపల బ్రహ్మాండసమూహాలను పొందికగా పెట్టుకొని, చేతనములు, అచేతనాలు అయిన సకలప్రాణిసమూహాలనురక్షించుతండ్రివి నీవే కాబట్టి తరతరములుగా, నీకుమారుడనై ఉన్న నాపాలిట నీవు పక్షపాతివై ఉండవలె. నేను పాపాలను చేసినానని నన్ను విడువరాదు. ఎన్ని పాపాలు చేసినా, లోకముల్లను రక్షించేవాడవు నీవే కాబట్టి, ఆ పని చేసేవాడవు నీవొక్కడివే కాబట్టి నీవేనన్ను కాపాడవలెను.

వ్యా: భగవంతుడైన వాసుదేవుడు అతని అవతారరూపమైన శ్రీరాముడు ఈ బ్రహ్మాండాన్ని, పదునాల్గులోకాలను, తనకుక్షిలో ఇముడ్చుకొన్నాడు. ఈ లోకాలు ఆయన గర్భంలోనుండి వెలువడినాయి. కాబట్టి ఈ లోకాలకు, బ్రహ్మాండానికి ఆయన తండ్రియేకదా. లోకాలను, వాటిలోని ప్రాణులను సృష్టి చేసిన భగవానుడు, మనుష్యమాత్రులందరికి తండ్రివంటివాడు. ఈ మనుజాలు ఆయనకుమారులు. మనుజుడైన కవికూడ ఈ భగవానునికుమారుడే. భక్తులందరు ఆయనకుమారులే. ఈ ప్రపంచం అనేకవిధాల వ్యామోహాలకు, ఆశలకు, మోహాలకు, ఆలవాలమైనట్టిది. భగవంతునికుమారులైన మనుజులు ఈ వ్యామోహాలలో కర్మవశాన చిక్కుకొని, దోషాలకు, పాపాలకు గురికావడంలో ఆశ్చర్యం లేదు. కాని, భగవానుడైన శ్రీరాముడు జగద్రక్షకుడు కాబట్టి దోషాలు చేసిన తన తనయులవంటి భక్తులను, కాపాడడంకూడ ఆయనవిధి. విష్ణుమూర్తికి భక్తపక్షపాతి అనే ప్రఖ్యాతి ఉన్నది. దోషానికి లోనైనవాడు, పశ్చాత్తాపం చెంది తనను ప్రార్థించితే, అతని పాపాలను నిర్మూలించి ముక్తిని ప్రసాదిస్తాడు. 'నీవే తప్ప ఇతఃపరంబెరుగ' అని అన్న గజేంద్రుని కాపాడినాడుకదా. జీవునివేదనను విన్న భక్తునికి ఎవరికైనా శ్రీనాథుడు కరుణను ప్రసాదిస్తాడు. గోపన్నగారు ఈ పద్యంలో మానవసహజమైన బాధలకు గురియైనట్లుగాను, తనను, కుమారునిగా భావించి రక్షించవలెనని ప్రార్థించడమే కాక భగవానుని విధిని గుర్తు చేస్తున్నాడు. తండ్రిని కుమారుడు స్వతంత్రంగా కోరికలు కోరినట్లుగానే ఉన్నది ఈ పద్యంలోనిభావం. శ్రీమన్నారాయణుడు సర్వాధీశుడు, సర్వేశ్వరుడు, చరాచర ప్రాణికోటిని సంరక్షించేసమర్థుడు అనే విశేషాలను సూచించడానికే, గోపన్నగారీ పద్యం వ్రాసిఉంటాడు.

42.ఉ. గద్దరియోగిహృత్కమలగంధరసానుభవంబుఁజెందు పె
న్నిద్దపుగండుఁదేటి, ధరణీసుతకౌగిలిపంజరంబునన్
ముద్దులుగుల్కురాచిలుక, ముక్తినిధానము, రామ, రాఁగదే,
తద్దయు నేఁడు నాకడకు, దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : గద్దరి = దిట్టయైన, యోగి = యోగతపశ్శీలురైనవారియొక్క, హృత్ = హృదయమనెడు, మనస్సు అనే, కమల = తామరయందలి, గంధ = సువాసనతోగూడిన రస = మకరందముయొక్క, తేనెయొక్క, అనుభవంబున్ = ఆస్వాదనమును, రుచిని,చెందు= పొందునట్టియు, పెను = మిక్కిలి, నిద్దపు = నిగనిగ, స్నిగ్ధమైన , గండుతేటి = మగతుమ్మెద, మదించినతుమ్మెదయైనవాడు, ధరణీసుత = భూసుత, సీతాదేవియొక్క, కౌగిలి = ఆలింగనమనెడు, పంజరంబునన్ = గూటిలో, ముద్దులుగుల్కు = మనోజ్ఞముగానుండు, రాచిలుక = రామచిలుక, రాచచిలుక, ముక్తినిధానము= మోక్షముండెడిపాతర, మోక్షముండే ధనాగారము, రామ = శ్రీరామా, నాకడకున్ = నాయొద్దకు, నేఁడు = ఈనాడు, తద్దయు = అత్యంతము, రాఁగదే = రమ్మా.

తా : పద్మపుష్పములలోని, తేనెమాధుర్యాన్ని అనుభవించే గండుతుమ్మెదలాగ, యోగశీలురైన భక్తుల హృదయాల్లో ఆనందాన్నిఅనుభవించేవాడవును, గూటియందు రామచిల్కలాగ సీతాదేవి కౌగిలిలో సొంపులు గులుకువాడవును, మోక్షమిచ్చువాడవునుఅగు ఓ శ్రీరామా, నేడు నాయొద్దకు వేగము రమ్మా, అత్యంతము నాదరికి రమ్మా.

వ్యా: కవి భక్తుడు. అతడు శ్రీరాముని దూరముగా దర్శించినంతమాత్రాన తృప్తినిపొందినవాడు కాడు. భక్తితో తపోజపాదులుచేసే యోగులమనస్సుల్లో భగవానుడు నివసించిఎల్లప్పుడు ఉంటాడు. ఆ విధంగానే శ్రీరాముడు తన హృదయంలో నివాసముండవలెనని కవి ఆకాంక్ష. అతనిసాన్నిధ్యంలో భక్తుడు నివసించవలెనని కోరిక. ఈవిధంగానే, శ్రీరాముడు తనకు ప్రియురాలైన సీతాదేవికౌగిలిలో పారవశ్యం చెందుతాడు. ఆమె సాంగత్యంలో ఉంటాడు. కవికూడ శ్రీరాముడు తన సాంగత్యంలో ఉండవలెనని కోరుకొంటున్నాడు. తన సాన్నిధ్యంలో ఉండే యోగశీలురైన భక్తులకు, తన ప్రియురాలైన సీతాదేవికి, మోక్షాన్ని ప్రసాదిస్తాడు. శ్రీరాముడు కవికి సన్నిహితంగా వస్తే తనకుకూడ మోక్షం సులభంగా లభిస్తుంది. తనను చేరినవారికి మోక్షం ప్రసాదిస్తాడు కాబట్టి శ్రీరాముడు మోక్షనిధానం. అంటే మోక్షానికి ధనాగారం వంటివాడు.

పద్మములు వికసించి పరిమళభరితమైనప్పుడు, తుమ్మెదలు వాటిమీద వ్రాలి వాటిమకరందాన్ని రుచి చూచి ఆనందించడం సహజమే. ఈ సన్నివేశాన్ని కవులు

ప్రేయసీప్రియుల సమాగమంగా భావించడం, వర్ణించడం కవి సంప్రదాయం. విశిష్టాద్వైత సంప్రదాయంలో మధురభక్తి అనే ఒక పద్ధతి ఉన్నది. దానిలో భగవంతుని ప్రియుడుగాను, భక్తుడు తనను తాను ప్రేయసిగాను భావిస్తారు. దీనికి భౌతికమైన సంబంధం లేకపోవచ్చును. కాని, మానసికమైన సంబంధం మధురాతిమధురమైంది. దీనిలో శృంగారమాధుర్యం శారీరకమైంది కాదు. పాంచభౌతికశరీరానికి ఈ శృంగారం అన్వయించదు. ఇది కేవలం మానసికమైంది. ఆధ్యాత్మికతాపూర్ణమును, ఆత్మపరమాత్మలకు సంబంధించినదియును అయినట్టిది. అదికూడ నిర్మలజ్ఞానభక్తిశీలురకు లభించేది. ఆస్వాదింపదగింది. ఇది నిశ్చలమైంది. నిరంతరప్రవాహియైన తైలధారవలె అవిచ్ఛిన్నంగా కొనసాగేటట్టిది. దీనిపర్యవసానం మోక్షమే. మధురభక్తిని చవిచూచిన ప్రపన్నుడైనవాడు దానినుంచి దూరం అయ్యేప్రసక్తి లేదు. అది నిరతిశయానందదాయకమైన భక్తి. ఇటువంటిభక్తిని ద్వాపరయుగంలో గోపికలు ప్రకటించినారు. కలియుగారంభంలో నమ్మాళ్వార్లు అనుసరించింది ఈ భక్తిమార్గమే.

గోపన్నగారు పద్మానికి, తుమ్మెదకు - అంటే ప్రేయసీప్రియులకు ఉండే సంబంధం తనకు, శ్రీరామునికి కలగాలని,గోదాదేవివలె తాను తరించాలని ఈ పద్యంలో ఆకాంక్షించినాడు.

ధనుర్భంగం చేసి,స్వయంవరంలో సీతాదేవిని వరించిన శ్రీరాముడు ఆదర్శపతి. సీతాదేవి ఆదర్శనారీమణి. వారిది ఆదర్శదాంపత్యం. సీతాదేవిని త్రికరణశుద్ధిగా వరించి వివాహమాడినశ్రీరాముడు ఆమెసాన్నిధ్యంలో, ఆమెకౌగిలిలో సర్వసౌఖ్యాలు అనుభవించి ఉంటాడు. సీతాదేవి కౌగిలిని గూడుగా ఉపమించినాడు. శ్రీరాముని ఆ గూటిలోని రామచిలుకగా, రాచచిలుకగా ఉపమించినాడు. ఇంక వారి సౌఖ్యాన్ని, సాన్నిహిత్యాన్ని మనం మనసారా ఊహించుకోవలసిందే.

గోదాదేవికి మోక్షం ఇచ్చి ఆమెను భార్యగా గ్రహించినవాడు శ్రీహరి. సీతాదేవిని వరించి పరమానందం కలిగించి ఆనందించినవాడు శ్రీహరి. అందుచేత ఆయన మోక్షమనే స్థానానికి ధనాగారంవంటివాడు. కవి గోదాదేవి, సీతాదేవి పొందిన ఉన్నతస్థానాన్ని తానుకూడ అధిరోహించవలెనని, మోక్షాన్ని సంపాదించవలెనని మహోత్కంఠతో శ్రీరాముని ఈ పద్యంలో ప్రార్థించినాడు.

**43.ఉ. కలియుగమర్త్యకోటి నిను కన్గొనరాని విధంబొ, భక్తవ**
**త్సలత వహింపవో, చటులసాంద్రవిపద్దశవార్థిఁ గ్రుంకుచోఁ**
**బిలచినపల్కవింత మరపే నరులిట్లనరాదుగాక,నీ**
**తలఁపున లేదె సీతచెర - దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : కలియుగ = కలియుగంలోని, మర్త్యకోటి = మనుష్యసమూహం, కన్గొనరానివిధంబో = చూడలేనివిధమో, భక్తవత్సలతన్ = భక్తులయందు ప్రేమకలిగిఉండుటను, వహింపవో = తాల్చవో, చటుల=మిక్కిలిఅయిన, సాంద్ర =దట్టమైన, విపత్ = ఆపదలయొక్క, దశ = అవస్థ అనే, వార్ధిన్ - సముద్రంలో, క్రుంకుచోన్=మునిగేటప్పుడు, పిలిచినన్=నిన్ను పిలువగా, పల్కవు = సమాధానమీయవు, ఇంత మరపే = ఇంతగా మరచిపోవుటయా, నరులు = నాబోటి మనుష్యులు, ఇట్లు = ఈ ప్రకారం, అనరాదు గాక = చెప్పరాదు కాని, నీ తలఁపునన్ = నీచింతలో, నీజ్ఞాపకంలో, సీతచెర = సీత రావణుని బందీలో ఉన్నవృత్తాంతం, లేదె = లేదా?

తా: ఓ దశరథరామా, నేను మిక్కిలి ఆపత్సముద్రంలో మునుగుతూ, నిన్ను ఎంత పిలిచినా, మారు పలుకవు ఇదేమి? కలియుగంలో మనుష్యులకు కనబడరాదని అనుకొన్నావా? లేక, భక్తులపై నీకు వాత్సల్యం కలగడం లేదా? ఈ విధంగా నన్ను మరచిపోవచ్చునా? నీకు మరపు అని మాబోటులు చెప్పరాదు. కాని, సీతాదేవికి కలిగిన చెరను మరువవుకదా! మేముకూడ అటులే చెరలో ఉన్నప్పుడు పిలిచిన పలుకని నీ మరపు ఎక్కడిది?

వ్యా: శ్రీరామభక్తుడైన కవి ఈ పద్యంలో ఆత్మనివేదనం చేసికొంటున్నాడు. భక్తుడు ఆపద అనేసముద్రంలో విలపిస్తూ ఉన్నాడు. అప్పుడు తన యిష్టదైవాన్ని, శ్రీరాముని ఎలుగెత్తి పిలిచినాడు. కాని అతడు రాలేదు సరికదా ప్రత్యుత్తరమిచ్చినవాడు కాడు. దానికి సందేహం కలిగి, కలియుగంలో మనుష్యులకు దర్శనమీయకూడదనే నియమం చేసికొని నాకు కనబడలేదు. నా పిలుపునకుమారు పలుకలేదు అనుకోవచ్చునా అని శ్రీరాముని ప్రవర్తనను కొంత సమర్థించినాడు. కాని, తన ఇష్టదైవానికి, తనకు ఆత్మీయభావం ఉన్నది. అందుచేత కొంత నిష్ఠురంగాకూడ, పలుకుతున్నాడు. పూర్వం నీకు భక్తవత్సలత ఉండేది. అనేకులయిన భక్తులను నీవు ఆపత్సమయంలో కాపాడి వారిపై వాత్సల్యం చూపించినావు. అటువంటి భక్తవాత్సల్యగుణం వదలివేసినావా అని ప్రశ్నించినాడు. ఇక దైవాన్నికూడ మానవులలాగ భావిస్తున్నాడు కవి. మానవులకు మరపు అనేగుణం ఉంటుంది. దైవానికి ఇటువంటి గుణం ఉండదుకదా. అయినా, తనను ఆపత్సమయంలో కాపాడలేదు. పలుకలేదు. కాబట్టి భక్తులు పిలిస్తే పలుకవలెననే విషయం నీవు మరచినావా? అని ప్రశ్నించినాడు. ఇదికూడ దైవంపై ఆత్మీయభావాన్ని ప్రకటించడమే. కాని తాను పలికిన నిష్ఠురమైన మాటలు, దైవంతో పలికేవి కావని కవికి తెలుసు. అందుచేత 'నావంటి మానవులు ఇటువంటి మాటలు, ఉన్నతోన్నతుడైనవానితో పలుకడం న్యాయం కాదు' అనేవిశ్వయాన్ని 'నరులిట్లనరాదు' అనే మాటల్లో వ్యక్తం

ప్ర : కలియుగ = కలియుగంలోని, మర్త్యకోటి = మనుష్యసమూహం, కన్గానరానివిధంబో = చూడలేనివిధమో, భక్తవత్సలతన్ = భక్తులయందు ప్రేమకలిగిఉండుటను, వహింపవో = తాల్పవో, చటుల=మిక్కిలిఅయిన, సాంద్ర =దట్టమైన, విపత్ = ఆపదలయొక్క, దశ = అవస్థ అనే, వార్ధిన్ - సముద్రంలో, క్రుంకుచోన్= మునిగేటప్పుడు, పిలిచినన్= నిన్ను పిలువగా, పల్కవు = సమాధానమీయవు, ఇంత మరపే = ఇంతగా మరచిపోవుటయా, నరులు = నాబోటి మనుష్యులు, ఇట్లు = ఈ ప్రకారం, అనరాదు గాక = చెప్పరాదు కాని, నీ తలంపునన్ = నీచింతలో, నీజ్ఞాపకంలో, సీతచెర = సీత రావణుని బందీలో ఉన్నవృత్తాంతం, లేదె = లేదా?

తా: ఓ దశరథరామా, నేను మిక్కిలి ఆపత్సముద్రంలో మునుగుతూ, నిన్ను ఎంత పిలిచినా, మారు పలుకవు ఇదేమి? కలియుగంలో మనుష్యులకు కనబడరాదని అనుకొన్నావా? లేక, భక్తులపై నీకు వాత్సల్యం కలగడం లేదా? ఈ విధంగా నన్ను మరచిపోవచ్చునా? నీకు మరపు అని మాబోటులు చెప్పరాదు. కాని, సీతాదేవినికి కలిగిన చెరను మరువవుకదా! మేముకూడ అటులే చెరలో ఉన్నప్పుడు పిలచిన పలుకని నీ మరపు ఎక్కడిది?

వ్యా: శ్రీరామభక్తుడైన కవి ఈ పద్యంలో ఆత్మనివేదనం చేసికొంటున్నాడు. భక్తుడు ఆపద అనేసముద్రంలో విలపిస్తూ ఉన్నాడు. అప్పుడు తన యిష్టదైవాన్ని, శ్రీరాముని ఎలుగెత్తి పిలిచినాడు. కాని అతడు రాలేదు సరికదా ప్రత్యుత్తరమిచ్చినవాడు కాదు. దానికి సందేహం కలిగి, కలియుగంలో మనుష్యులకు దర్శనమీయకూడదనే నియమం చేసికొని నాకు కనబడలేదు. నా పిలుపునకుమారు పలుకలేదు అనుకోవచ్చునా అని శ్రీరాముని ప్రవర్తనను కొంత సమర్థించినాడు. కాని, తన ఇష్టదైవానికి, తనకు ఆత్మీయభావం ఉన్నది. అందుచేత కొంత నిష్ఠురంగాకూడ, పలుకుతున్నాడు. పూర్వం నీకు భక్తవత్సలత ఉండేది. అనేకులయిన భక్తులను నీవు ఆపత్సమయంలో కాపాడి వారిపై వాత్సల్యం చూపించినావు. అటువంటి భక్తవాత్సల్యగుణం వదలివేసినావా అని ప్రశ్నించినాడు. ఇక దైవాన్నికూడ మానవులలాగ భావిస్తున్నాడు కవి. మానవులకు మరపు అనేగుణం ఉంటుంది. దైవానికి ఇటువంటి గుణం ఉండదుకదా. అయినా, తనను ఆపత్సమయంలో కాపాడలేదు. పలుకలేదు. కాబట్టి భక్తులు పిలిస్తే పలుకవలెననే విషయం నీవు మరచినావా? అని ప్రశ్నించినాడు. ఇదికూడ దైవంపై ఆత్మీయభావాన్ని ప్రకటించడమే. కాని తాను పలికిన నిష్ఠురమైన మాటలు, దైవంతో పలికేవి కావని కవికి తెలుసు. అందుచేత 'నావంటి మానవులు ఇటువంటి మాటలు, ఉన్నతోన్నతుడైననీతో పలుకడం న్యాయం కాదు' అనేనిశ్చయాన్ని 'నరులిట్లనరాదు' అనే మాటల్లో వ్యక్తం

చేసినాడు. కాని, రాముని ఔదార్యం భక్తవాత్సల్యగుణం కవికి తెలియనిది కాదు. అందుచేత 'నీతలపున లేదె సీతచెర' అని ఒకమాటను ప్రయోగించినాడు. దీనిలో రెండు భావాలు వ్యక్తం అయినాయి. నీకు భక్తులవైపు మరపు ఉండదు. ఎందుచేతనంటే సీతాదేవి లంకలో బంధింపబడినపుడు, ఆమె నీకు భక్తురాలు కాబట్టి ఆమెపై వాత్సల్యం వహించి ఆమెను కాపాడినావు. ఆ విధంగా నన్నుకూడ కాపాడుతావుఅనేభావం ఒకటి. నీభార్య అయిన సీతాదేవిని సముద్రంకూడ దాటి రక్షించినావుకదా. ఆమెను చెరనుండి విడిపించినావు కదా. ఆమె నీభార్య కాబట్టి అట్లా ప్రవర్తించి ఉంటావు. నేను కేవలం నీ భక్తుడనే. అందుచేత నన్ను విస్మరిస్తావా అనే నిష్ఠురోక్తి రెండవది.

ఈ పద్యంలో కంచెర్ల గోపన్న అనే రామదాసు చెరలో పడడం, అక్కడినుండి శ్రీరామునికి తనకష్టాలు నివేదించుకోవడం సూచితమైనాయి. ప్రధానంగా చెర అనే మాట సీతాదేవికి, రామదాసుకు ఏకంగా సమన్వయమవుతుంది.

ఈ పద్యంలో కవి స్వీయానుభూతియేకాక, జీవునివేదన ఉన్నది. మానవుడు కష్టంలోచిక్కుకొన్నప్పుడు దైవాన్ని ప్రార్థించేవిధానం, ఆయన వాత్సల్యబుద్ధిని, చివరకు ఆయన అస్తిత్వాన్ని శంకించేవిధానం కూడ వ్యంజితమైంది.

తనశక్తిమీద విశ్వాసం కలిగిన గజేంద్రుడు, తన శత్రువునుండి, మకరినుండి విడిపించుకోవడానికి దీర్ఘకాలం పోరాడినాడు. కాని తనకు సాధ్యం కాలేదు. అపుడు సర్వేశ్వరుడు గుర్తుకు వచ్చినాడు.

ముక్తసంగులైన మునులు దిదృక్షులు - సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తురెవ్వాని - దివ్యపదమువాఁడు దిక్కు నాకు'

అని భావించినాడు. అయినా విష్ణుమూర్తి అతనికి దర్శనమిచ్చినట్లు లేదు. అప్పుడు స్వాభావికంగా, జీవసహజంగా దైవంమీద, ఆయన వాత్సల్యగుణంమీద ఆయన అస్తిత్వం మీదకూడ సందేహం కలిగింది.

*కలఁడందురు దీనులయెడ - కలఁడందురు పరమయోగిగణములపాలన్*
*గలఁడందురన్ని దిశలను - గలఁడు గలండనెడువాఁడు గలఁడో లేఁడో*

అని సందేహించినాడు. ఈ కవిగారిమనస్తత్త్వంకూడ ఈ పద్యం వ్రాస్తున్నప్పుడు ఈ విధంగానే ఉంటుందని మనం ఊహించవచ్చు. ఈ రామదాసుకీర్తనలో

ఉన్నాడో లేడో భద్రాద్రియందు
ఉన్నాడో లేడో భద్రాద్రి యందు॥ - అని ఈ సందేహమే వ్యక్తమైంది.

శ్రీరామలక్ష్మణులు పర్ణశాలలో లేని సమయంలో సీతాదేవిని రావణుడు అపహరించుకొని లంకానగరానికి తీసికొని వెళ్ళి ఆమెను అశోకవనంలోచెరపట్టినాడు. ఆ

చేసినాడు. కాని, రాముని ఔదార్యం భక్తవాత్సల్యగుణం కవికి తెలియనిది కాదు. అందుచేత 'సీతలపున లేదె సీతచెర' అని ఒకమాటను ప్రయోగించినాడు. దీనిలో రెండు భావాలు వ్యక్తం అయినాయి. నీకు భక్తులవైపు మరపు ఉండదు. ఎందుచేతనంటే సీతాదేవి లంకలో బంధింపబడినపుడు, ఆమె నీకు భక్తురాలు కాబట్టి ఆమెపై వాత్సల్యం వహించి ఆమెను కాపాడినావు. ఆ విధంగా నన్నుకూడ కాపాడుతావుఅనేభావం ఒకటి. నీభార్య అయిన సీతాదేవిని సముద్రంకూడ దాటి రక్షించినావుకదా. ఆమెను చెరనుండి విడిపించినావు కదా. ఆమె నీభార్య కాబట్టి అట్లా ప్రవర్తించి ఉంటావు. నేను కేవలం నీ భక్తుడనే. అందుచేత నన్ను విస్మరిస్తావా అనే నిష్ఠురోక్తి రెండవది.

ఈ పద్యంలో కంచెర్ల గోపన్న అనే రామదాసు చెరలో పడడం, అక్కడినుండి శ్రీరామునికి తనకష్టాలు నివేదించుకోవడం సూచితమైనాయి. ప్రధానంగా చెర అనే మాట సీతాదేవికి, రామదాసుకు ఏకంగా సమన్వయమవుతుంది.

ఈ పద్యంలో కవి స్వీయానుభూతియేకాక, జీవునివేదన ఉన్నది. మానవుడు కష్టంలోచిక్కుకొన్నప్పుడు దైవాన్ని ప్రార్థించేవిధానం, ఆయన వాత్సల్యబుద్ధిని, చివరకు ఆయన అస్తిత్వాన్ని శంకించేవిధానం కూడ వ్యంజితమైంది.

తనశక్తిమీద విశ్వాసం కలిగిన గజేంద్రుడు, తన శత్రువునుండి, మకరినుండి విడిపించుకోవడానికి దీర్ఘకాలం పోరాడినాడు. కాని తనకు సాధ్యం కాలేదు. అపుడు సర్వేశ్వరుడు గుర్తుకు వచ్చినాడు.

ముక్తసంగులైన మునులు దిదృక్షులు - సర్వభూతహితులు సాధుచిత్త
లసదృశవ్రతాఢ్యులై కొల్తురెవ్వాని - దివ్యపదమువాఁడు దిక్కు నాకు'

అని భావించినాడు. అయినా విష్ణుమూర్తి అతనికి దర్శనమిచ్చినట్లు లేదు. అప్పుడు స్వాభావికంగా, జీవసహజంగా దైవంమీద, ఆయన వాత్సల్యగుణంమీద ఆయన అస్తిత్వం మీదకూడ సందేహం కలిగింది.

*కలఁడందురు దీనులయెడ - కలఁడందురు పరమయోగిగణములపాలన్*
*గలఁడందురన్ని దిశలను - గలఁడు గలండనెడువాఁడు గలఁడో లేఁడో*

అని సందేహించినాడు. ఈ కవిగారిమనస్తత్త్వంకూడ ఈ పద్యం వ్రాస్తూన్నప్పుడు ఈ విధంగానే ఉంటుందని మనం ఊహించవచ్చు. ఈ రామదాసుకీర్తనలో

*ఉన్నాడో లేడో భద్రాద్రియందు*
*ఉన్నాడో లేడో భద్రాద్రి యందు॥* - అని ఈ సందేహమే వ్యక్తమైంది.

శ్రీరామలక్ష్మణులు పర్ణశాలలో లేని సమయంలో సీతాదేవిని రావణుడు అపహరించుకొని లంకానగరానికి తీసికొని వెళ్లి ఆమెను అశోకవనంలోచెరపట్టినాడు. ఆ

చెరలో మహాసాధ్వి సీతాదేవి అనేకకష్టాలు పడింది. భర్తవియోగం అనుభవించింది. భగవత్స్వరూపుడైన శ్రీరాముని ధ్యానంచేసి ప్రార్థించింది. ఆయన స్థితిగతులను ఆలోచించి విచారించింది. ఆంజనేయస్వామి లంకానగరానికి వచ్చినతరువాత, వారిద్దరు మాటాడిన సందర్భంలో 'చెరలోని సీతాదేవి' మానసికస్థితిని వాల్మీకిమహర్షి ఈ విధంగా వర్ణించినాడు.

కచ్చిన్న విగతస్నేహో వివాసాన్మయి రాఘవః।
కచ్చిన్మాం వ్యసనాదస్మాన్ మోక్షయిష్యతి రాఘవః॥

సీతాదేవి అన్నది: నేను దౌర్భాగ్యవశాన ఆయనకు దూరమైనాను. ఈ కారణంగా ఆయనకు నామీద ఉండే స్నేహం తగ్గిపోలేదు కదా. ఆయన ఎప్పుడైనా నన్ను ఈ సంకటంనుండి విముక్తి చేస్తారా?

మన్నిమిత్తేన మానార్హః కచ్చిచ్ఛోకేన రాఘవః।
కచ్చిన్నాన్యమనా రామః కచ్చిన్మాం తారయిష్యతి॥

మాననీయుడైన శ్రీరాముడు, నావలన కలిగే దుఃఖంచేత చాల సంతప్తుడై ఉన్నాడా? నా విషయమై ఆయన అన్యమనస్కంగా లేడుకదా, విముఖుడుగా లేడుకదా. నాకు కలిగిన సంకటనుంచి శ్రీరాముడు నన్ను విడిపిస్తాడా?

కచ్చిన్న తద్ధేమ సమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి।
మయా వినా శుష్యతి శోకదీనం జలక్షయే పద్మమివాతపేన॥

నీరు ఎండిపోయినప్పుడు వేడివలన కమలం మాడిపోతుంది. ఆ విధంగానే నేను లేనప్పుడు శ్రీరాముని బంగారువంటి ముఖం కాంతిహీనమైందా? పద్మంలాగ సుగంధసహితంగా ఉండే ఆయనముఖం ఎండిపోలేదుకదా.

**న చాస్య మాతా న పితా న చాన్యః స్నేహో ద్విశిష్టో ౽స్తి మయా సమో వా।**
**తావద్ధ్యహం దూత జిజీవిషేయం యావత్ ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య॥**

దూతా,నామీద ఆయనకు ఉన్న ప్రేమతో సమానమైనప్రేమ ఆయనకు తల్లిదండ్రులపైనగాని, ఇతరబంధువులపైనగాని లేనట్టిది. నాకు ప్రియతముడైన శ్రీరామునిరాకనుగురించి, ఆయననుగురించి వినినంతకాలం నేను జీవించవలెనని కోరుకొంటున్నాను.

సీతాదేవిచెరలోని ఆమెమనఃప్రవృత్తిని హనుమంతుడు శ్రీరామునికి వినిపించడం. ఆయన లంకానగరంపై దండెత్తడం తరువాతికథ.

విశిష్టాద్వైతసంప్రదాయం తెలిసినవారు చెప్పేదేమిటంటే, భగవంతుడు కలియుగంలో,

పూర్వయుగాలలోలాగ ప్రత్యక్షంగా భక్తులకు కనిపించడు. ఆయన అర్చామూర్తులనే, సాక్షాన్మూర్తులుగా గ్రహించవలసి ఉంటుంది. త్యాగరాజస్వామి, మీరాబాయి మొదలైన భక్తులు అర్చామూర్తులనే కొలిచి తరించినారు.

**44.చ. జనవర, మీ కథాళి విననోపక కర్ణములందు ఘంటికా**
**నినదవినోదముల్ సలుపు నీచునకున్ వరమిచ్చినావు, ని**
**న్ననయము నమ్మికొల్చిన మహాత్ములకేమి యొసంగెదో సనం**
**దననుత, మాకొసంగుమయ, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : జనవర = ఓ రాజా, ఓ రఘురామా, మీ కథాళి = మీ కథలయొక్క సమూహం, వినన్ = వినడానికి, ఓపక = సహింపక, ఓర్వక, కర్ణములందు = చెవులలో, ఘంటికా = గంటలయొక్క నినద = శబ్దముల, చప్పుళ్ల, వినోదముల్ = వేడుకలను, సలుపు = ఆచరిస్తున్న, నీచునకు = అధమునకు, అల్పునికి, వరము = కోరిక, ఇచ్చినావు = ప్రసాదించినావు. అనయము = ఎల్లప్పుడు, నమ్మికొల్చి = విశ్వసించి సేవించిన, నీమీద ఆధారపడిన, మహాత్ములకు = మహనీయులకు, ఏమి ఒసంగెదో = ఏమి అనుగ్రహిస్తావో, సనందననుత = సనందనుడు అనే భక్తునిచేత, ఋషిచేత కొనియాడబడినవాడా, మాకు = మాకును, ఒసంగుమయ = ప్రసాదించుమయ్యా.

తా: ఓరాజా, ఓ దశరథరామా, మీకథలను వినడానికి సహించక తన చెవుల్లో ఘంటలధ్వనియొక్క వేడుకలను సలుపు అల్పునికి, అధమునికి, కోరినవరమును నీవు ఇచ్చినావు. ఎల్లప్పుడు నిన్ను నమ్మి సేవించువారికి ఏమి ప్రసాదిస్తావో, సనందనుడనే ఋషిచేత కొనియాడబడినవాడా, వారికిచ్చినట్లే మాకును ప్రసాదించవా?

వ్యా: ఈ పద్యంలో కవి శ్రీరామునిఔదార్యాన్ని, ప్రదర్శిస్తున్నాడు. శ్రీరాముని కథలు, విష్ణుమూర్తికథలు బహుపుణ్యాత్మకములైనట్టి వి. వాటిని విని తరించేవారు లోకంలో చాలమంది ఉన్నారు. కాని కొందరు అల్పబుద్ధిగలవారు శ్రీరామునికథలను వినసిచ్ఛగించరు. ఎవరైన భగవానునికథాకీర్తనం చేస్తున్నప్పుడు, ఆ పుణ్యవృత్తాంతాలు తమకు వినిపిస్తాయని కాబోలు గంటలు కొట్టించుకొని, తాళాలు వేయించుకొని వాటినాదంవలన ఆనందాన్ని పొంది వినోదిస్తుంటారు. ఇంక వారికా పుణ్యకథావిశేషాలు తెలియవు. ఇటువంటి అజ్ఞానులుకూడ ఏదైనా ఆపద సంభవించినప్పుడు భగవానుని వేడుకోవడమో, ఆయనను సందర్శించడమో జరుగుతుంది. అప్పుడు భగవంతుడు వారివేడికోలును మన్నించి వారు కోరినవరాలు ప్రసాదిస్తాడు. వారికి మోక్షం ప్రసాదిస్తాడు. అప్పుడు, తనను ప్రార్థించనివాడు, తన ప్రార్థనలను వినినివాడు, ఇతని కోరికలను మన్నించవచ్చునా అనే భావం భగవానునికి ఉండదు. ఆయన ఔదార్యం మహోన్నతమైంది. 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాఁడు నేర్పరి సుమతీ' అన్న

సుమతీశతకకారునిమాట ఆయన పట్ల సర్వదా వర్తిస్తుంది. అందుచేతనే విజ్ఞులు ఆయనను నిర్హేతుకజాయమానకరుణాకటాక్షం కలిగినవాడని కొనియాడినారు. మహాత్ముడైన గాంధీగారు శ్రీరామునిభజనలో రఘుపతి రాఘవ రాజారాం పతితపావన సీతారాం అని నిత్యం పాడేవారు. ప్రార్థించేవారు. ఇక్కడ పతితులంటే శ్రీరామనామాన్ని ఉచ్చరించనివారు,ఆయన గొప్పతనాన్ని అంగీకరించనివారనే అర్థం గ్రహించవలసి ఉంటుంది. అటువంటి పతితులనుకూడ శ్రీరాముడు, పావనులను, పవిత్రులను చేస్తాడు. వారిని అనుగ్రహిస్తాడు. వారి పాపాలను శమింపచేస్తాడు. వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. అందుచేతనే ఆయనకు 'పతితపావన' బిరుదం సార్థకమైంది.

నిరంతరం విష్ణుమూర్తిని ధ్యానించి, భజించే ప్రహ్లాదనారదపరాశరపుండరీకాదులకు మోక్షాన్ని ప్రసాదిస్తాడనడంలో కవిగారికి సందేహం లేదు. అందుచే ఈమహనీయులకిచ్చే సాయుజ్యసౌఖ్యాన్ని తనకు ప్రసాదించమని కవి, భక్తుడు కాబట్టి తనయిష్టదైవాన్ని ఈ పద్యంలో ప్రార్థించినాడు.

ఇచట ఒక విశేషం చెప్పవలె. మహాభక్తులుగా, మహాత్ములుగా ప్రఖ్యాతి చెందినప్రహ్లాదనారదాదులు విష్ణుమూర్తిని భజించడంచేతనే గొప్పవారైనారు. సాయుజ్యాన్ని పొందినారు. గోపన్నగారుకూడ నిరంతరం శ్రీనాథుని భజిస్తారు కాబట్టి వారంతటివాడు తాను కావాలని కాంక్షించడం ఇక్కడ ధ్వన్యాత్మకంగా సూచితమైంది.

ఈ పద్యంలో ఘంటాకర్ణునివృత్తాంతం సూచితమైంది. ఘంటాకర్ణుడు కుబేరునిసేవకుడు శివభక్తుడు. అతడు శ్రీహరిపేరు తనకు వినపడకూడదని చెవులకు గణగణమ్రోగే గంటలను కట్టుకొన్నాడు. శివునికి ఈ విషయం తెలిసి నీవు విష్ణుమూర్తిని భజిస్తేతప్ప మోక్షం లేదన్నాడు.

శ్రీకృష్ణుడు బదరికాశ్రమంలో తపస్సు చేస్తూ సమాధిలో ఉన్నప్పుడు. ఘంటాకర్ణుడు కుక్కలగుంపుతోను, మాంసంపళ్లెంతోను అతనిదగ్గరకు వెళ్ళి ఆయనను పరిహాసం చేసినాడు. కృష్ణుడు ఘంటాకర్ణునివలన అతనివృత్తాంతంతెలిసికొన్నాడు. శ్రీకృష్ణుడు శివుడు చెప్పినట్లుగానే ఉన్నాడు అని భావించాడు. అయినా, శ్రీకృష్ణుని అక్కడినుంచి పంపించివేసి, శివుడు ఆదేశించినట్లుగా శ్రీమన్నారాయణుని పిశాచరూపంలోనే ధ్యానం చేసినాడు. సమాధిగతుడైనాడు. శ్రీమన్నారాయణస్తోత్రం చేయడంచేత, శ్రీకృష్ణుడు ప్రసన్నుడైనాడు. అతడు ఘంటాకర్ణుని అనుగ్రహించినాడు. ఆ పిశాచం తనమనస్సులో ధ్యానిస్తున్న శ్రీవిష్ణురూపంలోనే అతనికి సాక్షాత్కరించినాడు. ఘంటాకర్ణుని పిశాచత్వం వదలిపోయింది. సర్వాభరణభూషితుడైన గంధర్వుడుగా మారినాడు. విష్ణుభక్తుడై పరిపరివిధాలుగా శ్రీకృష్ణునిస్తోత్రంచేసి తరించినాడు.

45.ఉ. పాపములొందువేళ రణపన్నగభూతభయజ్వరాదులం
నాపదనొందువేళ, భరతాగ్రజ, మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁ దమ్ముఁడిరు ప్రక్కియలం జని తద్విపత్తి సం
తాపము మాని; కాతురఁట, దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : పాపములు = దోషములు, ఒందువేళన్ = పొందేసమయంలో, రణ = యుద్ధములు, పన్నగ = సర్పములు, భూత = జంతువులు, పిశాచములు - వీటివలన భయ = కలిగేభయంవలన, జ్వర = తాపము, ఆదులందు = మొదలైనవానిలో, ఆపదన్ = విపత్తును, కష్టమును, ఒందువేళన్ = పొందే సమయంలో, భరతాగ్రజ = భరతునికి అన్నయైన శ్రీరామా, సంబోధన, మిమ్ము భజించువారికిన్ = మిమ్ములను సేవించేవారికి, కీర్తించేవారికి, కొలుచువారికి, నీవు తమ్ముఁడు = నీవును, నీ సోదరుడైన లక్ష్మణుడు, ఇరుప్రక్కియలన్ = రెండు ప్రక్కల, రెండుపార్శ్వముల, ప్రాపుగ = సాహాయ్యంగా, చని = వెళ్లి, తత్ = వారియొక్క, విపత్తి = కష్టమును, సంతాపమును = విచారాన్ని, మాన్పి = పోగొట్టి, కాతువట = రక్షింతువఁట - కాపాడుదువట.

తా: ఓదశరథరామా, భరతునిఅన్నయైన శ్రీరామా, పాపములు పొందునపుడు, యుద్ధము, సర్పములు, భూతములు, జ్వరములు (తాపము-రోగము) మొదలైన వానిచేత ఆపదకలిగినప్పుడు నిన్ను సేవించేవారిని, కొలిచేవారిని సహాయము చేయబోయి, నీవు, నీతమ్ముడైన లక్ష్మణుడును రెండు ప్రక్కల నిలిచి వారి ఆపదలను పోగొట్టి రక్షింతువని లోకులు చెప్పుదురు. కాబట్టి నిన్ను సేవించు నన్ను కాపాడవా?

వ్యా: ఈ పద్యంలో శ్రీరాముని భగవచ్ఛక్తిని వర్ణించినాడు కవి. భగవంతుడు ఆపద్బాంధవుడు. తనను సేవించేవారికి, కొలిచేవారికిఎటువంటి ఆపదలు కలిగినా, తాను తనతమ్మునివంటి పరివారం, ఆపదలో ఉన్నవారిని ఆదుకొంటారు. మానవుడు నిత్యకష్టజీవి. ఇంధనములు సేకరించడానికి వెళ్లితే అక్కడ సర్పబాధ కలుగుతుంది. కారడవుల్లో తిరుగుతూ ఉంటే భూతప్రేతపిశాచబాధలు కలుగుతాయి. శత్రువులు తనకు అపకారంచేస్తూంటే దాన్ని నిర్మూలించక ఉండలేడుకదా. అప్పుడు శత్రువుతో సంఘర్షణకు దిగవలసి వస్తుంది. దానివలన ప్రాణాపాయం ఏర్పడవచ్చును. లోకంలో రోగగ్రస్తుడు కాని మనుష్యుడు ఉండడు. జ్వరాదికాలు మానవులను పీడిస్తూ ఉంటాయి. ఆరోగ్యభంగం అవుతుంది. కొన్ని వ్యాధులు ఔషధాలకు లొంగవు. ఈ ఆపదలు మనుష్యులకు వచ్చినప్పుడు ఆపన్నరక్షకుడైన భగవంతుడే దిక్కు అని అతన్ని ప్రార్థిస్తే సేవిస్తే వచ్చి కాపాడుతాడు. తన పరివారంతో వస్తాడు. వారికి కలిగిన విపత్తును మాన్పి రక్షిస్తాడు. భగవంతుని భక్తరక్షణగుణం మనం అనేకవృత్తాంతాల్లో చూడవచ్చు. ఆపదలో

**45.ఉ. పాపములొందువేళ రణపన్నగభూతభయజ్వరాదులం**
**బాపదనొందువేళ, భరతాగ్రజ, మిమ్ము భజించువారికిం**
**బ్రాపుగ నీవుఁ దమ్ముఁడిరు ప్రక్కియలం జని తద్విపత్తి సం**
**తాపము మాని; కాతురఁట, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : పాపములు = దోషములు, ఒందువేళన్ = పొందేసమయంలో, రణ = యుద్ధములు, పన్నగ = సర్పములు, భూత = జంతువులు, పిశాచములు - వీటివలన భయ = కలిగేభయంవలన, జ్వర = తాపము, ఆదులందు = మొదలైనవానిలో, ఆపదన్ = విపత్తును, కష్టమును, ఒందువేళన్ = పొందే సమయంలో, భరతాగ్రజ = భరతునికి అన్నయైన శ్రీరామా, సంబోధన, మిమ్ము భజించువారికిన్ = మిమ్ములను సేవించేవారికి, కీర్తించేవారికి, కొలుచువారికి, నీవు తమ్ముఁడు = నీవును, నీ సోదరుడైన లక్ష్మణుడు, ఇరుప్రక్కియలన్ = రెండు ప్రక్కల, రెండుపార్శ్వముల, ప్రాపుగ = సాహాయ్యంగా, చని = వెళ్లి, తత్ = వారియొక్క, విపత్తి = కష్టమును, సంతాపమును = విచారాన్ని, మాన్పి = పోగొట్టి, కాతువట = రక్షింతువఁట - కాపాడుదువట.

తా: ఓదశరథరామా, భరతునిఅన్నయైన శ్రీరామా, పాపములు పొందునపుడు, యుద్ధము, సర్పములు, భూతములు, జ్వరములు (తాపము-రోగము) మొదలైన వానిచేత ఆపదకలిగినప్పుడు నిన్ను సేవించేవారిని, కొలిచేవారిని సహాయము చేయబోయి, నీవు, నీతమ్ముడైన లక్ష్మణుడును రెండు ప్రక్కల నిలిచి వారి ఆపదలను పోగొట్టి రక్షింతువని లోకులు చెప్పుదురు. కాబట్టి నన్ను సేవించు నన్ను కాపాడవా?

వ్యా: ఈ పద్యంలో శ్రీరాముని భగవచ్ఛక్తిని వర్ణించినాడు కవి. భగవంతుడు ఆపద్బాంధవుడు. తనను సేవించేవారికి, కొలిచేవారికిఎటువంటి ఆపదలు కలిగినా, తాను తనతమ్మునివంటి పరివారం, ఆపదలో ఉన్నవారిని ఆదుకొంటారు. మానవుడు నిత్యకష్టజీవి. ఇంధనములు సేకరించడానికి వెళ్లితే అక్కడ సర్పబాధ కలుగుతుంది. కారడవుల్లో తిరుగుతూ ఉంటే భూతప్రేతపిశాచబాధలు కలుగుతాయి. శత్రువులు తనకు అపకారంచేస్తూంటే దాన్ని నిర్మూలించక ఉండలేడుకదా. అప్పుడు శత్రువుతో సంఘర్షణకు దిగవలసి వస్తుంది. దానివలన ప్రాణాపాయం ఏర్పడవచ్చును. లోకంలో రోగగ్రస్తుడు కాని మనుష్యుడు ఉండడు. జ్వరాదికాలు మానవులను పీడిస్తూ ఉంటాయి. ఆరోగ్యభంగం అవుతుంది. కొన్ని వ్యాధులు ఔషధాలకు లొంగవు. ఈ ఆపదలు మనుష్యులకు వచ్చినప్పుడు ఆపన్నరక్షకుడైన భగవంతుడే దిక్కు అని అతన్ని ప్రార్థిస్తే సేవిస్తే వచ్చి కాపాడుతాడు. తన పరివారంతో వస్తాడు. వారికి కలిగిన విపత్తును మాన్పి రక్షిస్తాడు. భగవంతుని భక్తరక్షణగుణం మనం అనేకవృత్తాంతాల్లో చూడవచ్చు. ఆపదలో

చిక్కుకొన్న గజేంద్రుని కాపాడలేదా? అవమానానికి గురి అయిన ద్రౌపదీదేవిని రక్షించలేదా? అన్నచేత అవజ్ఞకు లోనైన విభీషణునికి శరణు ఇవ్వలేదా? అందుచేత మానవులు కష్టం కలిగినప్పుడు శ్రీరాముని ధ్యానించవలెనని, ఆపదలను నిర్మూలించుకోవలెనని, కవి బోధిస్తున్నాడు.

ఆపదామపహర్తారం - దాతారం సర్వసంపదామ్।

లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహమ్॥

శ్రీరాముని నిర్హేతుకజాయమానకరుణాకటాక్షం గురించి రామాయణంలో ఒక ఘట్టం ఉన్నది.

దండకారణ్యంలో శ్రీసీతారామలక్ష్మణులున్నపుడు, సీతాదేవికి ఒక సందేహం వచ్చింది. ఆ సందేహాన్ని మృదుమధురంగా తన భర్తకు ఈ విధంగా నివేదించింది.

'నాథా, మీరు ధర్మాత్ములు. మీకు తెలియని ధర్మం లేదు. కాని రాక్షస సంహారం అధర్మకార్యమేమో అని నా అనుమానం. మనతో వైరంపెట్టుకోనివాళ్లను మనం సంహరించవచ్చునా అని నా సందేహం. అసత్యసంభాషణ, పరస్త్రీగమనం, నిర్వైరసంహారం అనే మూడు కామంవలన ఏర్పడే పాపకృత్యాలు. వాటిలో మొదటి రెండు మిమ్ములను స్పృశించవు. కాని మూడవదోషం మిమ్ములను బాధిస్తున్నట్లుగా నాకు అనిపిస్తున్నది. అసురసంహారంకోసం మీరీ దండకారణ్యంలో దండయాత్ర సాగించడం నాకిష్టం లేదు. దానివలన మనం దోషానికి గురి అవుతామేమోనన్నదే నా సందేహం' అని.

ధర్మనిష్ఠుడయిన శ్రీరాముడు ధర్మపత్నికి వచ్చిన సందేహాన్ని విని సంతోషించినాడు. దానికి ఆయన ఈ విధంగా సమాధానం చెప్పినాడు.

కిం ను వక్ష్యామ్యహం దేవీ త్వయైవోక్తమిదం వచః।

క్షత్రియైర్ధార్యతే చాపో నార్తశబ్దో భవేదితి॥

దేవి, నీకు నేనేమి సమాధానం చెప్పేది? నీవు ఇదివరకే అన్నావుకదా, క్షత్రియులు ధనుస్సు ధరించేది, ఇతరులు దుఃఖించి హాహాకారాలు చేయకూడదని. అనగా ఎవరైనా కష్టాల్లో ఉంటే వారిని రక్షించడానికే ఈ ధనుర్ధారణ.

తే చార్తా దండకారణ్యే మునయః సంశితవ్రతాః।

మాం సీతే స్వయమాగమ్య శరణ్యం శరణం గతాః॥

సీతా, దండకారణ్యంలో నివసించి, కఠోరవ్రతాలు చేసే యీ మునులు చాల దుఃఖితులు. అందుచేతనే, నేను శరణాగతవత్సలుడనని భావించి నా యొద్దకు వచ్చి నన్ను శరణువేడినారు.

వసంతః కాలకాలేషు వనే మూలఫలాశనాః।

న లభన్తే సుఖం భీమా రాక్షసైః క్రూరకర్మభిః॥

భక్ష్యంతే రాక్షసై ర్భీమైర్నరమాంసోపజీవిభిః।

సీతా, వనంలో ఎల్లప్పుడు నివసించి ఫలములు తినే ఈ మునులు, క్రూరంగా ప్రవర్తించే రాక్షసులకారణంగా ఎప్పుడూ సుఖంగా ఉండరు. మనుష్యమాంసానికి రుచిమరగిన రాక్షసులు ఈ మునులను సంహరించి తినివేస్తారు.

*తే భక్ష్యమాణా మునయో దండకారణ్యవాసినః॥*

*అస్మానభ్యవపద్యేతి మామూచుర్ద్విజసత్తమాః॥*

ఈ రాక్షసులకు ఆహారమవుతున్న దండకారణ్యవాసులైన మునులు, బ్రాహ్మణోత్తములు, మనవద్దకు వచ్చి నాతో, 'ప్రభూ, మమ్ములను అనుగ్రహించండి' అని ప్రార్థించినారు.

*సర్వైరేవ సమాగమ్య వాగియం సముదాహృతా,*

*రాక్షసైర్దండకారణ్యే బహుభిః కామరూపిభిః॥*

*అర్దితాః స్మ భృశం రామ భవాన్ నస్త్రత రక్షతు,*

అప్పుడు వారందరు తమ మనస్సులోని భావాలను ఈ విధంగా వ్యక్తం చేసినారు: శ్రీరామా! దండకారణ్యంలోకామరూపులైనరాక్షసులు అనేకులున్నారు. వారివలన మాకు చాల ఆపదలు కలుగుతున్నాయి. అందుచేత వారినుండి కలిగే కష్టాలనుండ మీరే రక్షించవలె.

*హోమకాలే తు సంప్రాప్తే పర్వకాలేషు చానఘ,*

*ధర్షయంతి సుదుర్ధర్షా రాక్షసాః పిశితాశనాః॥*

రఘునందనా, అనఘా, అగ్నిహోత్రకాలం సమీపించినప్పుడు, పండుగసమయం వచ్చినప్పుడు, చాల దుష్టులైన రాక్షసులు మమ్ములను చాల హింసిస్తారు.

*తేన శాపం న ముంచామో భక్ష్యమాణాశ్చ రాక్షసైః,*

*తదర్ద్యమానాన్ రక్షోభిర్దండకారణ్యవాసిభిః,*

*రక్ష నస్త్వమ్ సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే॥*

(ఈ కారణంచేత), రాక్షసులకు ఆహారమైనప్పటికి, మేము వారిని శపించలేము. అందుచేత నిశాచరులవలన పీడితులమైన మమ్ములను, మీరు మీ సోదరుడు రక్షించవలె. ఈ వనంలో ఇంక మాకు మీరే రక్షకులు కదా.

*మయా చైతద్వచః శ్రుత్వా కార్త్స్న్యేన పరిపాలనమ్ ,*

*ఋషీణాం దండకారణ్యే సంశ్రుతం జనకాత్మజే॥*

ఓ జనకరాజకుమారీ, దండకారణ్యంలో ఉండే ఋషులు ఈ విధంగా చెప్పితే విని వారిని పూర్తిగా రక్షించవలెననే నిశ్చయానికి వచ్చినాను.

అందుచేత నేను నిర్వైరులను శిక్షించే ప్రసక్తి లేదుకదా.

ఈ మాటలు సీతాదేవిని సంతృప్తిపరచినాయి. ఆమెసందేహం తీరిపోయింది.

ఈ విధంగా ఎవరికి ఏమి ఆపదకలిగినా శ్రీరాముడు. తనసోదరునితో గూడి వారిని ఆ ఆపదనుండి కాపాడుతాడు అని విని కవి ఈ పద్యం వ్రాసి ఉంటాడు.

**46.చ. అగణితజన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్**
**దెగిపడ నీఁదలేక, జగతీధవ నీపదభక్తినావచేఁ**
**దగిలి తరింపఁ గోరితిఁ బదంపడి నాదుభయంబు మాన్పవే**
**తగదని చిత్తమందిడక దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : జగతీధవ = లోకాధినాథా, అగణిత = లెక్కలేనన్ని, అసంఖ్యాకమైన, జన్మ = పుట్టువులందలి, కర్మ = కర్మపరంపరచే కల్గిన, దురిత = పాపాలనే, అంబుధిలోనన్ = సముద్రంలో, బహు = అనేకాలయిన, దుఃఖము = విషాదాలు, బాధలు అనే, వీచికలు = తరంగాలు, అలలు, తెగిపడన్ = వచ్చిపడగా, ఈఁదలేక, = ఈఁదుటకు సాధ్యం కాక, తరించడం సాధ్యం కాక, పదంపడి = పిమ్మట, తరువాత, నీపదభక్తినావచే = నీపాదములపై భక్తి అనే ఓడవలన, తగిలి = ఆసక్తితో, కోరికతో, తరింపఁగోరితిన్ = దాటడానికి ఇచ్ఛగించినాను. తగదు+అని = ఇది కూడదు అని, తగినది కాదు అని, చిత్తమందు = మనస్సులో, ఇడక = వహించక, ఉంచుకొనక, నాదుభయంబున్ = నావెరపును, మాన్పవే = పొగొట్టుమా, నిర్మూలించుమా.

తా : ఓలోకనాథా, ఓ రఘురామా, లెక్కింపరాని జన్మములందలి కర్మపరంపరలచేత, కలిగినపాపాలు సముద్రంలాగ అపారంగా ఉన్నాయి. ఆపాపాలవల్ల అనేక దుఃఖాలు కెరటాలలా వచ్చిపడుతున్నాయి. వాటిని నాయంతట నేను నిర్మూలించుకోవడం సాధ్యం అయ్యేపని కాదు, అందుచేత నీపాదముల భక్తి కలిగి, దానిని ఓడలాగ చేసికొని, ఈదరానిసముద్రాన్ని ఓడచే సులభంగా దాటినట్లు నా పాపాలను తేలికగా పొగొట్టుకొనదల్చినాను. నా యీ సంకల్పాన్ని నీవు తగినది కాదు అని నిరాకరించక, అనగా స్వీకరించి నా వెరపును, భయాన్ని నిర్మూలించుమా.

వ్యా : భారతీయ ఆధ్యాత్మిక జీవనంలో జన్మాంతరములపై విశేషమైన విశ్వాసం కనిపిస్తుంది. ఒక జీవితంలో సత్కార్యాలు చేస్తే, మరొక జీవితంలో మంచి ప్రవర్తన ఏర్పడుతుందని, ఆ జీవితంలో సుకృత్యాలు చేస్తే, భగవంతుని ప్రార్థిస్తే మోక్షం లభిస్తుందని మనవారి విశ్వాసం. గోపన్న కవి ఈ పద్యంలో జన్మపరంపరలనుగురించి, వాటివలన సంక్రమించిన పాపాలనుగురించి, ఆ పాప ఉదధిని దాటేమార్గంగురించి ప్రస్తావించినాడు. జీవుడు తెలిసిచేసినా, తెలియకచేసినా పాపాలు అసంఖ్యాకంగా పేరుకొనిపోతాయి. వాటిని దాటడానికి భగవంతునిమీద భక్తి ఏర్పడడమొక్కటే మార్గం. భగవంతుడొక్కడే ఈ పాపాలను నిర్మూలించి మోక్షాన్ని ప్రసాదిస్తాడని భక్తిసిద్ధాంతాన్ని విశ్వసించినవారు భావిస్తారు. భగవంతుని చేరడానికి, కష్టాలను, భయాలను తరించడానికి

జ్ఞానమార్గం కంటె, కర్మమార్గంకంటె, భక్తిమార్గమే సులభమైందని గోపన్న కవి ప్రతిపాదించినాడు.

జన్మలో అనేక కర్మలు చేయవలసి వస్తుంది. దానివలన అనేకపాపాలు సంభవిస్తాయి. ఆ పాపాలు సముద్రంలాంటివి. దైవసాహాయ్యంలేక ఎవడును దాన్ని దాటడం సంభవం కాదు. అందుచేత నావ-ఓడ- కావాలె. ఓడ భగవంతుని పదాంబుజభక్తి. అది లభిస్తే ఈ సముద్రాన్ని తరించడం చాలసులభం. ఈ భక్తిసూత్రాన్ని సర్వజనులకు సమన్వయం అయ్యేటట్లుగా కవి సులభంగా ఈ పద్యంలో ప్రతిపాదించినాడు. ఈశ్వరునిపదభక్తి ఉపమేయం. నావ ఉపమానం. ఇక్కడ ఆరోపణ ఉన్నది కాబట్టి ఇది రూపకాలంకారం.

**47.ఉ. నేనొనరించు పాపములనేకములైనను, నాదుజిహ్వకున్**
**బానకమయ్యె మీ పరమపావననామము దొంటిచిల్క 'రా**
**మా, నను గావు'మన్న తుదిమాటకు సద్గతిఁ జెందెఁ గావునన్**
**దాని ధరింపఁ గోరెదను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : నేను, ఒనరించు = ఆచరించునట్టి, పాపములు = దోషాలు, అనేకములు = పెక్కులు, బహుసంఖ్యాకములు, ఐనను = అయినప్పటికి, నాదు జిహ్వకు = నా యొక్క నాలుకకు, నా వాక్కుకు, మీ పరమ పావననామము = మీ యొక్క మిక్కిలి పవిత్రమైనపేరు, పానకము+ అయ్యెన్ = రుచి అయినది. తీయనైనది, ఆస్వాద్యమైనది. తొంటి = పూర్వం నివసించిన, చిల్క = రామ చిలుక, శుకము, రామా నను కావుము = ఓ రామా, నన్ను రక్షింపుము, నన్ను కాపాడుము, అన్న = అనిన, తుదిమాటకు = కడపటిమాటకు, చివరిపలుకునకు. సద్గతిన్ = సన్మార్గమును, మోక్షమును, చెందెను = పొందెను. కావున = కాబట్టి, దాని = ఆ రామనామాన్ని, ధరింపను = (నేను) వహించడానికి, పూనడానికి, కోరెదను = ఇచ్ఛగింతును, ఇష్టపడుతాను.

తా: ఓ దశరథరామా, పాపాలను అనేకం నేను చేస్తున్నవాడను, చేసినవాడను. ఇట్టి పాపాత్ముడనైనను నీ దివ్యనామం ఉచ్చరించడం నా నాలుకకు పానకంలాగ రుచికరంగా ఉన్నది. అనగా ఆస్వాదయోగ్యంగా ఉన్నది. ఎట్లనగా, పూర్వం ఒక చిలుక, 'రామా, నన్ను కావుము' అని కడపట ఒక్కమాట చెప్పగానే, మోక్షమునొందెగదా! నీ పేరు అటువంటిస్థితి ప్రసాదిస్తుంది. కాబట్టి నేను చాల రుచిగల నీ నామాన్ని పఠిస్తాను. (మోక్షాన్ని పొందుతాను).

వ్యా: లౌకిక జీవితాన్ని గడిపే కంచెర్ల గోపన్నకవి, వారెవరైనా, నిత్యజీవితంలో దోషాలకు గురి కాకుండ తప్పించుకొనలేరు. దానిని సమర్థించుకోవడంకంటె, ఆ దోషాలుచేసినట్లు అంగీకరించడం, పశ్చాత్తాపపడడమే ప్రాయశ్చిత్తం. ఇది చేసుకొంటూనే

భక్తుడు రామనామాన్ని ధ్యానించినాడు. ఆ నామం అతనికి పంచదారతో చేసిన పానకం త్రాగినంతటి రుచికరంగా భాసించింది. రామనామోచ్చారణవలన భక్తుడు చేసినపాపాలు నశించిపోతాయని అతనికి విశ్వాసం ఉన్నది. ఎందుచేతనంటే, ఒక చిలుక, కేవలపక్షిజాతికి చెందినట్టిది, పూర్వం తన చివరిక్షణంలో 'రామా నన్ను కాపాడుము' అని పల్కిందట. దయామయుడైన శ్రీరాముడు దానికి ఆ చిలుకకు అంతమాత్రంచేతనే మోక్షం ప్రసాదించినాడు. ఈ భక్తుడుకూడ శ్రీరామనామాన్ని ధరింపగోరుతున్నాడు. తత్పరిణామమైన మోక్షాన్ని పొందగోరుతున్నాడు.

భగవంతునిభక్తులెవరైనా తప్పులు చేయకపోరు. కాని తమ తప్పులను సమర్థించుకోవడంకంటె, వాటిని అంగీకరించి, ఆ దోషజాలంనుండి బయటపడడమే కర్తవ్యం. దోషాన్వితులు భగవన్నామస్మరణచేయవలెనని, పాపపరిహారం పొందవలెనని కవి ఈ పద్యంలో సూచించినాడు. కవి తనవృత్తాంతం చెప్పినట్లుగానే చెప్పి పాఠకులకు రామనామోచ్చారణం వల్ల కలిగే ఫలితాన్ని సూచించినాడు.

పూర్వం ఒక చిలుక, అంతిమసమయంలో రామనామం ఉచ్చరించి ముక్తిని సంపాదించింది. అనే కథకూడ ఈ పద్యంలో సూచితమైంది. ఆ వృత్తాంతమిది.

ఒక నగరంలో జీవంతి అనే వేశ్య ఉన్నది. ఆమె తనవినోదంకొరకు, చిలుకలు అమ్మేవానినుండి ఒక చిలుకను కొన్నది. తనకు సంతానం లేదు కాబట్టి ఆ చిలుకను ప్రేమతో పెంచుకొనేది. దానికి 'రామ రామ' అనే మాటలను నేర్పింది. రామ అని పలుకగానే, పెంపుడు చిలుక జీవంతితొడపై వ్రాలుతుండేది. కొంత కాలానికి జీవంతికి, చిలుకకు అవసానకాలం సంప్రాప్తమైంది. ఇద్దరూ అలవాటు ప్రకారంగా రామ రామ అంటూ ప్రాణాలు వదలినారు.

అవినీతిగా భావించక, పరలోకభయం లేక వ్యభిచరించిన వేశ్యను కొనిపోయేటందుకు యమదూతలు, 'రామ రామ' అంటూ మరణించడంచేత ఆమెను విష్ణులోకానికి తీసుకపోవడానికి విష్ణుదూతలు వచ్చినారు. ఒకరు ఈమె పాపి, అంటే, మరొకరు ఈమె పుణ్యవతి అని వాదించసాగినారు. వారికలహం చివరకు యుద్ధంగా మారింది. విష్ణుదూతలచే దెబ్బలు తిని, యమదూతలు, యమధర్మరాజుదగ్గరకు వెళ్లి జరిగింది చెప్పి 'ప్రభూ, ఈ పరాభవం మాది కాదు. ఇది మీదే' అని చెప్పి ఖేదపడసాగినారు. అప్పుడు యముడు

*దూతా యది స్మరంతౌ తౌ రామనామాక్షరద్వయమ్ ।*
*తదా న మే దండనీయౌ తయోర్నారాయణః ప్రభుః॥*

'దూతలారా, వారు మరణించేసమయంలో రామ అనే రెండక్షరాలు పలికిన వార[illegible] కొబట్టి, వారు మనచేత దండింపదగినవారు కాదు. వారికి ప్రభువు శ్రీమన్నారాయ[illegible]

కావున వేశ్యయు, ఆమె పెంపుడు చిలుకయు, వైకుంఠానికి వెళ్లడానికి అర్హులు' అని విశదం చేసినాడు.

మృత్యుకాలే ద్విజశ్రేష్ఠ రామేతి నామ యః స్మరేత్
స పాపాత్మాపి పరమం మోక్షమాప్నోతి జైమినే

ఓ జైమినీ, మృత్యుసమయంలో రామనామస్మరణ చేసినవాడెంత పాపాత్ముడైనా, మోక్షపదవిని పొందుతాడు. రామనామం సమస్తఅమంగళాలను అణచి, మనోభీష్టాలను నెరవేర్చి మోక్షం ప్రసాదిస్తుంది.

**48.చ. పరధనముల్ హరించి, పరభామలనంటి, పరాన్నమబ్బినన్**
**మురిపముకాని, మీఁదనగు మోసమెరుంగదు మానసంబు, దు**
**స్తరమిది, కాలకింకరగదాహతి పాల్పడనీక, మమ్ము నే**
**తరి దరిఁజేర్చి కాచెదవొ? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : పరధనముల్ = ఇతరులద్రవ్యములను, హరించి = అపహరించి, దొంగిలించి, గ్రహించి, పరభామలను = ఇతరులఇల్లాండ్రను, అంటి = తాకి, స్పృశించి, పరాన్నము = ఇతరుల ఆహారము (కష్టము చేయక దొరికే ఆహారము), అబ్బినన్ = దొరుకగా, మురిపము కాని = సంతోషించును కాని, ఆనందిస్తుంది కాని, మీద = అటుపిమ్మట, భవిష్యత్తులో, అగు మోసము = కలిగేప్రమాదము, మానసము = మనస్సు, ఎరుంగదు = తెలిసికొనదు, ఇది = ఇట్లు తెలియక పోవడము, దుస్తరము = తరింపరానిది దాటరానిది. కాలకింకర = యమునిదూతలయొక్క, గదా = గద అనే ఆయుధం యొక్క, హతి = దెబ్బయొక్క, పాలు = వశము, అధీనత, పడనీక = పొందనీయక, మమ్ము, ఏతరి = ఏ సమయంలో, దరిచేర్చి = దగ్గరతీసి, ఆశ్రయమిచ్చి, కాచెదవో = రక్షింతువో.

తా: దశరథరామా, పరులధనాన్ని దొంగిలించడం, పరస్త్రీలతో సంపర్కం చేయడం, ఇతరులు కష్టపడి సంపాదించిన ఆహారాన్ని తినడం, మొదట సుఖంగా ఉండినప్పటికీ, తరువాత నరకాన్ని కలిగిస్తుంది. యమదూతలగదాహతులకు గురిచేస్తుంది. ఇది మనస్సుకు తెలియదు. మనస్సును జయించడం కష్టం కాబట్టి మనస్సు ప్రేరేపించిన దారిలో వెళ్లి, నరకంలో బడకుండేటట్లు మమ్ము ఎప్పుడు కడతేర్చి కాపాడుతావో! కాపాడుతాడు శ్రీరాముడు అని భావం.

వ్యా: అరిషడ్వర్గానికి లోనైనవాడు చేసే పనులను ఉటంకించి చెబుతున్నాడు కవి ఈ పద్యంలో. పరధనముల్ హరించడం లోభగుణపరిణామం. తాను కష్టపడి సంపాదించవలె

కాని, ఇతరులు పరిశ్రమించి సంపాదించిన దాన్ని దొంగిలించడం, లేదా దౌర్జన్యం చేసి హరించడం అన్యాయం. పాపమే. ఇది పాపకారణమైంది.

పరభామలనంటి' అన్నాడు. ఇది మోహగుణపరిణామం. తనభార్యకంటె ఇతరుల భార్య సౌందర్యవతి కావచ్చు. ఆమెను పొందే అవకాశం రావచ్చు. కాని పరదారసంపర్కం పాపహేతువు. పరస్త్రీని సోదరిగా భావించవలెనని నీతిశాస్త్రం చెబుతున్నది.

పరాన్నం తినడం అనేదికూడ లోభమే. తాను కష్టపడి సంపాదించి భుజించవలెకాని, ఇతరులపై ఆధారపడి భోజనసౌఖ్యం అనుభవించడం పాపకారణమే. ఇటువంటి పరాన్నభుక్కులు లోకంలో మనకు సామాన్యంగా, తరచుగా దర్శనమిస్తారు. ఈ అరిషడ్వర్గంవలన చేసే, పరధనాపహరణం, పరదార గ్రహణం, పరాన్నభోజనం అనేవి మనస్సుకు చాలతృప్తినిస్తాయని, సంతోషాన్ని కలుగజేస్తాయని కవి అంటున్నాడు. నిజమే. ఈ సంతోషం ఎప్పటివరకు? అవి పాపాలని, వాటివలన నరకంలో యమకింకరుల బారి పడవలసి వస్తుందని తెలిసేదాకనే. ఆ తరువాత మానసికమైన నరకం అనుభవించవలసిందే.

అజ్ఞానంచేత మానవుడు అరిషడ్వర్గానికి లోబడి, పాపాలు ఆచరించినప్పటికి దానికి ప్రాయశ్చిత్తం లేకపోలేదు. తాను చేసేవి పాపకార్యాలని భావించి, పశ్చాత్తాపం పొంది, భక్తిమార్గం వహించి, భగవంతునిభజన చేసి మన్నింపుమని కోరుకొంటే ఈ పాపాలు నశించిపోతాయి. కవి ఆత్మాశ్రయంగా ఈ విశేషాలనే వెలిబుచ్చినాడు. భక్తుడు పరమాత్ముని ఆశ్రయించినట్లయితే, ఆయన భక్తునికి శరణం ఇచ్చి ఆతడు అజ్ఞానంతో చేసినపాపాలను పరిహరించి, ఘోరనరకంనుండి కాపాడుతాడు అనే విషయం ఈ పద్యంలో ధ్వన్యాత్మకంగా సూచితమైంది. భగవన్నామస్మరణలోని ఆధిక్యం వక్కాణింపబడింది.

**49.ఉ. చేసితి ఘోరకృత్యములు చేసితి భాగవతాపచారముల్**
**చేసితి నన్యదైవములఁ జేరి భజించినవారిపొందు నేఁ**
**జేసిన నేరముల్ దలచి చిక్కులు బెట్టకుమయ్య, యయ్య, నీ**
**దాసుఁడనయ్య భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: ఘోరకృత్యములు = భయంకరమైన కార్యములు, చేసితిని = ఒనరించినాను. భాగవతాపచారముల్ = భగవద్భక్తులయెడ అపచారములు, దోషములు, అపరాధాలు చేసినాను. అన్యదైవములు = విష్ణుమూర్తి కాని మరోదైవాలను, చేరి = ఆశ్రయించి, భజించినవారి = కొలిచినవారి సహవాసము చేసినాను. నేను చేసిననేరములను = నేను కావించిన తప్పులను, అపరాధాలను, తలంచి = ఎంచి, భావించి, పరిగణించి, చిక్కులన్

= సంకటాలను, పెట్టకుమయ్యా = కలిగించకుమీ, అయ్యా, నీ దాసుడను = నీకు సేవచేసే సేవకుడను.

తా: దశరథరామా, నేను భయంకరమైన పనులు చేసినాను. భగద్భక్తులైన నీ భక్తులకు, భాగవతులకు అపకారాలు చేసినాను. దోషాలు చేసినాను. విష్ణుమూర్తికిభిన్నమైన దైవములను కొలుచువారితో సహవాసం చేసినాను. ఈ అపరాధాలనన్నింటిని నేను ఆచరించినాను. నా తప్పులను తలచి, పరిగణించి నన్ను సంకటములలో పెట్టవలదు. నేను నీ సేవ చేసే దాసుడను. నన్ను మన్నించుము.

వ్యా : భక్తుడైన కవి తాను చేసిన అపరాధాలను ఈ పద్యంలో చెప్పి తన దైవాన్ని శరణువేడి మన్నింపమని ప్రార్థిస్తున్నాడు.

భాగవతులు అంటే, భగవంతుని సేవించేవారు. విష్ణుమూర్తిని కొలిచేవారు. భక్తులు. వీరు సాత్త్వికులు. ఇతరులకు హాని చేయనివారు. వీరికి హానిచేయడమే భాగవతాపచారం. కవి భాగవతాపచారం చేసినానని ఈ పద్యంలో చెప్పినాడు.

విష్ణుభక్తులు, విష్ణువును తప్ప ఇతర దైవతములను సేవించరు. అంతేకాదు, ఇతరదైవాలను సేవించేవారి సహవాసం చేయరు. అయినా, ఈ పద్యంలో కవి 'అన్యదైవముల చేరి భజించినవారి పొందు చేసితిని' అంటున్నాడు. 'నీవే తప్ప ఇతః పరంబెరుగ' అని భావించడమే విష్ణుభక్తుల లక్షణం. కవి ఇతరదైవతాలను అనుసరించేవారి సహవాసం చేసి ఈ నియమాన్ని కూడ అతిక్రమించినానని అంటున్నాడు. ఈ దోషాలన్ని శ్రీరాముని, విష్ణుమూర్తిని ఆశ్రయించి, అతనికి దాసుడైనప్పుడు తొలగిపోతాయని భక్తుని విశ్వాసం. పరమాత్ముడు భక్తులను కాపాడేవాడుకదా. భక్తులపక్షపాతికదా.

భక్తుడు తనదోషాలను, తాను చేసిన అపరాధాలను ఎరుకపరచి, తనను క్షమింపుమని, భగవంతుణ్ణి ప్రార్థించడాన్ని వైష్ణవులు నైచ్యానుసంధానమంటారు. ఇది వైష్ణవోచిత స్వభావములభవినయ గుణ సంపన్నత్వముగా, స్వాహంకారపరిత్యాగంగా గ్రహించవలెనే గాని, వైష్ణవులీ తప్పులన్నింటిని చేసినవారని భావించరాదు. ఎన్నో జన్మలు గడచినాయి. ఎన్నెన్ని అపరాధాలు చేసి ఉన్నామో మనకేమి తెలుసును? చేసియుండుట వాస్తవమగునేమో. ఈ అపరాధాలు పరిహరింపబడడం వలన ఈ జన్మలో హరిభక్తి సంక్రమించింది. 'పరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే' అని శాస్త్రవాక్యం.

**50.చ. పరులధనంబుఁ జూచి, పరభామలఁ జూచి, హరింపఁ గోరును**
**ద్ధురుతరమానసంబనెడి దొంగనుబట్టి నిరూఢదాస్య వి**
**స్ఫురితవివేకపాశములఁ జుట్టి, భవచ్చరణంబనే మరు**
**త్తరువునఁగట్టివేయఁగదె దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: పరులధనంబున్ = ఇతరులద్రవ్యమును, చూచి, ఆశతో చూచి, హరించవలెనని చూచి, పరభామలను = ఇతరుల స్త్రీలను, పరస్త్రీలను, హరింపన్ = అపహరించడానికి దొంగిలించడానికి, కోరు = వాంఛించు, మత్ = నా యొక్క, గురుతర = మిక్కిలి గొప్పదైన, మానసంబు = మనస్సు అనే, దొంగనుబట్టి = చోరుని బంధించి, నిరూఢ = ప్రసిద్ధి కెక్కిన, ప్రఖ్యాతమైన, దాస్య = సేవలో, కైంకర్యంలో, విస్ఫురిత = మిక్కిలి ప్రకాశించిన, వివేక = తెలివియనెడు = బుద్ధియనెడు, పాశములన్ = త్రాళ్లచేత, చుట్టి = బంధించి, భవత్ = మీ యొక్క, చరణమనే = పాదములనెడు, మరుత్‌తరువున = దేవతావృక్షానికి, కల్పవృక్షానికి, కట్టివేయఁగదె = బంధించివేయుమా.

తా. ఇతరులకు సంబంధించిన ద్రవ్యాన్ని, ఇతరులస్త్రీలను, అనగా పరస్త్రీలను చూచినప్పుడు, నామనస్సు వాటిని అపహరించడానికి కోరుతుంది. అపహరించేవాడు దొంగ కాబట్టి నా మనస్సు దొంగవంటిది. దానిని నీవు పట్టుకొని, నీకు కైంకర్యం చేసే బుద్ధి అనే త్రాళ్లతో నీవు బంధించుము. అనగా నిగ్రహించుము. తరువాత నీపాదాలు కల్పవృక్షంలాంటివి కాబట్టి ఆ వృక్షానికి కట్టివేయుము.

వ్యా: ఈ పద్యంలో కవి మానవునిచంచలస్వభావాన్ని వర్ణిస్తున్నాడు. స్వభావానికి కారణమైంది మనస్సు. ఈ మనస్సు నిశ్చలంగా ఉండదు. ఎప్పుడు ఏమి కాంక్షిస్తుందో ఎవరికెరుక? మహానుభావులైనవారు. తపస్సంపన్నులైనవారు. తమమనస్సును నిగ్రహించడానికే, తమకు కలిగిన కోర్కెలను అదుపులో పెట్టుకోవడానికే నిరంతరం ప్రయత్నం చేస్తుంటారు. కవి తన మనస్సును వివేకం లేని పశువుగా భావిస్తున్నాడు. ఎక్కడైనా పచ్చని చేను కనిపిస్తే ఆ చేను తాను మేయకూడదు అనే జ్ఞానాన్ని వదలి ఆ చేనులో ప్రవేశించి, తిన్నంత తిని మిగిలిన దాన్ని నాశనం చేస్తుంది దొంగపశువు. మానవుని మనస్సుకూడ అంతే. ఎక్కడనైనా ధనం కనిపిస్తే దాన్ని తేరగా గ్రహించి సౌఖ్యాలను పొందాలని కోరుకొంటుంది. పశువు తన ఎదుట యౌవనంలో ఉన్న ఆడజంతువు కనిపిస్తే దానిమీదకురికి దాన్ని అనుభవించవలెనని చూస్తుంది. ఆ విధంగా చేస్తుంది కూడ. మనుష్యుడు కూడ అంతే. పరస్త్రీలు అందంగా కనిపిస్తే చాలు. వారిని అన్యాయంగా అనుభవించవలెననే వాంఛకు గురిఅవుతాడు. ఈ కోరికలు మనుష్యునికి అజ్ఞానంవలన కలుగుతాయి. జ్ఞానం ఉన్నవానికి ఇటువంటి అన్యాయకార్యములమీద మనస్సు పోదు. దొంగ లాగ ప్రవర్తించే మనస్సును నిగ్రహించడానికి వివేకం అనే త్రాడు కావాలె. అది ఎప్పుడు లభిస్తుందంటే శ్రీరామునికి ప్రఖ్యాతమైన దాస్యం చేసినప్పుడు దైవసాహాయ్యం చేత లభిస్తుంది. అటువంటి వివేకం లభించినప్పుడు పశువును త్రాటితో బంధించి, దొంగతనం చేయనీయక ఆపినట్లుగా, మనుష్యుని మనస్సును నిగ్రహించవచ్చు.

కాని, త్రాటితో బంధించినంతమాత్రాన పశువు దొంగతనం మానదు. ఆ బంధనాన్ని వదలగానే తిరిగి దుష్ప్రవర్తనకు పాల్పడుతుంది. అందుచేత త్రాటితో బంధించినపశువును చెట్టుకు కట్టివేయాలె. అప్పుడది పైరులవరకు పోలేదు. ఇతరములైన ఆడజంతువుల దరిజేరదు. మనస్సుకూడ అంతే. శ్రీరామునిదాస్యం అనే త్రాటిచేత నిగ్రహించి, దానికి తిరిగి సంచలనం కలుగనీయక, నిశ్చలంగా ఉండడానికి శ్రీరామునిపాదాలనే కల్పవృక్షానికి బంధించినప్పుడే దాని చోరప్రవర్తన అంతం అవుతుంది. నిశ్చలంగా ఉంటుంది.

(నీ పాదమనే కల్పవృక్షానికి కట్టి వేయమనటంలో చమత్కారం ఉంది. శ్రీరామచరణబద్ధమైన మనస్సుకు అయోగ్యమైన కోరికలుండవు. యోగ్యమైన కోరికలుంటే అదే తీరుస్తుంది. కల్పవృక్షం లక్షణం అదే. అందుకే కల్పవృక్షంతో పోల్చటం.)

విశిష్టాద్వైతసంప్రదాయ విశేషం ఇక్కడ ఒకటి సూచితమైంది. వైష్ణవులు నిత్యం పఠించే తిరుమంత్రం ఒక భాగం ద్వయం అనే రెండు వాక్యాలున్నాయి. అవి శ్రీమన్నారాయణుని పాదాలను శరణువేడుతున్నట్లుగాను, ఆయన పాదాలకు త్రికరణశుద్ధిగా నమస్కరించుచున్నట్లుగాను ఉండే భావాన్వితమైనవి. వైష్ణవుల ప్రపత్తిలో ద్వయానుసంధానం ముఖ్యమైనభాగం. నారాయణమూర్తిపాదాలు కల్పవృక్షంలాంటివి. కాబట్టి వాటిని శరణువేడిన వారికి సర్వము సమకూరుతుంది. మోక్షంకూడ లభిస్తుంది. విష్ణుభక్తుడు ద్వయానుసంధానంచేసి, తనను తాను, శ్రీమన్నారాయణుని పాదములనే కల్పవృక్షానికి బంధించుకొనవలె. ఈ పనిలో భగవంతుని సాహాయ్యమర్థించవలె. 'భవచ్చరణంబనే మరుత్తరువునఁ గట్టివేయఁ గదె' అని శ్రీ రాముని ప్రార్థించడంలో, విశృంఖలంగా ఉన్న అజ్ఞానిని ద్వయానుసంధానం చేయించి శ్రీ మన్నారాయణపాదపద్మయుగళం ఆశ్రయించేటట్లు చేయుమనే అభ్యర్థన ఉన్నది.

శ్రీకులశేఖరాళ్వార్లు ముకుందమాలలో ఈ శ్లోకాన్ని రచించినారు.

> ముకున్దమూర్ధ్నా ప్రణిపత్య యాచే భవన్త మేకాన్త మియన్త మర్థమ్।
> అవిస్మృతి స్త్వచ్చరణారవిందే భవే భవే మే ఽస్తు భవత్ప్రసాదాత్ ॥

దీనిలో ఆళ్వార్లు జన్మజన్మల్లో శ్రీమన్నారాయణపాదపద్మయుగ్మమునందలి సంస్మృతిని కోరుచున్నాడు. ఇదే మోక్షమార్గమని, ఇదే భక్తిమార్గమని, సంచలనాత్మకమైన మనస్సును నిశ్చలంచేయడానికి ఈ పద్ధతికంటె మరొకటి లేదని ఆళ్వారుల అభిప్రాయమై ఉంటుంది. గోపన్నకవి, శ్రీ రాముని భవచ్చరణంబనే మరుత్తరువునఁ గట్టివేయఁగదె, అని ప్రార్థించడంకూడ, పూర్వాళ్వారుల అభిప్రాయానికి, భక్తిప్రపత్తిమార్గానికి అనుగుణంగానే ఉండడం విశేషంగా పరిగణించవలసి ఉన్నది.

**51.చ. సలలితరామనామజపసారమెరుంగను గాశికాపురీ**
**నిలయుఁడఁగాను, మీ చరణనీరజరేణుమహాప్రభావముం**
**దెలియ నహల్యఁ గాను, జగతీవర, నీదగు సత్యవాక్యముం**
**దలఁపఁగ రావణాసురునితమ్ముఁడఁ గాను, భవద్విలాసమున్**
**తలఁచి నుతింప నాతరమె? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: సలలిత = ఇంపైన, మిక్కిలి ఒప్పుచున్న, మనోజ్ఞమైన, రామనామ = శ్రీరామునిపేరు, జపము = మంత్రావృత్తి, తిరిగి తిరిగి పలుకడము, సారము= శక్తిని, సారమును, ఎరుంగను = తెలుసుకోవడానికి, కాశికాపురీనిలయుఁడను = కాశీనగరంలో, వారణాసీనగరంలో నివాసం చేసే శివుడను కాను, మీ చరణనీరజ = మీపాదములనే పద్మాలయొక్క, రేణు = దుమ్ము ధూళి అనే పుప్పొడి యొక్క, మహాప్రభావమున్ = గొప్పమాహాత్మ్యాన్ని, తెలియన్ = తెలిసికొనడానికి, అహల్యను కాను = గౌతముని భార్యయగు అహల్యాదేవిని కాను, జగతీవర = ఓ భూనాథా, (సంబోధన) నీదగు = నీకుచెందిన, నీవాడిన, సత్యవాక్యమున్ = నిజమైనమాటను, యథార్థాన్ని, తలఁపఁగన్ = భావించడానికి, ఎన్నడానికి, రావణాసురునితమ్ముఁడన్కాను = విభీషణుని కాను, భవద్విలాసముల్ = నీ మహిమతోడ కూడిన విచిత్రమైన కార్యములు, నీ సుందరకార్యకలాపాలు, తలచి = భావించి, నుతింపన్ = స్తుతిచేయడానికి, పొగడడానికి, నా తరమె = నాకు శక్యమా, నాకు సాధ్యమా?

తా : ఓ లోకపాలకా, ఓ దశరథరామా, నీ పేరును, అంటే, రామనామాన్ని జపించడం చేత కలిగే శక్తి కాశీనగరంలో నివాసంచేసే విశ్వనాథుడనే ప్రఖ్యాతి కలిగిన మహేశ్వరునికి తెలుస్తుంది. కాని, నాకు తెలియునా? నీ పాదధూళియొక్క మహత్త్వము, మహిమ, ప్రభావము, అహల్యాదేవికి తెలుస్తుంది కాని నాకెట్లా తెలుస్తుంది? నీ సత్యవాక్కులోని గొప్పతనం తెలిసికోవడానికి రావణాసురుని తమ్ముడైన విభీషణునికి శక్యముకాని నాకు సాధ్యమా? నీ లీలలు, నీసుందరకృత్యాలు నావంటివానికి తెలిసికోవడం కాని, వర్ణించడం కాని సాధ్యం కాదు.

వ్యా : కవి ఈ పద్యంలో తాను సామాన్యుడను, రామనామజపంతో వచ్చేశక్తిని, పాదధూళి మహత్త్వాన్ని, సత్యవాక్శక్తిని తెలుసుకోలేను. ఈ విశేషాలు కాశీనగరంలోని శివుడు కనుగొనగలడు. అహల్యాదేవి తెలిసికోగలదు. విభీషణునికి ఈ జ్ఞానం ఉన్నది. కవి పైవారివంటిశక్తి సమన్వితుడు కాడు కాబట్టి శ్రీరాముని లీలను తెలుసుకోవడంకాని, వర్ణించడం కాని తనకు సాధ్యం కాదని చెప్పినాడు. ఇది శ్రీరాముని నామ మహత్త్వాన్నీ చరణరజఃప్రభావాన్నీ, సత్యవ్రతాన్నీ కవియొక్క వినయశీలాన్నీ వ్యక్తం చేస్తుంది.

అహల్యవృత్తాంతం శ్రీమద్రామాయణంలో ఇట్లా ఉన్నది. విశ్వామిత్రునివెంట వెళుతున్న శ్రీరామలక్ష్మణులు గౌతముని ఆశ్రమంలో ప్రవేశించగానే దుర్నిరీక్ష్యమైన అహల్యాలావణ్యం సుదర్శనీయమవుతుంది. వారు ఆమెఅపూర్వసౌందర్యాన్ని చూచి నివ్వెరపోతారు. పొగకమ్మిన అగ్నిశిఖవలె, మబ్బునిండిన చంద్రునివలె ఎవరికి కనిపించక ఉన్న అహల్య శ్రీరాముని సన్నిధిలో రమణీయంగా వెలువడుతుంది. నిరాహారంగా వేలసంవత్సరాలు తపించిన అహల్యాదేవిని చూచి రామలక్ష్మణులు ఆమెపాదాలకు నమస్కరిస్తారు. ఆమెకూడ తనభర్తచెప్పినమాటలను గుర్తు తెచ్చుకొని రామపాదాలకు నమస్కరిస్తుంది. అంతటితో అహల్యశాపవిమోచనం అవుతుంది. అహల్యాగౌతములు ఆనందంగా ఆశ్రమంలో మళ్లీ తమ జీవితయాత్రను సాగిస్తారు.

వాల్మీకిరామాయణంలో అహల్య 'భస్మశాయినీ'. అధ్యాత్మరామాయణంలో ఆమె 'శిలాయాం' శిలయందు పడిఉంటే రాముడు త్రొక్కినప్పుడు, పాదస్పర్శకలిగినప్పుడు శాపవిమోచనం అయినట్లున్నది. పాదస్పర్శ, పాదధూళి, ఏదైనా ఒక్కటే. ఏదైనా పవిత్రమే. అహల్య ప్రకృతికి వశమై ప్రవర్తించింది. ప్రకృతికి, స్వభావానికి, చంచలత్వానికి తగినశాపం పొందింది. 'సుఖం వా యదివా దుఃఖమ్' అనే గీతావాక్యాన్ని అనుసరించి, ఆమె ప్రకృతికి తగినవిధంగా శిక్ష అనుభవించిన అనంతరం శ్రీరాముడు ఆమెకు శాపవిమోచన కలిగించినాడు. శ్రీరాముని పాదపద్మాలమాహాత్మ్యం తెలిసింది. కాబట్టి శ్రీరాముని పాదస్పర్శవలన తన దుఃఖాన్ని పోగొట్టుకొన్నది అహల్య. విభీషణునికి సభలో అవమానం తనఅన్నవలన జరిగింది. అందుచేత శ్రీరాముని శరణు కోరినాడు. ఆయన అభయం పొందినాడు.

*సో ఽహం పర్యుషితస్తేన దాసవచ్చావమానితః ।*
*త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః ॥*
*సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే ।*
*నివేదయత మాం క్షిప్రం విభీషణముపస్థితమ్ ॥*

రావణునిరాక్షసభావానికి, విభీషణునిసాధుభావానికి ఘర్షణ జరిగింది. సీతను రామునికి అర్పించమని అనేకవిధాలుగా విభీషణుడు రావణునికి చెప్పినాడు. రావణునికి కోపం వచ్చింది. ఇక అక్కడ ఉండలేను, పుత్రులను, భార్యను విడిచి రాముని శరణువేడి వచ్చినానని, లోకాలన్నింటికి రాముడే శరణు, మహాత్ముడు, రామునిచేరి శరణువేడుకొంటున్నానని రామునికి నివేదించండి, అని తనను చూచినవానరులకు విభీషణుడు చెప్పినాడు.

ఇది విని రాముడేమన్నాడో చూతాము.

మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన ।
దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్ ॥

అన్నాడు శ్రీరాముడు. మిత్రభావంతో వచ్చినవారిని ఏ పరిస్థితిలోను తిరస్కరించకూడదు. శరణు అని వచ్చిన దోషినైనా గ్రహించడం సత్పురుషులకు దోషం కాదు.

విభీషణుని మిత్రభావం గుర్తించినాడు శ్రీరాముడు.

శ్రీరాముని 'సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే' అని విభీషణుడు అతని దైవత్వాన్ని గుర్తించినాడు. అందుచేతనే ఇద్దరికి సంబంధం కుదిరింది.

**52.ఉ. పాతకులైన మీ కృపకుఁ బాత్రులు గారె తలంచి చూడఁ జ**
**ట్రాతికి గల్గెఁ బావన, మరాతికి రాజ్యసుఖంబు గల్గె, దు**
**ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ, గపిజాతి మహత్త్వమునొందెఁ గావునన్**
**దాతవ యెట్టివారలకు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : పాతకులైనన్ = పాపాత్ములైనప్పటికి, దోషం చేసిన వారైనప్పటికి, మీకృపకు = మీదయకు, పాత్రులు కారె = అర్హులుకారా - అర్హులగుదురు, తలంచి చూడన్ = భావించిచూడగా, చట్రాతికి = చట్టురాయిగా ఉండిన అహల్యకు, పావనము = పవిత్రత్వము, దోషరాహిత్యము, కల్గెన్ = లభించింది. అరాతికి = శత్రువుకు, విభీషణునికి, రాజ్యసుఖంబు = రాజ్యలాభమనే సౌఖ్యము, కలిగెను = దొరికింది. దుర్జాతికి = నీచజాతులవారికిని, పుణ్యము = సుకృతము, అబ్బెన్ = దొరికింది. కపిజాతి = వానరజాతి, మహత్త్వము = గొప్పతనాన్ని, పొందింది = అందుకొన్నది. కావున = కాబట్టి, ఎట్టివారలకున్ = ఎటువంటి వారికైనా, దాతవు = అడిగినది ఇచ్చేవాడవు, కోరికలు తీర్చేవాడవు నీవు.

తా : దశరథరామా, పాపాత్ములైనా, దోషాలు చేసిన వారైనా, మీ దయకు పాత్రులైనవారు, ఉన్నారు. వారి ఉదాహరణలిట్టివి. శిలగా ఉండిన అహల్యాదేవి మీ పాదస్పర్శచేత నిజరూపమంది కృతార్థురాలైంది. శత్రువర్గంలోనివాడు, రాక్షసుడుఅయిన విభీషణుడు నీవలన లంకారాజ్యాన్ని పొందినాడు. సుఖించినాడు. జటాయువువంటి పక్షిజాతి వారికికూడ నీవలన, నీదయవలన పుణ్యం లభించింది. వనచరులైన సుగ్రీవాది వానరులకు నీ అనుగ్రహంచేత గొప్పతనం అబ్బింది. ఈ విశేషాలు చూడగా నీవు ఎక్కువ తక్కువలు పాటించేవాడవు కాదు. ఎట్టివారికైనా కోర్కెలను నెరవేర్చేదాతవు అని తెలియవస్తుంది. అందుచేత నా కోరిక నెరవేర్చుమా. (నేను కూడ అల్పుడనే అనేభావం వ్యంజితమైంది.)

వ్యా : భగవంతుడు నిర్హేతుకజాయమానకరుణా కటాక్షవిలసితుడు. తనను కోరినవారు, తనమీద భక్తికలిగినవారు, ఏ జాతివారు, ఏ తెగవారు అనే ఆలోచన ఆయనకుండదు. తనను నమ్ముకొన్నవారిని తనవారుగా భావించి, వారిని కాపాడడం, వారిని తన 'కృపకు పాత్రులచేయడమే' శ్రీమన్నారాయణమూర్తి చేసేపని శ్రీమద్భాగవతభారత రామాయణాల్లో శ్రీ మన్నారాయణుని నిర్హేతుకమైన కృపావర్షానికి అనేక ఉదాహరణలున్నాయి. గజేంద్రుడు మొదలైనవారు.

ఇటువంటి సంఘటనలను మనస్సులో పెట్టుకొని కాబోలు కవి శ్రీరామునితో, 'పాతకులైన మీ కృపకు పాత్రులుగారె తలంచిచూడ' అని అంటున్నాడు.

ఈ పద్యంలో చిత్రాతిగా శిలగా ఉండిన అహల్యాదేవి ప్రస్తావన వచ్చింది. ఈ కథ ఇదివరకే గడచిన పద్యాల్లో ఉన్నది కాబట్టి తిరిగి చెప్పబనిలేదు. శ్రీరాముని పాదస్పర్శ ఆమెను ఉద్ధరించింది.

రాక్షసరాజగు రావణుడు శ్రీరామునిభార్యను సీతాదేవిని అపహరించి రామునితో శత్రుత్వం సంపాదించుకొన్నాడు. రాజనీతిని అనుసరించి, శత్రువైనవారి పరివారబంధు జాలమంతా, అంటే రావణుని బంధువులందరు శ్రీరామునికి శత్రువర్గంలోనివారే. కాని విభీషణుడు తన అన్నను, రావణుని, పరిత్యజించి శ్రీరాముని శరణువేడినాడు. శరణాగత వత్సలుడైన శ్రీరాముడు అతనికి అభయమీయడమేకాక, లంకారాజ్యాన్ని సముద్రోదకంతో ధారాదత్తం చేసినాడు. ఆయనదయాస్వభావం అటువంటిది. విభీషణుడు నిజానికి శత్రుపక్షంవాడైనా, రాక్షసుడైనా శ్రీరాముని అనుగ్రహ మహత్త్వంచేత రాజ్యసౌఖ్యాన్ని పొందినాడు. 'అరాతికి రాజ్యసుఖంబు కల్గె.'

శ్రీరాముని దాతృత్వగుణంచేత దుర్జాతికి పుణ్యమబ్బింది అని ఇంకొక కథనం చేసినాడు. దుర్జాతి అంటే దుష్టమైనజాతి అని అర్థం చెప్పక అల్పజాతి అని గ్రహించడం సముచితంగా ఉంటుంది. తిర్యక్కులు, పశుపక్ష్యాదులు, అని గ్రహించవచ్చు. శ్రీరాముని తండ్రి దశరథుని మిత్రుడైనవాడు జటాయువు. అరణ్య కాండలో శ్రీరామలక్ష్మణులు సీతాన్వేషణం చేస్తున్నప్పుడు జటాయువును చూడడం సంభవిస్తుంది. సీతను జటాయువే చంపి ఉంటాడని, అక్కడ రావణజటాయులకు జరిగిన యుద్ధ చిహ్నాలనుబట్టి భావించి ఆ జటాయువును సంహరిస్తానని రాముడు వింటిలో బాణం సంధించినాడు. జటాయువు, గాయపడిన స్థితిలోనే జరిగినది వివరిస్తాడు. తనకై, సీతాదేవిని రక్షించడానికి, జటాయువు చేసిన త్యాగాన్ని మెచ్చుకొని, అతనిని చేతితో తడిమి ఆలింగనం చేసికొంటాడు శ్రీరాముడు. సీతను అపహరించి, రావణుడు దక్షిణ దిక్కుకు వెళ్ళినాడని, అపహరించిన

ముహూర్తానికి 'విందమని' పేరు. ముహూర్తబల ప్రకారం సీతాదేవి తిరిగి శ్రీరాముని చేరుతుందని, రావణుడు విశ్రవసుని కుమారుడని, కుబేరుని తమ్ముడని చెప్పి పక్షిరాజైన జటాయువు ప్రాణం విడిచినాడు. రావణుని నివాసం మాత్రం చెప్పలేక పోయినాడు. జటాయువు మరణానికి శ్రీరాముడు దుఃఖిస్తూ నా నిమిత్తంగా జటాయువుకు ప్రమాదం కలిగింది. సీతాపహరణంకంటె ఇది అధికదుఃఖకరమైంది అంటాడు లక్ష్మణునితో. జటాయువుకు దహన సంస్కారం చేసి రాముడు 'నా అనుజ్ఞతో ఉత్తమ లోకాలకు వెళ్లుము'ని ఆదేశిస్తాడు. ఆ విధంగా తిర్యగ్జాతిలో పుట్టి జీవించిన జటాయువుకు పుణ్యలోకం ప్రాప్తమైంది.

వాల్మీకి రామాయణంలో లేదు కాని, ఇతర రామాయణాల్లోని ఉడుత అనే తిర్యక్కు వృత్తాంతంకూడ ఇటువంటిదే. లంకా నగరానికి సముద్రం మీద వారధి నిర్మిస్తున్నప్పుడు వానరులంతా రాళ్లు రప్పలు తెచ్చి వారధినిర్మాణానికి పూనుకొన్నారు. అప్పుడు ఒక ఉడుత, శ్రీరామునిపై భక్తికలిగి, తనకు చేతనైన సాహాయ్యం అతనికి చేయవలెనని భావించి, తన అల్పత్వాన్ని కూడ లెక్క చేయక, తాను ఇసుకలో దొర్లి, తనకంటుకొనిన ఇసుకరేణువులను వారధి కట్టే చోటదులుపుతూ సముద్రంలో వేసిందట. ఆ దృశ్యంచూచి మనస్సు ద్రవించిన శ్రీరాముడు, దాన్ని చేతిలోనికి గ్రహించి దాని వీపు నిమిరినాడని దానికి గుర్తుగా ఉడుతల వీపుమీద మూడు చారలు నేటికీ ఉంటున్నాయని ఆ ఉడుతకు పుణ్యలోకాలు ప్రాప్తించినాయని లోకంలో ఒక ఐతిహ్యం ఉన్నది. శ్రీరాముని కరుణ కలిగితే ఉడుతవంటి అల్ప జంతువుకు కూడ ఉన్నత లోక ప్రాప్తి సమకూరుతుంది.

లోకంలోని అన్ని జీవుల్లో మానవుడే బుద్ధిజీవి. అతనికున్న ఆధిక్యం మరొకరికి కాదు. శ్రీరాముడు సీతాన్వేషణ చేస్తూ, కిష్కింధ ప్రాంతంలో సంచరిస్తూ ఉంటే, మొదట హనుమంతుని చూచినాడు. ఆతనివలన వానరరాజు సుగ్రీవుని గాంచినాడు. తరువాత వాలినిగ్రహం అనంతరం వానరులతో స్నేహమైంది. శ్రీరామునితో, లంకా నగరానికి వెళ్లడంలోను, శత్రువును నిర్జించడంలోను వానరులకు సాంగత్యం ఏర్పడింది. వారిమీద శ్రీరామునికి అభిమానం అనుగ్రహం కలిగినాయి. దీనివలన వానరులకు, లోకంలో ఇదివరకు లేని గొప్పతనం వచ్చింది. రామాయణం లోకంలో ఉన్నంతవరకు, శ్రీరామునికథను లోకంలో చదివినంతవరకు, వానరులను జ్ఞాపకం చేసికోకుండ ఉండలేము. అనామకంగా వనంలో జంతుసమానంగా తిరిగే వానరులకు శ్రీరాముని దాతృత్వంవలన ఈ అదృష్టం మహత్త్వం కలిగిందని కవిభావం.

ఈ పద్యంలో అర్థాంతరన్యాసాలంకారం నిక్షిప్తమై ఉన్నది.

ముహూర్తానికి 'విందమని' పేరు. ముహూర్తబల ప్రకారం సీతాదేవి తిరిగి శ్రీరాముని చేరుతుందని, రావణుడు విశ్రవసుని కుమారుడని, కుబేరుని తమ్ముడని చెప్పి పక్షిరాజైన జటాయువు ప్రాణం విడిచినాడు. రావణుని నివాసం మాత్రం చెప్పలేక పోయినాడు. జటాయువు మరణానికి శ్రీరాముడు దుఃఖిస్తూ నా నిమిత్తంగా జటాయువుకు ప్రమాదం కలిగింది. సీతాపహరణంకంటె ఇది అధికదుఃఖకరమైంది అంటాడు లక్ష్మణునితో. జటాయువుకు దహన సంస్కారం చేసి రాముడు 'నా అనుజ్ఞతో ఉత్తమ లోకాలకు వెళ్లమ'ని ఆదేశిస్తాడు. ఆ విధంగా తిర్యగ్జాతిలో పుట్టి జీవించిన జటాయువుకు పుణ్యలోకం ప్రాప్తమైంది.

వాల్మీకి రామాయణంలో లేదు కాని, ఇతర రామాయణాల్లోని ఉడుత అనే తిర్యక్కు వృత్తాంతంకూడ ఇటువంటిదే. లంకా నగరానికి సముద్రం మీద వారధి నిర్మిస్తూన్నప్పుడు వానరులంతా రాళ్లు రప్పలు తెచ్చి వారధినిర్మాణానికి పూనుకొన్నారు. అప్పుడు ఒక ఉడుత, శ్రీరామునిపై భక్తికలిగి, తనకు చేతనైన సాహాయ్యం అతనికి చేయవలెనని భావించి, తన అల్పత్వాన్ని కూడ లెక్క చేయక, తాను ఇసుకలో దొర్లి, తనకంటుకొనిన ఇసుకరేణువులను వారధి కట్టే చోటదులుపుతూ సముద్రంలో వేసిందట. ఆ దృశ్యంచూచి మనస్సు ద్రవించిన శ్రీరాముడు, దాన్ని చేతిలోనికి గ్రహించి దాని వీపు నిమిరినాడని దానికి గుర్తుగా ఉడుతల వీపుమీద మూడు చారలు నేటికీ ఉంటున్నాయని ఆ ఉడుతకు పుణ్యలోకాలు ప్రాప్తించినాయని లోకంలో ఒక ఐతిహ్యం ఉన్నది. శ్రీరాముని కరుణ కలిగితే ఉడుతవంటి అల్ప జంతువుకు కూడ ఉన్నత లోక ప్రాప్తి సమకూరుతుంది.

లోకంలోని అన్ని జీవుల్లో మానవుడే బుద్ధిజీవి. అతనికున్న ఆధిక్యం మరొకరికి కాదు. శ్రీరాముడు సీతాన్వేషణ చేస్తూ, కిష్కింధ ప్రాంతంలో సంచరిస్తూ ఉంటే, మొదట హనుమంతుని చూచినాడు. ఆతనివలన వానరరాజు సుగ్రీవుని గాంచినాడు. తరువాత వాలినిగ్రహం అనంతరం వానరులతో స్నేహమైంది. శ్రీరామునితో, లంకా నగరానికి వెళ్లడంలోను, శత్రువును నిర్జించడంలోను వానరులకు సాంగత్యం ఏర్పడింది. వారిమీద శ్రీరామునికి అభిమానం అనుగ్రహం కలిగినాయి. దీనివలన వానరులకు, లోకంలో ఇదివరకు లేని గొప్పతనం వచ్చింది. రామాయణం లోకంలో ఉన్నంతవరకు, శ్రీరామునికథను లోకంలో చదివినంతవరకు, వానరులను జ్ఞాపకం చేసికోకుండ ఉండలేము. అనామకంగా వనంలో జంతుసమానంగా తిరిగే వానరులకు శ్రీరాముని దాత్పర్యంవలన ఈ అదృష్టం మహత్త్వం కలిగిందని కవిభావం.

ఈ పద్యంలో అర్థాంతరన్యాసాలంకారం నిక్షిప్తమై ఉన్నది.

ఒక సామాన్యవిషయం చెప్పి, దానిని విశేషంచేత సాధర్మ్యం పురస్కరించుకొని సమర్థించినా, వైధర్మ్యం పురస్కరించుకొని సమర్థించినా, అర్థాంతరన్యాసాలంకారం అవుతుంది. 'దాతవ ఎట్టి వారలకు' అనే సామాన్యాన్ని అహల్య, విభీషణుడు వానరులు అనేవారి వృత్తాంతాలతో విశేషాలతో సమర్థించి. దీన్ని అర్థాంతరన్యాసాలంకారం చేసినాడు.

**53.ఉ. మామకపాతకవ్రజము మాన్ప నగణ్యము, చిత్రగుప్తులే**
**యేమని వ్రాతురో? శమనుఁడేమి విధించునో? కాలకింకర**
**స్తోమమొనర్చుటేమొ? వినఁజొప్పడదింతకు మున్నె దీనచిం**
**తామణి, యెట్లు గాచెదవొ? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: మామక = నాయొక్క, పాతకవ్రజము = పాపాలసమూహం, దోషజాలం, మాన్పన్ = పోగొట్టడానికి, అగణ్యము = గణింపలేనట్టిది. లెక్కింప రానిది. చిత్రగుప్తులు = యముని సన్నిధిలో జీవుల పుణ్యములను, పాపాలను లెక్కలు వ్రాసే వాడు, యమలోకంలోని గణక ఉద్యోగి, ఏమి+ఏమి అని = చేసినపాపాలను ఏమి ఎట్లు అని వితర్కించి, వ్రాతురో = వ్రాయుదురో, లిఖింతురో, శమనుఁడు = యమధర్మ రాజు, ఏమి = ఏమి శిక్ష, ఏమి ఫలము, విధించునో = నిర్ణయం చేస్తాడో, కాలకింకిర+స్తోమము = యముని దూతల సమూహం, ఒనర్చుట = చేయడం, ఏమొ = ఏవిధమో, వినన్ = వినడానికి, ఆలకించడానికి, చొప్పడదు = సరిపడదు, సాధ్యం కాదు, ఇంతకు పూర్వమే = దీనికి పూర్వమే = మృత్యువు దరిచేరడానికి పూర్వమే, దీనచింతామణి = దిక్కులేనివారికి ప్రార్థించేవారికి చింతామణి అనే రత్నంలా కోర్కెలు దీర్చేవాడా (సంబోధన), ఎట్లు = ఏ విధంగా, కాచెదవొ = కాపాడుతావో?

తా : దశరథరామా, నేను అసంఖ్యాకమయిన పాపాలు చేసినవాడిని, వాటిని నిర్మూలించుటకు లెక్క యెక్కడిది? ఈ పాపాలను యమునిగణకుడైన చిత్రగుప్తుడు ఏ విధంగా లెక్కపెట్టివ్రాస్తాడో, అతడు వ్రాసిన పాపాల జాబితా చూచి, వాటికి యముడేమి శిక్షలు విధిస్తాడో, మృత్యుసమయంలో కాలకింకరులు, అంటే యమదూతలు ఏ విధంగా ప్రవర్తిస్తారో, ఈ మృత్యువు ఆసన్నం కావడానికి పూర్వమే భయపడిన వారికి, దిక్కులేనివారికి, కోర్కెలు దీర్చే దేవమణి, చింతామణివంటి ఓరామా, నీవు నన్నెట్లు కాపాడుతావో (కాపాడుము అని ప్రార్థన).

వ్యా : భారతీయుల్లో ఆధ్యాత్మికచింతన ఎక్కువ, భౌతిక విచారం తక్కువ కాబట్టి మానవునికి పాపపుణ్యాల భావం అనాదిగా వస్తూ ఉన్నది. మనుష్యుడు తనకు లభించిన జన్మలో పాపాలు చేయకూడదని, పెద్దలవలన, మన ప్రాచీన గ్రంథాలవలన తెలిసి

కొనడం పరంపరగా జరుగుతూ ఉన్నది. పాపాలను మన ధర్మశాస్త్రంలో ఐదు విధాలుగా పేర్కొన్నారు: సువర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము. వీటిని పంచమహాపాతకములు అని వ్యవహరించినారు. మనుష్యుడు తన చంచల స్వభావంచేత ఈ పంచమహాపాతకాలకు గురియైతే యమలోకంలో యమధర్మరాజుకు సహాయ్యకుడుగా ఉన్నచిత్రగుప్తుడు వీటిని గ్రంథస్థం చేస్తాడని, మానవుడు మరణించిన తరువాత, యమధర్మరాజు చిత్రగుప్తుడు వ్రాసిన నేరాల ప్రకారం శిక్షలు విధిస్తాడని విశ్వాసం ఉన్నది. పుణ్యకార్యాలవల్ల సాటిమానవులకు సుఖం లభిస్తుంది.

గీతాకారుడు చెప్పిన కర్మసిద్ధాంతాన్ని మనవారు పూర్తిగా విశ్వసిస్తారు. పుణ్యం చేసినవారికి దానికి పరిణామంగా పుణ్యాలోకం ప్రాప్తిస్తుందని, పాపాలను ఆచరించేవారికి నరకం తప్పదని విశ్వాసం కర్మఫలితం - అది పుణ్యమైనా పాపమైనా - పరిణామం తప్పదని గీతాకారుడు చెప్పినాడు కదా.

దాశరథిశతకకర్త వైష్ణవుడు. దీన్ని విష్ణుభక్తుల నైచ్యానుసంధానపద్ధతిగా భావిస్తే సముచితంగా ఉండవచ్చు.

**54.ఉ. దాసినచుట్టమా శబరి? దాని దయామతి నేలినావు; నీ**
**దాసుని దాసుఁడా గుహుఁడు? తావక దాస్యమొసంగినావు; నేఁ**
**జేసిన పాపమా? వినుతి సేసినఁ గావవు, గావుమయ్య, నీ**
**దాసులలోన నేనొకఁడ దాశరథీ కరుణాపయోనిధీ,**

ప్ర: దాసిన = సన్నిహితమైన, దగ్గరయిన, చుట్టమా = బంధువా, వియ్యమా, శబరి = శబరి అనే పేరు కలిగి ఆటవికస్త్రీ, దానిన్ = ఆమెను, దయామతిన్ = దయతోకూడిన బుద్ధితో, ఏలినావు = రక్షించినావు. గుహుఁడు= గంగానదిపై పడవ నడిపించే గుహుడనే పేరు కలిగిన బోయరాజు, నీ దాసునిదాసుఁడా = నీ సేవకునికి సేవకుడా, తావక = నీయొక్క, దాస్యము = సేవను, ఒసంగినావు = ఇచ్చితివి, అనుగ్రహించినావు, నేన్ = నేను, చేసిన = ఒనరించిన, పాపమా = పాపకృత్యం కారణమా? వినుతి చేసినన్ = స్తుతిచేసినప్పటికి - స్తోత్రం గావించినప్పటికి, పొగడినను, కావవు = రక్షించవు, కాపాడవు, కావుమయ్య = కాపాడుమా, నీ దాసులలోన నేనొకఁడ = నీ సేవకులలో, నీ భక్తులలో నేను ఒకడనుకదా.

తా : ఓ దశరథరామా, శబరి అనే ఆటవిక స్త్రీ నీకు సన్నిహితమైన బంధువు కాకపోయినా, దానిని దయతో కాపాడినావు. గుహుడు నీకు సేవ చేసే దాసులకు

దాసుడైనవాడు కాదు. అయినా అతనిని దాసునిగా చేసికొంటివి. నేను నిన్ను (శతక రూపంలోను కీర్తనలుగాను) స్తుతిచేసినవాణ్ణి. అంటే వారికంటె అధికుడను. అయినప్పటికిని నన్ను కాపాడటం లేదు. దీనికి కారణం నేను చేసిన ఏ పాపమైనా కలదా? నీకున్న అనేక మంది దాసులలో ఒకడనుకదా. నన్ను దయతో కాపాడుము.

వ్యా : శబరి : - సీతాన్వేషణచేస్తున్న రామలక్ష్మణులు మతంగవనంలో మహర్షులు చెప్పినవిధంగా, తపశ్చర్య చేసి, తత్త్వజ్ఞానం పొంది దాశరథి సందర్శనం కోసం ఎదురుచూస్తున్న శబరిఆశ్రమం చేరుకొన్నారు.

శ్రీరామసందర్శనం కాగానే, పరమపదం చేరుకోవలెనని శబరి సంకల్పించి దానికి రాముని అనుమతిని కోరడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. శబరి కోరికను అనుసరించి శ్రీరాముడు శబరికి ఆత్మసాయుజ్యాన్ని అనుగ్రహించినాడు.

శబరి చితి పేర్చుకొని జీర్ణ శరీరాన్ని విసర్జించి చిరంతన చైతన్యంలో లీనమైపోతుంది. ఆ సమయంలో ఆమె దివ్య శరీరం దివ్యహారాలతో, దివ్యవస్త్రాలతో, దివ్యచందన లేపనాలతో దేదీప్యమానంగా విద్యుత్కాంతిని వెలయిస్తుంది. పుణ్యాత్ములైన మతంగమహామునులు విహరించేవియల్లోకాలను శబరి చేరుకొంటుంది.

గుహుడు : అరణ్యావాసానికి శ్రీ సీతారామలక్ష్మణులు, సుమంత్రుని రథ సారథ్యంలో బయలు దేరినారు. కోసల దాటిన తరువాత గంగాతీరంలో శృంగవీరపురం కనిపించింది. ఆదేశానికి అధిపతి గుహుడు. మునివేషంలో ఉన్నరాముని చూచి చింతించినాడు. ఆత్మసఖుడైన గుహుడు తనరాజ్యాన్ని శ్రీరామునికి అర్పించడానికి సిద్ధమైనాడు. గుహుడు ఏర్పాటు చేసిన పడవలో రాముడు గంగానదిని దాటినాడు.

శ్రీరాముడు గుహునికి ఆలింగన సౌఖ్యం ఇచ్చినాడు. ఇదిసామాన్యమైన విషయంకాదు. ఆ గుహుడు నీదాసులకు దాసుడుకాదు కదా, అతనికి ఆలింగనసౌఖ్యం ప్రసాదించడమేకాక, గంగానదిని దాటడానికి చేసే ఏర్పాటునుకూడ అనుగ్రహించినావుఅని కవి శ్రీరామునికి నివేదించినాడు. ఇక కవి తాను, స్వయంగా స్తుతిపూర్వకమైన రామదాసుకీర్తనలనువ్రాసి ఉన్నాడు. దాశరథీశతకాన్ని రచించినాడు. ఆ విధంగా నన్ను కూడ కాపాడి శబరికి గుహునికి అనుగ్రహించిన సాయుజ్యం నాకుకూడ అనుగ్రహించి 'కావుమయ్య' అని వేడుకొంటున్నాడు. ఇది భక్తుని నివేదన.

**55.ఉ. దీక్ష వహించి నా కొలఁది దీనులనెందరిఁ గాచితో జగ**
**ద్రక్షక, తొల్లి యాద్రుపదరాజతమాజ తలంచి నంతనే**
**యక్షయమైన వల్వలిడితక్కట, నా మొర చిత్తగించి, ప్ర**
**త్యక్షముగాదదేమిటికి? దాశరథీ కరుణాపయోనిధీ.**

దాసుడైనవాడు కాదు. అయినా అతనిని దాసునిగా చేసికొంటివి. నేను నిన్ను (కీ
రూపంలోను కీర్తనలుగాను) స్తుతిచేసినవాణ్ణి. అంటే వారికంటె అధికుడను. అయినప్పటి
నన్ను కాపాడటం లేదు. దీనికి కారణం నేను చేసిన ఏ పాపమైనా కలదా? నీకున్న అ
మంది దాసులలో ఒకడనుకదా, నన్ను దయతో కాపాడుము.

వ్యా : శబరి : - సీతాన్వేషణచేస్తున్న రామలక్ష్మణులు మతంగవనంలో మహర్షు
చెప్పినవిధంగా, తపశ్చర్య చేసి, తత్త్వజ్ఞానం పొంది దాశరథి సందర్శనం కో
ఎదురుచూస్తున్న శబరిఆశ్రమం చేరుకొన్నారు.

శ్రీరామసందర్శనం కాగానే, పరమపదం చేరుకోవలెనని శబరి సంకల్పించి దా
రాముని అనుమతిని కోరడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. శబరి కోరిక
అనుసరించి శ్రీరాముడు శబరికి ఆత్మసాయుజ్యాన్ని అనుగ్రహించినాడు.

శబరి చితి పేర్చుకొని జీర్ణ శరీరాన్ని విసర్జించి చిరంతన చైతన్యంలో లీనమైపోతుం
ఆ సమయంలో ఆమె దివ్య శరీరం దివ్యహారాలతో, దివ్యవస్త్రాలతో, దివ్యచంద
లేపనాలతో దేదీప్యమానంగా విద్యుత్కాంతిని వెలయిస్తుంది. పుణ్యాత్ములై
మతంగమహామునులు విహరించేవియల్లోకాలను శబరి చేరుకొంటుంది.

గుహుడు : అరణ్యవాసానికి శ్రీ సీతారామలక్ష్మణులు, సుమంత్రుని రథ సారథ్యంలో
బయలు దేరినారు. కోసల దాటిన తరువాత గంగాతీరంలో శృంగవీరపురం కనిపించి
ఆదేశానికి అధిపతి గుహుడు. మునివేషంలో ఉన్నరాముని చూచి చింతించినా
ఆత్మసఖుడైన గుహుడు తనరాజ్యాన్ని శ్రీరామునికి అర్పించడానికి సిద్ధమైనాడు. గుహు
ఏర్పాటు చేసిన పడవలో రాముడు గంగానదిని దాటినాడు.

శ్రీరాముడు గుహునికి ఆలింగన సౌఖ్యం ఇచ్చినాడు. ఇదిసామాన్యమైన విషయంకాదు.
ఆ గుహుడు నీదాసులకు దాసుడుకాదు కదా, అతనికి ఆలింగనసౌఖ్యం ప్రసాదించడమేకా
గంగానదిని దాటడానికి చేసే ఏర్పాటునుకూడ అనుగ్రహించినావుఅని కవి శ్రీరామునికి
నివేదించినాడు. ఇక కవి తాను, స్వయంగా స్తుతిపూర్వకమైన రామదాసుకీర్తనలనుప్రా
ఉన్నాడు. దాశరథీశతకాన్ని రచించినాడు. ఆ విధంగా నన్ను కూడ కాపాడి శబరికి
గుహునికి అనుగ్రహించిన సాయుజ్యం నాకుకూడ అనుగ్రహించి 'కావుమయ్య' అ
వేడుకొంటున్నాడు. ఇది భక్తుని నివేదన.

**55.ఉ. దీక్ష వహించి నా కొలఁది దీనులనెందరిఁ గాచితో జగ**
**ద్రక్షక, తొల్లి యాద్రుపదరాజతనూజ తలంచి నంతనే**
**యక్షయమైన వల్వలిడితక్కట, నా మొర చిత్తగించి, ప్ర**
**త్యక్షముగావదేమిటికి? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: జగద్రక్షక = లోకాలను రక్షించేవాడా. శ్రీమన్నారాయణా. శ్రీరామా (సంబోధన). దీక్షన్ = నియమము. వహించి = తాల్చి). నా కొలది దీనులన్ = నా వంటి దిక్కులేనివారిని. నన్ను+బోలిన భయపడినవారిని. ఎందరిని = ఎంతమందిని. కాచితో = కాపాడినావో. రక్షించినావో. తొల్లి = పూర్వం. ఆ ద్రుపదరాజతనూజ = ఆ ద్రుపదమహారాజకుమార్తె ద్రౌపది. తలంచినంతనే = నిన్ను స్మరించగానే. నిన్ను జ్ఞాపకం చేసికోగానే. అక్షయము = తరుగని = తక్కువకానివి. నాశములేనివి. అయిన వల్వలు = అయినట్టి చీరలు. ఇడితి = ఇచ్చినావు. అక్కట = అయ్యో (ఆశ్చర్యార్థకం). నామొరన్ = నా ప్రార్థనను. నా మనవిని. చిత్తగించి = ఆలకించి. మనస్కరించి. ప్రత్యక్షము కావు = సాక్షాత్కరించవు. కట్టెదుట కన్పించవు. అదేమిటికి = దాని కారణమేమి?

తా : జగద్రక్షక, లోకరక్షకా. నీవు భయపడినవారిని, శరణువేడినవారిని దిక్కులేని వారిని కాపాడే నియమం కలిగినవాడవు. పూర్వం ఎందరిని కాపాడినావో నాకు తెలియదు. ఇదివరలో నేను విన్నంత వరకు ద్రౌపదిని దుర్యోధనుని సభకు నీడ్చి దుశ్శాసనుడు సభలో ఆమె చీరలు ఒలుచునప్పుడు ఆమె నిన్ను స్మరించగా ఆమెకు లెక్కలేని చీరలను ఇచ్చి ఆమెను కాపాడినావట.అయ్యో నా ప్రార్థనను. నా మొరను ఆలకించి. మనస్కరించి నాకు ప్రత్యక్షము కావేమి? (కాపాడవేమి?).

వ్యా: శ్రీమన్నారాయణునికి ఆపన్న రక్షకుడనే ప్రఖ్యాతి ఉన్నది. ఆయన భక్తులకు ఎక్కడ ఏమి కష్టం వచ్చినా అక్కడ తాను ప్రత్యక్షమై వారిని రక్షించడం ఆయనవిధిగా దీక్షగా పెట్టుకొన్నాడు. గజేంద్రుడు విభీషణుడు మొదలైన వారందరు ఆయన ఈ దీక్షవలన్నే రక్షితమైనవారే. కవి ఈ పద్యంలో భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణుడు ద్రౌపదీదేవిని వలువలిచ్చి రక్షించిన వృత్తాంతాన్ని స్మరిస్తున్నాడు.

**56.ఉ. నీలఘనాభమూర్తివగు నిన్నుఁ గనుంగొనఁ గోరి వేడినన్**
**జాలముచేసి డాగెదవు, సంస్తుతికెక్కిన రామనామమే**
**మూలను దాచుకోఁగలవు ముక్తికిఁ బ్రాపది పాపమూలకు**
**ద్దాలముగాదె మాయెడల దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: నీల = నల్లని. ఘన = మేఘమువంటి. ఆభ = కాంతిగల. మూర్తివి = స్వరూపం గలవాడవు. అగు నిన్నున్ = అయినట్టి నిన్ను. కనుంగొనన్ = చూడడానికి. కోరి = అపేక్షించి. వాంఛించి. వేడినన్ = ప్రార్థించగా. జాలము చేసి = మాయచేసి. జాలము చేసి = ఆలస్యము చేసి. డాగెదవు = దాగి ఉందువు. కనిపించక పోవుదువు. సంస్తుతికిన్ = పొగడ్తకు. స్తోత్రానికి. ఎక్కిన రామనామము = వచ్చిన రామ అనే పేరు. ఏమూలను =

ఏ కోణములో, దాచుకొందువు = కనిపించనీయక ఉంచుదువు, దాచుకొననేర్తువు? అది = ఆ రామనామము, మా యెడలన్ = మా విషయమందు, మాసంబంధముగా, ముక్తికిన్ = మోక్షానికి, ప్రాపు = ఊతపట్టు, స్థానము, పాప = దోషాల, మూల = వ్రేళ్లకు, కుద్దాలము = భూమిని త్రవ్వే గుద్దలి, కాదె = అవును కదా.

తా : ఓ దశరథరామా, నల్లని మేఘంలాగా ప్రకాశించే నీ స్వరూపాన్ని కన్నార చూడవలె నని ఎంత ప్రార్థించినా, మాయచేసి, ఆలస్యం చేసి దాచుకొంటావు. కనిపించక ఉంటావు. మంచిది. నీవు దాగినా, ప్రసిద్ధమై వన్నెకెక్కిన నీ రామనామాన్ని నీవు ఎక్కడను దాచిపెట్టుకోలేవు. మా పాపము అనే వ్రేళ్లను పెల్లగించి నిర్మూలించే గుద్దలి వంటి సాధనము రామనామమే. అది చాలదా?

వ్యా : జాలము = వల, మాయ అని నైఘంటికార్థాలున్నాయి. శ్రీరాముడు ప్రార్థించిన వారికి కనిపించక ఉన్నాడు కాబట్టి అతడు వలవేసినట్లుగా మాయ చేస్తున్నాడు అని దైవంపై ఆరోపిస్తున్నాడు.

జాలము = అని దంత్యంగా కూడ వ్రాయవచ్చు. అప్పుడు దీనికి జాగు, ఆలస్యం అనేవి నైఘంటికార్థాలు. ప్రార్థించిన వారికి కనిపించక రాముడు ఆలస్యం చేస్తున్నాడు అనే అర్థం సమన్వయం అవుతుంది.

ఇక్కడ శ్రీరాముడు ప్రార్థించినా, తనను తాను దాచుకొంటున్నాడని, కనిపించక ఉన్నాడని కవి అతని పట్ల సాన్నిహిత్యంతో కూడిన కినుక ప్రదర్శిస్తున్నాడు. కవి ఇక్కడ శ్రీరాముని 'నీలఘనాభమూర్తి' అని వర్ణించడం సాభిప్రాయ ప్రయోగంగా కనిపిస్తుంది. ఎందుచేతనంటే శ్రీరాముడు సులభంగా కాన్పించడు. తెల్లని స్వరూపం ఉన్నవాడు స్పష్టంగా కాన్పించిన విధంగా నల్లనివాడు అంత స్పష్టంగా దర్శనమీయడనే మాట ఒకటి. కవి, తన దైవాన్ని ప్రత్యక్షం కమ్మని ప్రార్థించినప్పుడు అతడు జాలము చేస్తున్నాడు అని కూడ అన్నాడు. అంటే మాయ చేస్తున్నాడు. విష్ణుమూర్తి - నల్లని వాడే మాయ చేయడంలో అందెవేసిన చేయి. 'కలయో వైష్ణవమాయయో' అని తెలుగువారు నిత్యం ఉపయోగించే కవివాక్యం. మాయ చేసేవాడు నల్లగా ఉండడం స్వాభావికమే. లోకంలో మాయలు చేసేవారిని ఇంద్రజాలికులు -ఐంద్ర జాలికులు అని వ్యవహరిస్తారు. వీరు ఇంద్రనీలమణుల్లాగ నల్లగా ఉండడమే దాని కారణం కావచ్చును. శ్రీరాముని నల్లని సౌందర్యం పవిత్రమైనది మహిమాన్వితమైనది కాబట్టి కంచెర్లగోపన్న కవి 'రామనామాన్ని ఏమూలను దాచుకోగలవు, ముక్తికి బ్రాపది పాపమూల కుద్దాలము గాదె మాయెడల' అని ఉద్ఘాటించినాడు.

57.చ :వలదు పరాకు భక్తజనవత్సల, నీ చరితమ్ము వమ్ము గా
వలదు పరాకు, నీ బిరుదు వజ్రమువంటిది కావకూరకే
వలదు పరాకు, నాదురితవార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతుమె కా నిరంతరము, దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : భక్తజన = భక్తులైనమానవులకు, భక్తులసమూహానికి, వత్సల = ప్రేమ, వాత్సల్యముకలవాడా, (సంబోధన), నీచరితంబు = నీ చరిత్ర, నీ నడవడి, వమ్ము = వ్యర్థము, నిష్ఫలము, కా వలదు = కాకుండనిమ్ము, పరాకు = హెచ్చరిక, నీ బిరుదు = ఆశ్రితరక్షకుడు అనే బిరుదు, నీ సామర్థ్య చిహ్నం. వజ్రమువంటిది = కఠినాతికఠినమైన రత్నంవంటిది. వజ్రాయుధము, కులిశమువంటిది. కావక = (మమ్ము) రక్షింపక, ఊరకే = వ్యర్థము, వలదు = కాకూడదు. పరాకు = తత్పరుడవు కమ్ము, హెచ్చరికసుమా. నా దురిత = నేను చేసినపాపం అనే, వార్ధికిన్ = సముద్రానికి, తెప్పవుగా = ఓడవుగా మనంబులో = మనస్సులో, నిరంతరము = ఎల్లప్పుడు, తలఁతుమె కా = భావిస్తూనేఉంటాము కదా.

తా : భక్తులపై దయ, ప్రేమ కలవాడా, దశరథరామా, శరణువేడినవారిని, ఆశ్రయించినవారిని రక్షింతువని తెలిపే నీనడవడి, నీ చరితము నిష్ఫలం కాకూడదు. నీ సామర్థ్యచిహ్నమైన బిరుదము సుస్థిరమైంది. కఠినాతికఠినమైన రత్నంలాంటిది. వజ్రాయుధంవంటిది. నీవు రక్షించకపోవడం వలన అది (ఆ బిరుదము) నిష్ఫలం కాకూడదు. నీకు హెచ్చరిక - దానిపై తత్పరుడవగుము. జాగ్రత్తసుమీ, నిన్ను నేను ఎల్లప్పుడు స్మరింతును. నేను చేసిన అపారమైన సముద్రంలాంటి పాపాలను దాటడానికి నీవు ఓడ వంటివాడవని తలచుకొంటూ ఉంటాను.

నేను పాపాలను చేసినాను. అవి అపారమైనవి. సముద్రంలాంటివి. వాటిని దాటడానికి నీవే తెప్పవలె ఉపయోగించి నన్ను కాపాడవలె. ఒకవేళ నీవు కాపాడక పోతే, భక్తవత్సలుడనే నీ నడవడి వ్యర్థం కావచ్చును. ఆశ్రితులను కాపాడేవాడవనే నీ బిరుదు సార్థక్యం కోలుపోవచ్చు. అవి అట్లా కాకూడదు. జాగ్రత్త సుమీ. నీవు నన్ను కాపాడుము.

వ్యా : పరాకు = తత్పరత - శ్రద్ధ - హెచ్చరిక.

బిరుదు = సామర్థ్యచిహ్నము - శౌర్యచిహ్నము.

బిరుదులాడు అంటే ప్రజ్ఞావంతుడు అని అర్థం.

వజ్రము = నవరత్నాలలో కఠినాతికఠినమైంది - రవ - ఇంద్రుని ఆయుధము - కులిశము.

ఈ పద్యంలో పరమాత్మునికి భక్తుడు తనదీనదశను నివేదించుకొనే విశేషం చెప్పబడింది. కవి ఆత్మాశ్రయలక్షణంతో ఈ నివేదన చేస్తున్నాడు. యథార్థానికి ఇది కవివేదన కాదు. సమస్తజీవులవేదనం. తెలిసో తెలియకో జీవులు పాపాలు చేయడం, తరువాత వాటిని నిర్మూలించమని పరమాత్ముని వేడికోవడం సహజమే. చేసిన దోషాలను పశ్చాత్తాపంతో పరమాత్మునికి నివేదించుకొంటే అవి తొలగిపోతాయని విశ్వాసం. ఇక్కడ కవి చెప్పుతున్నపాపాలు అపారమైనవి. అవి సముద్రంలాంటివి. వాటిని దాటవలెనంటే మానవ ప్రయత్నం సరిపోదు. ఈ సముద్రాన్ని దాటడానికి శ్రీరాముడనే పడవ కావలె. దానికై భక్తుడు నిరంతరం ధ్యానిస్తుఉన్నాడు. శ్రీరాముని భక్తవత్సలుడనే ప్రఖ్యాతచరితం ఉన్నది. ఆశ్రితవాత్సల్యంకలవాడనే సామర్థ్యచిహ్నం, బిరుదం ఉన్నది. అవి వృథా కావు. కాకూడదు. అందుచేత ఆమహానుభావునిసాహాయ్యంవలన దురితవార్ధిని భక్తుడు దాటగలడనే విశ్వాసాన్ని కవి వ్యక్తం చేసినాడు. దీనికి అనేకప్రమాణాలున్నాయి. ఇది భక్తిమార్గమే.

భగవానుడైన గీతాకారుడు తనకాశ్రితుడైన భక్తునిగురించి ఇట్లా చెప్పినాడు.

అపిచేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః ॥ (గీత - 9-30)

'ఎటువంటి దురాచారపరుడైనా, అనన్యమైన భక్తితో నన్ను సేవిస్తే అతనిని సాధువుగాను, వైష్ణవోత్తమునిగాను భావిస్తాను'.

ఈ గీతావాక్యాన్ని మనస్సులో పెట్టుకొని కంచెర్ల గోపన్నకవి ఈ పద్యంలో తనదురితవార్ధిని గురించి వ్రాసి ఉంటాడు.

'అహమస్యపరాధచక్రవర్తీ, కరుణే త్వం చ గుణేషు సార్వభౌమీ' అపరాధాలు చేయడంలో నేను సర్వశ్రేష్ఠుడను. దయా, సుగుణాలలో నీవు సార్వభౌమురాలవు అని వేదాంతదేశికులవారు తమ దయాశతకంలో సెలవిచ్చిఉన్నారు.

ముకుందమాలలో శ్రీకులశేఖరాళ్వార్లు ఈ విధంగా చెప్పినారు.

మాభీర్మన్ద మనో విచిన్త్య బహుధా యామీశ్చిరం యాతనా
నామీ నః ప్రభవన్తి పాపరిపవస్స్వామీ నను శ్రీధరః
ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణమ్
లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిస్న క్షమః

దీనికి తెలుగుసేత :

**లోలోనన్ యమయాతనల్ దలఁచి మేలో కుందుటల్ చిత్తమా,**

**చాలర్మమ్ముల పాపశత్రులుడికింపన్ స్వామి యౌ శ్రీధరుం**

**డాలస్యమ్మును వీడి భక్తినులభున్ ధ్యానింపు నారాయణున్**

**ఈ లోకమ్ముల దుఃఖహారికరుదే ఈ దాసునిం బ్రోచుటల్.**

మనసా యమబాధలకు భయపడక, ఆలస్యము చేయక, శ్రీధరుని సేవించుము. లోకాలదుఃఖాలను నిర్మూలించే పరమాత్ముడతడు. అతడు దాసుని తప్పక రక్షిస్తాడు.

**58.ఉ. తప్పులెరుంగలేక, దురితంబులు సేసితినంటి, నీవు మా**

**యప్పవు గావుమంటి, నిఁక నన్యులకున్ నుదురంటనంటి, నీ**

**కొప్పిదమైన దాసజనులొప్పినబంటుకు బంటనంటి నా**

**తప్పులకెల్ల నీవెగతి దాశరథీ -కరుణాపయోనిధీ.**

ప్ర : తప్పులు = అపరాధాలు, దోషాలు, పాపాలు, ఎరుంగలేక = తెలిసికొనలేక, జ్ఞానంలేక, దురితంబులు = పాపాలు, చేసితిని + అంటిన్ = చేసినాను అని చెప్పినాను. నీవు, మా అప్పవు = మాతండ్రివి, కావుము అంటి = రక్షింపుమని కోరితిని, ఇఁకన్ = ఇకపైన, అన్యులకు = ఇతరులకు, ఇతరదైవతములకు, నుదురు = నెత్తిని, ముఖాన్ని, అంటను అంటి = స్పృశింపను, అంటిని, నమస్కరింపనంటిని, నీకు, ఒప్పిదమైన = తగినవారైన, అంగీకృతులైన, దాసజనులు = సేవకసమూహములు, భక్తులు, ఒప్పినబంటుకు = సమ్మతించిన, స్వీకరించిన సేవకునికి, దాసునికి, బంటును అంటి = దాసుని అన్నాను. నా తప్పులకు = నా అపరాధాలకు, దోషాలకు, ఎల్లన్ = అన్నింటికి, నీవె గతి = నీవె దిక్కు - నీవె శరణ్యము.

తా : దశరథరామా, చేస్తున్నపనులు దోషాలని తెలిసికొనలేక పాపాలను చేసినాను. నీవు మాతండ్రివి, నన్ను రక్షింపుము. ఇకమీద, ఇతరులకు నుదురుతాకించి నమస్కరించను. (నీకే నమస్కరిస్తాను), నీకు ఇష్టమైన దాసులు అంగీకరించిన దాసునికి నేను సేవకుడను. అందుచేత నేను చేసిన అపరాధాలు నిర్మూలించడానికి, నన్ను రక్షించడానికి, నీవే దిక్కు - నీవే శరణ్యము.

వ్యా : అప్ప = తల్లి, తండ్రి, అక్క, అనే అర్థాలున్నాయి. తండ్రి అనే అర్థంలోని ప్రయోగమిది.

ఇచట కంచెర్ల గోపన్న శ్రీరాముని తనతండ్రిగా అంటే పరమాప్తుడుగా భావించుకోవడమేకాక, తాను చేసిన తప్పులను నివేదించుకొంటున్నాడు. తాను చేస్తున్న పనులు అపరాధాలు అనే జ్ఞానం లేకపోబట్టి తప్పులు చేసినాడట. వాటి వలన రక్షింపుమని

వేడుకొంటున్నాడు. ఇతరులకు, అంటే అధికారం ఉన్న మానవ మాత్రులకుగాని, ఇతర చిల్లరదేవుళ్లకు గాని తలవంచి నమస్కరించనని చెప్పినాడు. 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అనే ప్రామాణిక సూక్తిని అనుసరించి పలికే మాట ఇది. వైష్ణవుడైనవాడు విష్ణుమూర్తిని తప్ప ఇతరులను కొలువడు. 'నీవే తప్పనితఃపరంబెరుగ' అనే భాగవతవాక్యానికి ఈ భావం చక్కగా సరిపోయింది. ఇంక తానెటువంటి వాడో తరువాత చెప్పినాడు. శ్రీరామునికి సమ్మతమైన భక్తులు కొందరున్నారు. వారు శ్రీహనుమదాదులు. వారు అంగీకరించిన సేవకులు మరికొందరుండవచ్చు. అటువంటి విష్ణుమూర్తిదాసులకు తాను దాసుడు. కవిని పరమాత్ముడు, దాసదాసానుదాసునిగా పరిగణిస్తే, అతడు ఎన్ని తప్పులు తెలిసి చేసినా, తెలియక చేసినా, మన్నిస్తాడని విశ్వాసము.

ఇది తెలిసిన వాడు కాబట్టియే భక్తుడు 'తప్పులకెల్ల నీవెగతి', అని తన దైవానికి నివేదించుకొన్నాడు.

**59.చ. ఇతఁడు దురాత్ముఁడంచు జనులెన్నఁగ నాఱడి గొంటి, నేనె పో**
**పతితుఁడనంటిపో, పతితపావనమూర్తివి నీవుగల్గ నే**
**నితరుల వేడనంటి నిహమిచ్చిన నిమ్ము, పరంబొసంగుమీ**
**యతులితరామనామమధురాక్షరపాళి నిరంతరంబు హృ**
**ద్గతమని నమ్మి కొల్చెదను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ఇతఁడు = వీడు, దురాత్ముఁడు అంచున్ = దుష్టమైన మనస్సుగలవాడు అనుచు, జనులు = లోకులు, ఎన్నఁగన్ = తలపగా, ఆరడిన్ కొంటి = నింద గ్రహించితిని. నేనెపో = నేనేసుమా, పతితుఁడను = పాపాత్ముడను, అంటిపో = అని చెప్పినాను సుమా, ఓరామా, పతిత = పాపాత్ములైనవారిని, పావన = పవిత్రులను చేసే, మూర్తివి = రూపముగలవాడవు, నీవు, కల్గన్ = కలిగిఉండగా, నేను, ఇతరులను = అన్యులను, వేడను అంటిన్ = ప్రార్థింపను అని చెప్పితిని, ఇహము = ఇహలోకసుఖము, ఇచ్చిన నిమ్ము = అనుగ్రహిస్తే అనుగ్రహించుము. పరము = స్వర్గలోక సౌఖ్యము, పరలోకసౌఖ్యము, ఒసంగుమీ = ఇమ్ము, అతులిత = సాటిలేని, రామనామ = రామ అనే పేరు యొక్క మధుర = తీయనైన, అక్షర = అక్షరాలయొక్క, పాళి = వరుస = సమూహము, నిరంతరము = ఎల్లప్పుడు, హృద్గతము = మనస్సును పొందింది, నా మనస్సులోనే ఉంటుంది, అని నమ్మి కొల్చెదను = అని విశ్వసించి సేవ చేస్తాను.

తా : దశరథరామా, నేను దుష్టమనస్సు గలవాడనని జనులచేత నిందింపబడితిని.

నేను పతితుడనని నాయంతట నేనే నీతో చెప్పికొంటిని. పతితులను, పవిత్రులనుగా జేయునవతరించిన నీవుండగా పతితుడనైన నేను నిన్నే వేడుదును గాని, మరియొకని వేడనని చెప్పితిని. ఇక నీవే ఒకడవు నాకు స్వామివి. నీవే ఇహమిచ్చినను ఈయవలె, పరమిచ్చినను ఈయవలెను. నేనుమాత్రము రామ అనే తీయని అక్షరములను మనస్సులో నిలుపుకొని కొలువుచేస్తాను.

వ్యా : రామదాసుగారు జనులచేత 'ఆరడిగొన్నా'రట - అంటే నిందను పొందినారు. బహుశా, ప్రజలధనాన్ని, లేక రాజధనాన్ని దుర్వినియోగంచేసి భద్రాచలంలో శ్రీరామమందిరం కట్టించినాడనే నిందకావచ్చు. ఇది - రాజధనాన్ని గ్రహించడం కొంతవరకు యథార్థమే కాబట్టి తాను పతితుడను అని భావించుకొని శ్రీరామునికి నివేదిస్తున్నాడు. శ్రీవైష్ణవులు నిత్యం భావించేవిధానమే ఇది. అపరాధాలు చేయకపోయినాసరే, శ్రీరాముని వేడుకొంటే, శ్రీమన్నారాయణుని శరణువేడితే ఎటువంటి పాపాలైనా తొలగిపోయి పతితుడు పావనుడు కావడం ఉన్నది.

శ్రీరాముని నమ్ముకొన్నభక్తుడు ఇతర దైవతములకు సేవచేయడు. ఇహలోకసౌఖ్యాన్ని ప్రసాదించినాసరే, స్వర్గలోకసౌఖ్యాన్ని ప్రసాదించడానికి సాయుజ్యం అనుగ్రహించినాసరే. తనకు నిందకలిగినా, అది శ్రీరామునిఅనుగ్రహంచేత సమసిపోయినా, ఇహలోకసౌఖ్యం కలిగినా, సాయుజ్యం లభించినా, రామ అనే రెండక్షరాల సమూహం తనమనస్సులో నిలిచిపోయిందని, దానివలన శ్రీరామునిసేవ చేస్తానని కవి ఉద్ఘాటించినాడు.

ఇది చూడగా కవినివేదనగాను, వేదనగాను కనిపిస్తుంది. కాని యథార్థానికి లోకంలో నిత్యజీవితంగడిపే ప్రతిమానవునివేదన. కారణం ఉండియో, లేకపోయియో, అపనింద కలుగడం సహజం. దాని బాపుకొనడానికి దైవానుగ్రహం కావాలె. విశ్వాసంతో శ్రీరామునిసేవ చేయాలె. ఇతరుల సేవ కాంక్షించకూడదు. దానివలన కలిగే ఫలితాన్ని గురించి ఆశించగూడదు. అంటే కర్మఫలత్యాగం చేయాలె. అప్పుడు భగవానుడు తనభక్తుని కాపాడి ఇహలోకసౌఖ్యాన్ని, పరలోకసౌఖ్యాన్ని తప్పక ప్రసాదిస్తాడని కవి ధ్వనిప్రధానంగా ఈ పద్యంలో నివేదించినాడు.

**60.ఉ. అంచితమైన నీదుకరుణామృతసారము నాదుపైని బ్రో**
**క్షించిన చాలు, దాన నిరసించెద నాదురితంబులెల్లఁ దూ**
**లించెద వైరివర్గమెడలించెదఁ గోర్కుల నీదుబంటనై**
**దంచెదఁ గాలకింకరుల దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : అంచితము = ఒప్పునది, శ్రేష్ఠము, ఐన నీదుకరుణా = అయినట్టి నీదయ అనే

అమృతసారము = అమృతము యొక్క తేట-సుధాసారము, నాదుపైన = నామీద ప్రోక్షించినన్ = చల్లించిన, చిలికించిన, చాలున్ = అదియే చాలును - నాకు తృప్తి కలుగుతుంది. దానన్ = దానిచేత, నా దురితంబులు = నాపాపములను, ఎల్లన్ = అన్నింటిని, నిరసించెదన్ = తిరస్కరిస్తాను, వైరివర్గము = శత్రుసమూహాన్ని, తూలించెదన్ = చెదరిపోయేటట్లు చేస్తాను. కోర్కులన్ = ఇచ్ఛలను, రాగాలను, ఎడలించెదన్ = విడిచిపోయేటట్లు చేస్తాను. నీదుబంటనై = నీదాసుడనై, కాలకింకరులను, = యముని దూతలను, దంచెదను = తరిమికొట్టుతాను.

తా : ఓ దశరథరామా, ఒప్పిదమైన నీ దయామృతసారాన్ని నామీద చల్లితేచాలు, నీ అమృతంవంటి దయను నామీద ప్రసరింపజేస్తే చాలు. దానిచేత నాపాపాలను దూలించి అంతశ్శత్రువులైన ఇంద్రియాలను చిక్కబట్టి, రాగద్వేషాలను వదలి, నీ దాసుడనై యమకింకరులు వచ్చిరేని వారిని తరిమికొట్టెదను.

వ్యా : భక్తుడు, ఈ పద్యంలో శ్రీరామునిదయను తనపై ప్రసరింపజేయమని ప్రార్థిస్తున్నాడు. భక్తుడు ఎంత వేడికొన్నను ఈశ్వరునిదయ కలుగకపోతే ఫలితం లేదుకదా. దయాగుణాన్ని శ్రీరాముడు సమృద్ధిగా కలిగినట్టివాడు. కవి అతనిని ప్రతిపద్యంలోను కరుణాపయోనిధీ అని సంబోధిస్తున్నాడు. అనగా దయాగుణానికి అతడు అపారమైన సముద్రంలాంటివాడు. ఇక దయాగుణం ఎటువంటిది అని ప్రశ్న వేసుకొంటే, అది అమృత సదృశమైంది. ఆయనదయ మరణంనుండి విముక్తి కలిగిస్తుంది. మృత్యుభయం లేకుండ కాపాడుతుంది. ఆ అమృతసారాన్ని ప్రసరింపజేస్తే కలిగే ఫలితాలను కూడ కవి వక్కాణించినాడు. తాను ఇదివరలో చేసినపాపాలను శ్రీరాముని దయా విశేషంచేత తిరస్కరిస్తాడట. అంటే ఆపాపాలవలన కలిగే దుష్పరిణామాలను ఎదిరించే శక్తి వస్తుంది. నిర్మూలించే బలం సమకూరుతుంది. మానవ సహజంగా భక్తుడు కూడ అరిషడ్వర్గమనే ఆరు అంతఃశత్రువులకు లోనవుతాడు. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనేవి ఆరు శత్రువులు. ఈ అంతఃశత్రువులను మానవుడు తనంతట తాను జయించలేడు. దానికి దైవానుగ్రహం కావాలె. అందుచేతనే శ్రీరామునికటాక్షం కలిగితే, ఈ కామాది అరులను పారద్రోలి తనవలన జరిగే దోషాలనుంచి తప్పించుకొంటాడు. ఒకసారి అరిషడ్వర్గంపోతే, తాను శ్రీరాముని దాసుడుగా మారిపోతాడు. అతని దాస్యం లభిస్తే మృత్యుభయం ఉండదు. అందుచేత ప్రాణాన్ని హరించడానికి, నరకానికి తీసికొని వెళ్లడానికి యమధర్మరాజుదూతలు వస్తే వారిని నిర్భయంగా దండిస్తానని ధైర్యంగా చెబుతున్నాడు కవి.

**61.చ. జలనిధులేడునొక్క మొగిఁ జక్కికిఁ దెచ్చె శరంబు, రాతినిం**
**పలరఁగఁ జేసె నాతిగఁ బదాబ్జపరాగము, నీచరిత్రముం**
**జలజభవాదినిర్జరులు సన్నుతి సేయఁగ లేరు గావునన్**
**దలఁప నగణ్యమయ్య యిది, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: శరంబు = నీబాణము, జలనిధులు ఏడున్ = ఏడు సముద్రాలు, ఒక్క మొగిన్ = ఒక సారిగా, చక్కికిన్ = ఒకచోటికి, ఒకస్థానమునకు, తెచ్చెన్ = తీసికొనివచ్చెను. పదాబ్జ = పద్మములవంటి నీపదముల యొక్క, పరాగము = ధూళి, దుమ్ము, రాతిని = శిలను, రాతిని, ఇంపు = సంతోషముతో, మనోజ్ఞంగా, అలరంగన్ = ఒప్పునట్లుగా సంతోషించునట్లుగా, నాతిగన్ = వనితగా, చేసెను. నీ చరిత్రమును = నీ నడవడిని, జలజభవ = పద్మంలో పుట్టినబ్రహ్మ, ఆది = మొదలైన, నిర్జరులును = దేవతలును, అమరులును, సన్నుతి చేయఁగన్ = స్తోత్రము చేయడానికి, లేరు = సమర్థులు కారు, కావునన్ = అందుచేత, తలంపన్ = విచారించగా, అగణ్యము = లెక్కింపరానిది, వర్ణించడానికి సాధ్యం కానిది.

తా : ఓ దశరథరామా, నీబాణము సప్తసముద్రాలను ఒక్కచోటికి కొనివచ్చింది. నీ పద్మాలవంటి పాదాల ధూళి, రాతిని, వనితగా మార్చివేసింది. ఇట్టి నీ చరిత్రం బ్రహ్మమొదలయిన దేవతలకైనా, పొగడశక్యము కాదు. కాబట్టి నావంటివానికి గణుతింపసాధ్యమా, (సాధ్యముకాదని భావము).

వ్యా : శ్రీరాముని అనన్యమైన నడవడిని ఈ పద్యంలో కవి వర్ణిస్తున్నాడు.

సప్తసముద్రాలు : 1. లవణసముద్రము - లక్ష యోజనముల విస్తీర్ణము.

2. ఇక్షుసముద్రము - 2 లక్షల " "
3. సురాసముద్రము - 4 లక్షల " "
4. సర్పి (నేతి) సముద్రము 8 లక్షల " "
5. దధి సముద్రము - 16 లక్షల " "
6. క్షీరసముద్రము - 32 లక్షల " "
7. జల సముద్రము - 64 లక్షల " "

'లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరజలార్ణవాః' అని అమరము.

**62.ఉ. కోతికి శక్యమా యసురకోటుల గెల్వను? గెల్చెఁ బో నిజం**
**బాతనిమేన శీతకరుఁడౌట దవానలుఁ డెట్టివింత? మా**
**సీత పతివ్రతామహిమ సేవకుభాగ్యము మీ కటాక్షమున్**
**ధాతకు శక్యమా పొగడ? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : అసురకోట్లను = రాక్షసులసమూహాన్ని, కోట్లకొలది రాక్షసులను, గెల్వను = జయించుటకు, కోతికి = మర్కటానికి, (హనుమంతునికి) శక్యమా = సాధ్యమా, గెల్చెఁబో = జయించనిమ్ము, గెలువనిమ్ము, అతని మేనన్ = ఆ వానరుని శరీరమందు, దవానలుఁడు = అగ్ని, కారుచిచ్చు, శీతకరుడు = చల్లని అనుభూతిని కలిగించేవాడు, చల్లదనాన్ని కలిగించేవాడు - చంద్రుడు, ఔట = కావడము, ఎట్టి వింత = ఎంత విచిత్రము, ఎంతటి ఆశ్చర్యము. మా సీత = మాతల్లియైన సీతాదేవియొక్క, పతివ్రతా = పతిభక్తిగల యిల్లాలు, క్రొత్తడి, మగనాలు, ఆమె యొక్క, మహిమ = గొప్పతనము, సేవకు భాగ్యము = మిమ్ము సేవించువానియొక్క భాగ్యవిశేషము, మీ కటాక్షమున్ = మీ యొక్క దయను, పొగడన్ = స్తుతిచేయడం, కొనియాడడము, ధాతకున్ = బ్రహ్మదేవునికి, శక్యమా = సాధ్యమా (సాధ్యము కాదని భావము).

తా : దశరథరామా, ఒకవానరుడు, హనుమంతుడు, అసంఖ్యాకమైన రాక్షసులను జయించడం సాధ్యమా. శక్యము కాదు. కాని జయించినాడు. అది యెట్లు శక్యమైనను కానిమ్ము. కాని, అతని వాలములో అంటించిన అగ్ని, వేడిని చూపక, కాల్చివేయక, చంద్రునివలె చల్లదనం కలిగించడం మరింత ఆశ్చర్యంకదా. ఇంతకు, సీతాదేవి పాతివ్రత్య మహిమవలన, ఆమె మిమ్ములను సేవించడంవలన, హనుమంతుడు మీకు దాసుడగుటవలన, మీ దయా స్వభావంవలన, ఇది జరిగింది. కాబట్టి సీతాదేవి పాతివ్రత్యాన్ని ఆమె, హనుమంతుడు మీకు చేసినసేవను, మీ దయాగుణాన్ని పొగడి వర్ణించడం బ్రహ్మకు శక్యమగునా, అనగా కాదని భావం.

వ్యా : ఈ పద్యంలో కవి శ్రీరామునిదూతగా లంకానగరానికి వెళ్లి సీతాదేవిని దర్శించిన వృత్తాంతం, ఆ విషయం తెలిసిన రావణుడు, అతనిఅనుచరులు ఆంజనేయులతో ప్రవర్తించినతీరు, ఏప్రమాదంలేక హనుమంతుడు తిరిగివచ్చిన వైనం సూచించినాడు. ఇవన్ని శ్రీరాముని కరుణాకటాక్షంచేత సాధ్యమైనాయని వక్కాణించడంకూడ ఇచటివిశేషం.

ఇటువంటి అద్భుత కార్యం జరగడం మీకటాక్షమే కదా అని అనడం ఈ సందర్భంలో సముచితంగా ఉన్నది. సర్వోత్కృష్టమైన శ్రీమహావిష్ణులీలలను పొగడడం బ్రహ్మకుసాధ్యమా అనడం లోకంలోని నుడికారం. అసాధ్యమైన పనిజరిగినప్పుడు ఇది బ్రహ్మకైన సాధ్యమా అని పలుకడం సహజమే. కవి ఈ వాక్యం మాటవరసకు వ్రాసింది కాదని, యథార్థమని భావించవలసి వస్తుంది.

**63.ఉ. భూపలలామ, రామ, రఘుపుంగవ రామ, త్రిలోకరాజ్య సం**
**స్థాపన రామ, మోక్షఫలదాయకరామ, మదీయ పాపముల్**
**పాపఁగదయ్య రామ, నినుఁ బ్రస్తుతిచేసెదనయ్య రామ, సీ**
**తాపతి రామ, భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : భూపలలామ = రాజులలో శ్రేష్ఠుడవైన, రామ = రామా, రఘుపుంగవ = రఘువంశములో జన్మించినవారిలో శ్రేష్ఠుడవైన, రామా, త్రిలోక = స్వర్గమర్త్యపాతాళలోకములనే మూడులోకములలో, రాజ్య = రాజ్యమును, సంస్థాపన = స్థాపించునట్టి, ప్రారంభించికొనసాగించునట్టి, రామా, మోక్ష = ముక్తి అనే, ఫల = ఫలితమును, దాయక = ఇచ్చునట్టి, రామా, సీతాపతిరామ = సీతాదేవికి ఆదర్శపతివైన రామా, నిన్ను, ప్రస్తుతి = స్తోత్రము, చేసెదన్ = చేస్తాను. మదీయపాపముల్ = నేను చేసినట్టి దోషాలను, నా పాపములను, పాపగదయ్య = తొలగించుమా, పోగొట్టుమా.

తా : రామా, నీవు రాజులలోకెల్ల శ్రేష్ఠుడవు. మరి రఘువంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠుడవు. కేవలము రాజశ్రేష్ఠుడవే కాదు. ముల్లోకములు స్థిరంగా ఉండేటట్లు పరిపాలించే సమర్థుడవు. అన్నిటికంటె మించి, మోక్షమును, కైవల్యమును దానిఫలమును ఇచ్చేవాడవు. నిన్ను స్తోత్రము చేస్తాను. నీవు లక్ష్మీదేవివంటి సీతాదేవికి భర్తవు. ఇటువంటి గొప్పతనాన్ని కలిగినవాడవు కాబట్టి. తెలిసినంతవరకు నిన్ను పొగడెదను. ఆ పొగడ్తను బట్టి యైనను నా పాపములను బోగొట్టి నన్ను కాపాడుము.

వ్యా : ఈ పద్యంలో శ్రీరాముని గొప్పతనాన్ని పొగడడం ఒక భాగం. 'నాపాపములు పోగొట్టుమా' అని ప్రార్థించడం రెండవభాగం. దీనిలో కవి నిన్ను ప్రస్తుతిస్తాను అని వాచ్యంగానే చెప్పి ఉన్నాడు. నవవిధభక్తుల్లో ఈశ్వరుని ప్రస్తుతించడం ఒకటి.

ఇచట కవి 'ప్రస్తుతి చేసెదనయ్య రామ' అని వక్కాణించడం భక్తునిగా అతని సేవ చేయడానికే. మిగిలిన భారమంతా భగవానునిదే.

**64.ఉ. నీ సహజంబు సాత్త్వికము, నీవిడిపట్టు సుధాపయోధి, ప**
**ద్మాసనుఁ డాత్మజుండు, గమలాలయ నీ ప్రియురాలు, నీకు సిం**
**హాసనమిద్ధరిత్రి, గొడుగాకస, మక్షులు చంద్రభాస్కరుల్**
**నీ సుమతల్పమాదిఫణి, నీవె సమస్తము, గొల్చునట్టి నీ**
**దాసుల భాగ్యమెట్టిదయ దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : సాత్త్వికము = సత్త్వగుణము, నీ సహజంబు = నీకు సహజమైంది, నీతోనే ఏర్పడినది, అలవరచుకొన్నది కాదు. సుధాపయోధి = పాలసముద్రము, నీవిడిపట్టు =

నీవిడిదిచోటు. నీనివాసస్థానము. ఆత్మజుండు = నీకొడుకు, పద్మాసనుఁడు = బ్రహ్మ, నీ ప్రియురాలు = నీభార్య, కమలాలయ = లక్ష్మీదేవి, ఈ ధరిత్రి = భూమి, నీసింహాసనము = సింహము అంకితమైన ఆసనము, రాజు కూర్చునే ఆసనంవంటిది. ఆకసము = గగనము, ఆకాశము, గొడుగు = ఛత్రము, చంద్రభాస్కరులు = చందమామ, సూర్యుడు, అక్షులు = కన్నులు, ఆదిఫణి = సర్పముఖ్యుడు, ఆదిశేషుడు, నీ సుమతల్పము = నీ పూలపాన్పు, సమస్తము = సర్వపదార్థములు, నీవే, ఇట్టి నిను కొల్చినట్టి = సేవించునట్టి, నీదాసుల = నీదాసజనుల, సేవకుల, భాగ్యము = గొప్పదనము, అదృష్టము, ఎట్టిదయ్యా = ఎటువంటిదయ్యా, చాల గొప్పది అని భావము.

తా : దశరథరామా, సత్త్వగుణము నీ స్వభావము, నీనివాసస్థానము పాలసముద్రము. నీ కొడుకు బ్రహ్మదేవుడు. నీ భార్య లక్ష్మీదేవి. ఈ భూమి నీ సింహాసనము. ఆకాశము నీ గొడుగు, నీ కన్నులు చంద్రసూర్యులు. ఆదిశేషుడు నీ పూలపాన్పు. ఇవి అన్నియు నీ రూపములే. నీవు కానిది లేదు. ఇట్టి నిన్ను గొల్చిన భక్తుల భాగ్యము, సంపద ఎటువంటిదో చెప్పదరమా? చెప్పతరముకాదని, చాల గొప్పది అని భావము.

వ్యా : ఈ పద్యంలో శ్రీరాముని దివ్యస్వరూపమైన విష్ణుమూర్తిని వర్ణించి, ఆయన గొప్పతనాన్ని వక్కాణిస్తున్నాడు కవి.

**65.చ. చరణము సోకినట్టి శిల జవ్వనిరూపగుటొక్క వింత, సు**
**స్థిరముగ నీటిపై గిరులు దేలినదొక్కటి వింత గాని, మీ**
**స్మరణఁ దనర్చు మానవులు సద్గతిఁజెందినదెంత వింత? యీ**
**ధరను ధరాత్మజారమణ! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ధరాత్మజా = భూమికుమార్తెయైన సీతాదేవికి, రమణ = ఆనందమును కలిగించేవాడా, పురుషుడైనవాడా, సంబోధన, చరణమున్ = పాదమును, సోకినట్టి = అంటినట్టి, స్పృశించినట్టి, శిల = రాయి, జవ్వని = యువతియైన స్త్రీ యొక్క, రూపు = స్వరూపము, అగుట = పొందుట, ఒకవింత = ఒక ఆశ్చర్యము, ఒక విచిత్రము, నీటిపయిన్ = నీటిమీద, సముద్రజలంమీద, గిరులు = కొండలు. రాళ్లు, సుస్థిరముగన్ = మిక్కిలి నిలుకడగా, తేలినది = మునుగక తేలుచుండినది, ఒక్కటి వింత = మరొక ఆశ్చర్యము. అద్భుతము. మీ స్మరణన్ = మిమ్ము స్మరించుటలో, తనర్చు మానవులు = ఒప్పునట్టి మనుష్యులు, సద్గతిని = మోక్షాన్ని, ముక్తిని, చెందినది = పొందినది, లభించినది, ఈ ధరన్ = ఈ భూలోకంలో, ఎంత వింత = ఎంతటి ఆశ్చర్యము!

తా : దశరథరామా, నీపాదములను తాకిన శిలను వనితగా చేయడమును,

కొండలను, రాళ్లను సముద్రమునీటిమీద మునుగకుండునట్లు నిల్పడమును అద్భుతము కాని నిన్ను ధ్యానించి స్మరించినవారికి (నీ భక్తులకు) మోక్షమునొసగడం ఏమి వింత? అంటే అద్భుతము కాదు అని తాత్పర్యము.

వ్యా : రామాయణంలో ముఖ్యమైన రెండు ఘట్టములను కవి ఈ పద్యంలో స్పృశించినాడు. అహల్యాశాపవిమోచనం ఒకటి. సముద్రంపై వారధిని నిర్మించే సందర్భం రెండవది.

**66.ఉ. దైవము తల్లిదండ్రి తగు దాత గురుండు సఖుండు నిన్నెకా**
**భావనసేయుచున్నతరిఁ బాపములెల్ల మనోవికార దు**
**ర్భావితుఁజేయుచున్నవి కృపామతివై నను గావుమీ జగ**
**త్పావన మూర్తి భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : జగత్పావనమూర్తి = లోకాలను పవిత్రం చేసే రూపంగలవాడా, రామా, సంబోధన, దైవము = భగవంతుడు, తల్లి = మాత, తండ్రి = కన్నతండ్రి, పితరుడు, తగు దాత = తగినసమయంలో తగినవస్తువును దానంచేసేవాడు, గురుండు = విద్యాబుద్ధులు నేర్పించినవాడు, సఖుడు = స్నేహితుడు, చెలి, నిన్నె = నీవే, కాన్ = అగునట్లు, భావన సేయుచున్న = మనస్సులో భావించుచున్న, తరిన్ = సమయంలో, ఎల్ల = అన్ని, సమస్తమైన, పాపములు = దోషాలు, మనోవికార = మనస్సునందు వికారము, మారుపాటు (కలిగించి), దుర్భావితుని = దుష్టమైన భావాలుగల వానిని, చెడ్డఆలోచనలు వచ్చేమనస్సుగలవానిని చేయుచున్నవి. కృపామతివై = నామీద దయగలిగిన మనస్సుగలవాడవయి, ననున్ = నన్ను, కావుమీ = రక్షించుమా.

తా : దశరథరామా! లోకాన్ని పవిత్రంచేసే స్వరూపం గలిగిన రామా, నేను నిన్ను దైవంగాను, తల్లిదండ్రులుగాను, గురువుగాను, స్నేహితుడుగాను భావిస్తూ ఉండగా దోషాలు, పాపాలు నా మనస్సులో మారుపాటుగావించి సంచలనం గలిగించి దుష్టభావాలు కలిగించి నన్ను చెరుపుచున్నవి. లోకంలోని పాపాలను పోగొట్టేస్వరూపం గలవాడవు కాబట్టి నా పాపాలను నిర్మూలించి నన్ను కాపాడుమా.

వ్యా : గురువు, తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవము, దాత అనేవి సప్తప్రాకారములుః గల రక్షకము. ఇదే ఏడుగడ. లోకాన్ని సృష్టిచేసి దానిని ఎల్లప్పుడు రక్షచేసేవాడు కాబట్టి భగవానుడు దైవమైనాడు. లోకాన్ని మాతృదేవి వలె కాపాడేవాడు కాబట్టి తల్లియైనాడు. పితృస్థానంలో ఉండి, బాగోగులు చూసేవాడు కాబట్టి తండ్రియైనాడు. అవసరమైనప్పుడు తగినవస్తువులను, తగిన సమయంలో సమకూరుస్తాడు. కాబట్టి దాతయైనాడు.

విద్యాబుద్ధులు నేర్పించి, విచక్షణాజ్ఞానాన్ని కలిగిస్తాడు కాబట్టి గురువైనాడు. ఆపదసమయం వచ్చినప్పుడు తగిన సాహాయ్యం అందిస్తాడు కాబట్టి సఖుడైనాడు. ఇన్నివిధాల భగవంతుని భావించుకొన్నప్పుడే భక్తునికి ఆయనమీదగల నిజమైన భక్తి వ్యక్తమైంది.

**67.ఉ. వాసవరాజ్యభోగసుఖవార్ధిని దేలుప్రభుత్వమబ్బినా**
**యాసకు మేరలేదు కనకాద్రిసమాన ధనంబు గూర్చినం**
**గాసును వెంటరాదు, కని కానక చేసిన పుణ్యపాపముల్**
**వీసర బోవనీవు, బదివేలకుఁ జాలు భవంబునొల్ల నీ**
**దాసునిగాఁగ నేలికొను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : వాసవ = ఇంద్రునియొక్క, రాజ్య = అధికారమును, దొరతనమును, భోగ = అనుభవము, సుఖ =సౌఖ్యమనెడు, వార్ధిని = సముద్రంలో, తేలుప్రభుత్వము = ఆనందించే దొరతనము, అబ్బి = లభించినప్పటికి, నా ఆసకు = నా వాంఛకు, ఆశకు, మేరలేదు = పరిమితి కలుగదు, తృప్తి కలుగదు. కనకాద్రి = బంగారుకొండకు, సమాన = సరియైన, ధనంబును = ద్రవ్యమును, కూర్చినను = సేకరించినను, కాసు = రాగినాణెముకూడ, వెంటరాదు = వెంబడించదు. కని = తెలిసి, కానక = చూడక, తెలియక, చేసిన = ఒనరించిన, పుణ్యపాపముల్ = మంచి పనులు, చెడ్డపనులు, దోషాదోషములు, వీసర బోవనీవు = వెలితిపడనీయవు. పదివేలకు = పదివేల (అసంఖ్యాకమైన) అనర్థాలకు, చాలు = సమర్థములైన, భవంబు = జన్మము, (= సంసారము = జననమరణచక్రంలో చిక్కి ఉండటం), ఒల్లను = అంగీకరించను, నీదాసునిగాఁగన్ = నీ సేవకునిగాగ, ఏలుకొను = పాలింపుము, రక్షించుము.

తా : దశరథరామా, స్వర్గాధిపతియైన ఇంద్రునిభోగమునకు సమానమైన సౌఖ్యము లభించే అధికారం దొరికినప్పటికి, ఆశకు అంతం లేదు. తృప్తి లేదు. బంగారు కొండకు సమానమైన ధనం ప్రోగుచేసినా, మరణించినప్పుడు ఒకకాసు అంటే రాగినాణెముకూడ వెంటరాదుకదా. మానవ సహజంగా తెలిసితెలియక చేసిన దోషాలు వెలితిపడనీయవు. అనంతమై అసంఖ్యాకమైన అనర్థాలకు సమర్థమైన జన్మను నేను అంగీకరించను. నీవు, ఓరామా, నన్ను దాసునిగా అంగీకరించి, పరిపాలించి రక్షింపుము (అని ప్రార్థన).

వ్యా : మానవజీవితము సుఖదుఃఖములకు ఆలవాలము. మనుష్యుడు అన్నివిధాల తాను సాధ్యమైనంతవరకు సుఖముగా జీవించవలెనని ప్రయత్నిస్తాడు. లోకంలో కొందరీ ప్రయత్నంలో సాఫల్యం సాధిస్తారుకూడ. వారు చేసే పనులవలన ధనకనక వస్తువాహనాలు లభించడం ఉన్నది. ఇవి ఐహికమైన సౌఖ్యాలు. ఈ సౌఖ్యాలు ఇంద్రుడు అనుభవించే

భోగములతో సమానమైనవి. కాని, విచిత్రమేమంటే ఇటువంటి ఐహికమైన సౌఖ్యాలు ఎన్ని లభించినా మనస్సుకు తృప్తి కలుగదు. ఇంకా అధికంగా కావలెననే కోరిక ప్రబలుతూ ఉంటుంది. ఇది మానవ సహజం.

ఈషణాత్రయంలో ధనేషణ ప్రధానమైంది. న్యాయంగానో, అన్యాయంగానో ధనాన్ని సమకూర్చుకోవలెనని మానవుడు లోకంలో ప్రయత్నించడం ఉన్నది. తనప్రయత్నంలో సఫలమై, కొండంత ధనం సంపాదించినా, దీనికి పరిమితి కన్పించదు. ఆ ధనాన్ని తాను కర్చు చేయలేడు సరికదా, తాను మరణించినప్పుడు కనక రజతాలే కాదు. ఒక రాగినాణెముకూడ తనవెంట రాదు. కాని, అజ్ఞానంచేత ఈ విషయం తెలిసికొనలేక వ్యామోహంలో పడడం అందరు నిత్యజీవితంలో చూస్తూ ఉన్నదే.

మానవ జీవితయాత్ర చేస్తున్నప్పుడు తెలిసియో, తెలియకయో, పాపాలకు, దోషాలకు గురికావలసివస్తుంది. తెలిసి చేసినా, తెలియకచేసినా పాపాలు పాపాలే. వాటికి వెలితి లేదు. దోషం చేస్తే దానికి ఫలితం అనుభవించవలసియే ఉంటుంది. కర్మఫలం అనుభవించక తప్పదుకదా. అందుచేత ఈ జన్మం (భవం) కొనసాగినంతకాలం పాపాలకు కరువుండదు. తరువాత పాపఫలాన్ని అనుభవించడానికి కరువు ఉండదు. అందుచేత కవి ఈ జన్మాన్ని 'పదివేలకు జాలు' అని వర్ణించినాడు. అంటే ఈ జన్మం ఉన్నంతకాలం అసంఖ్యాకమైన పాపకార్యాలు చేయవలసివస్తుంది.

ఇక సౌఖ్యాలపై ఆశను, ధనంపై కోరికను, భవంలో కలిగే దోషాలను తప్పించుకోవలెనంటే ఏమి చేయవలెనని ఆలోచించినాడు కవి. దానికి ఒకేమార్గం ఉన్నది. భగవానుని శరణుచేరవలె, ఆయనకు దాస్యం చేయవలె. ఆయన తనను దాసునిగా అంగీకరిస్తే తన దోషాలు, తన ఆశలు అన్ని తొలగిపోతవి. అందుచేత 'అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అని శ్రీరాముని ఈ పద్యంలో ప్రార్థిస్తూ ఉన్నాడు.

'వాసవరాజ్యభోగసుఖవార్ధిని' అనే ప్రయోగంలో రూపకాలంకారం ప్రయుక్తమైంది.

**68.ఉ. సూరిజనుల్ దయాపరులు, సూనృతవాదు లలుబ్ధమానవుల్**
**వీరపతివ్రతాంగనలు, విప్రులు, గోవులు, వేదముల్, మహీ**
**భారముఁ దాల్పఁగా, జనలు పావనమైన పరోపకార స**
**త్కారమెరుంగలేరకట దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : సూరిజనుల్ = పండితులు, దయాపరులు = దయాస్వభావం గలవారు, సూనృతవాదులు = సత్యముపలుకువారు, అలుబ్ధ మానవులు = లోభములేనివారు, దాతృత్వగుణము కలిగినవారు, వీరపతివ్రతాంగనలు = పాతివ్రత్యమును శ్రద్ధగా

పాటించే వనితలు, విప్రులు = బ్రాహ్మణులు, గోవులు = సాధుజంతువులైన ఆవులు, వేదములు = ఋగ్యజుస్సామాథర్వణవేదాలు, మహీభారము = భూభారాన్ని, తాల్చ(గాన్ = వహించగా, జనులు = లోకులు, సామాన్యజనులు, పావనము = పవిత్రము - అయిన, పరోపకారము = ఇతరులకు మేలు చేయడంలోని, సత్కారమును = గౌరవము, సమ్మానము, ఎరుంగలేరు = తెలియ(జాలరు, అకట = అయ్యో - ఆశ్చర్యార్థకము.

తా : ఓ దశరథరామా, ఈనాడు లోకంలో ఉండే జనులను, పండితులు, దయాస్వభావంగలవారు, నియమంగా పాతివ్రత్యాన్ని పాటించే వనితలు, బ్రాహ్మణులు, గోవులు, నాలుగువేదాలు, ఉద్ధరించుచున్నారు. (ఉద్ధరించుచున్నవి) కాపాడుతున్నవి. జనులు వీరివలన ఉపకారం పొంది వారికి ప్రత్యుపకారం చేయడం ధర్మంకదా. కాని అది తెలియలేని జనులు వారిని గౌరవింపలేకున్నారు.

వ్యా : ఈ పద్యంలో కవి సమకాలీన సమాజంలోని సామాజికప్రవృత్తిని పరిశీలించి చెప్పుతున్నాడు. కలియుగంలో ఎంత దోషభూయిష్ఠమైన వ్యవస్థ ఉన్నా, మంచివారు లేకుండే పరిస్థితి రాదు. వారివలననే ఈ ప్రపంచం కొనసాగుతుంది. వారివలన కలిగే లోకోపకారాన్ని గురించియే కవి ఈ పద్యంలో ప్రశంస చేసినాడు.

సూరిజనులు అంటే పండితులైనవారు. వీరు విద్యాధికులు, మేధావులు. సమాజంలో కలిగే మంచిచెడులనుగురించి ఆలోచించేవారు. దుర్మార్గంలో వెళ్లేవారికి మంచిమార్గం చూపించేవారు. వీరివలన ఎల్లప్పుడు లోకానికి మేలు జరుగుతుంది. పూర్వం రాచరిక వ్యవస్థ ఉన్నప్పుడు మనదేశంలో మేధావులైన పండితులు వీరులైన రాజులకు, పురోహితులుగాను, హితవరులుగాను ఉండి మార్గదర్శనంచేసి, మంచి పరిపాలనావ్యవస్థకు తోడ్పడేవారు. ప్రస్తుతప్రజాస్వామ్య వ్యవస్థలోను, మేధావులపాత్ర సామాజికంగా కొంతవరకైనా ప్రాముఖ్యం కలిగి ఉందనడంలో సందేహం లేదు.

దయాపరులు అంటే దయాస్వభావం కలిగినవారు. హింసను విడనాడి, పరులకు బాధ కలుగనీయక సామాజిక వ్యవస్థ కొనసాగడానికి ప్రయత్నించేవారు. ఒకవిధంగా వారిని అహింసాపరులని చెప్పవచ్చు. మనచరిత్రలో బుద్ధుడు, ఆయనఅనుచరులై, ఆయనసిద్ధాంతాన్ని నమ్మి ఆచరించే బౌద్ధులు అహింసాపరులే. మనజ్ఞాపకంలో గాంధీగారు గొప్ప అహింసావాది. ఆయన అవలంబించిన అహింసాసిద్ధాంతం మానవలోకాన్ని చాల ప్రభావితంచేసింది. ఆయన అనుయాయులు గాంధేయవాదులు. వారును సిద్ధాంతరీత్యా అహింసావాదులు. అహింసాసిద్ధాంతాన్ని పాటిస్తున్నవారివలన బలహీనులకు, కీడు కలుగదు. వారిఉన్నతికి ఈ అహింసావాదులు త్రికరణశుద్ధిగా తోడ్పడవలసిన ఆవశ్యకత ఉన్నది.

సూనృతవాదులు అంటే అసత్యం పలుకనివారు. సత్యవాదులు. మనదేశంలో అనాదిగా సత్యవాక్యపరిపాలన అనేది మహానుభావులలక్షణంగా ఉన్నది. పురాణాల్లో హరిశ్చంద్రుడు శ్రీరాముడు సత్యవాక్యపరిపాలనచేసి ప్రఖ్యాతి పొందినవారు. ఆధునిక కాలంలో గాంధీమహాత్మునికి అటువంటికీర్తి ఉన్నది. ఈ మహనీయులను ఆదర్శంగా పెట్టుకొన్న వ్యక్తులు మనసమాజంలో అనేకులు సత్యవాదులున్నారు. వీరివలన సాటిమానవులకు శుభం కలుగుతుంది. ఉపకారం కలుగుతుంది. సామాజికమైన కాలుష్యాన్ని దూరం చేయడానికి సాహాయ్యం లభిస్తుంది.

అలుబ్ధమానవుల్ అంటే ఉదారస్వభావంగల మనుష్యులు దానధర్మాలమీద ఆసక్తి కలవారు. తాము సంపాదించినదంతా తామే అనుభవించక, సమాజంలోని అవసర పరిస్థితిలో ఉన్నవారిని ఆదుకొనేవారు. శిబి దధీచి మహానుభావులు పౌరాణిక ప్రసిద్ధులు. ఈనాటికిని, ధనవంతులు, వర్తకులు, తమ నిధులవలన చాలమంది బీదలను ఆదుకోవడం, అనేకవిద్యాసంస్థలను నడిపించడం మనం గమనించవచ్చు.

భారతీయ సంస్కృతిలో పతివ్రతానియమం అనాదిగా వస్తున్న నియమం. సామాజికవ్యవస్థ నిరాటంకంగా కొనసాగవలెనంటే, స్త్రీలు పాతివ్రత్యాన్ని పాటించవలసి ఉన్నది. పురుషులు ఏకపత్నీవ్రతాన్ని ఆచరించవలసిఉన్నది. దీనివలన సామాజికమైన శాంతి ఏర్పడి ఉంటుంది. పురుషులకు పరదారగమనం, స్త్రీలకు పరపురుషసంగమం మనధర్మశాస్త్రాల్లో నిషేధించబడి ఉన్నది. నియమానుసరణంవలన వర్ణసాంకర్యం పరిహరింపబడుతుంది. సామాజికమాత్సర్యం నశిస్తుంది. శాంతికి దోహదం కలుగుతుంది. విప్రులు అంటే బ్రాహ్మణులు. వీరు వేదాధ్యయనం చేసేవారు. యజ్ఞయాగాదికర్మలు చేసేవారు. ఇతరులచేత చేయించేవారు. నిత్యాగ్నిహోత్రకర్మలు దేవతలకు తృప్తి కలిగిస్తాయని మనవేదాల్లో చెప్పబడి ఉన్నది. ద్విజుడు అనగా బ్రాహ్మణుడు తనవిధులను సక్రమంగా ఆచరించినప్పుడే అతనిబ్రాహ్మణత్వం ఉంటుంది. కేవలం బ్రాహ్మణజాతిలో జన్మించినంతమాత్రాన బ్రాహ్మణత్వం సిద్ధించదు. వేదాలు శాస్త్రాలు సమసిపోనీయక కాపాడేవారు బ్రాహ్మణులు కాబట్టి వారివలన లోకానికి ఉపకారం జరుగుతుందని కవిభావన.

గోవులు సాధుజంతువులు. సామాజికంగా ఈ జంతువులకు మనదేశంలో చాల ప్రాముఖ్యం ఉన్నది. ఇవి లోకానికి పాడిపంటలు సమకూరుస్తాయి. మనది వ్యావసాయిక దేశం కాబట్టి కృషికి కావలసిన కోడెలను సమకూరుస్తున్నాయి. రవాణాకు కావలసిన ఎద్దులను గోవులే ప్రసాదిస్తున్నాయి. గోవుల ప్రాముఖ్యం ఎంత ఉన్నదంటే ప్రతి భారతీయుడు తననిత్యప్రార్థనలో 'గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం' అని భగవంతుని

కోరుతున్నాడు. గోహింస, గోవధ మనశాస్త్రాల్లో నిషేధింపబడింది. గోవును నరికితే మనం మనను నరుకుకొన్నట్లే కదా.

వేదాలు నాలుగు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము. ఈ నాలుగువేదాలు భారతీయువిజ్ఞానానికి గనులవంటివి. ఈ వేదాలు బ్రహ్మముఖవినిర్గతములని, అపౌరుషేయాలని ప్రఖ్యాతిని వహించినాయి. ఇవి ప్రపంచసాహిత్యంలోనే అతిప్రాచీనమైనవి అనేది యథార్థము. ఈ వేదాలు సామాజికమైన వ్యవస్థను కాపాడి, ఈ వ్యవస్థ కూలిపోకుండునట్లు వ్యవహరిస్తాయి. మనకు వేదాలు **లేకపోతే**, మనకు సంస్కృతి లేదని రాధాకృష్ణపండితుడు వక్కాణించినాడు. మన **తరతరా**లసంస్కృతికి వైదికసంస్కృతియే మూలమైందని మాక్స్‌ముల్లరు పండితుడు వ్రాక్రుచ్చినాడు.

పైన పేర్కొన్నవి మనకు నిత్యోపకారం చేసేవి. కాని, కలియుగంలో పండితులు, దయాస్వభావంగలవారు, దాతలు, పతివ్రతలు, బ్రాహ్మణులు, గోవులు, వేదాలు ఎంత గౌరవాన్ని జనులవలన పొందవలసిఉన్నదో పొందడం లేదు. కంచెర్ల గోపన్న నివసించిన **కాలంలో**, మనదేశంమీద ముసల్మానులఅధికారం ఉండేది. కాబట్టి వీరు మనసంస్కృతిని ఆదరించలేదు. ఆధునికకాలంలో, విజ్ఞానశాస్త్రం అధికారం వహించి ఉన్నది కాబట్టి, మనకు స్వేచ్ఛ ఉన్నా, పైన పేర్కొన్నవారికి తగిన సమ్మానం లభించడం లేదు. 'అకట' **అనే** విచారార్థకమైన మాటతో దాశరథి కవి తన ఆవేదనను వ్యక్తంచేసినాడు ఈ పరిస్థితికి. గోపన్నకవి భక్తిశతకం వ్రాసి, దైవాన్నిమాత్రమే స్మరించినాడనవలసినపని లేదు. సామాజిక స్థితిగతులనుకూడ ఆయన పరికించినాడనడానికి ఈ పద్యం సజీవనిదర్శనం.

**69.ఉ. వారిచరావతారమున వారిధిలోఁ జొరఁబారి క్రోధవి**
**స్తారగుఁడైన యా నిగమతస్కరవీరనిశాచరేంద్రునిన్**
**జేరి వధించి వేదములచిక్కొడలించి విరించికిన్ మహో**
**దారత నిచ్చితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : వారిచర+అవతారమునన్ = (వారిచర = నీటిలో చరించేది చేప) మత్స్యమైన అవతారమునందు - వారిధిలోన్ = సముద్రములోనికి, చొరఁబారి = ప్రవేశించి, వేగముగా జొచ్చి, క్రోధవిస్తార = అధికమైన కోపమును పొందిన, నిగమ = వేదాలను, తస్కర = దొంగతనముచేసిన, వీరుని, నిశాచరేంద్రునిన్ = రాక్షసముఖ్యుని, సోమకాసురుని, చేరి = పొంది, వధించి = చంపి, వేదములచిక్కు = వేదాలకు కలిగిన చీకాకును, వేదాలగజిబిజిని, ఎడలించి = తొలగించి, విరించికిన్ = బ్రహ్మకు, మహా+ఉదారతన్ = మిక్కిలిదాతృత్వంతో, ఈవె = నీవే, ఇచ్చితికద = ఇచ్చినావుకదా.

కోరుతున్నాడు. గోహింస, గోవధ మనశాస్త్రాల్లో నిషేధింపబడింది. గోవును నరికితే మనం మనను నరుకుకొన్నట్లే కదా.

వేదాలు నాలుగు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము. ఈ నాలుగువేదాలు భారతీయవిజ్ఞానానికి గనులవంటివి. ఈ వేదాలు బ్రహ్మముఖవినిర్గతములని, అపౌరుషేయాలని ప్రఖ్యాతిని వహించినాయి. ఇవి ప్రపంచసాహిత్యంలోనే అతిప్రాచీనమైనవి అనేది యథార్థము. ఈ వేదాలు సామాజికమైన వ్యవస్థను కాపాడి, ఈ వ్యవస్థ కూలిపోకుండునట్లు వ్యవహరిస్తాయి. మనకు వేదాలు లేకపోతే, మనకు సంస్కృతి లేదని రాధాకృష్ణపండితుడు వక్కాణించినాడు. మన తరతరాలసంస్కృతికి వైదికసంస్కృతియే మూలమైందని మాక్సుముల్లరు పండితుడు వాక్రుచ్చినాడు.

పైన పేర్కొన్నవి మనకు నిత్యోపకారం చేసేవి. కాని, కలియుగంలో పండితులు, దయాస్వభావంగలవారు, దాతలు, పతివ్రతలు, బ్రాహ్మణులు, గోవులు, వేదాలు ఎంత గౌరవాన్ని జనులవలన పొందవలసిఉన్నదో పొందడం లేదు. కంచెర్ల గోపన్న నివసించిన కాలంలో, మనదేశంమీద ముసల్మానులఅధికారం ఉండేది. కాబట్టి వీరు మనసంస్కృతిని ఆదరించలేదు. ఆధునికకాలంలో, విజ్ఞానశాస్త్రం అధికారం వహించి ఉన్నది కాబట్టి, మనకు స్వేచ్ఛ ఉన్నా, పైన పేర్కొన్నవారికి తగిన సమ్మానం లభించడం లేదు. 'అకట' అనే విచారార్థకమైన మాటతో దాశరథి కవి తన ఆవేదనను వ్యక్తంచేసినాడు ఈ పరిస్థితికి. గోపన్నకవి భక్తిశతకం వ్రాసి, దైవాన్నిమాత్రమే స్మరించినాడనవలసినపని లేదు. సామాజిక స్థితిగతులనుకూడ ఆయన పరికించినాడనడానికి ఈ పద్యం సజీవనిదర్శనం.

**69.ఉ. వారిచరావతారమున వారిధిలోఁ జొరఁబారి క్రోధవి**
**స్తారగుఁడైన యా నిగమతస్కరవీరనిశాచరేంద్రునిన్**
**జేరి వధించి వేదములచిక్కెడలించి విరించికిన్ మహో**
**దారత నిచ్చితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : వారిచర+అవతారమునన్ = (వారిచర = నీటిలో చరించేది చేప) మత్స్యమైన అవతారమునందు - వారిధిలోన్ = సముద్రములోనికి, చొరఁబారి = ప్రవేశించి, వేగముగా జొచ్చి, క్రోధవిస్తార = అధికమైన కోపమును పొందిన, నిగమ = వేదాలను, తస్కర = దొంగతనముచేసిన, వీరుని, నిశాచరేంద్రునిన్ = రాక్షసముఖ్యుని, సోమకాసురుని, చేరి = పొంది, వధించి = చంపి, వేదములచిక్కు = వేదాలకు కలిగిన చీకాకును, వేదాలగజిబిజిని, ఎడలించి = తొలగించి, విరించికిన్ = బ్రహ్మకు, మహా+ఉదారతన్ = మిక్కిలిదాతృత్వంతో, ఈవె = నీవే, ఇచ్చితికద = ఇచ్చినావుకదా.

తా : దశరథరామా, మత్స్యావతారంలో, సముద్రంలో వేగంగా ప్రవేశించి, అధికమైన క్రోధావేశం కలిగినవాడై వేదాలను అపహరించుకొని వెళ్ళిన వీరుడైన మేటి రాక్షసుడగు సోమకాసురుని పట్టి చంపి, వేదములకు కలిగినప్రమాదమును, చీకాకును తొలగించి, బ్రహ్మకు మరల వానిని చాల ఔదార్యంతో ఇచ్చినవాడవు నీవే కాని మరెవ్వరుకాదు. ఓరామా, మత్స్యావతారం ఎత్తిన విష్ణుమూర్తివి నీవే.

వ్యా : ఈ పద్యంలో శ్రీమహావిష్ణువు మత్స్యావతారం వహించి, వేదాలను ఉద్ధరించిన వృత్తాంతాన్ని పేర్కొంటున్నాడు కవి.

లోకంలో విజ్ఞానం వెలుగువంటిది. దానికి విఘాతంకలిగితే లోకం అంధకారబంధురమవుతుంది. లోకానికి ఏ ప్రమాదం కలిగినా రక్షించేబాధ్యత భగవానునిదే కాబట్టి, రాక్షసునివలన విజ్ఞాన ఖనియైన వేదాలకు భంగం కలిగితే, వాటికి ప్రమాదం కలుగకుండగ రక్షించి, తిరిగి సృష్టికర్తకు వాటిని అప్పగించినాడా భగవానుడు.

**70.చ. కరమనురక్తి, మందరము గవ్వముగా, వహిరాజు త్రాడుగా,**
**దొరకొని దేవదానవులు దుగ్ధపయోధి మథించుచున్నచో,**
**ధరణి చలింప, లోకములు తల్లడమందఁగఁ, గూర్మమై ధరా**
**ధరము ధరించితీవె కద! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : కరము = మిక్కిలి, అనురక్తిన్ = అనురాగముతో, కూరిమితో, దేవ = దేవతలు, దానవులు = రాక్షసులు, మందరము = మందరపర్వతమును, కవ్వము = పెరుగు చిలుకు సాధనముగాను, అహిరాజు = సర్పములకు రాజైనవానిని, వాసుకిని, త్రాడుగా, దొరకొని = పూనుకొని, దుగ్ధపయోధిన్= పాలసముద్రాన్ని, మథించుచున్నచోన్ = చిలుకుతుండగా, ధరణి = భూమి, చలింపన్ = వడకగా, లోకము = జగము, తల్లడమందఁగన్ = కంపించగా, తల్లడిల్లఁగా, కూర్మమై = తాబేలు అయి, ధరాధరమున్ = పర్వతాన్ని, మంథరమును, ఈవె = నీవే, ధరించితివికదా = భారమును వహించితివి కదా, ఎత్తితివి కదా.

తా : దశరథరామా, దేవతలు, రాక్షసులు మందరపర్వతాన్ని కవ్వముగాను, సర్పరాజగు వాసుకిని కవ్వపుత్రాడుగానుజేసి పాలసముద్రాన్ని చిలుకుతూ ఉండగా, అపుడా కొండ తటాలున మునుగడంవలన భూమి, లోకము తల్లడిల్లడం చూచి, కూర్మావతారం ఎత్తి కొండను వీపుమీద దాల్చిన వాడవు నీవేకదా! లోకానికి ఉపకారం చేసినవాడవు నీవే కదా.

వ్యా : ఈ పద్యంలో విష్ణుమూర్తి రెండవ అవతారమైన కూర్మావతారాన్ని గురించిన ప్రస్తావన ఉన్నది. కూర్మావతారవృత్తాంతం అష్టాదశపురాణాల్లో అనేక సందర్భాల్లో

వచ్చింది. దీనిలో విష్ణుమూర్తిమాహాత్మ్యం వ్యక్తమైంది. మహేశ్వరుని గొప్పతనం లోకానికి తెలియవచ్చింది. విష్ణుమూర్తికూర్మరూపంలో పర్వతాన్ని లేవనెత్తితే, మహేశ్వరుడు, లోకానికి హానిచేసే హాలాహలాన్ని గ్రహించి తనకంఠంలో నిలుపుకొన్నాడు.

**71.ఉ. ధారుణిఁ జాపఁ జుట్టినవిధంబునఁ గైకొని హేమనేత్రుఁడ**
**వ్వారిధిలోన డాగినను, వాని వధించి వరాహమూర్తివై.**
**ధారుణిఁ దొంటికైవడిని దక్షిణశృంగమునన్ ధరించి, వి**
**స్తారముఁజేసితీవెకద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ధారుణిన్ = భూమిని, చాపన్ = చాపను, చదరను, చుట్టినవిధంబునన్ = గుండ్రముగా మడచినతీరుగా, హేమనేత్రుడు = హిరణ్యాక్షుడనే రాక్షసుడు, కైకొని = చేతిలో ఎత్తుకొని, అవ్వారిధిలోనన్ = ఆసముద్రంలో, దాగినను = కనిపించకయుండగా, దాగికొనగా, వానిని = ఆ హిరణ్యాక్షుడనే రాక్షసుని, వధించి = సంహరించి, చంపి, వరాహమూర్తివై = పందియాకారాన్ని ధరించినవాడవై, ధారుణిన్ = భూమిని, తొంటి = పూర్వము, కైవడిన్ = విధంగా, దక్షిణశృంగమునన్ = కుడికొమ్మునందు కుడిపంటికోరయందు, ధరించి = వహించి, తాల్చి, విస్తారము = వెడల్పుగా, మరల చాపవలె వెడల్పుగా, ఈవె = నీవే, ఒనర్చితికద = చేసినావు కదా, నిర్వహించినావు కదా.

**తా** : దశరథరామా, హిరణ్యాక్షుడనే రాక్షసుడు భూమిని చాపచుట్టగా చుట్టి యెత్తుకొని, సముద్రంలోనికి వెళ్లి దాచుకొనగా, నీవు వానిని సంహరించి వరాహ (పంది) రూపాన్ని ధరించి, కుడిపంటికోరతో ఎత్తుకొని వచ్చి మునుపటివలె చాపగా, వెడల్పుగా పరచునట్లు చేసినవాడవుకా. మరెవరు కాదు.

**వ్యా** : ఈ పద్యంలో శ్రీమన్నారాయణుని మూడవ అవతారమైన వరాహావతారప్రస్తావన ఉన్నది. విష్ణుమూర్తి వైకుంఠంలో నివసించినవాడు. అతనికి ద్వారపాలకులు జయవిజయులు. ఒక సందర్భంలో సనకసనందనులు అనే విష్ణుభక్తులు, వైకుంఠంలోని శ్రీమన్నారాయణుని దర్శించడానికి వచ్చినప్పుడు, జయవిజయులు అహంకారంతో వారిని అవమానించినారు. విష్ణుభక్తులను అవమానించడం ఎంతవారికిని తగదుకదా. దానిపరిణామంగా జయవిజయులు శాపదష్టులై హిరణ్యాక్షహిరణ్యకశిపులుగా జన్మించినారు. వీరిజన్మ వరాహకల్పంలో సంభవించింది. స్వయంగా జయవిజయులు విష్ణుభక్తులే కాబట్టి, శ్రీమహావిష్ణువు వారిని ఉద్ధరించడానికి, లోకోపకారం చేయడానికి వరాహరూపంగాను, నరసింహరూపంగాను అవతరించినాడు.

రాక్షసులు తామసప్రవృత్తి కలిగినవారు కాబట్టి హిరణ్యాక్షుడనే రాక్షసుడు కూడ

లోకోపద్రవకారణంగా పరిణమించినాడు. అతడు ఈ భూమిని చాపలాగ చుట్టి, దానిని సంక్షేపం చేసి సముద్రగర్భంలో దాచిపెట్టినాడు. భూలోక నివాసులు హాహాకారాలు చేసినారు. కష్టాలపాలైనారు. అప్పుడు శ్రీమన్నారాయణుడు వరాహరూపంలో అవతరించినాడు. హిరణ్యాక్షుని వధించినాడు. తన కుడి పంటికోరతో భూమిని సముద్రంనుంచిపైకి ఉద్ధరించినాడు. దీనివలన తిరిగి లోకానికి మేలు జరిగింది. భూమిని ఉద్ధరించినాడు కాబట్టి, భూదేవి శ్రీమహావిష్ణువుకు భార్య అయింది. ఆమెను శ్రీదేవితో సమానంగా గౌరవించినాడు. వరాహావతారకథ, ఇతర పురాణాలతో పాటు వ్యాసుడు శ్రీమహాభాగవతంలో వచించినాడు. ఈ వృత్తాంతం తైత్తిరీయ సంహితలోను, తైత్తిరీయబ్రాహ్మణంలోను, శతపథబ్రాహ్మణంలోను ఉన్నట్లు తెలియవస్తున్నది. శ్రీమద్భాగవతంలో ఆదివరాహావాతారాన్ని యజ్ఞవరాహావతారమని వ్యాసుడు పేర్కొన్నాడు.

**72.చ. పెటపెట నుక్కుగంబమున భీకరదంతనఖాంకురప్రభా**
**పటలముగప్ప నుప్పతిలి భండనవీథి నృసింహభీకర**
**స్ఫుటపటుశక్తి హేమకశిపున్ విదళించి సురారిపట్టి ను**
**త్కటకృపఁ జూచితీవె కద. దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ఉక్కుకంబమునన్ = ఇనుపస్తంభంలో, పెటపెట = పెటపెటమనే శబ్దంతో, భీకర = భయంకరమైన, దంత పండ్లయొక్క, నఖ+అంకుర = గోటి (వాడి) మొనలయొక్క, పటలము = సమూహం, కప్పన్ = వ్యాపించగా, ఉప్పతిలి = పుట్టి, భండనవీథిన్ = యుద్ధ ప్రదేశంలో, నృసింహ = మనుష్యుడు సింహము స్వరూపంగలిగిన అవతారముయొక్క, భీకర = భయంకరమైనట్టిది, స్ఫుట = స్పష్టమైనది, పటు = కఠినమైనది, అగు శక్తిన్ = బలముచేత, సామర్థ్యముచేత, హేమకశిపున్ = హిరణ్యకశిపుడనే రాక్షసుని, విదళించి = చీల్చి, సురారిపట్టిని = రాక్షసునికుమారుడైన ప్రహ్లాదుని, ఉత్కట = అధికమైన, కృపన్ = దయతో, చూచితివి కదా = కటాక్షించితివికదా, ఈవె = నీవే, నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని చీల్చి, ప్రహ్లాదునికాపాడినవాడవు నీవె కాని మరెవ్వరు కాదని భావము.

తా : దశరథరామా, నీవు ఉక్కుస్తంభంలో నరసింహమూర్తివై పెటపెట మనే ధ్వనితో ఉద్భవించి, నీ పండ్ల యొక్కయు మొగ్గలవంటి కొనగోళ్ల యొక్కయు, తెల్లని కాంతిసమూహములు వ్యాపించగా భయంకరమైన శక్తిచే, హిరణ్యకశిపుని రొమ్ము చీల్చి చంపి, తరువాత, వానికుమారుడైన ప్రహ్లాదుని కాపాడినవాడవు నీవేకదా (ఓ రామా నన్నును అట్లే కాపాడుము అని భావము).

వ్యా : ఈ పద్యంలో నృసింహావతారాన్ని గురించి కవి ప్రస్తావన చేసినాడు.

శ్రీమన్నారాయణుడు తనభక్తులను ఎల్లప్పుడు రక్షించే స్వభావం కలవాడు. హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదుడు విష్ణుమూర్తికి మహాభక్తుడు అనే ఖ్యాతిని వహించినాడు. అతనికి సహజంగా బాల్యం నుంచియే విష్ణుభక్తి అలవడింది. చండామార్కులు అనే గురువులసన్నిధిలో రాక్షసబాలురందరు హిరణ్యకశిపుని నామం స్మరిస్తూ ఉంటే ప్రహ్లాదుడుమాత్రం విష్ణుసంకీర్తన చేసేవాడు. నిరంతరం హరిపదాంభోజచింతనామృతంలో కాలంగడిపేవాడు. రాక్షసరాజు ఆగ్రహోదగ్రుడైనాడు. కుమారుడు అనే ప్రేమ కూడ లేక ప్రహ్లాదుని మీద క్రోధం వహించినాడు. రాక్షస రాజు ఆజ్ఞతో పసివాడైన ప్రహ్లాదుని రాక్షసులు ఏనుగుతో త్రొక్కించినారు. సర్పాలతో కరిపించినారు. సముద్రంలో పడద్రోసినారు. ఆయుధాలచేత పొడిచినారు. కాని విచిత్రమేమో, అతనికి అణుమాత్రం హానికలుగలేదు. ఆ హరి ఎక్కడున్నాడు చెప్పుమని ప్రశ్నించినాడు ప్రహ్లాదుని. విష్ణుమూర్తి విశ్వాత్మకుడు, విశ్వవ్యాపకుడు, అని ప్రహ్లాదుడు చెప్పినాడు.

అంతట ఉండే శ్రీహరి ఈ స్తంభంలో ఉన్నాడా అని ప్రశ్నించి, అరచేతిలో తన ఎదుట ఉండేస్తంభాన్ని చరచినాడు. నిజమే. అక్కడ శ్రీహరి ఉన్నాడుకదా ప్రహ్లాద హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీరరససంయుతుండును, మహాప్రభావుండును శ్రీనృసింహదేవుడు అక్కడ ఆవిర్భవించినాడు. తన భక్తుని బాధించి, లోకకంటకుడుగానున్న హిరణ్యకశిపుని తననఖములచేత చీల్చి వధించినాడు. తనభక్తునికి ప్రహ్లాదునికి ప్రీతి గావించినాడు.

తన భృత్యుడైన ప్రహ్లాదుని మాట నిలబెట్టడానికి బ్రహ్మఅనుగ్రహించిన వరములవైనాన్ని సత్యం చేయడానికి, భగవానుడు శ్రీనృసింహుడుగా అవతరించినాడు. నృసింహావతార వృత్తాంతం తైత్తిరీయారణ్యకంలో ఉన్నదట. అనేకపురాణాల్లో ఈ కథ చెప్పబడింది. అయినా, భాగవతపురాణంలోనికథ బహుప్రశస్తమైంది.

**73.చ. పదయుగళంబు భూగగనభాగములన్ వెసనూని విక్రమా**
**స్పదుఁడగు నబ్బలీంద్రు నొకపాదమునం దలక్రింద నొత్తి మే**
**లొదవ జగత్త్రయంబుఁ బురుహూతునకియ్య వటుండవైన చి**
**త్పదమలమూర్తి వీవెకద! దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : పదయుగళంబు = రెండుపాదాలను, పాదాలజంటను, భూ = భూమియొక్కయు, గగన = ఆకాశంయొక్కయు, భాగములన్ = ప్రదేశాలందు (ఒకకాలు భూమిలోను ఇంకొక కాలు ఆకాశంలోను) వెసన్ = వేగంగా, శీఘ్రంగా, ఊని = పూన్చి, నిలిపి, విక్రమ = పరాక్రమానికి, ఆస్పదము = స్థానము, అగు = అయిన, ఆబలీంద్రున్ = ఆ

బలిచక్రవర్తిని, ఒక పాదమునన్ = ఒకఅడుగుచేత, క్రిందన్ = క్రిందుగా, అధోముఖంగా, తలన్ = శిరస్సును, ఒత్తి = అదిమి, మేలు = శ్రేయస్సు, మంచి, ఒదవన్ = కలుగగా, పురుహూతునకు = ఇంద్రునికి, జగత్రయంబున్ = స్వర్గమర్త్యపాతాళములనే మూడులోకాలను, ఇయ్యన్ = ఇవ్వడానికి, వటుండవు = వడుగవు, బ్రహ్మచారివి, ఐన, చిత్ = జ్ఞానమును, సత్ = ఉనికియు, అమలమూర్తి, స్వచ్ఛమైన ఆకారము, స్వరూపము, నిర్మలరూపము, కలవాడవు, నీవెకదా = నీవేకాదా.

తా : ఓ దశరథరామా, ఒక పాదము, భూమిమీదను, మరొకపాదము ఆకాశంలోను పెట్టి, రెండుపాదాలచే లోకాన్ని ఆక్రమించి, మహాపరాక్రమశాలియైన బలిచక్రవర్తితలమీద ఒక పాదాన్ని మోపి, పాతాళానికి అణగ ద్రొక్కి మేలు కలిగేవిధంగా, మూడు లోకాలను ఇంద్రునకు ఇచ్చుటకు, వటువుగా మారిన (పుట్టిన) సచ్చిదానందమూర్తివి నీవె కాని, మరెవ్వరు కాదు. (కనుక నన్ను కాపాడుమా).

వ్యా : శ్రీమహావిష్ణువు వామనావతారం వహించి, లోకాలకు శ్రేయస్సు కలిగించి, అక్రమంగాప్రవర్తించిన బలిచక్రవర్తిని అణచి, తనవిశ్వరూపాన్ని ప్రదర్శించిన వృత్తాంతం ఈ పద్యంలో కవి ఉటంకించినాడు.

రాక్షసరాజైన బలిచక్రవర్తి, గొప్పశక్తిని సంపాదించుకొని, స్వర్గంమీద దండయాత్రచేసి, ఇంద్రునిరాజ్యాన్ని, స్వర్గాన్ని ఆక్రమించుకొన్నాడు. దేవతలను, వారిఅధీశుడైన ఇంద్రుని పరాజితులనుచేసి వారిని స్వర్గంనుంచి వెడల నడిపించినాడు. రాజ్యాన్ని, అధికారాన్ని, సర్వవైభవాలను పోగొట్టుకొన్న దేవతలు, విష్ణుమూర్తి సాన్నిధ్యానికి చేరి, తమకు కలిగిన దుర్దశను విన్నవించుకొన్నారు. శ్రీమహావిష్ణువు వారికి అభయమిచ్చినాడు.

(ఒకనాటి మధ్యాహ్నసమయంలో సూర్యచంద్రగ్రహాదితారకలు ఉచ్చస్థితిలో ఉండగా శ్రవణనక్షత్రయుక్త ద్వాదశీతిథినాడు వామనుడుగా విష్ణుమూర్తి అదితికుమారుడుగా జన్మించినాడు.)

అదితి అతన్ని ప్రేమతో పెంచింది. కశ్యపప్రజాపతి సముచితోపనయన కర్మ కలాపాలు చేయించినాడు.

ఇంక లోకోపకారం చేయగోరి ఆ బ్రహ్మచారి బలిచక్రవర్తియింటికి భిక్షాగమనము చేసినాడు. మూడడుగులభూమిని కోరినాడు. భార్యవింధ్యావళితో గూడి ధారాపూర్వకంగా మూడడుగులభూమిని దానం చేసినాడు బలి. దానాన్ని గ్రహించినంతనే వామనుడు విశ్వరూపాన్ని ధరించినాడు. తనరెండు పాదములతో స్వర్గమర్త్యలోకాలను ఆక్రమించినాడు. బలిని పాతాళలోకంలోనికి అణచివేసి, దేవతల రాజ్యాన్ని పునః స్థాపితం చేసినాడు.

శ్రీమహాభాగవతంలోనే కాక, వామనావతార చరిత్రము ఋగ్వేదంలోని విష్ణుసూక్తాలలో అనేకమంత్రాల్లో వర్ణింపబడింది. వామనునికి, ఉరుకాయుడు, ఉరుక్రముడు అనేవిశేషణాలు అక్కడ కనిపిస్తాయి.

**74.చ. ఇరువది యొక్కమారు ధరణీశుల నెల్ల వధించి తత్కళే**
**బరరుధిరప్రవాహమునఁ బైతృకతర్పణమొప్పఁజేసి, భూ**
**సురవరకోటికిన్ ముదము సొప్పడ భార్గవరామమూర్తివై**
**ధరణినొసంగితీవె కద, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : ఇరువది యొక్కమారు = ఇరువది ఒక్కటి సార్లు - పర్యాయములు, ధరణీశులన్ = రాజులను, ఎల్లన్ = అందరిని, వధించి = చంపి, తత్ = వారియొక్క, కళేబర = దేహముల యొక్క, రుధిర = రక్తముయొక్క, నెత్తుటియొక్క, ప్రవాహమున్ = వెల్లువచేత, పైతృకతర్పణము = పితృదేవతలకు మరణానంతరము చేసే జలతర్పణము, ఒప్పన్ = తగినట్లుగా, చేసి, భూసురవర = బ్రాహ్మణశ్రేష్ఠులైన, కోటికి = సమూహానికి, ముదము = సంతోషము, చొప్పడన్ = కలుగునట్లుగా, భార్గవ రామమూర్తివి ఐ = భృగువంశంలో జన్మించినరాముడవై, భార్గవరాముడుగా అవతరించినవాడవై, భూమిని = భూలోకాన్ని, ధరణిని, నీవే దానము చేసినావుకదా.

తా : దశరథరామా, క్షత్రియులై భూమిని పరిపాలిస్తున్న అనేకమంది రాజులను ఇరువది యొక్క పర్యాయములు సంహరించి, వారిశరీరాల్లో ప్రవహించే రక్తంచేత పితరులకు జలతర్పణం చేసి, వారినుండి జయించిన భూమిని బ్రాహ్మణసమూహానికి సంతోషం కలిగేటట్లుగా (కశ్యపునికి) దానం చేసిన పరశురాముడవు నీవే యగుదువు.

వ్యా : లోకంలో తామసం పెరిగినప్పుడు అహంకారం అధికమైనప్పుడు గోబ్రాహ్మణులకు హింస కలిగినప్పుడు శ్రీమన్నారాయణుడవతరించి, ఈ అపకార్యాలను నిర్మూలించడం సహజమే. పరశురామునిరూపంలో శ్రీమహావిష్ణువు అవతరించి, త్రేతాయుగంలో ఇటువంటి పనిచేసినాడు. కవి ఈ పద్యంలో భార్గవరాముని కార్యకలాపాలను ప్రస్తావించి ఉన్నాడు.

పరశురామావతారం త్రేతాయుగంలో జరిగింది. శ్రీరామావతారం కూడా త్రేతాయుగమే. దుష్టులైన శాసకులను వధించి శిష్టుడు, పరమధార్మికునిగా ఆదర్శశాసకునిగా లోకానికి ప్రదర్శనచేయడమే భగవంతుని సంకల్పం కాబోలు. పరశురామునిది ఆవేశావతారంగా పౌరాణికులు వక్కాణిస్తారు.

**75.చ. దురమునఁ దాటకందునిమి ధూర్జటివిల్ దునుమాడి సీతనుం**
**బరిణయమంది తండ్రిపనుపన్ ఘనకాననభూమికేగి, దు**
**స్తరపటుచండకాండకులిశాహతి రావణకుంభకర్ణ భూ**
**ధరములఁ గూల్చితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.**

శ్రీమహాభాగవతంలోనే కాక, వామనావతార చరిత్రము ఋగ్వేదంలోని విష్ణుసూక్తాలలో అనేకమంత్రాల్లో వర్ణింపబడింది. వామనునికి, ఉరుకాయుడు, ఉరుక్రముడు అనేవిశేషణాలు అక్కడ కనిపిస్తాయి.

**74.చ. ఇరువది యొక్కమారు ధరణీశుల నెల్ల వధించి తత్కళే**
**బరరుధిరప్రవాహమునఁ బైతృకతర్పణమొప్పఁజేసి, భూ**
**సురవరకోటికిన్ ముదము సొప్పడ భార్గవరామమూర్తివై**
**ధరణిపొసంగితీవె కద, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : ఇరువది యొక్కమారు = ఇరువది ఒక్కటి సార్లు - పర్యాయములు, ధరణీశులన్ = రాజులను, ఎల్లన్ = అందరిని, వధించి = చంపి, తత్ = వారియొక్క, కళేబర = దేహముల యొక్క, రుధిర = రక్తముయొక్క, నెత్తుటియొక్క, ప్రవాహమున్ = వెల్లువచేత, పైతృకతర్పణము = పితృదేవతలకు మరణానంతరము చేసే జలతర్పణము, ఒప్పన్ = తగినట్లుగా, చేసి, భూసురవర = బ్రాహ్మణశ్రేష్ఠులైన, కోటికి = సమూహానికి, ముదము = సంతోషము, చొప్పడన్ = కలుగునట్లుగా, భార్గవ రామమూర్తివి ఐ = భృగువంశంలో జన్మించినరాముడవై, భార్గవరాముడుగా అవతరించినవాడవై, భూమిని = భూలోకాన్ని, ధరణిని, నీవే దానము చేసినావుకదా.

తా : దశరథరామా, క్షత్రియులై భూమిని పరిపాలిస్తున్న అనేకమంది రాజులను ఇరువది యొక్క పర్యాయములు సంహరించి, వారిశరీరాల్లో ప్రవహించే రక్తంచేత పితరులకు జలతర్పణం చేసి, వారినుండి జయించిన భూమిని బ్రాహ్మణసమూహానికి సంతోషం కలిగేటట్లుగా (కశ్యపునికి) దానం చేసిన పరశురాముడవు నీవే యగుదువు.

వ్యా : లోకంలో తామసం పెరిగినప్పుడు అహంకారం అధికమైనప్పుడు గోబ్రాహ్మణులకు హింస కలిగినప్పుడు శ్రీమన్నారాయణుడవతరించి, ఈ అపకార్యాలను నిర్మూలించడం సహజమే. పరశురామునిరూపంలో శ్రీమహావిష్ణువు అవతరించి, త్రేతాయుగంలో ఇటువంటి పనిచేసినాడు. కవి ఈ పద్యంలో భార్గవరాముని కార్యకలాపాలను ప్రస్తావించి ఉన్నాడు.

పరశురామావతారం త్రేతాయుగంలో జరిగింది. శ్రీరామావతారం కూడా త్రేతాయుగమే. దుష్టులైన శాసకులను వధించి శిష్టుడు, పరమధార్మికునిగా ఆదర్శశాసకునిగా లోకానికి ప్రదర్శనచేయడమే భగవంతుని సంకల్పం కాబోలు. పరశురామునిది ఆవేశావతారంగా పౌరాణికులు వక్కాణిస్తారు.

**75.చ. దురమునఁ దాటకందునిమి ధూర్జటివిల్ దునుమాడి సీతనం**
**బరిణయమంది తండ్రిపనుపన్ ఘనకాననభూమికేగి, దు**
**స్తరపటుచండకాండకులిశాహతి రావణకుంభకర్ణ భూ**
**ధరములఁ గూల్చితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : దురమునన్ = యుద్ధంలో, తాటకన్ = తాటక అనే రాక్షసిని, తునిమి = సంహరించి, చంపి, ధూర్జటివిల్ = శివుని ధనుస్సును, తునుమాడి = విరిచి, సీతనున్ = సీతాదేవిని, జనకుని కుమార్తెను, పరిణయమంది = పెండ్లాడి, తండ్రిపనుపన్ = తండ్రియైన దశరథుడు ఆదేశించగా, ఘన =గొప్పదైన, కానన భూమికి = అరణ్యప్రదేశానికి, ఏగి = వెళ్ళి, దుస్తర = తరింపలేని, గడపరాని, పటుత్వము = గట్టితనము, గల, చండ = భయంకరమైన తీక్షణమైన, కాండ = బాణమనే, కులిశ = వజ్రాయుధముయొక్క ఆహతిన్ = దెబ్బచేత, రావణకుంభకర్ణ = రావణుడు, కుంభకర్ణుడు (అను రాక్షసులను) భూధరములను = కొండలవంటివారిని, కూల్చితి = పడవేసితివి, ఈవె కద = నీవేకదా.

తా : దశరథరామా, యుద్ధంలో తాటకను సంహరించి, శివునివిల్లు విరిచి, సీతను పెండ్లాడి, తండ్రియైన దశరథుడు ఆదేశించగా, భయంకరమైన అడవికి వెళ్ళి, (ఇంద్రుడు) వజ్రాయుధంతో కొండలను కూల్చినట్లు, కఠినమైన వాడి బాణములచేత రావణకుంభకర్ణులనే క్రూరరాక్షసులను కూల్చినవాడవు నీవే కదా!

వ్యా : కవి, అన్ని పద్యాలలో పూర్వదశావతారకథలను సంక్షిప్తంగా వర్ణిస్తూ వచ్చినాడు. ఈ పద్యంలో శ్రీరామావతారంలోని ప్రధానఘట్టాలను పేర్కొన్నాడు. తాటకసంహారం, సీతాదేవివివాహం, దశరథునిఆజ్ఞ - దండకారణ్యప్రయాణం, వాడియైన వజ్రాయుధం వంటిబాణాలతో రావణకుంభకర్ణులనే కొండలను కూల్చడం - ఈ విశేషాలు చెప్పినాడు. మనం చదువుతున్నది దాశరథి - రామ - శతకం కాబట్టి ఈ విశేషాలు అనేక స్థలాల్లో వచ్చినాయి.

**76.చ. అనుపమయాదవాన్వయ సుధాబ్ధిసుధానిధి కృష్ణమూర్తి నీ**
**కనుజుఁడుగా జనించి, కుజనావళినెల్ల నడంచి, రోహిణీ**
**తనయుఁడనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తివై**
**తనరిన వేల్పవీవెగద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : అనుపమ = సాటిలేని, యాదవ+అన్వయ = యదువంశమనే, సుధ+అబ్ధి = పాలసముద్రమునకు, సుధానిధి = చంద్రునివంటివా డగు, (పాలసముద్రాన్ని ఉప్పొంగజేయు చంద్రునివలె యాదవ వంశాన్ని వర్ధిల్లచేయువాడు) కృష్ణమూర్తి = శ్రీకృష్ణుడు, నీకున్, అనుజుడుగాన్ = నీకు తమ్ముడగునట్లుగా, రోహిణీతనయుడు అనంగన్ = రోహిణీదేవి కుమారుడు అని ప్రఖ్యాతితో, జనించి = పుట్టి, బాహుబల = భుజములశక్తి చేతనైన, దర్పమునన్ = గర్వముతో, కుజన + ఆవళిన్ ఎల్లన్ = దుష్టజనుల సమూహాన్ని అంతటిని, అడంచి = అణచివేసి, బలరామ మూర్తివై =

బలరాముడు అనే స్వరూపంతో అవతారమెత్తిన వాడవు అయి, తనరినవేల్పవు = ఒప్పునట్టిదేవుడవు, ఈవె కద = నీవేకదా.

తా : దశరథరామా, యాదవవంశంలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు తమ్ముడుగాను, రోహిణీదేవి గర్భంలో జన్మించి, భుజబలాతిశయంచేత, దుష్టజనసమూహాలను అందరిని రూపుమాపి, బలరాముడనే పేరుతో అవతరించిన దేవుడవు, శ్రీమన్నారాయణుడవు, నీవేకదా.

వ్యా : శ్రీమద్భాగవతంలో, ప్రథమ సూచికలో బలరామకృష్ణులను అవతారపురుషులని పేర్కొనడం జరిగింది. కాని, శ్రీకృష్ణుడు భగవానుడుగా పేర్కొనబడడం చేత, బలరాముణ్ణి తొమ్మిదవ అవతారంగా భావిస్తారు. సాక్షాత్తు శ్రీకృష్ణలీలాసహాయకుడు బలరాముడు అగ్నిపురాణం బలరాముని నవమావతారంగాను, అనంత మూర్తిగాను వర్ణించింది. శ్రీకృష్ణలీలలకు సాక్షాత్తు సాహాయ్యకుడుగా ఉండిన బలరాముడు శ్రీకృష్ణునిఅంశతోనే జన్మించినవాడు. చతుర్భుజత్వము లాంగల ధారిత్వము కలిగి, శంఖము, ముసలము ధరించినట్లుగా వర్ణితమైనాడు. అనిరుద్ధ, ప్రద్యుమ్నసంకర్షణ వాసుదేవమనే చతుర్విధవ్యూహాలతో ఉద్భవించినవాడు శ్రీకృష్ణుడు. ఆవ్యూహంలో సంకర్షణుడే బలరాముడు. శ్రీకృష్ణవాసుదేవ నామాలవలెనే సంకర్షణనామంకూడ లోక విడంబనకు ఉద్దేశించినట్టిదే. దేవకిగర్భాన్ని ఆకర్షించి రోహిణిగర్భంలో నిక్షేపింపగా అవతరించినవాడు కాబట్టి బలరామునికి సంకర్షణుడనే పేరు ఏర్పడింది. అతడు సంకర్షణుడైనాడు.

వసుదేవుడు కశ్యపునిఅవతారము. కశ్యపునిభార్య అదితియే దేవకియై అవతరించింది. కశ్యపునికి మరొక భార్య కద్రువ. ఆమె నాగమాత. ఆమె రోహిణిగా అవతరించింది. దేవకీ గర్భాన్ని సంకర్షించి రోహిణీ గర్భంలో నిక్షేపించడంవల్ల ఆమెకు ఉద్భవించినవాడు సంకర్షణుడైనాడు. అతడే బలరాముడు. కద్రువఅంశతో జన్మించిన రోహిణియందే ఆదిశేషుడు పూర్వంవలెనే అనంతుడుగా, శేషుడుగా, బలరాముడుగా, సర్వేశ్వరుడగు శ్రీకృష్ణునిసోదరుడుగా జన్మించినాడు. శ్రీకృష్ణబలరాములు పరస్పరము అభిన్నులు. బలరాముడు శ్రీకృష్ణునికి అగ్రజుడైనాడు. శ్రీమద్రామాయణంలో శ్రీరామునికి తమ్ముడై లక్ష్మణుడనేపేరు గలవాడే ఆదిశేషుడు.

బలరాముడు తన అవతారాన్ని చాలించేటప్పుడు సముద్రతటానికి చేరి, సహస్రశీర్షాలుగల ఆదిశేషుని స్వరూపంతో మహాసముద్రంలో ప్రవేశించి, అక్కడి నుంచి ఆకాశానికి ఎగసిపోయినాడు.

బలరామావతారానికి సంబంధించిన అనేకానేకవిశేషాలను శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారు సేకరించి తమ శ్రీకృష్ణశతక వ్యాఖ్యానంలో చేర్చినారు.

అలంకారము - రూపకము.

77.చ. సురలు నుతింపగాఁ ద్రిపురసుందరులన్ వరియింప బుద్ధ రూ
పరయఁగఁదాల్చితీవు, త్రిపురాసురకోటి దహించునప్పుడా
హరునకుఁ దోడుగా వరశరాసనబాణముఖోగ్రసాధనో
త్కర మొనరించితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : అరయఁగన్ = విచారించగా, సురలు =దేవతలు, నుతింపఁగాన్ = పొగడగా, స్తుతిచేయగా, త్రిపురసుందరులన్ = మూడునగరములలోని అందమైన స్త్రీలను, వరియింపన్ = వరించుటకై, బుద్ధరూపు = బుద్ధుని స్వరూపమును, ఈవు = నీవు, తాల్చితి = ధరించినావు, త్రిపుర = త్రిపురములలో వసించు, అసురకోటిన్ = రాక్షస సమూహాన్ని, దహించునప్పుడు = కాల్చినప్పుడు, ఆ హరునకు = ఆ మహేశ్వరునకు తోడుగాన్ = సాహాయ్యముగా, వర = శ్రేష్ఠమైన శరాసన = ధనుస్సు, బాణ = అమ్ములు ముఖ = మొదలైన, ఉగ్ర = భయంకర, సాధన = ఆయుధ, ఉత్కరము = సమూహము, ఈవె = నీవే, ఒనర్చితివికదా = చేసినావుకదా.

తా : దేవతలు ప్రార్థించగా, త్రిపురములందలి వనితలను వరించుకొరకు బుద్ధస్వరూపమును దాల్చినవాడవు నీవే. రాక్షససమూహాలను కాల్చునపుడు శివునికి విల్లు, అమ్ములు మొదలైన సాధనములను సవరించి సాహాయ్యము చేసినవాడవు నీవే. ఇట్లు దుష్టులను నిగ్రహించి శిష్టులను రక్షించు నీవు నన్నును రక్షింపుమా.

వ్యా : అగ్నిపురాణంలో బుద్ధమూర్తి వర్ణనమిట్లున్నది.

*శాంతాత్మా లంబకర్ణశ్చ గౌరాంగశ్చాంబరావృతః ।*
*ఊర్ధ్వపద్మస్థితో బుద్ధో వరదాభయదాయకః ॥*

ఈశ్లోకంలో సామాన్యంగా మనం శిల్పరూపంలో దర్శించే బుద్ధునిఅభయముద్ర వర్ణితమైంది. లంబకర్ణత్వం బుద్ధమూర్తిలోనివిశేషం. ఈ బుద్ధమూర్తి అమరావతి, అజంతా గాంధారశిల్పాలను జ్ఞప్తికి తెస్తున్నది.

బుద్ధావతారాన్నిగురించి చారిత్రకవిశేషాలకునూ, పౌరాణికవిషయాలకునూ భేదం కనిపిస్తుంది. చరిత్రలోనిబుద్ధుడు మాయాదేవీ శుద్ధోదన మహారాజుల కుమారుడు. పురాణాల్లోబుద్ధుని తొమ్మిదవ అవతారంగా, విష్ణుమూర్తిస్వరూపంగా వర్ణించడమైంది. అతని తండ్రిపేరు అజినుడు అని తెలియవస్తుంది.

రాక్షసులు క్రమంగా శక్తిని సంపాదించినారు. స్వర్గంలో అధికారాన్ని హస్తగతం చేసికొన్నారు. వారు యజ్ఞపరాయణులై పరిపాలన సుస్థిరం చేసికొన్నారు. అజేయులైనారు. మదమత్తులైనారు. దేశంలో ఉపద్రవాలను కలిగించి అశాంతిని, అసురభావాన్ని ప్రబలచేసినారు.

77.చ. సురలు నుతింపగాఁ ద్రిపురసుందరులన్ వరియింప బుద్ధ రూ
పరయఁగఁదాల్చితీవు, త్రిపురాసురకోటి దహించునప్పుడా
హరునకుఁ దోడుగా వరశరాసనబాణముఖోగ్రసాధనో
త్కర మొనరించితీవె కద, దాశరథీ కరుణాపయోనిధీ.

ప్ర : అరయఁగన్ = విచారించగా, సురలు =దేవతలు, నుతింపఁగాన్ = పొగడగా, స్తుతిచేయగా, త్రిపురసుందరులన్ = మూడునగరములలోని అందమైన స్త్రీలను, వరియింపన్ = వరించుటకై, బుద్ధరూపు = బుద్ధుని స్వరూపమును, ఈవు = నీవు, తాల్చితి = ధరించినావు, త్రిపుర = త్రిపురములలో వసించు, అసురకోటిన్ = రాక్షస సమూహాన్ని, దహించునప్పుడు = కాల్చినప్పుడు, ఆ హరునకు = ఆ మహేశ్వరునకు తోడుగాన్= సాహాయ్యముగా, వర = శ్రేష్ఠమైన శరాసన = ధనుస్సు, బాణ = అమ్ములు ముఖ= మొదలైన, ఉగ్ర = భయంకర, సాధన = ఆయుధ, ఉత్కరము = సమూహము, ఈవె = నీవే, ఒనర్చితివికదా = చేసినావుకదా.

తా : దేవతలు ప్రార్థించగా, త్రిపురములందలి వనితలను వరించుకొరకు బుద్ధస్వరూపమును దాల్చినవాడవు నీవే. రాక్షససమూహాలను కాల్చునపుడు శివునికి విల్లు, అమ్ములు మొదలైన సాధనములను సవరించి సాహాయ్యము చేసినవాడవు నీవే. ఇట్లు దుష్టులను నిగ్రహించి శిష్టులను రక్షించు నీవు నన్నును రక్షింపుమా.

వ్యా : అగ్నిపురాణంలో బుద్ధమూర్తి వర్ణనమిట్లున్నది.

శాంతాత్మా లంబకర్ణశ్చ గౌరాంగశ్చాంబరావృతః ।
ఊర్ధ్వపద్మస్థితో బుద్ధో వరదాభయదాయకః ॥

ఈశ్లోకంలో సామాన్యంగా మనం శిల్పరూపంలో దర్శించే బుద్ధునిఅభయముద్ర వర్ణితమైంది. లంబకర్ణత్వం బుద్ధమూర్తిలోనివిశేషం. ఈ బుద్ధమూర్తి అమరావతి, అజంతా గాంధారశిల్పాలను జ్ఞప్తికి తెస్తున్నది.

బుద్ధావతారాన్నిగురించి చారిత్రకవిశేషాలకునూ, పౌరాణికవిషయాలకునూ భేదం కనిపిస్తుంది. చరిత్రలోనిబుద్ధుడు మాయాదేవీ శుద్ధోదన మహారాజుల కుమారుడు.

పురాణాల్లో బుద్ధుని తొమ్మిదవ అవతారంగా, విష్ణుమూర్తి స్వరూపంగా వర్ణించడమైంది. అతని తండ్రిపేరు అజినుడు అని తెలియవస్తుంది.

రాక్షసులు క్రమంగా శక్తిని సంపాదించినారు. స్వర్గంలో అధికారాన్ని హస్తగతం చేసికొన్నారు. వారు యజ్ఞపరాయణులై పరిపాలన సుస్థిరం చేసికొన్నారు. అజేయులైనారు. మదమత్తులైనారు. దేశంలో ఉపద్రవాలను కలిగించి అశాంతిని, అసురభావాన్ని ప్రబలచేసినారు.

అప్పుడు భగవానుడు బుద్ధుడుగా అవతరించి, దైత్యుల యజ్ఞానుష్ఠానాదులను చూచి వారితో 'మీరు యజ్ఞాలపేరుతో జీవహింస చేస్తున్నారు. జంతుమాంసంతో అగ్నిని అపవిత్రం చేస్తున్నారు.' అని చెప్పి తాను నెమలియాక చీపురుతో నేల చిమ్ముకొంటూ జీవహింసలేక ప్రవర్తించినాడు. ఆ బుద్ధునిబోధనలు, ఆచరణలు విశ్వసించి దైత్యులు యజ్ఞాచరణంలో శాస్త్రవిధానాన్ని విస్మరించినారు. బుద్ధునిఆదేశంతో వారిభార్యలు అస్తవ్యస్తంగా వ్రతాలు చేసినారు. ఈ కారణాలవలన దైత్యులు దైవబలాన్ని కోల్పోయి నిర్వీర్యులైనారు. అపరిశుద్ధములైన దైవకార్యాలు చేసి స్వర్గభ్రష్టులైనారు. త్రిపురములలో ఉండే స్త్రీలు బుద్ధుని వరించి చరితార్థలైనారు.

విష్ణుదేవుడు దేవతలకు స్వర్గమప్పగించదలచి, బుద్ధుడుగా జన్మించి దైత్యులను దుష్కార్యాచరణానికి పురికొల్పి వారిని స్వర్గంనుండి తొలగించినాడు.

మయుడు అనే మహాశిల్పి, రాక్షసులకొరకు ఉక్కు, వెండి, బంగారము లోహములతో మూడు పట్టణాలు నిర్మించి ఇచ్చినాడు. వారాపట్టణాలలో చేరి దేవతలను బాధింపజొచ్చినారు. అప్పుడు దేవతలు మహేశ్వరునిశరణుజొచ్చి తమను కాపాడమని వేడుకొన్నారు. మహేశ్వరుడు త్రిపురాసురులపై దండెత్తి వెడలగా, మయుడు వారికి సిద్ధరసాన్నిచ్చి కాపాడినాడు. తిరిగి వారిని సాధించడానికి శ్రీమన్నారాయణుడు '*నైజంబులైన జ్ఞానవిద్యాతపోవిరక్తిసమృద్ధి క్రియాది శక్తి విశేషంబుల శంభునికిన్ ప్రాధాన్యంబు కల్పించి రథసూతకేతువర్మబాణాసనప్రముఖ సంగ్రామసాధనంబులు*' చేసినాడు. శంభుడు విజృంభించి రాక్షససంహారం గావించి, త్రిపురములను భస్మం చేసి, అమరగరుడగంధర్వ యక్షవల్లభులకు సంతోషం కలిగించినాడు.

**78.ఉ. సంకరదుర్గమై దురితసంకులమైన జగంబుఁ జూచి స**
**ర్వంకషలీల నుత్తమతురంగము నెక్కి కరాసిఁబూని వీ**
**రాంకవిలాసమొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ నిరా**
**తంకమొనర్చితీవె కద! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : సంకర = వర్ణసంకరముచేత, దుర్గమై = ప్రవేశింపరానిదై, దురిత = పాపముచేత, సంకులము = దట్టముగా వ్యాపించినది, ఐన జగంబున్ = అయినట్టి లోకమును, చూచి, సర్వంకష = అన్నిటిని వ్యాపించియున్న, లోకమునందంతటను నిండియున్న, లీలన్ = విలాసముతో, ఉత్తమ తురంగము = మేలయిన అశ్వమును, ఎక్కి = అధిరోహించి, కర+అసిన్ = చేతకత్తిని, పూని = తాల్చి, వీర+అంక+విలాసము = వీరునకు చిహ్నమైన విలాసం, అనగా సత్యపరాక్రమం, ఒప్పన్ = ప్రకాశించుచుండగా,

కలికి+ఆకృతిన్ = కల్కిస్వరూపంతో, కల్కి అవతారంతో, సజ్జనకోటికిన్ = సత్పురుషసమూహానికి, నిరాతంకము = ఆటంకములేమి, కష్టములేమిని, ఈవె = నీవే, ఒనర్చుదువు కదా = చేయబోయెదవుకదా.

తా : దశరథరామా, వర్ణ సాంకర్యము చాలబలీయమై, పాపాలు దట్టంగా వ్యాపించిఉన్న జగమును చూచి అంతట వ్యాపించిన భగవానుని విలాసముతో గొప్పమేలైన అశ్వాన్ని అధిరోహించి, చేత కత్తిబట్టుకొని,వీరునికి తగినట్టి సత్యపరాక్రమమే నీ విలాసము కాగా, కల్కి మూర్తివై సజ్జనులకు మంచిపనులలో ఆటంకము, కష్టము లేకుండునట్లు నిర్వహించేవాడవు నీవేకదా.

వ్యా : కంచెర్లగోపన్న కవి ఈ పద్యంలో కల్కి అవతారాన్ని వర్ణించినాడు. భగవద్గీతలో సంభవామి యుగే యుగే' అని భగవానుడు ఉద్ఘాటించినాడు కాబట్టి కలియుగంలో కలి ప్రబలినప్పుడు కల్కి అవతారంగా శ్రీమన్నారాయణుడు అవతరించవలసిందే. ఈ దుష్కృత్యాలను నిర్మూలించవలసిందే.

పురాణాల్లో కనిపించే దశావతారతత్త్వానికి దుష్టశిక్షణ, శిష్టరక్షణ ప్రధాన సూత్రంగా ఉన్నది.

**79.చ. మనమున నూహపోహలు మర్వక మున్నె, కఫాదిరోగముల్**
**దనువునవంటి మేనిబిగి దప్పక మున్నె, నరుండు మోక్ష సా**
**ధన మొనరింపఁగావలయుఁ, దత్త్వవిచారము మాని యుండుటల్**
**తనువునకున్ విరోధమది, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : మనమునన్ = మనస్సునందు, ఊహపోహలు = ఆలోచించుకొనే శక్తులు మర్వకముందె = మరచిపోక పూర్వమే - అంతరించుటకు పూర్వమే, కఫాదిరోగములు =శ్లేష్మము, తెముడ, మొదలైనవాటిని కూడిన వ్యాధులు, తనువునన్= శరీరమునందు, అంటి = తగులుపడి, వ్యాపించి, కలిగి, మేనిబిగి = దేహముయొక్క పటుత్వము, తప్పకమున్నె = తొలగిపోకపూర్వమే, నరుండు = మనుష్యుడు, మోక్షసాధన = ముక్తిని సాధించే ఉపాయాలు, ఒనరింపగా వలయును = చేసికొనవలెను. తత్త్వ = పరమాత్మ, విచారము = పరిశీలనము, మానియుండుటల్ = వదలియుండుపనులు, తనువునకు = శరీరమునకు, ఇది, విరోధము = విరుద్ధమైనది.

తా : దశరథరామా, మనస్సుకు ఆలోచించుకొనేశక్తి, తలంచుకొనేశక్తి, నశించడానికి పూర్వమే, కఫము (తెముడ) మొదలైన రోగములు దేహంలో వ్యాపించి, దాని శక్తిని హరించడానికి ముందే మనుష్యుడు తత్త్వము అంటే పరమాత్మనుగురించి విచారము

చేసి మోక్షమునకు తగిన ఉపాయములను చేసికొనవలెను. తరువాత ఇటువంటి ప్రయత్నం చేయడం సాధ్యంకాదు. తత్త్వవిచారం చేయకపోవడం ఆత్మస్వరూప ప్రభావాలకు విరుద్ధమైంది.

వ్యా : ఈ పద్యంలో కవి, మానవునిశరీరం అల్పమైందని, క్షణికమైందని, అది ఎప్పుడైనా రోగగ్రస్తం కావచ్చునని, శరీరంలో బలం ఉన్నప్పుడే పరమాత్మనుగురించి విచారించి, మోక్షసాధనానికి మార్గం ఆలోచించుకొనవలెనని, అట్లు చేయక పోవడం మానవజన్మతత్త్వానికి విరుద్ధమని చెబుతున్నాడు. దాశరథీశతకంలో చాల పద్యాలు ఆత్మాశ్రయభావంతో కూడినట్టివే. కాని, ఈ పద్యంలో కవి, సాటి మానవులకు జాగృతి కలిగించడానికి, ఉపదేశపూర్వకమైన వాక్యాలు వ్రాసి తనసామాజిక బాధ్యతను నిర్వహిస్తున్నాడు. మానవుడు భౌతికసౌఖ్యాలకు లోనుగాక ఆధ్యాత్మికచింతన చేసి తరించమనే మానవలోకానికి దీని సందేశం.

**80.చ. ముదమునకాటపట్టు, భవమోహమదద్విరదాంకుశంబు, సం**
**పదలకొటారు, కోరికలపంట, పరంబునకాది, వైరుల**
**న్నదన జయించుత్రోవ, విపదబ్ధికి నావ గదా సదా భవ**
**త్సదమల-నామ-సంస్మరణ దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : భవత్ = నీయొక్క, సత్ = శ్రేష్ఠమును, అమల = నిర్మలమునునైన, నామ = పేరు యొక్క, సంస్మరణ = జ్ఞాపకం చేసుకోవడం, స్మరించడం, ముదమునకు = సంతోషానికి, ఆటపట్టు = క్రీడాస్థానము, స్థానము, స్థలము, భవ = సంసారమునందలి మోహ = అజ్ఞానమనే, ద్విరద = ఏనుగుకు, అంకుశము = నిగ్రహించే సాధనము - మార్గంలో పెట్టే వాడియైన ఒక సాధనము, సంపదలకు = ధనధాన్యాది సంపత్తికి, కొటారు = ఆగారము, నిలువఉంచే చోటు, కొట్టు, కోరికలపంట = కోరికలకు, ఆశలకు సాఫల్యము, పరంబునకు = మోక్షానికి, ముక్తికి, ఆది = ప్రారంభము, వైరులన్ = శత్రువులను, అదనన్ = తగినసమయంలో, జయించు = గెలిచే, త్రోవ = దారి, విపత్ = కష్టముల, అబ్ధికి = సముద్రానికి, నావ = ఓడ, కదా = అవును కదా.

తా : దశరథరామా, నిర్మలమైన నీ నామాన్ని స్మరించడం సంతోషాన్ని కలిగిస్తుంది. అంకుశము అనే సాధనము, ఏన్గును అణచినట్లుగా, జన్మంలో కలిగే వ్యామోహాన్ని అణచివేస్తుంది. అన్ని సంపదలను (ధనధాన్యాదులను) సమకూరుస్తుంది. అన్ని కోరికలను తీరుస్తుంది. మోక్షమును కలిగిస్తుంది. పగవారిని గెలువడానికి సాధనము. సముద్రాన్ని దాటించు ఓడవలె కష్టాలను దాటిస్తుంది.

వ్యా : భక్తిమార్గంచేత లౌకిక మైనట్టియు పారలౌకికమైనట్టియు మనుజుని సమస్యలన్నీ తీరిపోవును అని కవి ప్రతిపాదించినాడీ పద్యంలో. శ్రీరాముని భర్తగా నమ్మి, దైవంగా భావించి సేవించిన మహాసాధ్వి సీతా దేవి, రావణుడు ఆమెను అపహరించిన క్షణంనుంచి రామనామస్మరణ చేస్తూనే ఉన్నది. ఆ నామమహాత్మ్యకారణంగానే హనుమంతునికి ఆమె కనిపించడం, వానరసైన్యం లంకానగరంపై దండెత్తడం, రావణసంహారం, సీతాదేవివిముక్తి జరిగినాయి. ఇదంతా రామనామస్మరణమహిమగానే భావించవలసి ఉన్నది.

కిరాతకుడుగా ఉండి, దారిదోపిడి చేసేవాడు వాల్మీకి. అతడు మహర్షుల ఉపదేశంతో శ్రీరామనామాన్ని జపించి, మహర్షి అయినాడు. మహాకవి అయినాడు. శ్రీమద్రామాయణ రచయిత అయినాడు. శ్రీరామనామస్మరణకు ఇంతకంటె ఉత్తమ ఉదాహరణ ఉండదు. స్వయంగా కంచెర్ల గోపన్నగారు, చెరసాలలో ఉండి, నిరంతరం శ్రీరామనామస్మరణచేసి, అనేక సంకీర్తనలు శ్రీరామునిపై రచించి, ఆపదలనుండి గట్టెక్కిన ఉదంతం చారిత్రకమే కదా.

ఇటువంటి భావమే కులశేఖరాళ్వారుల ముకుందమాలలో కనిపిస్తున్నది.

> శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రమ్
> సంసారోత్తారమంత్రం సముపచితతమస్సంఘనిర్యాణమంత్రమ్
> సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రమ్
> జిహ్వే, శ్రీకృష్ణమంత్రమ్, జప జప సతతం జన్మసాఫల్యమంత్రమ్॥

ఈ పద్యంలో రూపకాలంకారం ప్రయుక్తమైంది.

**81.చ. దురితలతానుసారి భవదుఃఖకదంబము రామనామభీ**
**కరతరహేతిచేఁ దెగి వకావకలై చనకుండనేర్చునే**
**దరికొని మండుచుండు శిఖి దార్కొనినన్ శలభాదికీటకో**
**త్కరము విలీనమై చనదె? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : దురిత = పాపమనెడు, లత = తీగను, అనుసారి = అనుసరిస్తున్న, భవ = జన్మములందలి, దుఃఖకదంబము = దుఃఖములసమూహము, రామనామ = రామనామము అనెడు, భీకరతర = భయంకరమైన, హేతిచేన్ = ఖడ్గముచేత, తెగి = ఖండితమై, వకావకలై = భిన్నభిన్నమై, ముక్కలుముక్కలై, చనకుండనేర్చునే = పోవకుండ ఉండునా? (ఉండదని భావము), దరికొని = తగులుకొని, అంటుకొని, మండుచుండు = ప్రజ్వలించుచున్న, శిఖిన్ = అగ్నిని, దార్కొనినన్ = కదియగ, దగ్గరగా రాగా, శలభ

వ్యా: భక్తిమార్గంచేత లౌకికమైనట్టియు పారలౌకికమైనట్టియు మనుజుని సమస్యలన్నీ తీరిపోవును అని కవి ప్రతిపాదించినాడీ పద్యంలో. శ్రీరాముని భర్తగా నమ్మి, దైవంగా భావించి సేవించిన మహాసాధ్వి సీతా దేవి, రావణుడు ఆమెను అపహరించిన క్షణంనుంచి రామనామస్మరణ చేస్తూనే ఉన్నది. ఆ నామమాహాత్మ్యకారణంగానే హనుమంతునికి ఆమె కనిపించడం, వానరసైన్యం లంకానగరంపై దండెత్తడం, రావణసంహారం, సీతాదేవివిముక్తి జరిగినాయి. ఇదంతా రామనామస్మరణమహిమగానే భావించవలసి ఉన్నది.

కిరాతకుడుగా ఉండి, దారిదోపిడి చేసేవాడు వాల్మీకి. అతడు మహర్షుల ఉపదేశంతో శ్రీరామనామాన్ని జపించి, మహర్షి అయినాడు. మహాకవి అయినాడు. శ్రీమద్రామాయణ రచయిత అయినాడు. శ్రీరామనామస్మరణకు ఇంతకంటె ఉత్తమ ఉదాహరణ ఉండదు. స్వయంగా కంచెర్ల గోపన్నగారు, చెరసాలలో ఉండి, నిరంతరం శ్రీరామనామస్మరణచేసి, అనేక సంకీర్తనలు శ్రీరామునిపై రచించి, ఆపదలనుండి గట్టెక్కిన ఉదంతం చారిత్రకమే కదా.

ఇటువంటి భావమే కులశేఖరాళ్వారుల ముకుందమాలలో కనిపిస్తున్నది.

శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రమ్
సంసారోత్తారమంత్రం సముపచితతమస్సంఘనిర్వాణమంత్రమ్
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రమ్
జిహ్వే, శ్రీకృష్ణమంత్రమ్, జప జప సతతం జన్మసాఫల్యమంత్రమ్॥

ఈ పద్యంలో రూపకాలంకారం ప్రయుక్తమైంది.

**81.చ. దురితలతానుసారి భవదుఃఖకదంబము రామనామభీ**
**కరతరహేతిచే, దెగి వకావకలై చనకుండనేర్చునే**
**దరికొని మండుచుండు శిఖి దార్కొనినన్ శలభాదికీటకో**
**త్కరము విలీనమై చనదె? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర: దురిత = పాపమనెడు, లత = తీగను, అనుసారి = అనుసరిస్తున్న, భవ = జన్మములందలి, దుఃఖకదంబము = దుఃఖములసమూహము, రామనామ = రామనామము అనెడు, భీకరతర = భయంకరమైన, హేతిచేన్ = ఖడ్గముచేత, తెగి = ఖండితమై, వకావకలై = భిన్నభిన్నమై, ముక్కలుముక్కలై, చనకుండనేర్చునే = పోవకుండ ఉండునా? (ఉండదని భావము), దరికొని = తగులుకొని, అంటుకొని, మండుచుండు = ప్రజ్వలించుచున్న, శిఖిన్ = అగ్నిని, దార్కొనినన్ = కదియగ, దగ్గరగా రాగా, శలభ

= మిడుతలు, ఆది = మొదలైన, కీటక =పురుగుల, ఉత్కరము = సమూహము విలీనమై = అడగిపోయినదై, కరిగిపోయినదై, చనదె = పోదా, నశించిపోవునని భావము.

తా : దశరథరామా, పాపము తీగలవలె అనుసరించిరాగా, దానితోగూడ సాగుదుఃఖాత్మకమైన జన్మపరంపర, వాడియైన ఖడ్గముచేత తీగముక్కలైనట్లు రామనామముచేత నశించి పటాపంచలవుతుంది. అంటుకొని మండుచున్న అగ్నికి దగ్గరగా వచ్చిన మిడుతలు మొదలైన పురుగుల సమూహము ఆ అగ్నిలోబడి నశించదా? నశించునని భావము.

వ్యా : ఈ పద్యంలో రెండు అలంకారములున్నాయి. మొదటిది రూపకము. రెండవది దృష్టాంతాలంకారము.

**82.చ. హరిపదభక్తి నింద్రియజయాన్వితుఁడుత్తముఁ డింద్రియమ్ములన్**
**మరుగక నిల్పనూదినను మధ్యముఁడింద్రియపారవశ్యుఁడై**
**పరగినచో నికృష్టుఁడని పల్కఁగ, దుర్మతినైన నన్ను నా**
**దరమున నెట్లు కాచెదవొ? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : హరిపదభక్తిన్ = విష్ణుమూర్తియొక్క పాదములందలి భక్తిచేత, ఇంద్రియ = అవయవములను, జ్ఞానకర్మేంద్రియాలను, జయ = గెలుపుతో, అన్వితుఁడు = కూడిన వాడు, ఉత్తముఁడు = శ్రేష్ఠుడు, ఇంద్రియమ్ములన్ = అవయవములు, కోర్కెలు అను వాటిలో, మరుగక = వశముకాక, లీనముకాక, (ఇంద్రియములు పోయిన దారి పోక), నిల్పన్= స్థిరంగా ఉంచుటకు, నిగ్రహించుటకు, ఊఁదినన్ = పట్టినను, ప్రయత్నించినన్ మధ్యముఁడు = నడుమరకమువాడు, ఇంద్రియ పారవశ్యుఁడై = అవయవసౌఖ్యాలకు లోనైనవాడై, పరగినచోన్ = ప్రవర్తించినట్లైతే, నికృష్టుఁడు = అధముడు, అల్పుడు, అని పల్కన్= అని చెప్పగా, దుర్మతిని= దుష్టబుద్ధిని అయిన నన్ను, ఆదరమునన్ = ప్రేమతో ఎట్లు కాచెదవొ = ఏవిధంగా రక్షిస్తావో.

తా : దశరథరామా, విష్ణుభక్తితో ఇంద్రియములను, కోరికలను, ఆశలను గెలిచిన వాడు ఉత్తముడు. ఇంద్రియములకు లోనుగాక నిలిచి ప్రయత్నించి నిగ్రహించువాడు మధ్యముడు. ఇంద్రియములకు అధీనమైనవాడు అధముడు. ఈ ముగ్గురిలో దుష్టబుద్ధినైన నేను అధముడను. అట్టి నన్ను ఆదరంతో ఏ విధంగా రక్షిస్తావో.

వ్యా : విష్ణుభక్తి ప్రాశస్త్యాన్ని గురించి కంచెర్ల గోపన్నగారు ఈ పద్యంలో ప్రస్తావించినారు. మానవుడు, లోకంలో ఆశలకు, అవయవబలహీనతలకు లోనుగావడం సహజం. అట్లా జరిగినప్పుడు, తనకును, తోడి మానవులకును హాని కలుగకపోదు. అందుచేత

ఏకాదశేంద్రియాలను జయించడమే మానవుడు పరమార్థంగా భావించవలె. దానికి 'హరిపదభక్తి' మంచి సాధనం. ఈ సాధనంవలన మనస్సును బంధించి, కోరికలను జయించి, భక్తిమార్గాన్ని అవలంబించి పూర్వం ప్రహ్లాదనారదాదివిష్ణుభక్తులు తరించినారు. ఈ విష్ణుభక్తులు, ఇంద్రియాలను జయించినవారు మానవులలో ఉత్తమోత్తములు. మొదటి తరగతికి చెందినవారు. ఆశలను, కోరికలను చూచి వాటికి వశముకాక, వాటిని బంధించి ప్రవర్తించినవాడు మధ్యముడు. అంటే రెండవ రకములో చేరినవాడు అని చెప్పినాడు కవి. ఇతనికి హరిభక్తి లేదు కాబట్టి మధ్యముడైనాడు. ఇంక, మానవసహజముగా ఆశలకు, కోరికలకు లోనైన వాడు అధముడు. మూడవతరగతికి చెందినవాడు. కవి తనను తాను ఈ తరగతిలో చేర్చుకొని తనను కాపాడుమని భగవంతుని ప్రార్థిస్తున్నాడు. కవి తన్ను 'దుర్మతిగా' భావించినాడు. అంతమాత్రంచేత ఈ కవి దుష్టుడు నీతిమాలినవాడు అని భావించే అవసరం లేదు. వైష్ణవులు తమ్ము తాము ఎల్లప్పుడు సర్వాపరాధులుగా భావించుకొనడం సంప్రదాయం. దీనిని నైచ్యానుసంధానం అని వ్యవహరిస్తారు.

**83.చ. వనకరి చిక్కె మైనసకు, వాచవికిం జెడిపోయె మీను, తా**
**వినికికిఁ జిక్కెఁ జిల్వ కనువేదురుఁ జెందెను లేళ్లు, తావిలో**
**మనికి నశించెఁదేటి, తరమా యిరుమూటిని గెల్వ నైదుసా**
**ధనముల నీవె కావఁదగు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : వనకరి = అడవి యేనుగు, మైనసకున్ = శరీరమునందలి చాపల్యమునకు, దురదకు, (ఏనుగును పట్టుకొన్నవాండ్రు) ఆకర్షించుటకై విడు ఆడ ఏనుగు దేహమును చూచి కామించుట అనుట, చిక్కె = పట్టుబడెను. మీను = చేప, వాచవికిన్ = నోటిరుచికి (గాలములోని ఎరరుచికి), చెడిపోయెన్ = తగులబడెను, భ్రష్టమయ్యెను చిల్వ = సర్పము, పాము, తాన్ = తాను, వినికికి = శ్రుతికి, వినుట అనే గుణమునకు (పాములవాడు ఊదేస్వరమునకు), చిక్కె = చిక్కుపడె - బంధింపబడెను. లేళ్ళు = ఆడు జింకలు, హరిణములు, కనువేదురున్ = దృష్టిచేత పిచ్చిని, చెందెను = పొందెను. (ఎండమావినీరని పరుగిడి నశించినవి, చక్షురింద్రియానికి లోనైనవి) తేటి = తుమ్మెద, తావిలో = పరిమళములో, వాసనలో, మనికిన్ = జీవించుటచేత, నశించెన్ = నిర్మూలనమయ్యెను. (ఘ్రాణేంద్రియమునకు లోనై పూదేనెవాసనకై తామరపూవులో ప్రవేశించి, అది ముడుచుకొనగా, లోపల చిక్కుకొనెనుట) ఇరుమూడింటిని = ఐదింటిని, పంచేంద్రియాలను, గెల్వన్ = జయించుట, తరమా = సాధ్యమా, శక్యమా, ఐదుసాధనముల = పంచవిధములైన ఉపాయములచేత, నీవె కావఁదగు = నీవే రక్షించవలెను.

తా : దశరథరామా, అడవిలో స్వేచ్ఛగా తిరిగే ఏనుగు, ఆడు ఏనుగును చూచి వ్యామోహమును పొంది బందీ అగును. చేప, గాలములోని ఎరయొక్క రుచి మరిగి దానికి వశమగును. సర్పము, పాములవాడు ఊదెడు స్వరమును విని పరవశించి చిక్కిపోవును. హరిణము, కనుపిచ్చిచేత నశించిపోవును. తుమ్మెద పరిమళమునకు ఆకర్షితమై తామర పుష్పాల్లో చిక్కిపోవును. ఈ అయిదు ఇంద్రియాలను గెలుచుట ఎవరికి సాధ్యము? నేను ఇంద్రియలోలుడను కాబట్టి మోక్షమును పొందుట కష్టము. కాబట్టి పంచేంద్రియమ్ముల నిన్ను గొల్చు పంచవిధకైంకర్యములచేత ఇంద్రియముల నడచి నన్ను కాపాడుమా.

వ్యా : జ్ఞానేంద్రియములను ఐదు సంఖ్యగా పేర్కొనియున్నారు. త్వక్కుకు (చర్మము) స్పర్శ, చక్షువు (కన్ను)కు రూపము, రసన (నాలుక)కు రుచి, శ్రోత్రమునకు (చెవికి) శబ్దము, ఘ్రాణము (ముక్కు) నకు గంధము విషయములు ఈ పంచేంద్రియములు. వీటివల్ల జీవులపతనానికి కారణమవుతున్నవి. అడవిలో స్వేచ్ఛగా తిరిగే ఏనుగు ఆడు ఏనుగుస్పర్శచేత, వేటగానికి బందీయై తనస్వేచ్ఛను కోలుపోతున్నది. నీటిలో యథేచ్ఛగా తిరిగేచేప, గాలములోనిఎఱ్ఱకు ఉండే రుచిని చూచి భ్రమించి, దానికి చిక్కుతున్నది. సర్పము పుట్టలో ఉండినప్పుడు తనచక్షురింద్రియంవలన, పాములవాని గానానికి ఆకర్షింపబడి వాని సంచిలో పడిపోతున్నది. ఇక హరిణములు తమబ్రదుకును తమసుందరమైన కనులవలనను వాటిలో ఉండే చూపులవలనను కోల్పోతున్నాయి. అదేమంటే, వేటగాండ్రు కనులు మిరుమిట్లు గొలిపే దివిటీలతో అడవిలో ప్రవేశిస్తారు. మంచి చూపుకలిగిన జింకలు ఆ వెలుగుకు ఆకర్షితమై, పరిసరాలను చూడలేక, ఆ దివిటీలను సమీపిస్తాయి. ఇంక వాటిని తాళ్లతో బంధించికాని, కొట్టికాని వేటగాండ్రు వశంచేసికొంటారు. ఆవిధంగా వాటికి ఉండే చక్షురింద్రియశక్తియే వాటినాశనానికి కారణమవుతున్నది. (లేళ్ళు కనువేదురు చెందటానికి సంప్రదాయజ్ఞులు మరొకరీతిని చెపుతారు. వేసవిలో అడవిలో నిర్జల ప్రదేశంలో దప్పికలిగినపుడు లేడి ఎండమావిచూచి నీటిప్రవాహమనుకొని చేరి త్రాగుదామని అటువైపు పరుగుపెడుతుంది. అది దానిని చేరటమూ దప్పితీరటమూ ఉండదు. కనుక, దప్పి తీరకపోగా కనుచూపు చెదరిన కారణంవల్ల పరుగుపెట్టి పరుగుపెట్టి, దాహబాధకు ఆయాసం తోడై మరణిస్తుంది. కనుకనే ఎండమావికి మృగతృష్ణ అని పేరు. తవిలి మృగతృష్ణలోనీరు త్రావవచ్చు అని భర్తృహరి అన్నాడు.) తుమ్మెదకు ఘ్రాణము అనే శక్తి అధికము. పరిమళము కలిగిన పూవులెక్కడ ఉంటే తుమ్మెదలు వాటిమీద పరిభ్రమించడం ప్రకృతిలో మనం చూడవచ్చు. కాని ఈ ఘ్రాణశక్తియే వాటికి ప్రమాదకరంగా పరిణమిస్తుంది. సూర్యునివెలుగు ఉన్నప్పుడు పద్మాలు సరస్సులో విచ్చుకొని ఉండి పరిమళాలను వెదజల్లుతాయి. ఆ

సువాసనలకు ఆకర్షితమైన తేంట్లు వాటిమీద కూర్చుని వాటిలోనితేనెలను, పరిమళాలను అనుభవించి పారవశ్యం చెందుతాయి. సాయంత్రం అయినప్పుడు సూర్యుడు అస్తమిస్తాడు. కమలబాంధవుడైన సూర్యుడస్తమించగానే, కమలాలు ముడుచుకొని పోతాయి. ఇది ప్రకృతిసహజం. ఇక వాటిపై వాలి ఉన్న తుమ్మెదలు ఆ పద్మాల్లోనే బంధించుకొని పోతాయి. మరునాడు అవి బ్రతికిఉండడం చాల సందర్భాల్లో సంభవించదు. ఆ విధంగా తుమ్మెదలకు ఉండే ఘ్రాణశక్తి వాటి నాశనానికే దారి తీస్తుంది.

త్వక్కు, చక్షువు, రసన, శ్రోత్రము, ఘ్రాణము అనే జ్ఞానేంద్రియశక్తులు సహజంగా, ఇతరజీవులవలెనే, మానవునికి కూడ సంక్రమించినాయి. జంతువులు ఆ శక్తులకు లోనై, ఏవిధంగా పతనమవుతున్నాయో, మనుష్యుడుకూడ ఈ ఇంద్రియ శక్తులకు వశమై ప్రమాదానికి లోనవుతూ ఉండడం సంభవమే. నైసర్గికంగా ఏర్పడిన ఈ శక్తులను జయించడం సామాన్యంగా మానవునికి సాధ్యం కాదు. ఇదేమాటను కవి 'తరమా యిరుమూటిని గెల్వ' అని చెప్పి తన అశక్తతను వెల్లడించినాడు. వాటిని గెల్వడం సాధ్యమెట్లా అవుతుంది. అని ప్రశ్నిస్తే వీటిని గెల్వడానికి ఐదు సాధనాలున్నాయట. అవి రానున్న 84 వ పద్యంలో చెప్పబోతున్నాడు.

ఈ పద్యంలో ఏనుగు, చేప, సర్పం, లేడి, తుమ్మెద అనే అల్పజంతువులను కవి పేర్కొన్నాడు. అవి తమ ఇంద్రియశక్తులవల్లనే నశించి పోవడాన్ని వర్ణించి చెప్పినాడు. మానవుడు లోకంలో తిర్యక్కులకంటె ఉన్నతుడైనవాడు అని భావించడమున్నది. కాని పైన చెప్పిన అల్పజీవులు ఇంద్రియాలకు ఏ విధంగా బలి అయి పోతున్నవో అలాగే మనుష్యుడుకూడ వాటికి బంధింపబడుతున్నాడు. అంటే, మనుష్యునిలో ఏమి ఉత్కృష్టత లేదన్నమాట. ఈ విషయంలో, జంతువులు మనుష్యులు ఒకటే అని ధ్వనింపచేసినాడు కవి. మనుష్యునికి జ్ఞానం ఉన్నది కాబట్టి దైవాన్ని ఆశ్రయించి, ఐదు సాధనాలను అవలంబించి ఈ ప్రమాదాలనుండి తప్పించుకొనే ప్రయత్నం చేయవచ్చు అని కవిసూచన.

**84.చ. కరములు మీకు మ్రొక్కులిడఁ గన్నులు మిమ్మునె జూడ, జిహ్వ మీ**

**స్మరణదలిర్ప, వీనులు భవత్కథలన్ వినుచుండ, నాస మీ**

**యరుతమ బెట్టు పూవరులకానగొనం, బరమార్థసాధనో**

**త్కరమిది చేయవే కృపను, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : కరములు = చేతులు, మీకు, మ్రొక్కులిడన్ = దండములు పెట్టునట్లుగాను, కన్నులు = చక్షువులు, మిమ్మునే, చూడన్ = వీక్షించునట్లుగాను, జిహ్వ = నాలుక, మీస్మరణన్ = మిమ్ముజ్ఞప్తికి తెచ్చుకొనుటచేత, తలిర్పన్ = ఒప్పునట్లుగాను, వీనులు =

సువాసనలకు ఆకర్షితమైన తేంట్లు వాటిమీద కూర్చుని వాటిలోనితేనెలను, పరిమళాలను అనుభవించి పారవశ్యం చెందుతాయి. సాయంత్రం అయినప్పుడు సూర్యుడు అస్తమిస్తాడు. కమలబాంధవుడైన సూర్యుడస్తమించగానే, కమలాలు ముడుచుకొని పోతాయి. ఇది ప్రకృతిసహజం. ఇక వాటిపై వాలి ఉన్న తుమ్మెదలు ఆ పద్మాల్లోనే బంధించుకొని పోతాయి. మరునాడు అవి బ్రతికిఉండడం చాల సందర్భాల్లో సంభవించదు. ఆ విధంగా తుమ్మెదలకు ఉండే ఘ్రాణశక్తి వాటి నాశనానికే దారి తీస్తుంది.

త్వక్కు, చక్షువు, రసన, శ్రోత్రము, ఘ్రాణము అనే జ్ఞానేంద్రియశక్తులు సహజంగా, ఇతరజీవులవలెనే, మానవునికి కూడ సంక్రమించినాయి. జంతువులు ఆ శక్తులకు లోనై, ఏవిధంగా పతనమవుతున్నాయో, మనుష్యుడుకూడ ఈ ఇంద్రియ శక్తులకు వశమై ప్రమాదానికి లోనవుతూ ఉండడం సంభవమే. నైసర్గికంగా ఏర్పడిన ఈ శక్తులను జయించడం సామాన్యంగా మానవునికి సాధ్యం కాదు. ఇదేమాటను కవి 'తరమా యిరుమూటిని గెల్వ' అని చెప్పి తన అశక్తతను వెల్లడించినాడు. వాటిని గెల్వడం సాధ్యమెట్లా అవుతుంది. అని ప్రశ్నిస్తే వీటిని గెల్వడానికి ఐదు సాధనాలున్నాయట. అవి రానున్న 84 వ పద్యంలో చెప్పబోతున్నాడు.

ఈ పద్యంలో ఏనుగు, చేప, సర్పం, లేడి, తుమ్మెద అనే అల్పజంతువులను కవి పేర్కొన్నాడు. అవి తమ ఇంద్రియశక్తులవల్లనే నశించి పోవడాన్ని వర్ణించి చెప్పినాడు. మానవుడు లోకంలో తిర్యక్కులకంటె ఉన్నతుడైనవాడు అని భావించడమున్నది. కాని పైన చెప్పిన అల్పజీవులు ఇంద్రియాలకు ఏ విధంగా బలి అయి పోతున్నవో అలాగే మనుష్యుడుకూడ వాటికి బంధింపబడుతున్నాడు. అంటే, మనుష్యునిలో ఏమి ఉత్కృష్టత లేదన్నమాట. ఈ విషయంలో, జంతువులు మనుష్యులు ఒకటే అవి ధ్వనింపచేసినాడు కవి. మనుష్యునికి జ్ఞానం ఉన్నది కాబట్టి దైవాన్ని ఆశ్రయించి, ఐదు సాధనాలను అవలంబించి ఈ ప్రమాదాలనుండి తప్పించుకొనే ప్రయత్నం చేయవచ్చు అని కవిసూచన.

**84.చ. కరములు మీకు మ్రొక్కులిడ( గన్నులు మిమ్మునె జూడ, జిహ్వ మీ**
**స్మరణదలిర్ప, వీనులు భవత్కథలన్ వినుచుండ, నాస మీ**
**యరుతను బెట్టు పూసరులకాసగొనం, బరమార్థసాధనో**
**త్కరమిది చేయవే కృపను, దాశరథీ, కరుణాపయోనిధీ.**

ప్ర : కరములు = చేతులు, మీకు, మ్రొక్కులిడన్ = దండములు పెట్టునట్లుగాను, కన్నులు = చక్షువులు, మిమ్మునే, చూడన్ = వీక్షించునట్లుగాను, జిహ్వ = నాలుక, మీస్మరణన్ = మిమ్ముజ్ఞప్తికి తెచ్చుకొనుటచేత, తలిర్పన్ = ఒప్పునట్లుగాను, వీనులు =

చెవులు, భవత్ కథలు = మీకథలను, చరిత్రలను, వినుచుండన్ = ఆలకించుచుండునట్లుగాను, నాస = ముక్కు, నాసిక, మీయురుతను = మీ కంఠమునందు, పెట్టుపూసరులకున్ = పెట్టినట్టి పూదండల కోసము, ఆసగొనన్ = ఆశపడునట్లుగాను, కృపను = దయతో, చేయవే = చేయుము. (అట్లు చేసినచో) ఇది = ఈ పంచేంద్రియ సమూహము, పరమార్థసాధన = పురుషార్థములలో ఉత్తమమైన మోక్ష పురుషార్థమును సాధించెడి ఉపాయముల యొక్క, ఉత్కరము = సమూహము (కాగలదు.)

తా : కరుణా సముద్రుడవైన ఓ దశరథరామా, నీవుదయతో నాకు గలచేతులు మీకు నమస్కరించేటట్లు చేయవలసినది. కన్నులు మిమ్ములను దర్శించేటట్లు చెయ్యి. నాలుక మీనామస్మరణచేసేటట్లు కావించు. చెవులు మీ సత్కథలను వినేటట్లు కావించు. ముక్కు మీ మెడలో వేసిన పూదండలకు ఆశపడేటట్లు చెయ్యి. ఈ అవయవముల పరమార్థము ఈ పనులు చేయడానికే గాని మరొకటి చేయడానికి కాదు. అలా చేస్తే ఈ పంచేంద్రియాలూ పతనకారణాలు కావటము మాని, పరమపురుషార్థమైన మోక్షాన్ని సాధించటానికి సాధనాలవుతాయి. నాకు చేతులచేత, కన్నులచేత, నాలుకవలన, చెవులవలన ముక్కుచేత మీకు సేవ చేయడానికి అనుగ్రహము కలిగించుమా.

వ్యా : జ్ఞానేంద్రియ పంచకము అనగా త్వక్కు, చర్మము, చక్షువు, రసన, శ్రోత్రము, ఘ్రాణము అనేవి. వీటివలన గ్రహింపబడే విషయాలివి : స్పర్శ, రూపము, రుచి, శబ్దము, సుగంధము.

మానవునికి ఈ అవయవములు (ఇంద్రియములు) సహజంగా లభించినాయి. వాటిని అతడు ప్రాపంచిక విషయాలను అనగా సౌఖ్యాలను అనుభవించడానికే ప్రతినిత్యం ఉపయోగిస్తున్నాడు కాని, వాటిని భగవంతుడు మనకు ప్రసాదించినాడు, వాటిని అతనిసేవకు ఉపయోగించి వాటిని సార్థకంచేయవలెననే జ్ఞానం కలిగినవాడుకాదు. మనుష్యుడు తన చేతులతో అనేకమైన పనులాచరించి, తన ఉదరపోషణకై వస్తువులను సంపాదిస్తున్నాడు. అతనికి ఉండే కన్నులతో, సుందరమైన వ్యక్తులను, తన భార్యాపుత్రులను చూచి తన్మయుడవుతున్నాడు. నాలుకచేత, ధనవంతులను యజమానులను భజనచేసి వారి అనుగ్రహమును, తద్వారా ధనధన్యాలను సంపాదిస్తున్నాడు. ఘ్రాణగుణంకలిగిన నాసిక, ఉద్యానవనాల్లో ఉండే పూవులను వాసన చూడడంలోను, ప్రేయసీ ధమ్మిల్లంలోని పుష్పాలను ఆఘ్రాణించడంలోను పారవశ్యం పొందుతుంది. కాని, మానవునికి పరమార్థం ఇది కాదు. ఈ పంచేంద్రియాలను, వాటికి సంబంధించిన గుణాలను మానవుని సృష్టించిన పరమాత్మను సేవించడానికి ఉపయోగించడమే వీటిపరమార్థంగా భావించవలె. పరమార్థం అంటే ప్రధానమైన ప్రయోజనం అని ఒక భావం. పరమ ప్రధానమైన అర్థము

= ప్రయోజనము అని. పరమము అంటే భగవంతుడు, అర్థము అంటే ప్రయోజనము, భగవంతునికి సంబంధించిన ప్రయోజనం అని భావించవలె. ముఖ్యమైన అర్థం, అనగా భగవంతుని ప్రయోజనమన్నా ఒక్కటే. మన పంచేంద్రియాలను, లౌకిక సౌఖ్యాలకై ఉపయోగించక,పరమాత్మసేవయే పరమార్థంగా భావించి ఉపయోగించవలెనని ఈ భక్తకవి భగవంతుని ప్రార్థిస్తున్నాడు. అలాచేస్తే ఆ పంచేంద్రియాలు మోక్ష సాధనములవుతాయని వివరిస్తున్నాడు. ఈ పరమార్థం సమకూడడంకూడ సామాన్యంగా సంభవించదు. అది అతని కృపచేయుట చేతనే అని కూడ కవి వక్కాణించినాడు.

(83, 84వ పద్యాలలో గోపన్నగారు ప్రతిపాదించిన అంశం క్రింది విధంగా క్రోడీకరించవచ్చు. ప్రతిప్రాణికీ ఐదు జ్ఞానేంద్రియాలు త్వక్కు మొదలయినవి ఉన్నాయి. ప్రతి ఇంద్రియానికీ శబ్దం మొదలయినవి విషయాలు. ఇంద్రియం విషయాసక్తం కావటం సహజం. ఒక్కొక్క రకమైన ప్రాణి తన ఒక ఇంద్రియం ఒక విషయంపై ఆసక్తమైనంత మాత్రానికే నశించిపోతున్నది. ఐదింద్రియాలూ ఐదు విషయాలపై ఆసక్తములు కావటం మానవుని విశేషం. సహజ ప్రవృత్తికల ఇంద్రియాలను గెలవటం జరిగే పనికాదు. చేయవలసిన పని విషయాలను మార్చటం. ఆ శబ్దాదులు పరమాత్మకు సంబంధించిన వయితే నాశనకారణములయిన ఇంద్రియాలే పరమార్థ సాధనకు ఉపయోగించేవి అవుతాయి. అది జరగాలన్నా దైవకృప అవసరం. కనుక అలా చేయమని ప్రార్థిస్తున్నాడు.)

**85.చ. చిరతరభక్తినొక్క తులసీదళమర్పణసేయువాఁడు ఖే**
**చరగరుడోరగప్రముఖసంఘములో వెలుఁగన్ సదా భవత్**
**స్ఫురదరవిందపాదములఁ బూజలొనర్చినవారికెల్లఁ ద**
**త్పరమరచేత ధాత్రి గద, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : చిరతర = చాలకాలముగానుండిన, భక్తిన్ = భక్తితో, ఒక్క తులసీదళము = తులసియొక్క చివురుటాకు, అర్పణసేయువాఁడు = సమర్పించేవాడు, ఇచ్చేవాడు, ఖేచర = (ఆకాశంలో తిరిగే), దేవతలు, గంధర్వులు, గరుడ = దేవతలలో ఒక తెగవారు, ఉరగ = సర్పములు (వీరుకూడ దేవతలే), ప్రముఖ = ప్రధానమైన, సంఘములో = సమూహములో, వెలుగన్ = ప్రకాశించగా, సదా = ఎల్లప్పుడు, స్ఫురత్= ప్రకాశించుచున్న, అరవింద = పద్మంవంటి పాదములను = అడుగులను, పూజలు = అర్చనలు, గౌరవాలు, ఒనర్చినవారికెల్లన్ = చేసినవారికి అందరికి, తత్+పరము = ఆ మోక్షము, అరచేత ధాత్రి = అరచేతిలోని ఉసిరిక - కరతలామలకం, కదా = అగును కదా.

తా : దశరథరామా, బహుకాలము నుండి కల భక్తితో ఒక్క తులసిదళమును నీకు

సమర్పించినవాడు ఖేచరులు, గరుడులు, ఉరగులు అనే దేవతలలో చేరి వారిలో ఒకడై ప్రకాశిస్తాడు. ఇక, ఎల్లప్పుడు, పద్మములవంటి నీ పాదాలను పూజచేసినవారికందరికి, మోక్షము. చేతిలో ఉసిరికవలె అతిసులభముకదా.

వ్యా : ఈ పద్యంలో కవి, భగవానుడు భక్తిమార్గంచేత అతిసులభుడు అనే విషయాన్ని వ్యక్తం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. తులసీదళం చాల సులభంగా లభించే ఓషధి. భక్తితో ఎవరైనా దానిని భగవంతునికి సమర్పణచేస్తే, అతనికి అతడు దేవతలపదవిని సమకూరుస్తాడు. అనగా సాయుజ్యాన్ని ప్రసాదిస్తాడు. హరివంశంలో చెప్పబడినకథలో, శ్రీ కృష్ణుని భార్యయైన సత్యభామ తన ధనధాన్యాలు సమస్త ఐశ్వర్యాలు తన భర్తయైన శ్రీకృష్ణునికి ధారాదత్తంచేసినా ఆయన ప్రసన్నుడు కాలేదు. కాని, పట్ట మహిషియైన రుక్మిణీదేవి ఒక తులసీదళమును సమర్పణచేయడంతో శ్రీకృష్ణుడు ప్రసన్నుడైనాడు. ఆమెకోర్కెలను నెరవేర్చినాడు. ఒక్క తులసీదళసమర్పణలోనే ఇంతటిమహత్త్వం ఉంటే, యోగులు, ఋషులు, భక్తులు, స్వామిపాదారవిందాలను నిత్యం భక్తితో సేవిస్తే వారికి, మోక్షం లభించడంలో సందేహం లేదు అని కవి చెప్పదలచుకొన్నాడు.

**86.ఉ. భానుఁడు తూర్పునందుఁ గనుపట్టినఁ బావకచంద్రతేజముల్**
**హీనతఁ జెందినట్లు, జగదేకవిరాజితమైన నీ పద**
**ధ్యానముసేయుచున్నఁ బరదైవమరీచులడంగకుండునే**
**దానవగర్వనిర్దళన, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : దానవ = రాక్షసులయొక్క, గర్వ = మదమును, నిర్దళన = హరించువాడా, భానుఁడు = సూర్యుడు, తూర్పునందు = తూర్పుదిక్కునందు, పూర్వదిశయందు, కనుపట్టినన్ = కనిపించగా, దర్శనమీయగా, పావక = అగ్నియొక్కయు, చంద్ర = చంద్రునియొక్కయు, తేజముల్ = కాంతులు, హీనతచెందినట్లు = తక్కువై పోయినట్లు, వెనుకబడిపోయినట్లు, జగదేక = లోకములో ప్రముఖముగా, విరాజితము = ప్రకాశించేది, ఐన, నీపదధ్యానము = నీ అడుగులధ్యానము, నిన్ను వేడుట, చేయుచున్నన్ = చేయుచుండగా, పరదైవ = ఇతర దైవతముల, మరీచులు = కిరణములు, కాంతులు, అడంగకుండునే = అణగిపోకుండునా? సన్నగిల్లిపోకుండునా? (పోవునని భావము).

తా : సూర్యుడు తూర్పుదిక్కున ఉదయించినప్పుడు అతని కాంతి లోకంలో వ్యాపిస్తుంది. ఆ కాంతికారణంగా అగ్ని, చంద్రుడు మొదలైనవారి వెలుగులు వెలవెలపోతాయి. అదేవిధంగా లోకంలో అంతటా వ్యాపించియున్న నీ భక్తిని నీ ధ్యానమును, నీ భక్తులు చేసినప్పుడు, ఇతర దైవతముల కాంతులు, వారి మహత్త్వాలు అణగిపోతాయికదా. ఇది యదార్థము. రాక్షసులమదాన్ని అణచివేసే ఓ శ్రీరామా!

వ్యా : ఈ పద్యంలో శ్రీరాముడు, విష్ణుమూర్తి, శ్రీమన్నారాయణుడు, సర్వోత్కృష్టుడని, ఇతరదైవతములు ఆయనముందు తృణప్రాయములని కవి బోధిస్తు ఉన్నాడు. సూర్యుని వెలుగుముందు, అగ్ని, చంద్రుడు ప్రసరించే వెలుగులు వెలవెలబోకుండునా? అదేవిధంగా శ్రీమన్నారాయణుని జగదేక విరాజితుడైనవానిని ధ్యానంచేసేవారు, ఇతర దైవతములను, లెక్కచేయనవసరం లేదని, అతడే ఉన్నతోన్నతుడని కవి ఉద్ఘాటించినాడు.

ఈ పద్యంలో రెండు వాక్యాలకు కవి బింబప్రతిబింబభావం చెప్పినాడు కాబట్టి ఇది దృష్టాంతాలంకారము.

**87.ఉ. నీమహనీయతత్త్వరసనిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ**
**దాము ముంకులాడక వృథా తనుకష్టముఁ జెంది మానవుం**
**డీమహిలోకతీర్థములనెల్ల మునింగిన దుర్వికారహృ**
**త్తామసపంకముల్ విడునె? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : నీమహనీయ = గొప్పదైన నీయొక్క, తత్త్వరస = తత్వసారముయొక్క, పరమాత్మ సారముయొక్క, నిర్ణయ = నిశ్చయముగల, సిద్ధాంతము, కలిగినట్టి, బోధ = జ్ఞానము కలిగిన, కథా = చరిత్రములనెడి, అమృతాబ్ధిలోన్ = అమృతమయమైన సముద్రములో, తాన్ = తాను (భక్తుడు), ముసు = ముందు, క్రుంకులాడక = మునగక, స్నానంచేయక, వృథా = వ్యర్థంగా, నిష్ప్రయోజనంగా, తను కష్టమున్ = శరీరసంకటమును, చెంది = పొంది, మానవుండు = మనుష్యుడు, ఈ మహిలోక = ఈ భూలోకమునందలి, తీర్థములన్ + ఎల్లన్ = తీర్థములందంతటను, మునింగినన్ = క్రుంకగా, స్నానంచేయగా, దుర్వికార = చెడ్డయైన మనస్సుయొక్క మారుపాటు, చెడుతెవులు, హృత్ = మనస్సుయొక్క, తామస = తమోగుణసంబంధములైన కార్యములు, అనే, పంకములు = బురదలు, మాలిన్యములు, విడునె = నిలిచిపోతాయా? వదలవని అర్థము.

తా : దశరథరామా, నీ గొప్పతనముయొక్క సారస్యమిట్టిదని నిర్ణయించి తెలిపే నీ దివ్య చరిత్రమనే అమృతసముద్రంలో గ్రుంకులిడినప్పుడు దుర్వికారమైన హృదయమునందలి తామసమనెడి మాలిన్యములు తొలగిపోవును. కాని కేవలము ఈ లోకంలోని నదీ నదములవంటి తీర్థములలో శరీరాన్ని కష్టపెట్టుకొని మునిగినప్పుడు మనస్సులోని తామసభావాలు తొలగిపోవునా, తొలగిపోవని భావము.

వ్యా : భక్తుడు నవవిధభక్తుల్లో ఒకటియైన శ్రీమన్నారాయణుని కథా సంకీర్తనం చేయవచ్చు. ఆయనకథలు అమృతంతో కూడిన సముద్రంవంటివి. ఆ కథలు చదివితే,

అమృత సముద్రంలో స్నానంచేసినపుణ్యాం లభిస్తుంది. దానివలన భగవత్ తత్త్వబోధ నిర్ణయాత్మకంగా తెలియవస్తుంది. దానివలన మోక్షం సిద్ధిస్తుంది. ఇది కాక, నదీనదములు పుణ్యతీర్థములుగా భావించడం ఉన్నది. వాటిలో స్నానంచేస్తే పుణ్యం లభిస్తుందనే విశ్వాసం ఉన్నది. కాని అది సరికాదు. ఈ నదీనదాలను చేరడానికి శరీరానికి కష్టం కలిగించాలె. అంటే దూరప్రదేశాలకు దుర్భరమైన ప్రయాణంచేయాలె. కాని, విష్ణుమూర్తిని సంకీర్తనం చేసే పుణ్యం దీనివలన లభించదు. తమోగుణం, అనగా అజ్ఞానం కలిగిన మనస్సును ఆవహించియున్నబురద, అంటే మాలిన్యం తొలగిపోదు. స్నానంచేస్తే శరీరమాలిన్యం వదలిపోవచ్చు కాని, మనస్సులోని మాలిన్యం పోవడం ఎట్లా సాధ్యమవుతుంది? మనస్సులోని తామసం తమోగుణం చీకటి అజ్ఞానం తొలగిపోవలెనంటే, శ్రీమన్నారాయణుని అమృతకథాగానం చేయాలె. ఆయనకథలు అనంతమైనవి అమృతసముద్రంతో పోలినవి. ఆ కథాసముద్రంలో గ్రుంకులిడినప్పుడు ఆ కథా సంకీర్తనం చేసినప్పుడు మనస్సులోని అజ్ఞానం తొలగిపోతుంది. చీకటి నశిస్తుంది. మాలిన్యం వదలిపోతుంది. జ్ఞానసముద్భావం కలుగుతుంది. ముక్తి లభిస్తుంది.

**88.ఉ. కాంచనవస్తుసంకలితకల్మషమగ్నిపుటంబువెట్టి వా**
**రించినరీతి, నాత్మనిగిడించిన దుష్కరదుర్మలత్రయం**
**బంచితభక్తియోగదహనార్చిఁ దగుల్పక పాయునే కన**
**త్కాంచనకుండలాభరణ దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : కనత్ = ప్రకాశించుచున్న, కాంచన = బంగారుమయమైన, కుండల = చెవుల అలంకారములు, పోగులు, కుండలములు, ఆభరణ = అలంకారముగా కలవాడా, సంబోధన, కాంచనవస్తు = బంగారు పదార్థమునందు, సంకలిత = చేరిన, కలిగిన, తగిలిన, కల్మషము = మాలిన్యము, కల్తీ, అగ్నిపుటంబు పెట్టి = అగ్నిలో పుటము వేసి వేడిచేసి, వారించినరీతిన్ = తొలగించిన విధంగా, నిర్మూలించిన రీతిగా, ఆత్మన్ నిగిడించిన = ఆత్మలో వ్యాపించిన, దుష్కర = చేయకూడని, చేయరాని, దుర్మలత్రయము = మూడు విధములైన చెడ్డవియైన మాలిన్యములను (మనోవాక్కాయ కర్మలచేత చేసే చెడ్డపనులు, ఈషణత్రయములు) అంచిత = ఒప్పైన, భక్తియోగ = భక్తిమార్గమనెడు, దహన = అగ్నియొక్క, అర్చిన్ = జ్వాలలో, మంటలో, తగుల్పక = కాల్చివేయక, నశింపచేయక, పాయునే? = విడిచిపోవునా?

తా : చెవులకు ప్రకాశించే బంగారు ఆభరణాలను ధరించిన దశరథరామా, బంగారులోని మాలిన్యము అగ్నిపుటమువలనతొలగిపోయినట్లు, మానవుని ఆత్మలో

వ్యాపించి యున్న మూడువిధములైన మాలిన్యములు నీయందలి భక్తియోగ మనెడు అగ్నిజ్వాలలో పడక, చేరక, నశింపవుకదా, నీయందలి భక్తియోగముచేతనే నశించుటయేగాని మరొక విధముగా ఈ మాలిన్యములు నశింపవుకదా అని భావము.

వ్యా : త్రికరణములు : మనుష్యునిజీవితానికి అతిసన్నిహితసంబంధముగా త్రికరణములు ప్రధానపాత్ర వహిస్తాయి. మనస్సు, వాక్కు, కాయము అనేవి త్రికరణములు. చెడుభావము మొదట మనస్సున ఉద్భవిస్తుంది. అది క్రమంగా వాక్కుకు అనగా మాటకు వ్యాపిస్తుంది. తరువాత అది కాయము, అనగా శరీరంతో చేసేపనిలో ప్రవేశిస్తుంది. ఉదాహరణకు ఇతరుల ధనాన్ని అపహరించవలెననే భావం మనస్సులో ప్రవేశించి, అందుకు సంప్రదించేపనిని మాటల్లో చేసి, చివరకు శరీరప్రయత్నంచేత దొంగతనానికి పూనుకోవడం సంభవిస్తుంది. ఈ విధంగా ఈ చేయకూడని పని మనోవాక్కాయకర్మలచేత జరిగిపోతుంది. కవి 'దుష్కర దుర్మలత్రయము' అనే మాటను ఉపయోగించినప్పుడు త్రికరణములనే మనస్సులో పెట్టుకొని ఉండవచ్చును.

మానవుని అపమార్గం పట్టించడానికి వ్యామోహంలో పడవేయడానికి ఇంకొక మూడు మార్గాలున్నాయి. వాటిని త్రివిధేషణములు అని అంటారు. 1. దారేషణ - భార్య మొదలగు స్త్రీలయందలి ఆశ. 2. పుత్రేషణ - కుమారులు, కుమార్తెలయందలి ఆశ. 3. ధనేషణ (ద్రవ్యమందలి ఆశ). ఈ ఈషణత్రయం, మనుష్యుని పెంపొందిక బంధనాల్లో పట్టిపడవేస్తుంది. ఒక స్త్రీని కామించి, ప్రేమించి, ఆమెను వివాహం చేసికొన్న తరువాత ఆమెను ప్రసన్నురాలిగా నుంచడానికి జీవితమంతా సరిపోదు. ఇక కుమారులు కుమార్తెలు కలిగిన తరువాత వారిమీద వ్యామోహంతో వారిని వదలి ఉండలేక జీవితమంతా వ్యయమై పోతుంది. భార్యాపుత్రులు కలిగినతరువాత వారిని పోషించడానికి ధనం సంపాదించవలసిన అవసరం ఏర్పడుతుంది. కాని చాల మంది తమకు సరిపోయినంత ధనంతో తృప్తిచెందక, మరింత ధనం సమకూర్చుకోవలెననే ప్రయత్నం చేస్తారు. దీనివలన జీవితంలో చాల సమయం గడిచిపోతుంది. ఈ విధంగా, ఈషణత్రయంలో చిక్కుకొన్నమానవుడు భగవంతునిపై మనస్సు మరల్చడానికి అంగీకరించడు. దుష్కరదుర్మలత్రయంబు, నిగిడించడమును ప్రస్తావించినప్పుడు గోపన్నగారు ఈ ఈషణత్రయాన్నికూడ మనస్సులో భావించి ఉంటారు. అలంకారము-ఉపమ.

**89.ఉ. నీసతి పెక్కు కల్ములిడ నేర్పరి, లోకముకల్మషంబుగా**
**నీసుత చేయు పావనము, నిర్మితికార్యధురీణదక్షుఁ డై**
**నీసుతుఁ డిచ్చువాయువులు, నిన్ను భజించిన కల్గకుండునే**
**దాసులకీప్సితార్థములు, దాశరథీ కరుణాపయోనిధీ.**

వ్యాపించి యున్న మూడువిధములైన మాలిన్యములు నీయందలి భక్తియోగ మనెడు అగ్నిజ్వాలలో పడక, చేరక, నశింపవుకదా, నీయందలి భక్తియోగముచేతనే నశించుననుగాని మరొక విధముగా ఈ మాలిన్యములు నశింపవుకదా అని భావము.

వ్యా : త్రికరణములు : మనుష్యునిజీవితానికి అతనినిత్యప్రవర్తనకు. త్రికరణములు ప్రధానపాత్ర వహిస్తాయి. మనస్సు, వాక్కు, కాయము అనేవి త్రికరణములు. చెడుభావము మొదట మనస్సున ఉద్భవిస్తుంది. అది క్రమంగా వాక్కుకు అనగా మాటకు వ్యాపిస్తుంది. తరువాత అది కాయము, అనగా శరీరంతో చేసేపనిలో ప్రవేశిస్తుంది. ఉదాహరణకు ఇతరుల ధనాన్ని అపహరించవలెననే భావం మనస్సులో ప్రవేశించి, అప్పులలో సంప్రదించేపనిని మాటల్లో చేసి, చివరకు శరీరప్రయత్నంచేత దొంగతనానికి పూనుకోవడం సంభవిస్తుంది. ఈ విధంగా ఈ చేయకూడని పని మనోవాక్కాయకర్మలచేత జరిగిపోతుంది. కవి 'దుష్కర దుర్మలత్రయము' అనే మాటను ఉపయోగించినప్పుడు త్రికరణములనే మనస్సులో పెట్టుకొని ఉండవచ్చును.

మానవుని అపమార్గం పట్టించడానికి వ్యామోహంలో పడవేయడానికి ఇంకొక మూడు మార్గాలున్నాయి. వాటిని త్రివిధేషణములు అని అంటారు. 1. దారేషణ - భార్య మొదలగు స్త్రీలయందలి ఆశ. 2. పుత్రేషణ - కుమారులు, కుమార్తెలయందలి ఆశ. 3. ధనేషణ (ద్రవ్యమందలి ఆశ). ఈ ఈషణత్రయం, మనుష్యుని సాంసారిక బంధనాల్లో పట్టిపడవేస్తుంది. ఒక స్త్రీని కామించి, ప్రేమించి, ఆమెను వివాహం చేసికొన్న తరువాత ఆమెను ప్రసన్నురాలిగా నుంచడానికి జీవితమంతా సరిపోదు. ఇక కుమారులు కుమార్తెలు కలిగిన తరువాత వారిమీద వ్యామోహంతో వారిని వదలి ఉండలేక జీవితమంతా వ్యయమై పోతుంది. భార్యాపుత్రులు కలిగినతరువాత వారిని పోషించడానికి ధనం సంపాదించవలసిన అవసరం ఏర్పడుతుంది. కాని చాల మంది తమకు సరిపోయినంత ధనంతో తృప్తిచెందక, మరింత ధనం సమకూర్చుకోవలెననే ప్రయత్నం చేస్తారు. దీనివలన జీవితంలో చాల సమయం గడిచిపోతుంది. ఈ విధంగా, ఈషణత్రయంలో చిక్కుకొన్నమానవుడు భగవంతునిపై మనస్సు మరల్చడానికి అంగీకరించడు. దుష్కరదుర్మలత్రయంబు, నిగిడించడమును ప్రస్తావించినప్పుడు గోపన్నగారు ఈ ఈషణత్రయాన్నికూడ మనస్సులో భావించి ఉంటారు. అలంకారము-ఉపమ.

**89.ఉ. నీసతి పెక్కు కల్మలిడ నేర్పరి, లోకమకల్మషంబుగా**
**నీసుత సేయు పావనము, నిర్మితికార్యధురీణదక్షుఁ డై**
**నీసుతుఁ డిచ్చునాయువులు, నిన్ను భజించిన కల్గకుండునే**
**దాసులకీప్సితార్థములు, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర. నీసతి = నీభార్య లక్ష్మీదేవి, పెక్కు కల్మిలు = అనేకసంపదలు, ఇడన్ = ఇవ్వడానికి, నేర్పరి = నిపుణురాలు. నీసుత = నీకుమార్తె -గంగ- (విష్ణుపాదోద్భవ గంగ అని) లోకము = జగము, అకల్మషమ్ముగాన్ = మాలిన్యములేనట్లుగా, నిర్దోషమగునట్లుగా, పావనము చేయు = పవిత్రము చేస్తుంది. నీసుతుఁడు = నీకొడుకు, బ్రహ్మ, నిర్మితికార్య = నిర్మాణము అనే పనిలో, సృష్టి కార్యము యొక్క, ధురీణ = భారము వహించుటలో, దక్షుఁడై = నేర్పుగలవాడై, ఆయువులు = ఆయుష్యములు, జీవితకాలములు, ఇచ్చును. నినున్ = ఇటువంటి భార్య, కుమార్తె, కుమారుడు కలిగిన నిన్ను, భజించినన్ = కొలువగా, సేవించగా, దాసులకు = నీ భక్తులకు, ఈప్సిత = కోరినట్టి, అర్థములు = ప్రయోజనములు, కలుగకుండునే = లభించక పోవునా? లభించును అని భావము.

తా: ఓ దశరథరామా, నీ భార్యయైన లక్ష్మీదేవి సమస్త సంపదలనీయడానికి నిపుణురాలు. నీ కూతురైన గంగ మూడులోకాల్లో ప్రవహించి లోకాలలోని దోషాలను నిర్మూలించి పవిత్రములుగా చేస్తుంది. నీ కుమారుడైన బ్రహ్మ సృష్టికార్యములను నిర్వహించే సమర్థుడై ఆయువులను ప్రసాదిస్తాడు. ఇట్టి పుత్రీ పుత్రకళత్రాదులు గల నిన్ను భజించిన నీ భక్తులకు కోరికల ప్రయోజనాలు నెరవేరకుండునా? నెరవేరునని భావము.

వ్యా : లక్ష్మి అనే పదానికి నిఘంటుకారులు అనేక అర్థాలను వ్రాసి ఉన్నారు. సంపద, వైభవము, ధనధాన్యములు, అదృష్టము, సౌభాగ్యము, జయము, అందము, గౌరవము, సౌందర్యము, సౌకుమార్యము, ఆకర్షణ, ఘనత.

వైభవానికి, సంపదకు, సౌందర్యానికి ఆదిదేవత.

విష్ణుమూర్తి భార్య - లక్ష్మీదేవి.

గంగ : 'విష్ణుపాదోద్భవా గంగా' అని ఆర్యోక్తి. విష్ణుమూర్తి పాదాల్లో ఉద్భవించడం చేత ఆమె విష్ణుమూర్తి పుత్రి అయింది. ఈ నది మూడు లోకాల్లో ప్రవహిస్తుంది. స్వర్గంలో మందాకినీ నది అని ప్రసిద్ధి. భూలోకంలో భాగీరథి, గంగ మొదలైన పేర్లతో వ్యవహరిస్తారు. పాతాళలోకంలో దీన్ని భోగవతి, పాతాళగంగ అని పేర్కొనడం ఉన్నది.

ఇటువంటి దారపుత్రాదులున్న శ్రీమన్నారాయణుని భక్తులు సేవించడంవలన, సంపద, సంతానము, పాపపరిహారము తప్పక కలుగుతాయని, భక్తితో భగవంతుని సేవించడమే మానవుని పరమార్థమని కవి ప్రబోధించినాడు.

**90.ఉ. వారిజపత్రమందిడిన వారివిధంబున వర్తనీయ మం**
**దారయ రొంపిలోనఁ దనువంటని కుమ్మరిపుర్వురీతి సం**
**సారమునన్ మెలంగుచు విచారగుఁడై పరమొందుఁ గాదె స**
**త్కారమెరింగి మానవుఁడు దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : వారిజ పత్రమందు = తామరాకునందు, (వారిజ = నీటిలో పుట్టింది, పద్మము, పత్రము = ఆకు), ఇడిన వారి విధంబున = ఉంచిన జలమురీతి, ఆరయన్ = పరిశీలించగా, రొంపిలోనన్ = బురదలో, తనువు = శరీరము, అంటని = తగులుకొనని, కుమ్మరిపుర్వు రీతిన్ = ఆ పేరుగల నల్లని ఒక పురుగు (వలె) సంస్కృతంలో దీన్ని యమకీటకమంటారు. వర్తనీయమందు = ప్రవర్తింపదగినదైన, సంసారమునన్ = లౌకిక జీవితంలో, ప్రాపంచిక జీవితంలో, మానవుఁడు = మనుష్యుడు, మెలంగుచున్ = ప్రవర్తిస్తూ, విచారగుఁడై = తత్త్వ విచారమును పొందినవాడై, సత్కారము = మంచిపని, గౌరవము, భగవత్సంబంధమైన పూజాదికము, ఎరింగి = తెలిసి, పరమున్ = మోక్షమును, ఒందును కాదె = పొందును కదా.

తా : ఓ దశరథరామా, తామరాకునందలి నీటిబొట్టు ఆ తామరాకును ఎట్లు అంటుకొనదో, బురదలో ఎప్పుడును కుమ్మరిపురుగు నివసించినా దాని శరీరమును బురద అంటుకొనక ఎట్లుండునో, అట్లే మనుష్యుడు, బుద్ధిమంతుడైన వాడు, సాంసారిక జీవనములో ప్రవర్తిస్తూ ఉండినా, భగవత్సబంధమైన విచారమును పొంది, మంచిపనులు (పూజాదికము) తెలిసి చేయడంచేత, సంసారబంధనాలలో చిక్కు పడక, మోక్షమును పొందుతాడు కదా.

వ్యా : తామరాకు నీటిమీద పరచుకొని ఉంటుంది. గాలి వీచినప్పుడు ఆ పత్రం కదలడం చేత అక్కడ ఉండే నీటిబొట్లు దానిమీద పడి, సూర్యునివెలుగు ప్రతిఫలించడంచేత, ముత్యం లాగ వెలిగి సుందరదృశ్యాన్ని సృష్టిచేస్తుంది. ఇట్లా తామరాకు మీద ఉన్న నీటిబిందువు మళ్లి గాలితాకిడికి ఆకు కదలడంచేత నీటిలోనికి జారిపోతుంది. కాని, తామరాకు తనమీద ఉండే నీటిబిందువులచేత తడి కాదు. పొడిగానే ఉంటుంది. ఇదే ప్రకృతిచిత్రం. మనుష్యుడుకూడ జన్మవశాన సాంసారిక జీవనంలో ఉండినా, భగవన్నామసంకీర్తనం చేస్తూ ఉంటే అతడు, సాంసారిక బాధల్లో చిక్కుపడక, నిర్లిప్తంగా ఉండే అవకాశం ఉన్నది. లేదా, సాంసారిక మమతల్లో చిక్కుకుంటే, ఈశ్వరుని విస్మరిస్తే, ఆ బంధాల్లోనుండి బయటపడేమార్గం ఉండదు. అందుచేత మంచిపనులు (సత్కారము) తెలిసికొని, వాటిని ఆచరించినవాడే మోక్షమార్గాన్ని కనుగొని దానికి అర్హుడవుతాడు.

కుమ్మరిపురుగును సంస్కృతంలో యమకీటక మంటారు. ఇది నల్లగా తగినంత పరిమాణంలో ఉంటుంది. దీని జీవితమంతా బురదలోనే, అందులోనే ఉండి అందులో ఉండే క్రిమికీటకాదులను తిని జీవిస్తుంది. విచిత్రమేమంటే ఆది ఎప్పుడైనాబురదనుంచి బయటకు వచ్చినప్పుడు దానిశరీరంమీద బురద కాని, మాలిన్యం కాని కనిపించదు. పైగా నిగనిగలాడుతూ నల్లగా కనిపిస్తుంది. ఇదే ప్రకృతిచిత్రం. మానవుడు కూడ సంసార

పంకంలో ఉన్నప్పుడు దానిమాలిన్యం అంటకుండా ఉండవలెనని, పూజాదికములు నిర్వర్తించడంచేత, మమకారబంధనాలు తొలగిపోతాయని, మోక్షం సుగమం అవుతుందని తాత్త్వికులు భావిస్తారు.

మానవుని సంసారజీవితాన్ని, తామరాకుతోను, బురదతోను పోల్చినాడు కవి. మనుష్యుని నీటిబిందువుతోను, కుమ్మరపురుగుతోను ఉపమించినాడు.

ఈ విధంగా దానిలో ఉపమాలంకారద్వయం ప్రయుక్త మైంది.

**91.ఉ. ఎక్కడ తల్లి దండ్రి, సుతులెక్కడివారు, కళత్రబాంధవం**
**బెక్కడ జీవుఁడెట్టితనువెత్తినఁ బుట్టుచుఁబోవుచున్నవాఁ**
**డొక్కడె, పాపపుణ్యఫలమొందిన నొక్కఁడె కానరాఁడు వే**
**రొక్కఁడు వెంటనంటి, భవమొల్లనయా, కృపజూడవయ్య నీ**
**తక్కరి మాయలందిడక దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : ఎక్కడి తల్లిదండ్రి = తల్లియు దండ్రియు ఎక్కడివారు, (తల్లిదండ్రి అని చెప్పడమే కాని వారితో సంబంధమేమి లేదు), సుతులు = కొడుకులు, ఎక్కడివారు = వారితో బాంధవ్యమెక్కడిది? కళత్ర = భార్యయొక్క, బాంధవంబు ఎక్కడ = చుట్టరికము ఎక్కడ ఉన్నది? జీవుఁడు = శరీరధారి, మానవుడు, ఎట్టి తనువు = ఎట్టిదేహమును, ఎత్తినన్ = ధరించినా, (ఎంతటి గొప్పజన్మము ఎత్తినవాడైనా), ఒక్కఁడె = తానొక్కడే. పుట్టుచున్ = జన్మిస్తూ, పోవుచున్ = మరణిస్తూ, ఉన్నవాడు, పాపపుణ్యఫలము = తాను చేసిన చెడుపనులను, మంచిపనులకు ఫలితమును, ఒందినన్ = అనుభవించుటకును, ఒక్కఁడె = ఒంటరివాడె కదా, తానే కదా. వెంటనంటి = వెంబడి వచ్చుటకు, వేరొక్కఁడు = మరియొకడు - తోడు, కానరాఁడు = కన్పించడు. (కాబట్టి), భవము = ఈ జన్మము, ఒల్లనయా = నాకు అంగీకారము కాదు, ఇచ్చగించనయ్యా, నీ టక్కరి మాయలందిడక = నీ కపటముమాయలలో పెట్టక (నన్ను) (నాతో లీలలు చూపక), కృపన్ = దయతో, చూడవయా = తిలకించుమా, చూడుమా, కాపాడుమా.

తా : దశరథరామా, తల్లిదండ్రులు, కొడుకులు, భార్య అనువారు, కాలానుగుణముగా నడుమ వచ్చినవారు. కాని శాశ్వతముగా సంబంధము కలిగి ఉండేవారు కాదు. ఎందుచేతనంటే, ఒకడు జన్మమెత్తినపుడు పుట్టునపుడు, మరణించునపుడు పుణ్యాపాపఫలములను అనుభవించేటప్పుడును, తానొక్కడె అగును గాని, తల్లిదండ్రులు, మొదలయినవారు వచ్చుట గాని, పోవుట గాని సంభవించదు. కాబట్టి అట్టివారితో సంబంధముగల జన్మము, (సాంసారిక జీవనము) నాకు అక్కర లేదు. నీవు నాతో లీలలు, మాయలు చేయక నిజముగా సంసారమునుండి తప్పించి కాపాడుమా.

వ్యా : మానవ జీవితంలోని పరమార్థాన్ని నివేదించినాడు కవి ఈ పద్యంలో. మనుష్యుడు జన్మించినప్పుడు ఒంటరివాడే. జీవితంలో కష్టసుఖాలు అనుభవించినప్పుడు ఒంటరి వాడే. ఆధివ్యాధులను అనుభవించడం ఒక్కడే. కాని లోకంలో తల్లిదండ్రులు, పుత్రకళత్రాదులు అనే వారున్నారు. కాని, వారితో ప్రయోజనం లేదు. వారివలన బాధానివారణకు సాహాయ్యం లభించదు. కష్టాలు కలిగించినా, సుఖాలు కలిగించినా దానికి బాధ్యత వహించేవాడు, సాహాయ్యం చేసేవాడు పరమాత్ముడొక్కడే. అతడే జన్మను ప్రసాదిస్తున్నాడు. జీవితానుభవములను సమకూరుస్తున్నాడు. భక్తిని ఇస్తున్నాడు. ముక్తిని అనుగ్రహిస్తున్నాడు. పరిసరాల్లో ఉండే బంధుజాలం వలన ఒంటరి జీవికి ప్రయోజనం లేదని, పరమాత్ముడే జీవికి పరమాధారమని తెలిసికోవడమే పరతత్త్వం. ఇది తెలిసికొన్నవానికి జన్మజరారుజా దుఃఖాలు లేవు. ముక్తిమార్గం సులభమవుతుంది. సాయుజ్యం లభిస్తుంది.

**92.చ. దొరసినకాయముల్ ముదిమి తోచినఁ జూచి, ప్రభుత్వముల్ సిరుల్**
**మెరవులు గాఁగఁ జూచి, మరి మేదినిలో తమతోడివారు ముం**
**దరుగుట జూచి, చూచి, తెగు వాయువెరుంగక మోహపాశముల్**
**దరుగనివారికేమిగతి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : దొరసిన = లభించిన, కలిగిన, అంటిన, కాయముల్ = శరీరములు - దేహములు, ముదిమి = ముసలితనము, వార్ధక్యము, తోచినన్ = స్ఫురించగా, తోపగా చూచి, ప్రభుత్వముల్ = దొరతనములు, అధికారములు, సిరులు = సంపదలు, ధనములు, మెరపులుగాఁగన్ = మెరపుతీగవలెగాగ, తాత్కాలికముగాగ, క్షణికముగాగ, చూచి = తెలిసికొని, పరికించి, మేదినిలోనన్ = భూమియందు, ప్రపంచంలో, తమతోడివారు = తన సహచరులు, తమతో సమానమైనవయస్సు గలిగినవారు, ముందు = (తమకు) ముందుగానే, పూర్వమే, ఎదుటనే, అరుగుట = పోవుటను, మరణించుటను, చూచి, తెగు ఆయువు = నశించునట్టి ఆయుష్యమును, తరిగిపోవునట్టి ఆయుష్యమును, ఎరుంగక = తెలిసికొనక, అజ్ఞానమును వహించగా, మోహపాశములు = అజ్ఞానముత్రాళ్లు, మూర్ఖత్వము త్రాళ్లు, తరుగనివారికి = తగ్గనివారికి, కోసివేయనివారికి, ఏమిగతి = ఏది మార్గం? ఏమి దిక్కు?

తా : దశరథరామా, శరీరములు ముదిసిపోవడంతో శరీరం అస్థిరమని, అధికారాలు, సంపదలు మెరపుతీగవలె అదృశ్యం కాగా, అవి అస్థిరమని, తమ సహచరులు సమానవయస్కులు తమకు ముందుగానే మరణించినప్పుడు తాము

మరణించవలసిన వారమని, చక్కగా తెలుస్తూ ఉన్నప్పటికి ఆయువు తరిగిపోవడం తెలిసికొనక, అస్థిరములైన దేహాదులలో అజ్ఞానమనే త్రాళ్లబంధాలలో పట్టుపడుతున్నారుగదా. ఇట్టి అజ్ఞానులకు కలుగ గల స్థితి ఏమి?

వ్యా : మనుష్యుడు జన్మించిన తరువాత బాల్య-యౌవన-కౌమార-వార్ధక్యదశలను అనుభవించడం, చివరకు ఈ శరీరాన్ని త్యాగం చేయడం అనేది యథార్థస్థితి. కాని, యౌవనాదులను అనుభవిస్తున్నప్పుడు, అధికారాలు, సిరిసంపదలు మనుష్యుని చేరి రావచ్చు. అతడు వాటి వ్యామోహంలో పడి, వాటిని శాశ్వతంగా భావించడం జరుగుతుంది. కాని, అధికారం, సంపద అనేవి కేవలం తాత్కాలికమైనట్టివి, క్షణికమైనట్టివి. విరాగులు, బుద్ధిమంతులు వీటిని బుద్బుదప్రాయములన్నారు. ఈ కవి వాటిని ఆకాశంలో ఉండే మెరుపుతీగలతో పోల్చినాడు. అటువంటి సంపదలను శాశ్వతం అనుకోవడం కేవలం మూర్ఖత్వమేకదా.

ఈ విధంగానే జీవితానికి ఒక పరిధి లేదు. అది ఎప్పుడు, ఏ క్షణంలో అంతమవుతుందో ఎవరికీ తెలియదు. తమతోడి వారు, సమానవయస్కులు సహచరులు తమ కన్నుల ఎదుటనే అంతం కావడం, వారిని చూడడం సహజంగా లోకంలో జరుగుతున్నవనే. తానుకూడ ఒక రోజు వారిని అనుసరించవలసిందే అనే జ్ఞానం చాలమందికి ఉండదు. తమజీవితం శాశ్వతమని భావించేవారు, చివరిదాక ధనధాన్యాలమీద వ్యామోహం వదలని వారి సంఖ్యయే ఈ భౌతిక ప్రపంచంలో అధికంగా ఉన్నది. ఇటువంటివారిని 'మోహపాశబద్ధులు' అని పేర్కొన్నాడు. నిజమే. మూర్ఖత్వం అనే త్రాళ్లతో బంధించబడినవారు వీరే. తమ వ్యామోహాన్ని వదలని వారికి ఇంక దిక్కేమిటి - అనగా వారికి దిక్కు లేదు - అని కవి సూచన చేసినాడు.

మానవుడు, తాత్కాలిక విషయోపభోగములమీద వ్యామోహమును వహించక ఈశ్వర భక్తిని నమ్మి, అతనిమీద భారం వేసి జీవించడంచేత అన్ని వ్యామోహాలు తొలగిపోతాయని, శాంతిసౌఖ్యాలు లభిస్తాయని, దానికి పరమాత్ముడే కారణమని కవి భావిస్తున్నాడు.

**93.చ. సిరిగలనాఁడు మైమరచి, చిక్కిననాఁడు దలంచి పుణ్యముల్**
**పొరిఁబొరిఁ జేయనైతినని పొక్కినఁ గల్గునె? గాలి చిచ్చుపై**
**కెరలినవేళఁ దప్పిగొని కీడ్పడు వేళ, జలంబుఁగోరి త**
**త్తరమునఁ ద్రవ్వినంగలవె? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : సిరి = సంపద, ధనము, కలనాఁడు = కలిగి ఉండిన దినముల్లో, మైమరచి = పారవశ్యం చెంది, శరీరాన్ని మరచిపోయి, చిక్కిననాడు = బలహీనమైననాడు, ధనమును

కోల్పోయినప్పుడు, తలంచి = ఆలోచించి, పుణ్యములు = పుణ్యకార్యములను, ఇతరులకు ఉపకారములను, పొరిన్ పొరిన్ = మాటిమాటికి, చేయనైతిని+అని = చేయక పోతిని గదా అని, పొక్కినన్ = తపించగా, విలపించగా, కల్గునె = ఫలము కలుగునా (కలుగదని భావము), గాలి = వాయువు, చిచ్చుపై = అగ్నిమీద, కెరలినన్ = విజృంభించినప్పుడు, దప్పిగొని = దాహమును పొంది, కీడ్పడువేళన్ = స్రుక్కెడు సమయంలో, జలంబున్ = నీటిని, కోరి = ఆశించి, తత్తరమున = తొందరపాటుతో, తడబాటుతో, త్రవ్వినన్ = భూమిలో నీటికై త్రవ్వగా, కలవె = నీళ్లు లభించునా? - లభించవని భావము.

తా : సంపద, ధనధాన్యాలు, చేతిలో ఉండిన సమయంలో వాటిని చూచి సర్వం మరచిపోయి, మత్తిల్లి, సంపదలు కోల్పోయి, బలహీనమైన వెనుక మరల మరల ఆలోచించి, పుణ్యకార్యములు చేయకపోతినే అని చింతించడం భావ్యం కాదు. గాలిచే విజృంభించిన నిప్పును, మంటలను ఆర్పడానికిగాని, బాగా దాహం కలిగినప్పుడు గాని, భూమిని వేగిరపడి త్రవ్వి నీటిని గ్రహించడానికి చేసే ప్రయత్నం ఫలిస్తుందా? ఫలించదని భావం. జీవితంలో ముందుచూపు అవసరమని, ఏ సమయంలో పని ఆ సమయంలో చేయవలెనని, సమయం గడచిన తరువాత చింతించిన లాభంలేదని కవి వాక్రుచ్చినాడు.

అలంకారము = దృష్టాంతము.

మానవుని ఆయుష్యం అల్పమైంది. దానిలో యౌవనం బుద్బుదప్రాయమైంది. కాని మానవుడు ధనం సంపాదించినా, మోక్షానికి ప్రయత్నం చేసినా, యౌవనంలోనే చేయవలసి ఉంటుంది. పుణ్యకార్యాలు చేయడానికిన్ని, ఇతరులకు ఉపకారం చేయ్యడంవంటి మంచిపనులు చేయడానికిన్ని యౌవనంకంటె తరుణం లేదు. అటువంటి యౌవనం సౌఖ్యాలు కాంక్షించే వయస్సు. మానవుడు ఆ సౌఖ్యాలచేత ఆకర్షితుడై, భవిష్యత్తును పరిసరాలను మరచిపోయే ప్రమాదం ఉన్నది. అతడు తనబాధ్యతలను, విస్మరించే ప్రమాదం ఉన్నది. ఇదే మైమరపు. ఇదే పారవశ్యం. ఈ పారవశ్యం తాత్కాలికంగా సుఖప్రదంగానే ఉండవచ్చు. కాని, సమయం గడిచిపోతే తిరిగిరాదుకదా. యౌవనం తొలగిపోయిన తరువాత, పరోపకారం చేయకపోతినని, పుణ్యకార్యాలు నిర్వహించకపోతినని వాపోవడం గతజలసేతుబంధనమే అవుతుంది. వర్షకాలంలో సుఖంగా ఉండడానికి, ఎనిమిది మాసాలు కష్టపడినరీతిగా, రాత్రి సుఖంగా నిద్రించాలంటే దినమంతా శ్రమించే రీతిగా, వార్ధక్యంలో సుఖంగా ఉండవలెనంటే, యౌవనంలో కష్టపడి పుణ్యకార్యాలు చేయడం విస్మరించరాదు. ఈ జీవితమంతా, పరమాత్మునిసేవ చేయడానికి, తద్వారా మోక్షమార్గం సులభంచేయడానికి అని భావించుకొన్న మానవుడు ధన్యుడు. అతనికి దాహమైనప్పుడు నూతిని త్రవ్వే కష్టం ఉండదు.

కంచెర్ల గోపన్నకవి తన దాశరథీశతకాన్ని, ఆధ్యాత్మికంగాను, భక్తిభావంతోను రచించినాడు. కాని కవికి సామాజికస్పృహకూడ అవసరమే. సామాజికంగా మానవుడు ఏ విధంగా ప్రవర్తించవలెననే విషయమై ఈ పద్యంలో సూచనలు చేసినాడు కవి.

**94.చ. జీవనమింకఁ బంకమునఁ జిక్కిన మీను చలింపకెంతయున్**
**దావున నిల్చి జీవనమె తద్దయుఁ గోరువిధంబు చొప్పడన్**
**దావలమైనఁ గాని గురి దప్పనివాఁడు తరించువాఁడయా**
**తావకభక్తియోగమున దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : జీవనము = నీరు, ఇంకన్ = ఎండిపోగా, ఇంకి పోగా, పంకమునన్ = బురదలో, చిక్కినమీను = చిక్కుపడిన చేప, ఎంతయు = ఏమాత్రమును, చలింపక = కదలక, తావునన్ = తానున్న స్థానముననే, అదేచోట, నిల్చి = ఉండి, నివసించి, జీవనమె = నీటినే, తద్దయున్ = మిక్కిలి, అత్యంతము, కోరువిధంబు = కోరినట్టిరీతి, చొప్పడన్ = ఏర్పడునట్లుగా, కలుగునట్లుగా, తావలమైనఁగాని = స్థానమైన, ఆధారమైన దానిని, గురితప్పనివాఁడు = సూటిచెడనివాడు, శ్రద్ధవదలనివాడు, తావక భక్తియోగమున్ = నీదైవభక్తితోడికూడికచే, తరించువాఁడయా = సంసారమును దాటువాడగునయ్యా.

తా : దశరథరామా, నీటిలో నివసించే చేప, నీరు ఎండిపోగా బురదలో చిక్కుకొన్నప్పటికి, ఆ చోటును విడిచి వదలక అక్కడనే నిలిచి, నీటినే చివరివరకు కోరినవిధంగా, మానవుడు నీయందు గురి ఉంచి, శ్రద్ధ వహించి, నీమీద చింతనముచే, ఎన్నికష్టాలు వచ్చినా, దానిని వదలక ఉన్నప్పుడు, భక్తిమార్గమున సంసారమును, కష్టనష్టములను దాటునట్టివాడు. నీమీద చింతనము, శ్రద్ధ అనే గుణములు, అతనిలో భక్తిని కలిగించి సమస్తకష్టములను, సంసారబాధలను తొలగించునని తాత్పర్యము.

వ్యా : భక్తుడై తరించేవాడు, భగవంతునిపై శ్రద్ధను, గురిని విడవరాదని, దానివలన భక్తి పరమాత్మునిపై ఏర్పడుతుందని, ఎంతటి కష్టపరంపర కలిగినా, భగవంతునిమీద శ్రద్ధ వదలడం, ఉచితం కాదని చెప్తుతూ, గోపన్నకవి నీరు ఎండిపోగా బురదలో చిక్కుకొనిపోయిన చేపను ఉత్తమభక్తునికి ఉపమానంగా గ్రహించినాడు.

తలిదండ్రులు తమ బిడ్డవిషయమై పరిపూర్ణ శ్రద్ధ వహించడంచేత, బిడ్డస్థితి సుఖంగా ఉంటుంది. భక్తుడు తనను ఇతర లోకాలకు చేర్చడానికి యోగాభ్యాసాదికాలు చేయనవసరంలేదు. దేవదేవుడు అత్యంతమయిన అనుగ్రహంచేత తనగరుడ వాహనంపై తటాలున వచ్చి భక్తుని వెంటనే సంసారంనుండి సముద్ధరిస్తాడు. దీనికి చేయవలసిన పని

నిమగ్నమై ఉండడమే. ఇతర మార్గాలకన్నింటికంటే బుద్ధిమంతుడు భక్తియుక్తసేవకే ప్రాధాన్యమీయవలె.

అలంకారము - ఉపమ.

**95.చ. సరసునిమానసంబు సరసజ్ఞుఁడెరుంగును, ముష్కరాధముం**
**డెరిఁగిగ్రహించువాఁడె? కొల నేక నివాసముగాఁగ దర్దురం**
**బరయఁగ నేర్చునెట్లు వికచాబ్జమరందరసైకసౌరభో**
**త్కరము మిళిందమొందుక్రియ దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : సరసునిమానసంబు = రసజ్ఞునిమనస్సు, సరసజ్ఞుఁడు = రసదృష్టికలిగి తెలిసినవాడు, ఎరుంగును = తెలియును, ముష్కర+అధముఁడు = కుటిలుడైన నీచుడు, ఎరిఁగి = తెలిసికొని, గ్రహించువాఁడె = అర్థము చేసికొనగలడా, దర్దురము = కప్ప, కొలను = సరస్సు, ఏకనివాసముగాఁగన్ = ఒక్క ఉనికిపట్టుకాగా, అరయఁగన్ = చూడగా, నేర్చునెట్లు = ఎట్లు సమర్థమగును? వికచ+అబ్జ = వికసించిన తామరయొక్క, మరంద = పూదేనె, రస+ఏక = కేవలము రసమునందే (ద్రవమునందే) కల, సౌరభ = సువాసన యొక్క, ఉత్కరము = సమూహము, మిళిందము = తుమ్మెద, ఒందుక్రియన్ = పొందినరీతి,

తా : దశరథరామా, కప్ప సరస్సులోనె ఎల్లప్పుడు నివసిస్తూ ఉంటుంది. అయినా, అదే సరస్సులో తన ప్రక్కనే ఉండి వికసించిన పద్మంలోని ద్రవంలోనే ఉండే సువాసనపరంపరను తెలిసికొనజాలదు. తుమ్మెద వెంటనే దానిని గ్రహించి అనుభవిస్తుంది. ఆ విధంగానే, రసికుని మనస్సులోని సుందరమైనభావాన్ని రసజ్ఞుడైనవాడు, కావ్యాదిపరిచయం కలవాడు తెలిసికొని ఆనందిస్తాడు కాని, కుటిలుడైనవాడు, నిర్మలమైన మనస్సులేని అల్పుడు తెలుసుకొనజాలునా? తెలిసికొనలేడని తాత్పర్యము.

వ్యా : కంచెర్ల గోపన్న నివసించినకాలంలో, క్రీ.శ. పదునేడవ శతాబ్దంలో తెలుగు సాహిత్యానికి తెలుగు దేశంలో తగినవాతావరణం లేకుండ ఉండింది. తెలుగుదేశంలో చాలభాగం ముసల్మానురాజుల అధీనంలో ఉండింది. అందుచేత తెలుగు సామ్రాజ్యాన్ని పరిపాలించేరాజులు పూర్వం రాజరాజనరేంద్రుడు శ్రీకృష్ణదేవరాయలు మొదలగు భూపతులలాగా తెలుగు సాహిత్యాన్ని పోషించే అవకాశం లేకపోయింది. కుతుబ్షాహిరాజుల్లో ఒక ఇబ్రాహింకుతుబ్షామాత్రమే తెలుగుసాహిత్యంపట్ల కొద్ది అభిమానం కలవాడు. కంచెర్ల గోపన్నగారు అబుల్‌హసన్ తానీషాకాలంలో జీవించినకవి. ఈతడు గోపన్నగారి కవిత్వాన్ని మెచ్చుకొన్నవాడు కాడుసరికదా, ఈ కవిని బందిఖానాలో ఉంచినాడు అని

చరిత్రవక్కాణిస్తున్నది. అందుచేత, రాజ్యాధిపతులచేత ఆదరించబడవలసిన కవిత్వానికి ఈ కవికాలంలో దుర్దశ పట్టింది. బహుశా తనకాలంలో తాను వ్రాసిన మధురభక్తి సంకీర్తనలకు గాని, ఇతర కావ్యానికి గాని తగినంత ఆదరణ లభించకపోవడంవలన కాబోలు. రసజ్ఞులైన రాజులు లేరు, వారు చెరువులోని కప్పలవంటివారు, వారికి రసజ్ఞత తెలియదు. కవిపండితుల రచనల్లోని మాధుర్యాన్ని గ్రహించలేరు అని వాపోయినాడు. పద్మాలపరిసరాల్లో కొలనిలో ఉన్న కప్ప పద్మంలోని సౌరభాన్ని కాని, రసమాధుర్యాన్ని కాని గ్రహింపగలుగుతున్నదా? రసజ్ఞులుకాని అధికారులుకూడ అంతే అని భావించినాడు కవి.

**అలంకారము**. దృష్టాంతము.

**96.చ. నోచినతల్లిదండ్రికిఁ దనూభవుఁడొక్కఁడె చాలు మేటి, చే**
**చాచనివాఁడు, వేరొకఁడు చాచిన లేదన కిచ్చువాఁడు, నో**
**రాచి నిజంబుకానిపలుకాడనివాఁడు, రణంబులోన మేన్**
**దాచనివాఁడు భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : నోచిన = నోములు - పుణ్యవ్రతాలు చేసిన (పూర్వజన్మలో), తల్లిదండ్రులకు మాతాపితలకు, తనూభవుఁడు = కుమారుడు, కొడుకు, ఒక్కఁడె చాలు = ఒక్కడైనా సరిపోతును - అనగా చాలామంది అవసరంలేదని భావం. మేటి = ముఖ్యుడైనవాడు - నాయకుడు, చేచాచనివాఁడు = యాచించనివాడు, ఇతరులను దానమునిమ్మని అడుగనివాడు, వేరొకఁడు = ఇంకొకడు, అనగా అవసరంలో ఉన్న బీదవాడు, చాచినన్ = చేయి ముందుకు చాపితే, యాచించితే, లేదనక = నిరాకరించక, ఇచ్చువాఁడు = దానం చేసేవాడు, నోరు = ముఖద్వారము, ఆచి = అడ్డగించి, అణగించి, నిజంబు = యదార్థము, సత్యము, కానిపలుకు = కానట్టిమాటను, ఆడనివాఁడు = చెప్పనివాడు, (అబద్ధము చెప్పడానికి నోరుమూసికొని, నోరుతెరచి సత్యమునే పలుకువాడని భావం), రణంబులోన = యుద్ధంలో, మేన్ = ఒడలు, దాచనివాఁడు = మాటు చేయనివాడు, (ఎదురుగా నిలిచి యుద్ధం చేసేవాడని అర్థము).

తా : ఒకరిని యాచించనివాడును, ఒకరు తనను యాచించగా లేదనక ఇచ్చువాడును, నోరు తెరచి అసత్యము పలుకనివాడును, యుద్ధమందు వెనుదీయని వాడును, అయినట్టికుమారుడు, భాగ్యముచేసిన తల్లిదండ్రులకు ఒక్కడు కలిగిన చాలును. అనేకమంది అక్కర లేదు - ఓ దశరథరామా!

వ్యా : ఈ పద్యంలో గోపన్నకవి సామాజికమైన ఒక సమస్యను అందుకొని

చర్చించినాడు. పూర్వజన్మంలో తలిదండ్రులు, నోములు, పుణ్యవ్రతాలు చేసి ఉంటే వారికి సత్‌సంతానం కలుగుతుందని భారతీయుల విశ్వాసం. ఆ కలిగిన సంతానం, ఒక్క కొడుకైనా చాలు. అతడు ఎట్లా ఉండాలో నని చెప్పినాడు.

అతడు మేటిగా ఉండవలెనట - మేటి అంటే అధిపుడు అని ఒక అర్థము, గొప్పవాడు, శ్రేష్ఠమైన అనే రెండవ అర్థమున్నది. తల్లిదండ్రులకు కలిగిన కుమారుడు, గొప్పవాడై, శ్రేష్ఠుడై ఉండవలెనని కవి భావం. ఇంక అతని గుణగణాలెట్లా ఉండవలెనో చెప్పినాడు. 'చేచాచనివాడు' అనగా ఇతరులముందు చేయి చాచి యాచన చేయనివాడు. అంటే దైన్యగుణం లేనివాడు. 'వేరొకడు చాచిన లేదనకిచ్చువాడు' ఇతరులెవరైనా యాచించునప్పుడు ఉదారబుద్ధితో దానం చేసేవాడు. ఇచట దానంకంటె అతని ఔదార్యం ప్రధానంగా చెప్పబడింది. ఇక మరొకలక్షణం, సత్యమునుమాత్రమే మాట్లాడడం. 'నోరాచి నిజంబుకాని పలుకాడనివాఁడు' నిజమే పలుకవలె కాని, అసత్యం చెప్పకూడదు. సత్యవాక్పరిపాలన శ్రీరాముడు, హరిశ్చంద్రుడు మొదలైన మహానుభావులు పాటించి లోక ప్రఖ్యాతిని పొందినవారు. మహాభారతంలో జనమేజయమహారాజును గురించి, 'మితహితసత్యవాక్య జనమేజయ' అని చెప్పబడింది. మితంగాను, హితంగాను, సత్యంగాను మాట్లాడవలెనని భావం కాబోలు! ఇక కుమారుడు భీరుడు కావద్దు - పిరికివాడు కావద్దు. పూర్వకాలంలో తరచు యుద్ధాలు జరిగేవి. వాటిలో యువకులు రాజులపక్షాన దేశం పక్షాన పాల్గొని తనువును, ప్రాణాన్ని త్యాగంచేయడానికి సిద్ధపడేవారు. వీరులైనవారు యుద్ధంలో మరణిస్తే వీరస్వర్గం అలంకరిస్తారని మన విశ్వాసం. ఖడ్గతిక్కన యుద్ధం నుంచి తప్పించుకొని వస్తే అతనికి తల్లి, భార్య ఎంతటి 'గౌరవం' చేసినారో లోకప్రఖ్యాతమే. అందుచేత త్యాగబుద్ధి అనేది చాలగొప్ప గుణంగా చెప్పబడింది. ఇన్ని గుణగణాలు కలిగిన కుమారుడు ఒక్కడు కలిగినా చాలు. ఈ గుణాలు లేని బుద్ధిహీనులు చాలమంది ఉన్నా ప్రయోజనం లేదు. దానివలన జనాభా పెరగడం తప్ప మరొక ఉపయోగంలేదుకదా.

**97.చ. శ్రీయుత జానకీరమణ చిన్మయరూప రమేశ రామ నా**
**రాయణ పాహి పాహి యని ప్రస్తుతిజేసితి నామనంబునం**
**బాయక కిల్బిషవ్రజవిపాటన మందఁగఁజేసి సత్కళా**
**దాయిఫలంబునాకిడవె - దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : శ్రీయుత = లక్ష్మీదేవితోకూడినవాడా, కాంతితోకూడినవాడా, జానకీరమణ = సీతాదేవికి పెనిమిటియైనవాడా, చిత్+మయ+రూప=జ్ఞానమయమైన స్వరూపము గలవాడా, రమ+ఈశ= లక్ష్మీదేవికి పతియైనవాడా, రామ = రాముడనేపేరు కలిగినవాడా,

అందరికి ఆనందం కలిగించేవాడా, నారాయణ = నారములనెడు సకల చేతనాచేతనములు వాసస్థానంగా గలవాడా, పాహి పాహి యని = కాపాడుము కాపాడుము అని, ప్రస్తుతి చేసితిని = స్తోత్రముచేసినాను, నామనంబునన్ = నామనస్సులో, పాయక = విడువక, కిల్బిష = పాపములయొక్క, వ్రజ = సమూహముల, విపాటనము = ఖండించుటను, అందఁగఁజేసి = లభించునట్లుచేసి (నా పాపాలను నిర్మూలింపచేసి), సత్కళా = మంచికళను, దాయి = యిచ్చునట్టి, ఫలంబున్ = ఫలితమును, నాకున్+ఇడవె = నాకు ప్రసాదించుమా.

తా : దశరథరామా, కాంతి మొదలయినవాటితో కూడియున్నవాడా, జానకీదేవికి భర్తగా నున్నవాడా, జ్ఞానమయమైనస్వరూపం కలిగినవాడా, లక్ష్మీదేవికి భర్తయైనవాడా, ఓరామా, నారాయణా, నన్ను కాపాడుము అని నిన్ను స్తుతిచేసినాను. నా ప్రార్థనను మన్నించి, నామనస్సులో నిలిచి, నాలోని పాపసమూహాన్ని ఖండించివేసి, మంచికళకు లభించే ఫలితాన్ని నాకు ప్రసాదించుమా.

వ్యా : ఈ పద్యంలో కవి శ్రీమన్నారాయణుని నామ సంకీర్తనం చేసినాడు. అతన్ని అనేక పేర్లతో సంబోధించినాడు. ఆ సంబోధనను ప్రస్తుతి అని తానే పేర్కొన్నాడు. శ్రీమన్నారాయణుడు లక్ష్మితో కూడినవాడు శ్రీమన్నారాయణుడనే మాటలో శ్రీ కాంతిని సూచిస్తుంది. శ్రీ అనే మాటకు లక్ష్మి, సంపద, ఐశ్వర్యము, త్రివర్గము, వృద్ధి, శోభ, అలంకరణము, కీర్తి, బుద్ధి, సరస్వతి అనే అర్థాలున్నాయి. ఈ అర్థాలన్నింటిని శ్రీయుత అనే పదం ధ్వనింపచేస్తుంది. జానకీరమణ అన్నప్పుడు జానకీదేవికి భర్త అని సామాన్యార్థం. రమణ శబ్దానికి ఒప్పిదమైంది, ప్రీతి, మనోజ్ఞము అనే అర్థాలు కూడ ఉన్నాయి. జానకీదేవికి ఒప్పిదంగా ఉండేవాడు శ్రీరాముడు అని అర్థం గ్రహించవచ్చు. సీతాదేవికి శ్రీరామునికంటె ఒప్పిదంగా దర్శనమిచ్చేవాడు మరెవరు? సీతాదేవికి ప్రీతి కలిగించేవాడు, రాముడు అనే మరొక అర్థం.

చిత్+మయ = చిన్మయ, అంటే జ్ఞానమయమైన రూపం కలిగినవాడు - దీనికి పరమాత్మ - పరబ్రహ్మ అనే అర్థాలున్నాయి.

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥

అని పరమాత్మస్వరూపుడే చిన్మయస్వరూపుడు అని చెప్పబడింది.

రమ అంటే లక్ష్మి. ఆమెకు ఈశుడు భర్త. విష్ణుమూర్తి శ్రీమన్నారాయణుడు సర్వసంపదలకు అధినేత్రియైన లక్ష్మీదేవిని భార్యగా పొందినవాడు. ఎంతటి ఉన్నతోన్నతుడో ఊహించుకొనవచ్చు. ఇదికూడ పరమాత్మకు సంబోధనమే.

రామ అనే మాటకు ఆనందం కలిగించేవాడు, సంతోషాన్ని కలిగించేవాడు. అందమైన వాడు. ఆకర్షణ కలిగినవాడు, దశరథరాముడు అనే అర్థాలున్నాయి. శ్రీరాముడు తాను జన్మించగానే తన తల్లిదండ్రులకు ఆనందం కలిగించినట్లుగానే, పెరిగిపెద్దవాడై, తనసత్ప్రవర్తనచేత, తన శౌర్యమహిమలచేత, తనప్రజలకు, లోకానికి తరతరాలుగా ఆనందం కలిగించి, తల్లిదండ్రులుపెట్టిన రామ అనేపేరును సార్థకం చేసికొన్న పరమాత్ముడు. కలిసంతరణోపనిషత్తులో రామశబ్దం మహామంత్రంలో చేరింది.

హరే రామ హరే రామ రామ రామ హరే హరే

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

నారాయణ అనేది ఈ పద్యంలో మరొక సంబోధన 'విష్ణుః నారాయణః కృష్ణో' అని అమరనిఘంటువు. పరమాత్మ అని స్థూలమైన అర్థం. భగవంతుని నామములలో అప్రాకృతమైనవి, అతిరహస్యమైనవి నారాయణ వాసుదేవ శ్రీకృష్ణాదిశబ్దాలు. నరమనగా ఆత్మ అని అర్థం. దానిలోనుండి ఉద్భవించిన ఆకాశాదులు నారములు.

వాటిలో కార్యకారణరూపమున వ్యాప్తమై నివసించువాడు నారాయణుడు.

నవవిధ భక్తుల్లో నామసంకీర్తనం ఒకటి. గోపన్నకవి, పరమాత్ముని, పైన పేర్కొనిన అనేక నామములతో సంకీర్తనం చేసినాడు. అతనిని తనమనంలో ఎల్లప్పుడు నివసించుమని ప్రార్థన చేసినాడు. తనకు కలిగిన పాపములను పటాపంచలు చేయుమని నివేదించుకొన్నాడు. తనలో ఉండే పాపాలు, అంటే మాలిన్యాలు కల్మషాలు తొలగిపోతే, తాను చక్కనికళతో, కాంతితో ప్రకాశించే అవకాశం లభిస్తుంది. ఆ కళాదాయి, అనగా కళను లోకానికి అందించే శక్తిని తనకు ప్రసాదించుమని, తన యిష్టదైవమైన శ్రీరాముని, పరమాత్ముని ఈ పద్యంలో వేడుకొన్నాడు.

**98.ఉ. ఎంతటి పుణ్యమో శబరియెంగిలిఁ గొంటివి వింతగాదె? నీ**
**మంతనమెట్టిదో యుడుతమైని కరాగ్రనఖాంకురంబులన్**
**సంతసమందఁ జేసితివి, సత్కులజన్మమదేమి లెక్క వే**
**దాంతముగాదె నీ మహిమ! దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : శబరి యెంగిలిన్ = శబరియనే ఆటవిక వనిత కొరికి చవి చూచిన ఎంగిలి పండ్లను, కొంటివి = స్వీకరించినావు - తిన్నావు. ఎంతటి పుణ్యమో = ఆమె చేసికొన్న పుణ్యము ఎంత అతిశయించినదో, వింతకాదె = ఇది ఆశ్చర్యముకాదా, అగునని భావము. నీ మంతనము = నీ రహస్యము, నీ ఆలోచన, ఎట్టిదో = ఎటువంటిదో, ఉడుతమైని = ఉడుత శరీరమును, కరాగ్ర = చేతిముందు భాగంలో ఉండే వ్రేళ్లయొక్క

నఖాంకురమ్ములన్ = గోటిమొనలచేత, సంతసమందన్ = సంతోషము కలుగునట్లుగా చేసితివి = ఒనరించినావు, సత్కులజన్మము = మంచివంశంలో పుట్టడం, అదేమి లెక్క = ఏమి ప్రాధాన్యము, నీకేమి లక్ష్యము, నీ మహిమ = నీమహత్త్వము, వేదాంతముగాదె= ఉపనిషత్‌తత్త్వం కాదా.

తా : శబరికొరికి ఎంగిలిచేసిన ఫలములను భుజించినావు. ఆమెయెంతటి పుణ్యము చేసికొన్నదో ఆశ్చర్యంగా ఉన్నది. ఉడుత శరీరమును వ్రేళ్ల గోటికొనలతో నిమిరితివి. దానిని సంతోషపెట్టితివి. దానిపై ఇంతటి వాత్సల్యము కలుగడానికి రహస్యమేమో? విచారించిచూడగా నీవు జాతిని, కులమును పాటించి గౌరవించేవాడవు కాదు. నీ మహత్త్వము, వేదాంతమగు ఉపనిషత్ తత్త్వము ప్రతిపాదించే విస్తారమయినదికదా. అది మముబోంట్లకు తెలియదుకదా దశరథరామా.

వ్యా : విశిష్టాద్వైత సంప్రదాయంలో ఒక ఆర్యోక్తి ఉన్నది.

**శ్వపచోపి మహీపాల: విష్ణుభక్తో ద్విజాధిక:**

జన్మతః కడజాతివాడైనను, రాజాధిరాజైనను, అతడు విష్ణుభక్తుడైనప్పుడు వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణునికంటె గొప్పవాడు అని దీని భావం. వైష్ణవ సిద్ధాంతంలో జాతిమతకులవివక్ష లేదు. శ్రియఃపతి తనభక్తులయినవారిని అందరిని సమానంగా చూచి, వారికి కలిగిన ఆపదలను తొలగిస్తాడు. భక్తావనప్రీతియందు శ్రీ మన్నారాయణునికి జాతి-కుల-మత వివక్షలేదని కవి ఈ పద్యంలో వక్కాణించినాడు.

ఈ అభిప్రాయాన్ని నిరూపించడానికి శ్రీమద్రామకథలోని రెండు ఉదాహరణలను కవి గ్రహించినాడు. మొదటిది శబరి అనే వనస్త్రీ వృత్తాంతం. వాల్మీకంలో శబరి ఎంగిలి చేసిన ఫలములను శ్రీరామునికి సమర్పించినట్లుగా లేదు. ఇంక రెండవది. ఉడుత వృత్తాంతం. ఇది సేతుబంధన సందర్భంలో ఉండవలె. కాని, వాల్మీకి రామాయణంలో ఉడుత కనిపించదు. జానపదులు పాటల రూపంలో పాడుకొనే రామాయణాల్లో ఉంటుంది. హరిదాసులు, వీధి భాగవతులు ఉడుతకథను ప్రచారం చేసినారు. దానిని కవి గ్రహించి ఈ పద్యంలో ప్రస్తావించినాడు.

భక్తికి శ్రీరామునిసేవకు జాతికులమతభేదం లేదు, భగవానునిభక్తితో సేవించేవారికి, ఎటువంటి వారికైనా ముక్తి లభిస్తుందని ఉద్ఘాటించడమే దాని పరమార్థం.

**99.ఉ. బొంకనివాఁడె యోగ్యుఁడరిబృందము లెత్తినచోటఁ జివ్వకున్**
**జంకనివాఁడె జోదు, రభసంబున నర్థి కరంబు సాచినన్**
**గొంకనివాఁడె దాత, మిముఁ గొల్చి భజించినవాఁడెపో నిరా**
**తంకమనస్కుఁడెన్నఁగను, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : బొంకనివాఁడె = అసత్యము పలుకనివాడు మాత్రమే, యోగ్యుఁడు = తగినవాడు, నేర్పుగలవాడు. అరిబృందము = శత్రుసమూహము, ఎత్తినచోట = దండెత్తివచ్చిన యెడల - చివ్వకున్ = యుద్ధమునకు, జంకనివాఁడె = భయపడనివాఁడే, వెనుకాడని వాడే, జోదు = యోధుడు, వీరుడు, రభసంబునన్ = వేగముగా, అర్థి = యాచకుడు, కరంబు = చేతిని, చాచినన్ = చాపగా, (దానమునర్థించగా అని అర్థము), కొంకని వాఁడె = (ఇవ్వడానికి) సందేహించని వాడె, దాత = దానగుణము కలిగినవాడు. మిమ్ము = శ్రీరాముని, దైవమును, కొల్చి = సేవించి, భజించినవాఁడె = భజన చేసినవాడే, సంకీర్తనం చేసినవాడే, నిరాతంక = ఆటంకము, అడ్డులేని, మనస్కుఁడు = మనస్సుగలవాడు.

తా : ఓ దశరథరామా, జీవితంలో అసత్యము మాట్లాడనివాడే యోగ్యుడు, గౌరవ యోగ్యుడైనవాడు. శత్రువులు దండెత్తిరాగా, వారితో యుద్ధానికి వెనుకాడక, భయపడక, ఎదిరించువాడే మహావీరుడు యోధుడు. అవసరమున్నవాడు, కోరిక కలిగినవాడు, దానమిమ్మనిచేయి చాపితే సందేహములేక దానం చేసేవాడే దాత. ఈ పని వెంటనే చేయవలెనట. మిమ్ములను, అనగా దైవాన్ని సేవించి, సంకీర్తనం చేసేవాడే, నిర్మలమైన ఆటంకములేని, స్వచ్ఛమైన మనస్సుగలవాడు.

వ్యా : ఈ పద్యం సామాజిక స్పృహతో వ్రాసింది. సమాజంలో అసత్యమాడనివాడు మోసగాడు కాలేడు. సత్యవాక్పరిపాలన మనసంస్కృతిలో ఒక భాగం. ఆ వ్రతాన్ని నియమ పూర్వకంగా పాలించిన హరిశ్చంద్రాదిచక్రవర్తులు ఆ చంద్రతారార్కమైన కీర్తిని గడించినారు. వారికంటె మరి యోగ్యులెవరు?

రాజులకు గాని, ఇతరులకు గాని, శత్రువులు లేక ఉండేవారు లోకంలో అరుదు. శత్రువులు సమయం చూసి దెబ్బతీయడానికే సన్నద్ధులై ఉంటారు. వారు ఎదిరించి, దండెత్తి వచ్చినప్పుడు భయపడనివాడు, వెనుకాడనివాడు ధైర్యంతో ఎదిరించేవాడు, వీరుడు యోధుడు అని కవి అభిప్రాయం.

ధనధాన్యములు సంపాదించి వాటిని దాచిపెట్టినంత మాత్రంచేత సరిపోదు. లోకంలో అవసరం కలిగినవారు, అర్థులు, ధనవంతులను అర్థించడం ఉన్నది. కాని, ధనవంతులలో చాలమంది లోభులే. ఇతరుల అవసరాన్ని గుర్తించి వారు కోరినవెంటనే వారికిసాహాయ్యం చేసేవాడు నిజమైనదాత. అంతేగాని, పదిసార్లు బ్రతిమాలించుకొని, అవసరానికి సాహాయ్యం చేయకపోతే వాని ధనం దేనికి? దాతృత్వం దేనికి?

మనసమాజంలో ఆస్తికత్వమే ప్రధానలక్షణం. అందుచేతనే కవి, ఈశ్వరుని సేవించి భజించినవాడే, నిష్కలంక మనస్కుడైనవాడు, అనగా సచ్ఛీలంగలవాడు అని చెప్పినాడు.

సమాజంలో సత్యశీలియైన యోగ్యుడు, వీరుడు, దాత, ఆస్తికుడు (భక్తుడు) ఉన్నప్పుడు ఆ సమాజం కల్యాణప్రదంగా ఉంటుంది. అదే ఆదర్శవంతమైన సమాజం అని కవి అభిప్రాయం.

**100.చ. భ్రమరము కీటకంబుఁగొని పాల్పడి ఝాంకరణోపకారియై**
**భ్రమరముగా నొనర్చునని పల్కుటఁజేసి, భవాదిదుఃఖసం**
**తమసమెడల్చి భక్తిసహితంబుగ జీవుని విశ్వరూపత**
**త్త్వమున ధరించుటేమరుదు? దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : భ్రమరము = తుమ్మెద, కీటకంబుఁగొని = పురుగును గ్రహించి, పాల్పడి = పూనుకొని, ఝాంకరణ = ఝుంకారముచేత, ఉపకారియై = మేలుచేయడానికి పూనుకొన్నదియై, భ్రమరముగాన్ = తుమ్మెదగాను, ఒనర్చునని = చేస్తుందని, పల్కుటన్+చేసి = చెప్పుటచేత, జనవాక్యం చేత, జీవునిన్ = మానవుని, భవ = పుట్టుక, ఆది = మొదలుగాగల, దుఃఖసంతమస = దుఃఖమనే అంధకారాన్ని, ఎడలించి = పోగొట్టి, నిర్మూలింపచేసి, భక్తిసహితంబుగన్ = భక్తితోగూడ, విశ్వరూపతత్త్వమును = నీ యొక్క విరాట్స్వరూపతత్త్వాన్ని, భగవత్‌తత్త్వమును, ధరించుట = వహించడం, ఏమి అరుదు = ఏమి ఆశ్చర్యము (ఆశ్చర్యము కాదు అని భావము).

తా : తుమ్మెద, ఒక పురుగును స్వీకరించి దానికొరకై పూనుకొని, తన ఝుంకారముచేత, ఉపకారము, (మేలు) చేసి, దాన్ని కూడ తుమ్మెదగా మార్చునని లోకంలో చెప్పుకొంటారు. ఓ దశరథరామా, నీవు మానవుడు జన్మించినది మొదలుకొని, దుఃఖమనే అంధకారాన్ని నిర్మూలించి అతనిలో భక్తిని కలిగించి, దానివలన నీవిశ్వరూపతత్త్వాన్ని భగవత్‌తత్త్వాన్ని ధరింప చేస్తావు. దీనిలో ఆశ్చర్యమేమున్నది? ఆశ్చర్యం లేదని తాత్పర్యం.

వ్యా : కవిసమయాల్లో 'భ్రమరకీటన్యాయము' అనే ఒక సంప్రదాయం ఉన్నది. తుమ్మెద గుడ్డుపెట్టిన కొద్దికాలానికి చిన్నమట్టిగూటిలో ఆ గుడ్డు కీటకంగా మార్పు చెందుతుంది. దానిపై ప్రేమచేత కావచ్చు. దాన్ని కాపాడడానికి కావచ్చు, గుడ్డు పెట్టిన తుమ్మెద ఆ గూటిచుట్టు ఝుంకారం చేస్తూ తిరుగుతూ ఉంటుంది. కొంత కాలానికి, గూటిలోని కీటకం రెక్కలు కలిగి భ్రమరంగాతుమ్మెదగా మారిపోతుంది. తుమ్మెద చేసే ఝుంకారంవలన కీటకం భ్రమరంగా మారిందని కవుల విశ్వాసం. దీన్ని కవిసమయాల్లో భ్రమర కీటకన్యాయం అంటారు.

దీనికి శాస్త్రపద్ధతిలో చెప్పవలెనంటే, తుమ్మెద గుడ్డుపెట్టిన తరువాత కొంతకాలానికి కాళ్లు కలిగిన పురుగులాగా (Caterpillar) మార్పు చెందుతుంది. మరికొంత కాలానికి

దానికి రెక్కలు వచ్చి తుమ్మెదలాగా స్వరూపాన్ని సంతరించుకొంటుంది. ఈ మూడు దశల్లోను, తల్లితుమ్మెద గూటిచుట్టు తిరుగుతూ ఝుంకారం చేస్తుంది. తనగుడ్డును, కీటకాన్ని కాపాడడానికి కాబోలు. ఝుంకారం వలన కీటకానికి తుమ్మెదరూపం వచ్చిందని కవులు భావించినారు. కాని, ఇది ప్రకృతిసిద్ధమైన త్రిదశపరిణామం. పక్షులు రెండుదశల్లో - అండము - పక్షి - పరిణామం చెందినట్టిదే ఇది కూడ.

భగవంతుడు, లోకంలో జన్మించిన మానవుని ఎల్లప్పుడు కాపాడుతుంటాడు. అతని జన్మ సంభవించినతరువాత, పెరిగి పెద్దవాడవుతున్నప్పుడు అతన్ని అనేక కష్టనష్టాలు బాధపెట్టుతాయి. వీటినుండి రక్షించేవాడు భగవంతుడే. తరువాత అతడు భగవద్భక్తికి లోనవుతాడు. ఇది మరొక పరిణామదశ. ఈ విధంగా నిరంతరం భగవత్ సన్నిధానంలో ఉండడంచేత, భగవంతుని విరాట్స్వరూపాన్ని అలవర్చుకొంటాడు. అంటే తాను మనుష్యమాత్రుడని లోకాన్ని తనను నడిపించేవాడు భగవత్స్వరూపుడు ఒకడున్నాడని గుర్తిస్తాడు. తుమ్మెదలో మూడురకాలైన పరిణామదశలు జరిగినట్లుగానే భక్తునిలో కూడ ఈ దశల్లో పరిణామం ఏర్పడి భగవత్‌తత్త్వం గ్రహించే అవకాశం వస్తుంది.

మానవుడు దుర్బలుడు, అతడు ఏ ఘనత పొందినా భగవదనుగ్రహంవలననే. అందుచేత, భగవంతుని మహత్త్వం అతని విరాట్స్వరూపం తెలుసుకోవడానికి భక్తి ముఖ్యమైందని కవి సూచనామాత్రంగా ప్రతిపాదించాడు.

**101.చ. తరువులు పూచి కాయలగుఁ దత్కుసుమంబులు పూజగా భవ**
**చ్చరణము సోకి దాసులకు సారములౌ ధనధాన్యరాసులై**
**కరిభటఘోటకాంబరనికాయములై విరజానదీ సము**
**త్తరణమొనర్చుఁ జిత్రమిది దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : తరువులు = చెట్లు, పూచి = పుష్పించి, కాయలు+అగున్ = కాయలుగా మారును, తత్ + కుసుమంబులు = ఆ పూవులు, పూజగా = పూజార్థముగా, భవత్ =చరణము = మీపాదమును, సోకి = తాకి, దాసులకు = నీ భక్తులకు, నీ సేవకులకు, సారములు = శ్రేష్ఠములు, శక్తులు, ఔ = అయినట్టి, ధనధాన్యరాసులై = సంపదలు, పంటలకుప్పలై, కరి = ఏనుగులు, భట = సేవకులు, ఘోటక = గుర్రములు, అంబర = వస్త్రములు, నికాయములై = వీని సమూహములుగా మారి, విరజానదీ = పరమ పదంలో ఉండేనది, సముత్తరణము = దాటడాన్ని, చేయున్ = ఒనర్చును. ఇది చిత్రము = ఇది ఆశ్చర్యము.

తా : దశరథరామా, చెట్లు పుష్పించి పూవులు, అక్కడనే ఉండినట్లయితే, అవి

కాయలుగా మారుతాయి. ఆ పూవులనే కోసి, నీ భక్తులు, వాటిని నీ పాదములందు పూజార్థము సమర్పించగా, అవి నీ అడుగులు సోకగానే, నిన్ను సేవించిన వారికి, మేలైన ధనధాన్యములుగాను, ఏనుగులుగాను, బంట్లుగాను, గుర్రములుగాను, వస్త్రములుగాను పరిణమించి ఈ లోకంలో సౌఖ్యాలను కలిగిస్తున్నాయి. చివరన పరమపదంలో ఉండే విరజానదిని దాటించి స్వర్గసౌఖ్యాన్ని అందిస్తున్నాయి. నీ పూజామహిమ ఇట్టిదికదా.

వ్యా : భక్తులు చేసే పూజను గురించి, దాని మహిమను గురించి వివరించినాడు కవి ఈ పద్యంలో. ఉద్యానవనంలో పూవులు పూచినప్పుడు వాటిని భగవంతుని పూజకు ఉపయోగించకపోతే కాయలుగా మారిపోతాయి. అంటే వాటిసొకుమార్యం తొలగిపోతుంది. వట్టి ఫలములు - కాయలు మాత్రమే లభిస్తాయి. వాటివెల స్వల్పం. అవి అశాశ్వతమైనవి. కాని భక్తులు ఆ పూవులనే సేకరించి భగవంతునిపాదాలకు సమర్పిస్తే ఆయన ఇహలోకసౌఖ్యాలను ప్రదానం చేస్తాడు. చివరన సాయుజ్యం అనుగ్రహిస్తాడు. ఇలా లభించే పుష్పపూజాఫలాలు రెండు రకాలు. ఒకటి ఈ లోకంలో మేలైన ధనధాన్యాలుగాను, ఏనుగులు, సేవకులు, అశ్వాలు, సుందరమైన వస్త్రాలు భక్తులకు లభించడం. ఇది వారు పరమేశ్వరుని పూజించిన కారణంగా సంభవిస్తుంది. వీటి వెలా, వీటి వల్ల కలిగే సౌఖ్యమూ అధికం. రెండవ రకం ఇక, ఈ శరీరం అంతమైనప్పుడు పరమపదంలో ఉండే విరజానదిని దాటడానికి ఆ పూజయే కారణమవుతుంది. ఆ విధంగా సాయుజ్యం లభిస్తుంది. ఇది శాశ్వతం.

గోపన్న కవి, మానవులు భగవంతుని భక్తులుగా ఉండవలెనని, భక్తిలో ప్రధానాంగమైన పూజ భగవంతునికి వారు నిర్వర్తించవలెనని, దానివలన, ఇహలోక సౌఖ్యాలే కాక, పరలోక సౌఖ్యం కూడ సులభమవుతుందని అందమైన భావంతో సందేశాన్ని అందించినాడు.

**102.ఉ. పట్టితి భట్టరార్యగురుపాదములిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్**
**బెట్టితి, మంత్రరాజమొడిఁబెట్టితి, నయ్యమకింకరాళికిం**
**గట్టితి బొమ్మ, మీ చరణకంజములందుఁ దలంపుపెట్టి పోఁ**
**దట్టితి పాపపుంజముల, దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : భట్టరార్య = భట్టరాచార్యులనే పేరుగల, గురుపాదములన్ = గురువు పాదములను, పట్టితిని = అందుకొన్నాను. చేపట్టినాను. ఆయనశిష్యుడనైనాను. ఈ మెయిన్ = ఈశరీరంపై, ఊర్ధ్వపుండ్రముల్ = తిరుమణి శ్రీ చూర్ణములతో నామములను పెట్టితిని. మంత్రరాజమును = శ్రేష్ఠమైన మంత్రమైన తిరుమంత్రమును, ఒడిఁబెట్టితిన్ = గ్రహించినాను, స్వీకరించినాను. దానిచేత = ఆమంత్రస్వీకారంవలన, యమకింకరాళికిన్

= యమదూతల సమూహానికి, బొమ్మకట్టితిని = జయించినాను, నిగ్రహించినాను. మీ చరణకంజములన్ = మీ పాదపద్మాలపై, తలంపుపెట్టి = మనస్సుపెట్టి, మనస్సును ఏకాగ్రముచేసి, పాపపుంజములన్ = పాపసమూహాన్ని, పోన్+తట్టితిన్ = పారద్రోలినాను, ఎగజిమ్మినాను.

తా : దశరథరామా, నేను (కవి), భట్టరాచార్యులవారి శిష్యుడనై, తిరుమణిశ్రీ చూర్ణములను ధరించినాను. వారివలన తిరుమంత్రముపదేశమును పొందినాను. మీకు భక్తుడనై, మీ పాదములను సదా ధ్యానించి, సమస్తపాపములనుండి వైదొలగినాను. ఈ నాలుగు పనుల సాహాయ్యముతో యమభటులను ఎదిరించి నరకమునుండి తప్పించుకొన్నాను. ఇక నాకేమి కావలెను ప్రభూ!

వ్యా : కవి ఈ పద్యంలో తన ఆత్మకథను, సంక్షిప్తంగా నివేదించినాడు. ప్రారంభంలో గురువును ఆశ్రయించినాడు. ఆ గురువుగారిపేరు భట్టరాచార్యులవారు. వారిపాదములకు నమస్కరించి వారి అనుగ్రహం పొందినాడు. వారి ఆదేశంచేత శ్రీవైష్ణవుడుగా రూపొందడానికి తిరుమణి శ్రీ చూర్ణముధరించినాడు. వైష్ణవులు ద్వాదశోర్ధ్వపుండ్రములను ధరించడం సంప్రదాయం. బాహ్యమైన ఈ సంప్రదాయం తీరిన తరువాత, గురువు అనుగ్రహంచేత మంత్రాల్లో శ్రేష్ఠమైన తిరుమంత్రాన్ని ఉపదేశం పొందినాడు. దానినే అష్టాక్షరీ మంత్రం అంటారు. దాన్ని ప్రతి నిత్యం జపించడంచేత, నరకానికి వెళ్లే బాధ తొలగిపోతుంది. అందుచేతనే యముని సేవకులను జయించినానని చెప్పినాడు. పూర్వం శ్రీరామానుజులు, దేవాలయ శిఖరాన్ని అధిరోహించి, వేలమంది భక్తులకు తిరుమంత్రముపదేశించి వారందరిని నరకమునుండి తప్పించినారట. ఇక గురువు అనుగ్రహంచేతనే కవికి శ్రీరామునిపై భక్తి ఏర్పడింది. అతని పాదములను సేవించినాడు. భగవత్పాదస్మరణము ద్వయము అనే మంత్రంలో ఉంటుంది. అనగా ద్వయానుసంధానం చేసినాడన్న మాట. దానివలన సమస్తపాపాలు తొలగిపోయినాయి. సంతోషచిత్తుడైనాడు. తన కథను శ్రీరామునికి నివేదించుకొన్నాడు.

ఈ పద్యంలో శ్రీవైష్ణవుడు అవలంబించేపద్ధతిని క్రమపరిణామంగా చెప్పినాడు కవి. మొదట గురువును ఆశ్రయించడం. ఆయన ఆదేశం చేత వైష్ణవునిబాహ్య రూపాన్ని ధరించడం. తరువాత తిరుమంత్రోపదేశం. దానివలన నరకబాధాభయం తొలగిపోవడం. దాని వెనుక ద్వయానుసంధానం. దానితో భగవంతునిమీద భక్తి ఏర్పడి, సమస్త పాపాలు పటాపంచలు కావడం. జన్మసార్థకం కావడం.

భక్తుడైన వాడు ఈ దశలనన్నింటిని గడచి, శ్రీరాముని సేవించి తరిస్తాడని ఈ పద్యంలో ధ్వనించిన భావము.

**103.ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం**
**చెర్ల కులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా**
**నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుఁడన్ జగ**
**ద్వల్లభ నీకు దాసుఁడను దాశరథీ కరుణాపయోనిధీ.**

ప్ర : జగద్వల్లభ = జగన్నాథా (సంబోధన), లింగమంత్రి సుతుఁడు = లింగ మంత్రికుమారుడు, అత్రిజగోత్రజుఁడు = ఆత్రేయగోత్రం కలవాడు, ఆదిశాఖ = శుక్లయజుర్వేదశాఖ, ప్రథమ శాఖకు చెందినవాడు, కంచెర్ల కులోద్భవుండు = కంచెర్ల వంశంలో పుట్టినవాడు, అనన్ = అనగా ప్రసిద్ధుడనై, భవదంకితంబుగా = నీకు అంకితముగా, నీ గుర్తుగా, నీ అర్పణగా, ఎల్లకవులు నుతింపన్ =అందరు కవులు మెచ్చుకొనగా, రచియించితిన్ = ఈ శతకాన్ని వ్రాసినాను, గోపకవీంద్రుఁడను = గోపన్న అనేపేరు కలవాడను, నీకున్ = శ్రీరామునికి, దాసుఁడను = భక్తుడను.

తా : దశరథరామా, నేను లింగమంత్రికుమారుడను. ఆత్రేయగోత్రమునకు చెందినవాడను. శుక్లయజుర్వేదశాఖ. కంచెర్లవంశము. పేరు గోపన్నకవి. నీకు దాసుడనై కవులందరు పొగడగా ఈ శతకమును రచించి నీకు అంకితము అర్పణ చేసినాను.

వ్యా : ఈ పద్యంలో కవి తనకులగోత్రనామాదులు చెప్పినాడు. కావ్యాంతంలో నన్నయాదికవులు ఆశ్వాసాంతగద్యం వ్రాయడం సంప్రదాయం. దీనికే బిరుదు గద్యసంప్రదాయం అంటారు. కాని ఈ కవి దీనిని పద్యంలో వ్రాసినాడు. పూర్వం శ్రీ కృష్ణదేవరాయలు, ఆశ్వాసాంతగద్యకు బదులుగా పద్యంగా వ్రాసి ఉన్నాడు. గోపన్న కవి కూడ అదేపద్ధతిని అనుసరించినాడని చెప్పవలె.

కావ్యాన్ని అంకితంచేయడం ఆంధ్రకవి సంప్రదాయమే. ఇది భూపతులయిన వారికి మిత్రులకు ఇష్టదైవానికి చేయవచ్చును. తిక్కనసోమయాజి హరిహర నాథునికి అంకితంచేసినాడు. పెద్దనాదికవులు శ్రీకృష్ణదేవరాయలకు సమర్పణం చేసిరి. ఇంక గోపన్నకవి తన దాశరథీ శతకాన్ని భద్రాచలశ్రీరామునికి అంకితం చేసి, రామదాసు అనేసార్థకనామాన్ని గ్రహించినాడు.

96599

తాము సంపాదించిన ఆస్తిని సంపత్తిని తమ సంతానానికి సంక్రమింపజేసే తల్లిదండ్రులు ఈ లోకంలో కోకొల్లలు.

భగవచ్చింతనతో ధర్మబద్ధమైన జీవనం అలవరచుకొన్నవారే, భగవన్నామ మహిమ వల్ల ఇహ పరసౌఖ్యాలు ప్రాప్తింపజేసుకో గలుగుతారు. అట్టివారే తమ సంతతికి సంపత్తిని, భక్తి సంపత్తిని కూడా సంక్రమింప జేసినందున యోగ్యులైనతల్లిదండ్రులవుతారు. వారు ధార్మికులు - సత్కర్ములు - చరితార్థులూ కూడా.

అలాంటి వారి ఇళ్లల్లో ఆబాల గోపాలానికి ఈ దాశరథి శతకం కంఠస్థమై నిలిచింది. శాంతి సుఖ సౌభాగ్యాలను పండించిరిది.

ఈ కాలంలో యోగంతో, తపస్సుతో, వేదాంత గ్రంథ పఠనంతో భగవద్భక్తిని సాధించడం అసంభవమేమీ కాదు కాని, అది అత్యంత కఠినమైన సాధన అవును.

శ్రీరామనామ సంకీర్తనం సర్వోపయోగమూ సఫలమూ అయిన సరససాధన. దీని మూలంగా సమస్త సాధనల ఫలమూ అనాయాసంగా చేకూరుతుంది.

ధన్యుడు పుణ్యుడు అయిన రామదాసు హృదయోద్గారం ఈ దాశరథి శతకం.

తెలుగులో గొప్ప శతకాలు ఇంకా ఉన్నాయి కాని తెలుగు వారి జీవితంతో, చరిత్రతో, హృదయస్పందనతో ఇంతగా పెనవేసుకుపోయిన శతకం మరొకటి లేదనటం అతిశయోక్తి కాదు. ఈ దేవుడు వీరిలాగే కష్టసుఖాలనుభవిస్తూ తిరిగాడు. ఈ భక్తుడు ఈ దేవునికోసం ఈ జనం కోసం వీరినడుమ వీరిలాగే పరితపించాడు. ఇందువల్ల రాముడూ భద్రాచలమూ భద్రాద్రిరామదాసూ ఆయన గురించి ఈయన వ్రాసిన దాశరథి శతకమూ తెలుగు వారి ప్రాణాలలో ప్రాణం, ఊపిరిలో ఊపిరి.

రామదాసు కీర్తనలలో మామూలు మాటలలో దాశరథి శకతంలో కాస్త పటువైన వాక్కులలో రామభక్తి వెల్లివిరుస్తుంటుంది. ఉపనిషత్తులలో వాల్మీకి రామాయణంలో తులసీ రామయణాదులలో నిక్షిప్తమైన రామతత్త్వం దీని వ్యాఖ్యలో తేట తెల్లమవుతోంది.

ఈ అమూల్య నిధిని మీ యింట నిలిపి, మీ ఒంటబట్టించుకొని మీ సంతతికి ఒంటబట్టించి మీరు ధన్యులు మాన్యులు కావాలనేదే మా ఆకాంక్ష.

- సంపాదకుడు

M

తాము సంపాదించిన ఆస్తిని సంపత్తిని తమ సంతానానికి సంక్రమింపజేసే తల్లిదండ్రులు ఈ లోకంలో కోకొల్లలు.

భగవచ్చింతనతో ధర్మబద్ధమైన జీవనం అలవరచుకొన్నవారే, భగవన్నామ మహిమ వల్ల ఇహ పరసౌఖ్యాలు ప్రాప్తింపజేసుకో గలుగుతారు. అట్టివారే తమ సంతతికి సంపత్తిని, భక్తి సంపత్తిని కూడా సంక్రమింప జేసినందున యోగ్యులైన తల్లిదండ్రులవుతారు. వారు ధార్మికులు - సత్కర్ములు - చరితార్థులూ కూడా.

అలాంటి వారి ఇళ్లల్లో ఆబాల గోపాలానికి ఈ దాశరథి శతకం కంఠస్థమై నిలిచింది. శాంతి సుఖ సౌభాగ్యాలను పండించిరేది.

ఈ కాలంలో యోగంతో, తపస్సుతో, వేదాంత గ్రంథ పఠనంతో భగవద్భక్తిని సాధించడం అసంభవమేమీ కాదు కాని, అది అత్యంత కఠినమైన సాధన అవును.

శ్రీరామనామ సంకీర్తనం సర్వోపయోగమూ సఫలమూ అయిన సరససాధన. దీని మూలంగా సమస్త సాధనల ఫలమూ అనాయాసంగా చేకూరుతుంది.

ధన్యుడు పుణ్యుడు అయిన రామదాసు హృదయోద్గారం ఈ దాశరథి శతకం.

తెలుగులో గొప్ప శతకాలు ఇంకా ఉన్నాయి కాని తెలుగు వారి జీవితంతో, చరిత్రతో, హృదయస్పందనతో ఇంతగా పెనవేసుకుపోయిన శతకం మరొకటి లేదనటం అతిశయోక్తి కాదు. ఈ దేవుడు వీరిలాగే కష్టసుఖాలనుభవిస్తూ తిరిగాడు. ఈ భక్తుడు ఈ దేవునికోసం ఈ జనం కోసం వీరినడుమ వీరిలాగే పరితపించాడు. ఇందువల్ల రాముడూ భద్రాచలమూ భద్రాద్రిరామదాసూ ఆయన గురించి ఈయన వ్రాసిన దాశరథి శతకమూ తెలుగు వారి ప్రాణాలలో ప్రాణం, ఊపిరిలో ఊపిరి.

రామదాసు కీర్తనలలో మామూలు మాటలలో దాశరథి శకతంలో కాస్త పటువైన వాక్కులలో రామభక్తి వెల్లివిరుస్తుంటుంది. ఉపనిషత్తులలో వాల్మీకి రామాయణంలో తులసీ రామయణాదులలో నిక్షిప్తమైన రామతత్త్వం దీని వ్యాఖ్యలో తేట తెల్లమవుతోంది.

ఈ అమూల్య నిధిని మీ యింట నిలిపి, మీ ఒంటబట్టించుకొని మీ సంతతికి ఒంటబట్టించి మీరు ధన్యులు మాన్యులు కావాలనేదే మా ఆకాంక్ష.

- సంపాదకుడు